

# మారూఫ్ వ మున్కర్

## (మంచీ - చెడు)

మూలం

మౌలానా సయ్యిద్ జలాలుద్దీన్ ఉమరీ

అనువాదం

ఎస్.ఎమ్. మలిక్

# విషయసూచిక

# అవతారిక

బహుశా అది 1968 జూన్ నెల అనుకుంటాను, సరిగ్గా గుర్తు లేదు. నేను మద్రాసు నుండి విజయవాడకు వచ్చిఉన్నాను, కృష్ణా పుష్కరాల కొరకు. ఆ సందర్భంలో జమాఅత్ తరపున ధార్మిక సేవా కార్యక్రమాలు నిర్వహించడానికి పుస్తక ప్రచురణ జరుగుతోంది. పెద్దఎత్తున చేపట్టిన కార్యక్రమం. ఆ పుస్తకాలలో 'యదార్థమేది' అన్న చిరుపుస్తకం మొదలుకుని 'ఇస్లామ్ జీవిత విధానం' వంటి పుస్తకం వరకు దాదాపు ఆరో ఎనిమిదో పుస్తకాలు కొన్ని వేల సంఖ్యలోను, లక్షల సంఖ్యలో కొన్ని హ్యాండ్‌బిల్స్ ప్రింట్ చేయిస్తున్నారు. ప్రింటింగ్ పర్యవేక్షణ, ప్రూఫ్‌రీడింగ్ వంటి పనులు చూడటానికి పుష్కరాలకు కొన్ని రోజుల ముందే వచ్చి ఉన్నాన్నేను.

ఆ రోజుల్లో ఓ సాయం సమయం మగ్రిబ్ తరువాత మౌలానా అబ్దుల్ అజీజ్ ఇంట, పంజా సెంటర్, విజయవాడ వన్‌టౌన్‌లో వరండాలో (అప్పట్లో అదే జమాఅత్ ఆఫీసు!) మిత్రులందరం కూర్చుని ఉండగా మౌలానా ఇంట్లో నుంచి బయటికి వస్తూ సలామ్, యోగక్షేమాల తరువాత, 'నీ కోసమే ఎదురుచూస్తున్నాను మధ్యాహ్నం నుంచి' అన్నారు నా వైపుగా వస్తూ. చిరునవ్వుతో ఆయన ముఖం అందంగా వెలిగిపోతోంది, విజయ గర్వమూ తొంగిచూస్తోంది. అందరూ ఆసక్తిగా ఆయన వైపుననే చూస్తున్నారు.

'ఏమయింది మౌలానా?' అన్నాను నేనూ ఆసక్తిగా.

'నీ రుక్నియ్యత్ మంజూరయ్యింది' అంటూ అమాంతంగా ఆలింగనం చేసుకున్నారు. ఒక్క క్షణం ఏమీ అర్థం కాలేదు, తరువాత బోధపడింది, సిగ్గనిపించింది ఎందుకో, బహుశా పది పన్నెండు రోజుల క్రితమే కదా ఫామ్ పంపించింది అని గుర్తుకు వచ్చింది. కళ్ళు జలజలామయ మయ్యాయి. మౌలానాను గట్టిగా అదుముకున్నాను. దీవించండి అని ప్రాధేయపడ్డాను.

మిత్రులందరూ ముబారక్, అల్‌హమ్దులిల్లాహ్, సుబహానల్లాహ్ మాషాఅల్లాహ్ అని ఏమేమో అంటున్నారు. అదొక మరువరాని ఘడియ, మరపురాని ఘడియ.

మరుసటి రోజు ఫజ్ర్‌లో జరిగే దర్స్ తరువాత మౌలానా అబ్దుల్ అజీజ్ ఓ పుస్తకం నాకిస్తూ 'ఇప్పుడు దీన్ని చదివి నీవు అర్థం చేసుకోగలవు. నేనూ ముగించాను. చాలా టఫ్ బుక్. అయినా చదవవలసిందే' అన్నారు. అది 'మారూఫ్ వ మున్కర్'. అప్పుడు చదివాను. యాభయ్యేళ్ళ నాటిమాట. ఇప్పుడు మళ్ళీ అనువదించడానికి చదివాను. అప్పటికీ ఇప్పటికీ నాలో సామాన్య జ్ఞానమయినా ధార్మిక జ్ఞానమయినా పెరిగిన విషయం ఒక ఎత్తయితే మౌలానా సయ్యిద్ జలాలుద్దీన్ ఉమరీతో పెరిగిన పరిచయం, ప్రేమ, అనురాగం, గౌరవం మరో ఎత్తు.

నేను మదరాసులో ఉన్నప్పుడు ఆయన మొదట రామ్‌పూర్ నుండి, తరువాత అలీగఢ్ నుంచి తన స్వగ్రామం తిరుప్పాతూరు (వెల్లూరు జిల్లా, తమిళనాడు)కు వెళ్ళడానికి మద్రాసుకు వచ్చేవారు. అక్కడ ఉండే తన సోదరుని ఇంట (రాయపేట) కొన్ని రోజులు గడిపి మరీ వెళ్ళేవారు. ఆ రోజుల్లో మదరాసు జమాఅత్ ఆఫీసుకు తప్పక వచ్చేవారు. అప్పుడు అందరినీ సహజంగానే కలుసుకునేవారు కూడా. అలా 1964 నుంచి ఆయన నాకు పరిచయమయ్యారు. ఆ తరువాత నేను జమాఅత్ కేంద్ర కార్యాలయం (మర్కజ్) ఢిల్లీలో ఉన్నప్పుడు- డిసెంబర్ 1969- ఆగస్టు 1972- ఆయన కేంద్ర కార్యాలయానికి వచ్చినప్పుడల్లా మరీ తరచుగా కలుసుకునే, అభిప్రాయాల మార్పిడి జరుపుకునే అవకాశాలు మెండుగా దొరికాయి. తొలినాటి పరిచయం కాస్తా మైత్రిగా మారింది.

ఆ తరువాత ఆయనతోపాటు నేను జమాఅత్ ప్రతినిధి మండలిలోను, పిమ్మట కేంద్ర సలహామండలిలో సభ్యునిగాను కూర్చునే అవకాశాలు దొరకాయి, అవి ఆయన్ని మరింత సన్నిహితం చేశాయి. ఇక ఆయన నాయబ్ అమీర్ (ఉపాధ్యక్షులు), అమీర్ (అధ్యక్షులు)గా ఎన్నిక అయిన దరిమిలా ఆయన పట్ల గౌరవమే తప్ప మా మధ్యన దూరాలు పెరగలేదు. నేనూ ఆయన మాత్రమే కలసి ఫజ్ర్ నమాజు తరువాత దావత్‌నగర్ మైదానాల్లోను, ఇషా నమాజ్, భోజనాలయ్యాక మర్కజ్ బిల్డింగ్ కప్పుపైనా చేసిన 'పచార్ల' (వాకింగు)ల్లోనూ ఆయన్ని మరింత సన్నిహితంగా కలుసుకునే తెలుసుకునే అవకాశాలు దొరికాయి. ఈ చనువు కారణంగానే, ఈ పుస్తకం అనువదించమని ఆయన ఆదేశిస్తే, అప్పటికే ఇక అనువాదాలు చేయనని నిర్ణయించుకుని ఓ విధంగా అనువాదం పట్ల 'సన్యాసం' పుచ్చుకున్న నేను ఆ మాటనే ఆయనతో అనగలిగాను. 'సరే, ఇదొక్కటి నువ్వు చేసెయ్యి, దీన్ని నువ్వే చెయ్యాలన్నది, చెయ్యగలవన్నది నా అభిప్రాయం..' అని తీర్పు ప్రకటించారాయన. ఇక నేనేమి చెప్పగలను? ఆయనేమో అమీర్!

ఇదంతా ఏకరువు పెట్టడానికి కారణం ఆయనతో నాకున్న పరిచయం తెలుపడం కాదు, ఆ సాన్నిహిత్యం మూలంగా ఓ మాట మాత్రం ఖచ్చితంగా చెప్పగలనని అనడానికి!

"ఆయన్ని రచనల్లో ఏ రూపంలో చూడగలిగానో అదేరూపంలో వ్యక్తిగత సంభాషణల్లోనూ, వ్యవహార సరళిలోనూ, జీవన గతిలోనూ, ఆచరణ ల్లోనూ చూడగలిగాను, పరిశీలించగలిగాను, అనుభవించగలిగాను."

దాదాపు 50 ఏళ్ళ పరిచయం, కనీసం 35 ఏళ్ళ సహవాసం, బాధ్యతా యుతంగా చెప్పగలను, నిర్భయంగా చెప్పగలను. మాటల్లో చేతల్లో వ్యత్యాస మున్న మనిషి కాదు, చెప్పింది చేసిన వ్యక్తి! అని.



ఇక పుస్తకం విషయానికి వస్తే, నేను ఎన్నో రకాల పుస్తకాలు చదివాను. నవలలు చదివాను. అత్యంత గంభీర రచనలు, అర్థం కాకపోతే మూడేసి పర్యాయాలు చదివాను. భావావేశాలను, ఉద్రేకాలను ప్రేరేపించగల రచనల్ని, సత్యం వైపునకు దూసుకుపోయేలా చేయగల రచనల్నీ చదివాను. ఆలోచనల్ని పేర్చి భవంతుల్ని నిర్మించి వాటి ద్వారా జీవన సౌధాలు నిర్మింపజేసి వసింపజేసిన రచనల్ని చదివాను. అన్నింటిద్వారా ప్రభావితుణ్ణయ్యాను- మానవుణ్ణి గనక! ఉద్యమంలో అన్ని రకాల రచయితలున్నారు. అందరినీ ఆశ్రయించాను. అందరూ ఆకట్టుకున్నారు. అందరినీ ప్రేమించాను, ప్రేమిస్తున్నాను. అన్నింటి ద్వారా కడకు ప్రాప్తమయ్యేది జ్ఞానమే; ఆచరణా ప్రధానం జ్ఞానమే గనక అన్ని రసాల రచనల్ని గ్రోలాను, గ్రోలాలని చదువరుల్ని కోరుతాను కూడా.

ఉద్యమ రచయితల్లో ప్రథముడు, ప్రాధాన్యుడు మౌలానా మౌదూది. ఆయన రచనా పటిమకు సమగ్రమయిన ఉదాహరణ 'తఫ్హీముల్ కుర్‌ఆన్'. తనకు వచ్చిన రసాలన్నింటినీ ఆయన అందులో మనసారా ఉదారంగా రంగరించారనిపిస్తుంది నాకు. తనివితీరా గ్రోలవచ్చు. అందులో కుర్‌ఆన్ మూలాన్ని అనువదించిన భాష, శైలి వేరు, వేర్వేరు పాదసూచికల్లో ప్రయోగించిన భాష్యశైలి, పదబంధాలు వేర్వేరు. కొన్ని వ్యాఖ్యానాల్లో వాడిన డిక్షన్ కూడా వేరంటే కొందరు, ఆయన గారి వీరాభిమానులు, నన్ను కొట్టవస్తారో ఏమోమరి! సరే అదంతా మరెప్పుడయినా చెప్పుకుందాము. ఇప్పుడు చెప్పవలసిందేమిటంటే ఆయన ప్రముఖ, ప్రసిద్ధ శైలి సహేతుకత, అవసరమున్నచోట కుర్‌ఆన్, హదీసుల సాధారణ నిరూపణ!

దీనికి పూర్తిగా భిన్నమయినది మౌలానా సయ్యిద్ జలాలుద్దీన్ ఉమరీ శైలి. ఇందులో ప్రాధాన్యత కుర్ఆన్ హదీసుల ప్రామాణికతకు ఉంటుంది. ఆ తరువాత ప్రవక్త సహచరులు, పండితులు, ధర్మవేత్తల అభిప్రాయాలకు. కాని అవి కూడా కుర్ఆన్ హదీసుల సర్వసాధారణ ప్రామాణికతకు లోబడి మాత్రమే. ఈ విషయం ఆయన పుస్తకాలు చదివిన వారందరికీ తెలిసిందే. ఆయన రచనలు అధికాంశం ఈవిధంగానే సాగాయి. ఆయన రచనలు బహుధా ఇస్లామీయ సామాజిక వ్యవస్థ చుట్టూ పరిభ్రమించాయి. అలా అని ఇతర అంశాలు ఆయన స్పర్శించలేదని కాదు. ఇస్లామీయ సమాజంలో మహిళ, ఇస్లామ్‌లో స్త్రీ, ముస్లిమ్ స్త్రీల బాధ్యతలు, ఇస్లామీయ కుటుంబ వ్యవస్థ, ముస్లిమ్ మహిళల హక్కులు, ముస్లిమేతరులతో సంబంధాలు, ఇత్యాదివి ఈ సందర్భంలో కొన్ని పేర్కొనదగ్గ పుస్తకాలు. ఈ రచనలన్నింటిలోనూ అత్యధికంగా కుర్ఆన్, హదీసుల ద్వారానే తన వాదనలకు ఆధారాలు, పునాదులు చూపెట్టారు మౌలానా ఉమరీ.

కుటుంబ వ్యవస్థకు సంబంధించిన రచనలే కాదు మౌలానా ఉమరీ చేసిన ఇతర రచనలు సయితం చదివినవారు తెలుసుకునే సత్యం ఒకటే, ఆయన రంగు కుర్ఆన్, హదీసులు, తఫక్కుహ్ ఫిద్దీన్ నిండిన రంగు! మౌలానా ఉమరీ, మానవ హక్కులు మొదలుకుని ఆరోగ్య సూత్రాలు, ప్రవక్త చరిత్ర మొదలుకుని ఇస్లామ్ పిలుపు వరకు అనేకానేక అంశాలు స్పర్శించారు. అన్నిటా ఆయన రచనాతీరు ప్రధాన లక్షణం ఒక్కటే- కుర్ఆన్ హదీసులు ఆధారభూత మయిన విధానం!

ఇక ఈ పుస్తకం. 1968లో నేను చదివిన పుస్తకానికి (1967 ఎడిషన్) ఇప్పుడు నేను అనువదిస్తున్న పుస్తకానికీ (2013 ఎడిషన్) భాష రీత్యా భావప్రకటనా విధానం రీత్యా చాలా తేడా వుంది. ప్రస్తుత ఎడిషన్ సవరణలు, మెరుగులు దిద్దుకున్న ఎడిషన్. నాకు లోగడ కూడా సామాన్య జ్ఞానంలేదు, ఇప్పుడూ లేదు. ధార్మిక జ్ఞానం అంతకన్నా లేదు. జ్ఞానం అంటూ నాకు అబ్బితే అది కేవలం జమాఅత్‌లో అడుగుపెట్టిన తరువాతనే. అయితే జ్ఞానం అన్నది బహుముఖమయినది అన్నది నేను మొట్టమొదట తెలుసుకున్న మూల విషయం. ఏ జ్ఞానమయినా ఒక కోణంలో కొంత తెలుసుకుని అదే సర్వం అనుకుంటే గోతిలో పడతారని కూడా తెలుసుకున్నాను. ఈ పుస్తక పఠనం ద్వారా పెరిగిన జ్ఞానం ఓ కోణంలో ఓ మూలజ్ఞానమయితే మరో కోణంలో ఈ పుస్తక అనువాదం ద్వారా ఎన్నో రెట్లుగా పెరిగిన అదే జ్ఞానం మరే మూలకూ సరిపోలేదు. దాన్ని బహుశా ప్రస్తావించడమూ చాలా కష్టమేనేమో!

ఈ పుస్తకంలో జమాఅతె ఇస్లామీ హింద్ ధ్యేయం అయిన 'ఇకామతుద్దీన్'ని ఎంతో శాస్త్రీయ పద్ధతిలో- ధార్మిక శాస్త్రీయ పద్ధతిలో- ఫిక్హ్ సూత్రాల వెలుగులో విశదీకరించడం జరిగిందని నేను భావిస్తున్నాను. కుర్‌ఆన్‌లో 'తఫక్కుహ్ ఫిద్దీన్'ని ధార్మిక జ్ఞాన సముపార్జనాక్రమంలో అభిలషణీయ ప్రమాణంగా పేర్కొనడం జరిగింది. కాని దాని భావం కేవలం ఫిక్హ్ జ్ఞానాన్ని పెంపొందించుకోవడం కాదు. (వివరాలకు కుర్‌ఆన్ అవగాహనం: తౌబా సూరా: 120వ పాదసూచిక చూడండి) ఈ పుస్తక అనువాదం సందర్భంలో నా స్వీయ ప్రమేయం లేకుండానే అనేక పుస్తకాలను తిరగవేయవలసి వచ్చింది. ఇంకా అనేక పుస్తకాల పేర్లను తెలుసుకోవడం మాత్రమే కాక వాటిని కనీసం దర్శించుకోవడం అవసరమయింది. ఆ విధంగా జ్ఞాన విస్తృతి కోణాలు ఎన్నో విధానాలు, మరెన్నో రూపాలు ధరించింది. దీనంతటికీ దైవానికి వేనవేల ధన్యవాదాలు.

జ్ఞాన సముపార్జన అన్నది తరగని నిధిని ప్రోది చేసుకోవడమే. ఈ పుస్తకంలోని అనేక విషయాలు చాలావరకు 'శుష్క ప్రియాలు'గానే అనిపిస్తాయి. అందరికీ పఠనానికే రుచించవు, జీర్ణించుకోవడం మరీ కష్టం. కాని జ్ఞానసముపార్జనే లక్ష్యమయితే దాని సముపార్జన కోసం సహనం వహించి దీని శుష్క వ్యాసావళిని భరించినట్లయితే లక్ష్యం సుసాధ్యమవుతుంది. నా మటుకు నేను ఈ సశాస్త్రీయ చర్చను వీలయినంత మేర ఆసక్తికరమయినదిగా మలచడానికి, మనోజ్ఞమయిన దిగా తీర్చిదిద్దడానికి ప్రయత్నం చేశాను. ఎంతవరకు కృతకృత్యుణ్ణయ్యానన్నది పాఠకమన్యులే తేల్చాలి.

ముస్లిముల నిజ జీవన ధ్యేయమేదో ముస్లిమ్ సోదరులు, ముస్లిమేతర సోదరులు క్షుణ్ణంగా తెలుసుకోగగలగాలన్నది నా ఉద్దేశ్యం. ముస్లిముల జీవన లక్ష్యం ఏదో తెలుసుకుంటే ముస్లిమేతర సోదరులు ముస్లిములను గురించి అపార్థాలకు లోనవకుండా వారి లక్ష్య సాధనలో తోడ్పడగలుగుతారని కూడా నేను నమ్ముతున్నాను. అలాగే ముస్లిమ్ సోదరులు దీనిద్వారా ప్రేరణ పొంది తమ ధ్యేయ సాధన కొరకు కార్యోన్ముఖులు కాగలుగుతారనీ ఆశిస్తున్నాను. అప్పుడే రచయితకు, అనువాదకునికీ, ప్రకాశకులకూ దైవసన్నిధిలో సరయిన ప్రతిఫలం సవ్యంగా సలక్షణంగా ప్రాప్తించగలదని ఆశ, ప్రాప్తించాలని ప్రార్థన.

1,రమజాన్, 1438 హిజ్రీ
28, మే 2017
హైదరాబాద్, 500 005

- ఎస్.ఎమ్. మలిక్

# కొత్త ప్రచురణ

దివ్య ఖుర్‌ఆన్ 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'ని ముస్లిమ్ సముదాయానికి ధ్యేయంగా, దాని ఉనికికే లక్ష్యంగా నిర్ణయించింది. మీ ముందున్న పుస్తకం దానికే వివరణ, విశదీకరణ. ఇది 1967 మే నెలలో మొదటిసారిగా ప్రచురితమయింది. ఇది ఈ విషయం మీద ఒక ప్రామాణిక రచనగా పరిగణించబడటం పట్ల దైవానికి ధన్యవాదాలు. దీని అనేక ముద్రణలు భారత్ పాకిస్తాన్‌ల నుండి వెలువడ్డాయి. దీని అనువాదాలూ జరిగాయి. ఇప్పటివరకు అరబీ, తుర్కీ, (అరబీ నుండి) ఇంగ్లీషు, హిందీ, బంగాలీ, తమిళంలో దీని అనువాదాలు జరిగాయి. కువైత్‌లోని International Islamic Federation of Students Organisation (IIFSO) ద్వారా దీన్ని పెద్ద పరిమాణంలో ప్రచురించటం జరిగింది. కొన్ని ప్రాంతాల్లో ఇది ఇస్లామీయ శిక్షణా ప్రణాళికలో కూడా చేరి ఉంది. కొందరు దీన్ని తమ రచనల్లోనూ, ఒక్కోసారి ఉటంకిస్తూ మరొక్కప్పుడు దీని ప్రస్తావన లేకుండానే వాడుకున్నారు.

సమయం ఎవరి కోసమూ ఆగదు, సాగిపోతూ ఉంటుంది. ఈ పుస్తక రచన జనవరి 1966లో జరిగింది. ఇప్పటికి 47 ఏళ్ళు గడిచాయి. ఈ సుదీర్ఘ కాలంలో పునః పరిశీలనావకాశం కలగలేదు. అన్యధా నిమగ్నతల్లోనూ అల్లాహ్ దీనికి ప్రస్తుతం అవకాశం కల్పించాడు. పూర్తి పుస్తకాన్ని పునఃపరిశీలించాను. ఒకటీ రెండుచోట్ల కొంతవరకు సరికొత్త విషయాన్ని అదనంగా చేర్చాను. భాష, భావపరంగానూ దీన్ని మెరుగుపరచడానికి ప్రయత్నించాను.

పుస్తక రచన కాలంలో మూలగ్రంథాల ప్రాచీన ప్రతులే సాధారణంగా దృష్టిలో ఉండేవి. తరువాత వాటిలో అనేక పుస్తకాల సరికొత్త ఎడిషన్లు ఇతోధిక సవరణలు, ఏర్పాట్లతో ముద్రితమయి ముందుకు వచ్చాయి. వాటి ఏ ఏ ఎడిషన్లు

లభించాయో రిఫరెన్సులు వాటి ప్రకారం సవరించబడ్డాయి. ఈ సేవలు మిత్రులు సిరాజ్అహ్మద్ ఫలాహీ నిర్వహించారు. అల్లాహ్ ఆయనకు సద్ఫలితాలు ప్రసాదించుగాక. సోదరులు డాక్టర్ ముహమ్మద్ రజీ ఉల్ ఇస్లామ్ నద్వీకి నేను కృతజ్ఞుణ్ణి. పుస్తకం కొత్త ఎడిషన్‌లో ఆయన సహకారం ఎంతయినా ఉంది. ఆయన ఎంతో శ్రద్ధ తీసుకుని దీని ప్రూఫ్ రీడింగ్ చూశారు. అవసరం అనిపించిన చోటల్లా రిఫరెన్సులు చెక్ చేశారు. ఈ ప్రయత్నాలు దీని విలువను, ప్రయోజకత్వాన్ని మరింతగా పెంచుతాయని ఆశిస్తున్నాను. అల్లాహ్ దీన్ని స్వీకరించాలని, రచయిత కొరకు పరలోక పెన్నిధిగా దీన్ని మార్చాలని ప్రార్థన.

డిసెంబరు 1, 2013

**- జలాలుద్దీన్**

# ఉపోద్ఘాతం

**అమ్ర్ బిల్ మారూఫ్** వ **నహీ అనిల్** మున్కర్ అన్నది కుర్ఆన్, హదీసుల్లో ఓ పారిభాషిక పదం. ఈ పుస్తకం ఈ పారిభాషిక పదానికి విశదీకరణ, వ్యాఖ్యానం లాంటిదిగా అగుపడుతోంది, కాని వాస్తవానికి ఇందులో ఇస్లామ్‌కు చెందిన విశ్వాసాల, ఆచరణల సంపూర్ణ వ్యవస్థ చర్చకు వచ్చేసింది. ఇలా ఇస్లామీయ వ్యవస్థకు ఓ సమగ్ర స్వరూపం సంకలనమయిపోయింది. దీనిద్వారా ఒకటి మాత్రం బాగా విశదమయి పోయింది, ఇస్లామ్ సందేశమేమిటో, దీని సందేశాన్ని ప్రపంచంలో వ్యాపింపజేయటం, దానికి ప్రపంచంలో ఆధిక్యత కలగజేయటం, దాన్ని నమ్మేవారికి ఎంతవరకు అవసరమో, దీని సందేశ వ్యాప్తి ఫలితంగా ఎటువంటి రాజ్యం రూపొందు తుందో, అందులోని ప్రతి వ్యక్తి ఏవిధంగా సమాజంలో చెడులను రూపుమాపడానికీ మంచిని వ్యాపింపజేయడానికీ నిమగ్నుడయిపోతాడో- అంతా తేటతెల్లమయి పోతుంది.

పరమ ప్రభువు అల్లాహ్ తన సందేశహరులు, వారిని విశ్వసించేవారి చేత ఏ పని చేయించదలిచాడో దానికి కుర్ఆన్ హదీసుల్లో అనేక పారిభాషిక పదాలు ప్రయోగించబడ్డాయి. ఉదాహరణకు, దావత్ ఇలల్లాహ్ (దైవం వైపునకు పిలుపు), ఇన్జార్ వ తబ్షీర్ (హెచ్చరిక, శుభవార్త), షహాదత్ అలన్నాస్ (మానవ సమక్షంలో సాక్ష్యం), ఇస్లాహ్ వ నసీహత్ (సంస్కరణ, సద్బోధన), తజ్కీర్ వ తబ్లీగ్ (జ్ఞాపికావచనం, ప్రచారం), జిహాద్ ఫీ సబీలిల్లాహ్ (దైవమార్గంలో సతత సమరం), ఇజ్హారుద్దీన్ (ధర్మాధిక్యత), ఇకామతుద్దీన్ (ధర్మ సంస్థాపనం), ఇలా ఉకలిమతుల్లాహ్ (దైవ వచన సమున్నతి), తవాసీబిల్ హక్క్ (సత్యసద్బోధన), తఆవనూ అలల్ బిర్ర్ (సత్కార్యంలో సహకారం)- ఇత్యాదివి. వీటిలోనే ఒక పారిభాషిక పదం, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** (ప్రసిద్ధ సత్కార్యాలను ఆదేశించడం, చెడుగులను నిరోధించడం) అన్నది కూడా ఉంది. ఈ పారిభాషిక పదాలలో కొంతమేర వ్యత్యాసమూ ఉంది, విభేదమూ ఉందన్నమాటలో సందేహం లేదు. వీటిలోని ఒక్కోదానిలో ఒక్కో పనిలోని ఒక్కో కోణం ప్రత్యేకంగా ఎత్తిచూపడం జరిగింది, మరో దానిలో మరో కోణం ప్రస్ఫుట పరచడం జరిగింది. ఒక్కో దానిలో పరిమితి ఉంటే మరో దాని భావం విస్తృతమయింది. కాని వీటిలో ఒకే యదార్థం వివరించబడింది. ఒకే లక్ష్యం వ్యక్తం చేయబడింది. అందువల్ల మీరు '**అమ్ర్ బిల్ మారూఫ్** వ **నహీ అనిల్** మున్కర్'ని అర్థం చేసుకున్న ట్లయితే ఆ మహత్తర కార్యాన్ని సునాయాసంగా అర్థం చేసుకోగలుగుతారు- ఆ మహాకార్యం

కొరకే కుర్‌ఆన్ సందర్భానుసారం విభిన్న భావాలను వర్తింపజేసే పదాలను ప్రయోగించింది.

ఏ వ్యక్తి అయినా కుర్‌ఆన్ హదీసులను ఏ కొంత అధ్యయనం చేసినా అతను **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** ప్రాముఖ్యాన్ని కాదనలేడు. అల్లాహ్ ఆయన సందేశహరుడు, దీన్ని ముస్లిముల ప్రత్యేక లక్షణంగా, వారి సాముదాయిక శక్తి సరోవరంగా పరిగణించారు. దీనివల్ల ఏమరుపాటును, అశ్రద్ధను వారి వినాశహేతువుగా పేర్కొన్నారు. ఏ పనికయితే షరీఅత్ ఇంత ప్రాముఖ్యాన్నిచ్చిందో దాన్ని గురించి కొన్ని ముఖ్యమయిన ప్రశ్నలు ఉత్పన్నమవుతాయి. అది ఫర్జ్ (విధి) అవుతుందా కాదా? అది ఫర్జ్ అయినట్లయితే విశ్వసించిన ప్రతి వ్యక్తికి ఫర్జ్ అవుతుందా లేదా ముస్లిముల ఓ ప్రత్యేక వర్గం లేదా సంఘం వరకే పరిమితమా? దాని అర్థం, భావం ఏమిటీ? దాని సంబంధం ముస్లిముల వరకేనా లేదా ముస్లిమేతరులతో కూడా ఉందా? ఇది విస్తృతమయిన పనా లేదా పరిమితమయినదా? దాని పరిధులు, షరతులు ఏమిటీ? ఇది ఎటువంటి గుణగణాలు గలవారిని కోరుతుంది? ఈ పుస్తకం ఈ ప్రశ్నలన్నింటికీ సవివరమయిన సమాధానం.

**'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** ప్రస్తావన కుర్‌ఆన్‌లో అనేక ఆయత్‌లలో, ఇంకా అసంఖ్యాకమయిన హదీసుల్లో ఉంది. వీటిలో కొన్ని ఆయత్‌లు, హదీసులు **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'**కు సంబంధించిన విభిన్న కోణాలను వివరిస్తాయి. ఉదాహరణకు ఒకే ఆయత్ ద్వారా 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్' విధి అయినదనీ రుజువవుతుంది, దాని విధానమూ బోధపడుతుంది. దాని విస్తృతి, సమగ్రతల భావనతోపాటు దాని పరిమితులు, షరతులూ ద్యోతకమవుతాయి. ఇటువంటి ఆయత్‌లు హదీసులూ ప్రతి చర్చ క్రింద ఉటంకిస్తూ పోతే విషయ పునరుక్తి అవడమేకాక పుస్తక ఘన పరిమాణం కూడా పెరిగిపోతుంది. అందువల్ల ఏ ఆయత్ లేదా హదీసుకు ఏ చర్చతో ప్రత్యేక సంబంధముందో దాన్ని అక్కడే ప్రస్తావించడం జరిగింది. ఇతర చర్చల్లో దాన్ని ఉటంకించడం జరగలేదు. కాని చర్చకు ఆధారమే ముందు ప్రస్తావించినటువంటి ఆయత్ లేదా హదీసు అయినట్లయితే, కేవలం దాన్ని పూర్తిగా ఉటంకించడం జరిగింది- చర్చలో దాని పదాలు సయితం ముందుండాలన్న ఉద్దేశ్యంతో.

పుస్తకంలో చర్చనీయాంశాలు పరస్పరం ఎంతగా ఒకదానితో మరొకటి అన్యోన్యత కలిగి కట్టుబడి ఉన్నాయంటే వాటిని వేర్వేరు చెయ్యడం కష్టం. కాగా విషయాన్ని ఒక కోణంలో చర్చిస్తూ ఒక్కోచోట ఇతర కోణాలూ చర్చించవలసి వచ్చింది. అందువల్ల ఏ కోణాన్ని పూర్తిగా అర్థం చేసుకోవడానికయినా దానికి సంబంధించిన పూర్తి విషయాన్ని తెలుసుకునేందుకు పరిశీలించేందుకు కేవలం సంబంధిత చర్చను పరిశీలించడంతో సరిపోదు, పుస్తకాన్ని పూర్తిగా చదవవలసి ఉంటుంది.

కుర్‌ఆన్‌లో ఓ చోట '**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముున్కర్**'తో పాటు 'దావత్ ఇలల్‌ఖైర్' అన్నదాన్నీ ప్రస్తావించటం జరిగింది. పుస్తకం ప్రారంభంలో దాన్నీ క్లుప్తంగా విశదీకరించడం జరిగింది. ఈ విశదీకరణ, 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'ని అర్థం చేసుకోవడంలో తోడ్పడుతుంది.

ఈ పుస్తకంలో ధర్మాన్ని ఏ కోణంలోనూ బౌద్ధిక, హేతుబద్ధ రూపంలో చర్చించడం జరగలేదు. కేవలం అల్లాహ్, ఆయన సందేశహరుడు (స) అందజేసిన మార్గబోధనను వారి పదాలలోనే ముందుంచడం జరిగింది. ఎందుకంటే ఈ పుస్తకం సంబోధితులు వాస్తవంగా, అల్లాహ్‌ను ఆయన సందేశహరుణ్ణి (స) విశ్వసించేవారే, విశ్వాసులయిన వారి దృష్టిలో ఏదయినా మాటను స్వీకరించడానికి, దాన్ని అనుసరించడానికి, అది కేవలం దైవగ్రంథం లేదా ఆయన సందేశహరుని సంప్రదాయం (సున్నత్)లో ఉంటే సరిపోతుంది గనక.

దైవగ్రంథం, ప్రవక్త సంప్రదాయం అన్వయింపులో వాటిని నమ్మేవారి మధ్యన భిన్నాభిప్రాయం సాధ్యమే. అది దాని పరిధిలో ధర్మ సమ్మతమే కాదు, అభిలషణీయం కూడా. కాని కొన్ని సందర్భాలలో ఇదే విభేదం ఒక వ్యక్తి ఆలోచనా విధానాన్ని మరో వ్యక్తి ఆలోచనా విధానానికి పూర్తిగా వేరయినదిగా చేసివేస్తుంది. దైవగ్రంథం, ప్రవక్త సంప్రదాయాల పట్ల ఒక వంక విశ్వాస ప్రకటన చేస్తూనే ఉభయులూ ఒండొకరికి పూర్తిగా వ్యతిరేక దిశల్లో ఆలోచిస్తూ ఉంటారు. ఇటువంటి విరుద్ధ అన్వయింపులు మన సమక్షంలో వచ్చినప్పుడు, కుర్‌ఆన్, హదీసుల పదాలకు, వాటి భావాలకు దూరమయిన అన్వయాన్ని, కుర్‌ఆన్ హదీసుల విద్యలను ఎరిగిన ధర్మవేత్తలు, నిపుణులు, పరిశోధకులు త్రోసిపుచ్చిన అన్వయింపును మనం స్వీకరించలేము. ఎందుకంటే కుర్‌ఆన్ హదీసుల అన్వయింపు, ఏదయినా వాటి పదాల ద్వారా నేరుగా ద్యోతకమయ్యేది లేదా వాటి శైలి, భావప్రకటనా శైలి ద్వారా గ్రహించగలిగేది మాత్రమే సరయినది కాగలదు. ఇంకా దానికి ఉన్నత స్థాయి విశ్వసనీయ ధర్మవేత్తలు మద్దతు తెలిపినప్పుడే అది సరయినది కాగలదు.

నేను ఈ పుస్తకంలో ఈ రెండవ పద్ధతినే అవలంబించాను. దీని కారణంగా ఈ పుస్తకం, దైవకృప వల్ల దాని విషయంలో ఒక ప్రామాణిక కృతిగా రూపొందింది. అయినప్పటికీ ఇందులో ఒకటి కాదు అనేక లోటుపాట్లు ఉండే అవకాశముంది. ఈ లోటుపాట్లను గురించి తెలుసుకోవడం నాకు ఎంతో ఆనందకరం. దైవం కోరినట్లయితే నేను వాటిని అంగీకరించడానికి, వాటిని సంస్కరించడానికి ఎన్నడూ వెనుకాడను. పరమప్రభువు ఈ అల్ప కృషిని స్వీకరించాలని, దీనిద్వారా ఆయన దాసులయిన మానవులకు ఇతోధికంగా ప్రయోజనం చేకూర్చాలని ప్రార్థిస్తున్నాను.

24, ఫిబ్రవరి 1966

**- జలాలుద్దీన్**

అపార కృపాశీలుడు, పరమ కరుణామయుడు, అల్లాహ్ పేరుతో...

# 1. శుభం వైపునకు పిలుపు

## శుభం వైపునకు పిలుపు- ఆదేశం

ఆలి ఇమ్రాన్ సూరాలో పరమ ప్రభువు విశ్వాసులకు ఇలా ఆదేశించాడు :

وَلْتَكُنْ مِّنْكُمْ اُمَّةٌ يَّدْعُوْنَ اِلَى الْخَيْرِ وَ يَاْمُرُوْنَ بِالْمَعْرُوْفِ وَ يَنْهَوْنَ عَنِ الْمُنْكَرِ ؕ وَاُولٰٓئِكَ هُمُ الْمُفْلِحُوْنَ ○ (آل عمران:۱۰۴)

**'మీలో తప్పక ఒక వర్గం ఉండాలి, అది శుభం వైపునకు పిలిచేది, ప్రసిద్ధమయిన మంచిని ఆదేశించేది, చెడు నుంచి వారించేదయి ఉండాలి. ఇలాంటి జనులే సాఫల్యం పొందగలవారు.'** *(ఆలి ఇమ్రాన్ : 104)*

## పూర్వ రంగం

ఈ ఆయత్‌కు పూర్వం యూదుల ప్రస్తావన వుంది. వీరు స్వయంగానూ దైవ ధర్మాన్ని వదిలేశారని, ఇతరుల్నీ దానికి దూరంగా ఉంచాలని ప్రయత్నిస్తున్నారని, ఈ కారణంగానే వారు మార్గబోధనకు దూరమయ్యారని, మరి దైవ ప్రేమకు అర్హులు కారనీను. ఆ తరువాత ముస్లింలకు ఆదేశమయింది, వారు "సంపూర్ణంగా దైవనిష్ఠ (తక్వా)ను అవలంబించాలని, జీవితపు చివరి క్షణం వరకూ ఇస్లామ్‌పై నిలకడ కలిగి ఉండాలని, మిథ్యకు ప్రతిగా సమైక్యంగా, ఏకాభిప్రాయం కలిగి ఉండాలని, అందరూ కలిసి దైవపాశాన్ని దృఢంగా పట్టుకోవాలి, వర్గ తత్వం, వైవిధ్యాలకు దూరంగా ఉండాలనీను." ఈ లక్షణాలన్నింటి సంబంధం వారి అంతర్గత జీవితానికి సంబంధించింది. ఆ తరువాత వారికి బాహ్య కార్యక్రమం ఇవ్వడం జరిగింది; వారు ప్రపంచాన్ని శుభం వైపునకు పిలువాలి, ప్రసిద్ధమయిన మంచిని ఆదేశించాలి, చెడుల నుండి వారించాలి. ఇదే విషయాన్ని వ్యాఖ్యాతలూ వ్రాశారు. ఇక్కడ మేము ఇద్దరు వ్యాఖ్యాతల పదాలను ఉటంకిస్తున్నాము.

ఇమామ్ 'రాజీ' ఇలా అంటున్నారు :

إعلم أنه تعالىٰ في الآيات المتقدمة عاب أهل الكتاب على شيئين، أحدهما: أنه عابهم على الكفر ... ثم بعد ذٰلک عابهم على سعيهم في إلقاء الغير في الكفر ... فلما انتقل منه إلى مخاطبة المؤمنين أمرهم أولاً بالتقوىٰ والإيمان... ثم أمرهم بالسعى في إلقاء الغير فى الإيمان والطاعة

'పరమ ప్రభువు అల్లాహ్ గత ఆయత్‌లలో గ్రంథవహుల రెండు విషయాలను ఖండించాడు. వాటిలో ఒకటి వారి తిరస్కార భావాన్ని ఖండించటం... ఆ తరువాత, వారు ఇతరుల్ని తిరస్కారంలో పడవేసే ప్రయత్నం చేస్తారన్న విషయాన్ని ఖండించడం. ఆపైన ముస్లిములను సంబోధించినప్పుడు తొలుత దైవనిష్ఠను, విశ్వాసాన్ని ఆదేశించాడు... ఆ తరువాత వారు ఇతరుల్ని విశ్వాసం, విధేయతా పరిధి లోకి తీసుకు వచ్చేందుకు ప్రయత్నించాలని నిర్దేశించాడు.'

*(మఫాతీహుల్ గైబ్, అత్ తఫ్సీరుల్ కబీర్, సంపు. 4, 8వ భాగం, పు. 145)*

అల్లామా సయ్యిద్ మహ్మూద్ ఆలూసీ ఇలా అంటున్నారు :

أمرهم سبحانه بتكميل الغير إثر أمرهم بتكميل النفس ليكونوا هادين مهديين على ضد أعدائهم. فإن ماقصّ الله تعالىٰ من حالهم فى ما سبق يدل على أنهم ضالون مضلون

'పరమ ప్రభువు అల్లాహ్ ముస్లిములను తమ వ్యక్తిత్వ పరిపూర్ణతకు ఆదేశమిచ్చిన తరువాత (ఈ ఆయత్‌లో) ఇతరుల పరిపూర్ణతకు ఆదేశమిచ్చాడు. తద్వారా వారు తమ శత్రువులు (యూదుల)కు భిన్నంగా సన్మార్గగాములవడంతోపాటు ఇతరులకు మార్గబోధన చేసేవారుగా కూడా రూపొందాలని. ఎందుకంటే గతించిన ఆయత్‌లలో అల్లాహ్ వివరించిన వారి పరిస్థితుల ద్వారా తెలిసే దాన్ని బట్టి వారు స్వయంగానూ దారి తప్పిన వారవడంతోపాటు ఇతరుల్నీ దారి తప్పించారు.

*(రూహుల్ మఆనీ, సంపు. 2, 4వ భాగం, పు. 237)*

అల్లాహ్ ముస్లిమ్ సమాజం ద్వారా చేయించదలచిన కార్యం కొరకు ఈ ఆయత్‌లో రెండు పదాలు ప్రయోగించబడ్డాయి :

1. దావత్ ఇలల్ ఖైర్ (శుభం వైపునకు పిలుపు)

2. **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** (ప్రసిద్ధమయిన మంచి విషయాలను ఆదేశించడం, చెడుల్ని వారించడం)

## అర్థం, భావం

తొలుత శుభం వైపునకు పిలుపునే తీసుకుందాము. ఇక్కడ వాడిన పదం 'ఖైర్' (శుభం) అన్నది, భావం అల్లాహ్ ధర్మం. అది ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లమ్) ద్వారా ముస్లిమ్ సముదాయానికి అందజేయబడింది. అల్లాహ్ ఇచ్చిన జీవన వ్యవస్థ, విశ్వాసాలు, సిద్ధాంతాలు, రాజకీయ శాసనాలు, నైతిక నియమాలు, ఆరాధనా సూత్రాలు- ఇవే ఖైర్ లేదా 'శుభం' అన్నది. ప్రపంచాన్ని ఈ ఖైర్ వైపునకు పిలుపునివ్వడం ముస్లిమ్ సముదాయం బాధ్యత. ఈ సముదాయానికి మంచీ చెడుల ప్రమాణం అల్లాహ్ ధర్మం. అల్లాహ్ ధర్మంలో ఉన్నదంతా మంచిది, మరేదయితే అల్లాహ్ ధర్మానికి వెలుపల ఉందో అది 'చెడుగు'. అల్లాహ్ ధర్మం తప్ప మరే జీవన భావన పట్లనూ ఈ సముదాయానికి శ్రద్ధ ఉండజాలదు, దాని వైపునకు అది ప్రపంచానికి పిలుపునూ ఇవ్వజాలదు. ప్రపంచంలో ఉన్న ఫిలాసఫీలన్నీ, జీవన వ్యవస్థలన్నీ జీవన శాసనాలన్నీ ఈ సముదాయం దృష్టిలో 'చెడు'కు భిన్న రూపాలే. వీటిలో మంచి అన్న కోణం ఏదయినా ఉన్నా దాని పైన చెడు అన్నదే ఆధిక్యత పొంది వుంది. ఆ చెడులన్నింటినీ రూపుమాపి వాటి స్థానే దైవధర్మాన్ని స్థాపించడానికి ప్రభవింపజేయ బడింది ముస్లిమ్ సముదాయం.

**'దావత్ ఇలల్ ఖైర్'** లేదా 'శుభం వైపునకు పిలుపు' అని అంటే ధర్మంలోని ఏదో ఒక అంశం వైపునకు పిలుపునివ్వడం కాదు, పూర్తి ధర్మం వైపునకు పిలవడం. ముస్లిమ్ సముదాయం సంపూర్ణ ధర్మం వైపునకు పిలుపును తీసుకొని బయలుదేరక పోతే అది 'దావత్ ఇలల్ ఖైర్' విధి నుంచి విముక్తం కాజాలదు. అది కేవలం నైతిక సంస్కరణ ఉద్యమాన్ని నడిపించినట్లయితే, లేదా అది కేవలం రాజకీయ విప్లవాన్ని దృష్టిలో ఉంచుకుంటే, లేదా అది కేవలం ఆరాధనల ఉద్బోధ వరకు తన కృషిని పరిమితం చేసుకుంటే, లేదా కేవలం వ్యవహారాల జీవన విభాగాన్ని చక్కబరచడమే ధ్యేయంగా పెట్టుకుంటే దానివల్ల 'దావత్ ఇలల్ ఖైర్' బాధ్యత ఎన్నడూ నెరవేరదు. ఈ పనుల్లో ప్రతి పని ధర్మానికి సంబంధించిన పనే అన్న విషయంలో ఎటువంటి సందేహం లేదు. అందులో 'ఖైర్' (శుభం) అన్న అంశం తప్పనిసరిగా ఉంది. కాని

ముస్లిమ్ సముదాయం అంశికమయిన ఖైర్‌ని నిర్వర్తించేందుకు నియమించబడలేదు. అది పూర్ణ ఖైర్ వైపునకు పిలుపునివ్వాలని దాన్ని ఆదేశించడం జరిగింది. దివ్యఖుర్‌ఆన్ లోని అనేక సూచనల ద్వారా ఇదే ద్యోతకమవుతోంది. ఉదాహరణకు అన్బియా సూరాలోని క్రింది ఆయత్‌ని గమనించండి. హజ్రత్ ఇబ్రాహీమ్(అ), హజ్రత్ ఇస్‌హాఖ్ (అ), హజ్రత్ యాకూబ్(అ) ప్రస్తావనల తరువాత ఇలా అంటుంది కుర్‌ఆన్:

وَ جَعَلْنٰهُمْ اَئِمَّةً يَّهْدُوْنَ بِاَمْرِنَا وَ اَوْحَيْنَآ اِلَيْهِمْ فِعْلَ الْخَيْرٰتِ وَ اِقَامَ الصَّلٰوةِ وَاِيْتَآءَ الزَّكٰوةِ ۚ وَكَانُوْا لَنَا عٰبِدِيْنَ O (الانبياء: ٧٣)

**'మేము వారిని ఇమామ్ (నాయకులు)గా చేశాము. వారు మా ఆదేశానుసారం మార్గ బోధన చేసేవారు. మేము వారికి శుభకార్యాలను (ఖైరాత్‌ని) నిర్వర్తించే వహీ చేశాము, ఇంకా నమాజ్ స్థాపించాలని, జకాత్ చెల్లించాలని (కూడా ఆదేశించాము). వారు మా ఆరాధనా తత్పరులయినవారు.'**

*(అల్ అన్బియా : 73)*

ఇక్కడ 'ఖైరాత్' అన్న పద ప్రయోగం జరిగింది. ఈ 'ఖైరాత్' పనులను అల్లాహ్ తన సందేశహరులకు చేసే ఆదేశమిచ్చాడు. దైవ సందేశహరులకు ఏ శుభకార్యాల కొరకు వహీ చేయడం జరుగుతుందో వాటి పరిధి సువిశాలమయింది. అందులో ఆరాధనలు, నీతి నియమాలు, వ్యవహారాలు అన్నీ చేరి ఉన్నాయి. దాన్నే దీన్ (ధర్మం) అనీ షరీఅత్ అనీ అంటారు. దీన్నిబట్టి అతి స్పష్టంగా తెలిసేదేమంటే 'ఖైరాత్' అన్న పదం సమస్త షరీఅత్ స్థానంలో ప్రయోగించబడింది. ఆ షరీఅత్ అల్లాహ్ పక్షాన ప్రవక్తలకు ప్రాప్తమవుతుంది. దాని ప్రకారమే వారు జీవితం గడుపుతారు. కనుక అల్లామా బగ్వీ ఈ ఆయత్‌ని వివరిస్తూ ఇలా వ్రాశారు :

(وَجَعَلْنٰهُمْ أَئِمَّةً يَهْدُوْنَ بِأَمْرِنَا) يُقتدي بهم في الخيرات (يَهْدُوْنَ بِاَمْرِنَا) يدعون الناس إلى ديننا (وَأَوْحَيْنَا إِلَيْهِمْ فِعْلَ

**"మేము వారిని ఇమామ్ (నాయకులు)గా చేశాము. వారు మా ఆదేశానుసారం మార్గ బోధన చేసేవారు" అంటే 'శుభ వ్యవహారాల'లో వారిని అనుసరించడం జరిగేది. "వారు మా ఆదేశం ప్రకారం మార్గబోధన చేసేవారు" అని అంటే వారు ప్రజలకు మా ధర్మబోధన చేసేవారు అన్నమాట. "ఇంకా మేము వారికి**

الخَيرَاتِ) يعني العمـــــل بالشرائع

**'శుభకార్యాల'ను వహీ చేశాము అంటే షరీఅత్‌లను ఆచరించాలని ఆదేశించాము."**

*(మఆలిముత్తన్జీల్: హామిష్ ప్రచురణ, అల్ ఖాజిన్ 4: 302) (లుబాబుత్తా'వీల్ ఫీ మఆని అత్తన్జీల్ : 4: 302)*

వ్యాఖ్యాత ఖాజిన్ కూడా 'ఫిఅలల్ ఖైరాత్' వివరణను 'షరీఅత్‌ని అమలు పరచడం' అనే వాక్యంతోనే చేశారు. దీని భావమేమిటంటే 'ఖైర్' అన్నది అల్లాహ్ షరీఅత్‌కు మరో పేరన్నమాట. ప్రవక్తలకు ఇదే ఖైర్‌ని అమలు చేయాలని ఆదేశం ఇవ్వబడేది. వారి జీవితం దానికే ప్రతిరూపమయి ఉండేది. వారు ఇతరులకూ దీని పిలుపునే ఇచ్చేవారు. ఈ విషయమే వారిని దైవ దాస్యపు అత్యున్నత స్థానం వరకు చేర్చింది. వారు అల్లాహ్ సన్నిధిలో దాసులు, ఆరాధకులుగా నిర్ణయమయ్యారు.

'ఖైర్' అనే పదం భావాన్ని అర్థం చేసుకునేందుకు మరో ఆయత్‌ని పరిశీలిద్దాం. అది మాఇద సూరాలోని ఆయత్. ఈ ఆయత్‌లో షరీఅత్‌ల భిన్నత్వం ప్రస్తావన ఉంది. అల్లాహ్ ధర్మం, దాని వాస్తవికత, దాని నిజసారం రీత్యా నిత్యం ఒక్కటే, ఇందులో ఎన్నడూ ఎటువంటి మార్పు జరగలేదు. కాని విభిన్న కాలాల్లో షరీఅత్ ఆదేశాలు వేర్వేరుగా ఉండేవి. కాగా బనీ ఇస్రాయీల్‌కు ఇవ్వబడిన షరీఅత్ మహనీయ ముహమ్మద్(స) ప్రభవన తరువాత మారిపోయింది. ఆయన(స)కు ఓ కొత్త షరీఅత్ ఇవ్వబడింది. కాని ఈ షరీఅత్‌లో విభేదం అసలు ధర్మంలో విభేదం అని అర్థం కాదు. అందువల్ల దైవభక్తికి ఆవశ్యకత ఏమిటంటే ఏ కాలంలో ఏ షరీఅత్ ఆదేశాలయితే అవతరిస్తాయో వాటిని శిరసావహించడానికి మనిషి సన్నద్ధుడయి ఉండాలి. ఎవరయితే కొత్త షరీఅత్ వచ్చిన తరువాత కూడా గత షరీఅత్‌ని వదలడానికి సిద్ధంకాడో అతను అల్లాహ్ పట్ల అవిధేయుడే.

لِكُلٍّ جَعَلْنَا مِنكُمْ شِرْعَــةً مِنهَـاجـاً ...فَاسْتَبِقُوا الْخَيرٰتِ (المآئدة : ٤٨)

**"మేము మీలో ప్రతి వర్గానికి ఒక షరీఅత్ ఒక మార్గం నిర్ణయం చేశాము. కాగా మీరు ఇప్పుడు 'ఖైరాత్' (శుభాల)లో ఒకరిని మించి మరొకరు మున్ముందు ఉండండి."**

*(అల్ మాయిద : 48)*

ఇక్కడ 'ఖైరాత్'లో ముమ్మందు ఉండటం అంటే అర్థం, మహనీయ ముహమ్మద్‌కు అవతరించిన షరీఅత్‌ని అమలు చేయడం. ఎందుకంటే ఇప్పుడు ఈ షరీఅత్‌ని అనుసరించడం ద్వారానే మోక్షం ప్రాప్తం అవుతుంది. కాగా ఇబ్ను కసీర్ (రహ్మ) **'ఫస్తబికుల్ ఖైరాత్'** 'శుభకార్యాల్లో ముమ్మందు ఉండండి' అన్న పదాలకు ఇలా వివరణ వ్రాశారు :

**وهى طاعة الله واتباع شرعه الذى جعله ناسخاً لما قبله و التصديق بكتابه القرآن الذى هو آخر كتاب أنزله**

**అంటే అర్థం అల్లాహ్ విధేయత, అది మునుపటి షరీఅత్‌లను రద్దు పరుస్తూ, ఆయన పంపిన ఈ షరీఅత్ అనుసరణ, ఆయన అంతిమంగా అవతరింపజేసిన ఆయన గ్రంథం కుర్‌ఆన్ ధ్రువీకరణ.**

*(తఫ్సీర్ అల్ కుర్‌ఆన్ అల్ అజీమ్ - 4/ 155)*

అల్లామా సయ్యిద్ మహ్మూద్ ఆలూసీ ఇలా అంటున్నారు :

**فسارعوا إلى ما هو خير لكم فى الدارين من العقائد الحقة والأعمال الصالحة المندرجة في القرآن الكريم**

**'మహత్పూర్వకమయిన కుర్‌ఆన్‌లో నమోదయి ఉన్న సత్యమయిన విశ్వాసాలు, సదాచరణల అవలంబన వైపునకు త్వరపడండి, అదే మీ ఇహపర లోకాలకు శుభప్రదమయింది'** ***(రూహుల్ మఆనీ : సం.3, 6వ భాగం, పు.322).***

అల్లామా నిజాముద్దీన్ కుమ్మీ నీషాపూరి ఇలా వ్రాస్తున్నారు :

**يعنى بالخيرات هٰهنا ما هو الحق من الاعتقادات والمُحقق من التكاليف**

**ఇక్కడ 'ఖైరాత్' అంటే అల్లాహ్ ఉద్దేశ్యం, అత్యంత సరయిన విశ్వాసాలు, మానవులకు చేయాలని ఆదేశించిన నిరూపిత ఆచరణలు అన్నది.** ***(గరాయిబుల్ కుర్‌ఆన్, వ రగాయిబుల్ ఫుర్‌కాన్, హామిష్ ప్రచురణ, ఇబ్ను జరీర్ : 6: 135)***

ఈ వివరణల వల్ల విశదమయ్యేదేమిటంటే 'ఖైరాత్‌లో ముమ్మందుండటం' అన్న దాని అర్థం, అల్లాహ్ దాస్యం, ఆయన సందేశహరుని(స) విధేయత, షరీఅత్ ఆదేశాల అనుసరణల్లో ముమ్మందుండటం అన్నమాట. 'ఖైర్' అన్న ఒక్క పదంలో విశ్వాసాలు, ఆచరణల సంపూర్ణ వ్యవస్థ ఏకత్రమయి వచ్చేసిందన్న మాట. ఇది కుర్‌ఆన్ రూపంలో అవతరించి ఉంది. ఆ 'ఖైర్' వైపునకే ప్రపంచానికి పిలుపునిచ్చే ఆదేశం ముస్లిమ్ సముదాయానికి ఇవ్వబడింది.

ఇక నేరుగా ఆ ఆయత్‌నే పరిశీలిద్దాం. అందులో 'శుభం వైపునకు పిలుపు' ఆదేశముంది. దాన్ని ప్రవక్తశ్రీ(స), సహచరమాన్యులు (ర), అనుచర మహనీయులు, కుర్ఆనీ శాస్త్రాల నిపుణులు ఏమని వివరించారో చూద్దాం.

## ప్రవక్త సంప్రదాయం

అబూ జాఫర్ బాకర్ (ర) ప్రకారం ప్రవక్త మహనీయులు(స) (ఒకసారి)ఈ ఆయత్ పఠించారు:

وَلْتَكُنْ مِّنْكُمْ اُمَّةٌ يَّدْعُوْنَ اِلَى الْخَيْرِ

**'మీలో కొందరు మంచివైపునకు పిలిచేవారు, (సత్కార్యాలను ఆదేశించేవారు) తప్పనిసరిగా ఉండాలి.** *(ఆలి ఇమ్రాన్ : 104)*

తరువాత ఇలా నుడివారు,

اَلْخَيْرُ اِتِّبَاعُ الْقُرْاٰنِ وَ سُنَّتِىْ

**'ఖైర్ (శుభం- మంచిది) అన్నది కుర్ఆన్, నా సంప్రదాయాల అనుసరణ'**

*(ఫత్‌హుల్ కదీర్, అల్ షౌకానీ 1: 466).*

'శుభం లేక మంచి వైపునకు పిలుపు' అంటే అర్థం, కుర్ఆన్ సున్నత్‌ల వైపునకు పిలుపు అన్నమాట. మరే పిలుపును ముస్లిమ్ సముదాయం ప్రజలకు అందజేసినా అది శుభం వైపునకు పిలుపు కాదు, ఆ పని శుభం వైపునకు పిలుపు కార్యమూ కాదు.

## ప్రాచీనుల విశదీకరణలు

అబూ హయ్యాన్ అందులుసీ, 'ఖైర్'ని గురించి కొందరు అనుయాయుల సూక్తులు ఉటంకించారు:

الخير هو الإسلام، قاله مقاتل، أو العمل بطاعة الله قاله أبو سليمان الدمشقى أو الجهاد والإسلام

**ముకాతిల్: 'ఖైర్ అంటే ఉద్దేశ్యం ఇస్లామ్, లేదా దీని ఉద్దేశ్యం దైవ విధేయత. అబూ సులైమాన్ దిమిష్కి : దీని భావం జిహాద్, ఇస్లామ్ కూడా కావచ్చు.**

*(అల్ బహ్రుల్ ముహీత్ : 3: 16)*

అల్లామా బగవీ, ఖైర్ అంటే ఇస్లామ్ అని వివరించారు. ఇదే వివరణ వ్యాఖ్యాన గ్రంథం జలాలైన్‌లోనూ ఉంది. *(మఆలిముత్తన్జీల్ : హామిష్ ఖాజిన్ ప్రచురణ:1: 514)*

కాని ఒక మాట మరువకూడదు. ఇస్లామ్ అంటే ఏదో ఒక అంశంలోనో, ఏదో ఒక ప్రత్యేక వ్యవహారంలోనో అల్లాహ్ విధేయత కాదు, దీని భావం అల్లాహ్ అవతరింప

జేసిన సంపూర్ణ ధర్మం, జీవితపు సకల వ్యవహారాలలో ఆయన విధేయత అని భావం. ఈ సంపూర్ణ ధర్మ సందేశమే అందజేయాలని ముస్లిమ్ సముదాయానికి ఆదేశ మయింది. కాగా అల్లామా సావీ వ్యాఖ్యాన గ్రంథం జలాలైన్‌కు టీకాలో ఇలా వ్రాశారు:

إنما قصره عليــه لأنــه رأس الأمور

**వ్యాఖ్యానకర్త ఖైర్‌ని ఇస్లామ్ అనే పదంలో పరిమితపరిచారు, ఎందుకంటే ఇస్లామ్ సమస్త వ్యవహారాలకు పునాది.** *(వ్యాఖ్యాన గ్రంథం జలాలైన్‌కు అస్సావీ టీకా : **1 : 150**)*

అత్యంత ప్రాచీన వ్యాఖ్యానకర్త ఇమామ్ ఇబ్ను జరీర్ తబరీ దీన్ని మరీ స్పష్ట పరిచారు:

(وَلْتَكُنْ مِّنكُمْ) أيها المؤمنون (أُمَّةٌ) يقول جماعة (يَدْعُونَ) الناس (إِلَى الْخَيْرِ) يعنى إلى الْإسلام وشرائعه التي شرعها الله لعباده

**విశ్వాసులారా! మీలో ఒక వర్గం (అంటే సంఘం) ఉండాలి. అది మానవుల్ని (శుభం వైపునకు) అంటే ఇస్లామ్ వైపునకు పిలుపు నిచ్చేది. అంటే ఇస్లామ్ వైపునకు, అల్లాహ్ తన దాసులకు పంపిన షరీఅత్ వైపునకు అన్న మాట.**

*(జామిఉల్ బయాన్ ఫీతఫ్సీరుల్ కుర్ఆన్ :4: 24)*

అల్లామా అబూ హయ్యాన్ అందులుసీ ఇలా వ్రాస్తున్నారు :

الدعاء إلى الخير وهو عام في التكاليف من الأفعال والتروك

**'ఖైర్' వైపునకు పిలుపు అన్నది సర్వసామాన్య మయింది. ఇందులో షరీఅత్ ఆదేశించిన ఆచరణలన్నీ చేరి ఉన్నాయి. చేయమన్నవీ, వారించినవీ** *(అల్ బహ్రుల్ ముహీత్, 3: 20)*

కాజీ బైజావీ ఇలా వ్రాస్తున్నారు :

الدعاء إلى الخير يعمّ الدعـاء إلى مـا فيــه صـلاح دينى و دنيـوى

**ఖైర్ వైపునకు పిలుపు అన్నది సామాన్య మయినది. దీని భావం సకల శుభాలన్నింటి వైపునకు పిలుపునివ్వడం ఇందులో చేరి ఉంది.**

*(అన్వారుత్తన్జీల్ వ అస్రారుత్తావీల్ 1: 174)*

ఇదే వ్యాఖ్యానం షైఖ్ అబుస్సఊద్, అల్లామా సయ్యిద్ మహ్మూద్ ఆలూసీ కూడా చేశారు. ఇహపరాల ఈ శుభం వైపునకే ముస్లిమ్ సముదాయం పిలుపునివ్వవలసి వుంది. ఇది అల్లాహ్ గ్రంథం, ప్రవక్త సంప్రదాయంలో ఉంది. ఏ నమ్మకాలు, ఆచరణ లయితే ఈ రెంటి ద్వారా రుజువవుతాయో అవే మానవ సంస్కరణకు సాఫల్యానికీ హామినిస్తాయి. మిగతా మార్గాలు, భావనలు, సిద్ధాంతాలు, ఆచరణలు, అన్నీ మార్గ విహీనతలే, కల్లోల కారణాలే. ఈ వ్యాఖ్యాతల భావం కూడా ఇదే. షైఖ్ ఇస్మాయీల్ హకీమ్ ఇహపరాల సాఫల్యానికి షరీఅత్ ప్రకారం చేయదగినది అన్న భావం ఇచ్చారు. షరీఅత్ ప్రకారం చేయదగినదేదో దైవగ్రంథం, ప్రవక్త సంప్రదాయం ద్వారానే రుజువవుతుంది:

(وَلۡتَكُنۡ مِّنۡكُمۡ اُمَّةٌ يَّدۡعُوۡنَ اِلَى الۡخَيۡرِ) جماعة داعية إلى الخير أى إلى مافيه صلاح دينى و دنيوى فالدعاء إلى الخير عام فى التكاليف من الأفعــال و التروك

**'(మీలో ఒక వర్గం ఖైర్ వైపునకు పిలుపునిచ్చేది తప్పక ఉండవలసిందే) అంటే ఒక సంఘం ఖైర్ (శుభం) వైపునకు పిలిచేదన్నమాట. ఖైర్ అంటే ఇహపరాల శుభం అన్నమాట. అందు వల్ల 'శుభం వైపునకు పిలుపు' అంటే అందులో మనుషులకు చేయడానికి లేదా మానుకోవ దానికి అల్లాహ్ తన దాసులకు ఆదేశించిన విషయాలన్నీ చేరి ఉన్నాయన్నమాట.**

*(రూహుల్ బయాన్ 1: 352)*

మీరు గమనించే ఉంటారు, కుర్‌ఆన్‌లోనూ ఇదే ఉంది. ప్రతి వ్యాఖ్యాత కూడా దీన్నే ధ్రువీకరించాడు, 'ఖైర్ పిలుపు' అంటే ఇస్లామ్ పిలుపునకు సమానార్థకం. ఇక ముస్లిమ్ సముదాయాన్ని 'శుభం వైపునకు పిలుపు' కొరకు నియమించడం అంటే భావం ఏమిటో, ఇస్లామ్‌ను ప్రశంసించడం, దాని సత్యత పట్ల ఏదయినా గ్రంథం వ్రాయించటం మటుకు కాదు కదా. ఈ పిలుపు బాధ్యత నెరవేరాలంటే ఈ సముదాయం దానికోసమని అంకితమయినంతవరకు అది సాధ్యం కాదు. ఈ సముదాయం దాని సర్వశక్తులూ ఆ ధర్మాన్ని స్థాపించేందుకు వినియోగించాలి. దీనిగ్గాను దాని సకల ప్రయత్నాలూ కృషి ఇదే లక్ష్యంతో జరగాలి. అది దాని జీవన శక్తిసామర్థ్యాలన్నీ దీనికై వెచ్చించాలి. దాని సంధి అయినా, యుద్ధమయినా, దీని మార్గంలోనే సాగాలి. ఈ సముదాయం దీనికోసమే బ్రతకాలి, దీనికోసమే మరణించాలి.



# అమ్ర్ బిల్ మా'రూఫ్,
# వ నహీ అనిల్ మున్కర్

# 2. విధి అవడం, ప్రాముఖ్యత

## 'అమ్ర్ బిల్ మా'రూఫ్ వ నహీ అనిల్ మున్కర్' కుర్ఆన్ పరిభాషలో దైవదౌత్య కార్యం - కుర్ఆన్ పరిభాషా పదం

మా'రూఫ్‌ను ఆదేశించడం, మున్కర్‌ని నిరోధించడం దైవప్రవక్తల పని. కుర్ఆన్, ప్రవక్తలు, వారి నిజ అనుయాయులు చేయవలసిన పనిని ఏ పరిభాషావళిలో అభివర్ణించిందో వాటిలో ఒక పారిభాషిక పదం **'అమ్ర్ బిల్ మా'రూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** అన్నది. కాగా దైవసందేశహరుల(స)ను గురించి కుర్ఆన్‌లో ఇలా ఉంది:

يَأْمُرُهُمْ بِالْمَعْرُوْفِ وَيَنْهٰهُمْ عَنِ الْمُنْكَرِ (الاعراف:١٥٧)

**ఆయన (గ్రంథవహులకు) మా'రూఫ్‌ను (సత్కార్యాలను) ఆదేశిస్తాడు, మున్కర్‌ని (చెడును) నిరోధిస్తాడు.** *(అల్ ఆరాఫ్ : 157)*

హజ్రత్ లుక్మాన్ తన తనయునికి **అమ్ర్ బిల్ మా'రూఫ్, వ నహీ అనిల్ మున్కర్** హితవు గరుపుతూ మా'రూఫ్‌ని ఆదేశించాలని, మున్కర్‌ని నిరోధించాలని ఆదేశిస్తారు. ఇంకా ఈ మార్గంలో వచ్చే ఆపదను సహించాలి అని, ఈ పనికి అసమాన సహనం, ధైర్యం అవసరం అని, దీనిపైన గట్టి సంకల్ప బలం గలవారే నిలబడగలుగుతారనీ అంటారు.

يٰبُنَيَّ اَقِمِ الصَّلٰوةَ وَاْمُرْ بِالْمَعْرُوْفِ وَانْهَ عَنِ الْمُنْكَرِ وَاصْبِرْ عَلٰى مَآ اَصَابَكَ ؕ اِنَّ ذٰلِكَ مِنْ عَزْمِ الْاُمُوْرِ ۚ (لقمان:١٧)

**నాయనా, నమాజ్‌ని స్థాపించు. మా'రూఫ్‌ని (మంచిని) ఆదేశించు, మున్కర్‌ని (చెడును) నిరోధించు, మరే ఆపద వచ్చి పడినా సహనం వహించు. నిశ్చయంగా ఇవి మరీ మరీ తాకీదుగా బోధింపబడిన విషయాలు.** *(లుక్మాన్ : 17)*

హజ్రత్ లుక్మాన్ దైవప్రవక్త కాకపోయినా ఎంతో సౌజన్యశీలురు, దైవభక్తి పరాయణులయిన మానవులు. కుర్ఆన్ ఆయన హితవును ఉటంకించడానికి

కారణం దీనివల్ల ఆయన శీల స్వభావాలు తెలిసి వస్తాయన్నది కాదు. దాన్ని ఉటంకించడానికి కారణం, దాన్ని అనుసరించాలన్నది. 'జస్సాస్' ఇలా అంటున్నారు:

إنما حكى الله تعالىٰ لنا ذٰلك عن عبده لنقتدى به وننتهى إليه

**అల్లాహ్ తన దాసుని ఈ ఉపదేశం మనకు వినిపించడానికి కారణం, మనం దాన్ని అనుసరించాలన్నది, ఆయన వరకు చేరాలన్నది.**

*(అహ్కాముల్ కుర్ఆన్, 2: 592)*

## గ్రంథవహులలో సత్యప్రియులు- అమ్ర్ బిల్ మా'రూఫ్ వ నహీ అనిల్ మున్కర్ విధి

కుర్ఆన్ అవతరణా కాలంలో గ్రంథవహులలో బలమయిన కలత, చెడుగు పొడసూపింది. వారు అల్లాహ్ ధర్మాన్ని వదలుకున్నారు. అయినా వారిలో ఒక వర్గం సన్మార్గాన నిలకడ కలదిగా ఉండేది. అది **అమ్ర్ బిల్ మా'రూఫ్, వ నహీ అనిల్ మున్కర్** విధిని నిర్వర్తిస్తూ ఉండేది. కుర్ఆన్ దాన్ని ప్రశంసించింది. దీన్నిబట్టి ఒక వాస్తవికత వ్యక్తమవుతుంది. రుజుమార్గాన నిలకడ కలిగి ఉండటానికి అమ్ర్ బిల్ మా'రూఫ్ వ నహీ అనిల్ మున్కర్ ఒక తప్పనిసరి నిబంధన. ఈ నిబంధన లేనిదే రుజుమార్గాన స్థిరంగా నిలుస్తారన్న భావన కూడా ఏర్పడదు. అందువల్లనే సెలవీయబడింది:

لَيْسُوْا سَوَآءً ؕ مِنْ اَهْلِ الْكِتٰبِ اُمَّةٌ قَآئِمَةٌ يَّتْلُوْنَ اٰيٰتِ اللّٰهِ اٰنَآءَ الَّيْلِ وَ هُمْ يَسْجُدُوْنَ ○ يُؤْمِنُوْنَ بِاللّٰهِ وَ الْيَوْمِ الْاٰخِرِ وَيَاْمُرُوْنَ بِالْمَعْرُوْفِ وَيَنْهَوْنَ عَنِ الْمُنْكَرِ وَ يُسَارِعُوْنَ فِى الْخَيْرٰتِ ؕ وَ اُولٰٓئِكَ مِنَ الصّٰلِحِيْنَ○ (آل عمران: ۱۱۳-۱۱۴)

**అయితే గ్రంథ వహులందరూ ఒకేవిధంగా లేరు. వీరిలో కొందరు రుజుమార్గాన నిలకడ గల వారూ ఉన్నారు. రాత్రివేళల్లో వచనాలను పఠిస్తారు, ఆయన సమక్షంలో ప్రణమిల్లుతారు, అల్లాహ్‌ను అంతిమ దినాన్నీ విశ్వసిస్తారు, మంచిని ఆదేశిస్తారు, చెడుల నుండి వారిస్తారు, సత్కార్యాల్లో నిమగ్నులయి ఉంటారు. వీరు సదాచార పరాయణులు."**

*(ఆలి ఇమ్రాన్ : 113, 114)*

## అమ్ర్ బిల్ మా'రూఫ్, వ నహీ అనిల్ మున్కర్- ప్రవక్తల పని

దీన్నిబట్టి తెలిసేదేమిటంటే ప్రవక్తా బాధ్యతను గురించి 'అమ్ర్ బిల్ మా'రూఫ్ వ నహీ అనిల్ మున్కర్' అన్న నిర్వచనం సరిగ్గా ఖుర్ఆన్ ప్రకటించిన నిర్వచనం. ఇదేదో పరిమిత నిర్వచనం కాదు. ఇదేదో ప్రవక్తలు వారి అనుయాయుల బాధ్యతల్లో ఓ భాగాన్ని సూచించేది కాదు. అలాకాక అది ప్రవక్తలు, వారి శిష్యగణం దైవధర్మ మార్గంలో చేసే కృషినంతటినీ ప్రస్ఫుటపరుస్తుంది. వారి బోధనలన్నీ అమ్ర్, నహీకి సంబంధించిన ఆదేశాలే. వారు మారూఫ్‌ను ఆదేశించేవారు లేదా మున్కర్ నుండి ఆపేవారు. ఈ నిర్వచనం ద్వారా ఒక ప్రవక్త, ఆయన అనుచర సమాజంలోని సంస్కర్తలు తమ తమ కాలాల్లో నిర్వర్తించిన బాధ్యత ఏదో అతి సులువుగా గ్రహించవచ్చు. ఆ కార్యమే ముస్లిమ్ సముదాయం నిర్వహించడానికి నేడూ నియుక్తమయి వుంది. వాస్తవానికి ఈ నిర్వచనం చూడటానికి కొన్ని పదాల సంచయనం. కాని ఈ కొన్ని పదాలలోనే ప్రవక్తల ప్రభవనకు ఉద్దేశ్యమేదో తెలుపడం జరిగింది. ఖుర్ఆన్, హదీసుల వెలుగులో విజ్ఞులయినవారు ఇదే మాటను పలికారు.

ఇమామ్ ఇబ్ను తయిమియ్య (రహ్మ) ఇలా అంటున్నారు :

الأمر بالمعروف والنهى عن المنكر الذى انزل الله به كتبه و ارسل به رسله، من الدين

**'అమ్ర్ బిల్ మా'రూఫ్, వ నహీ అనిల్ మున్కర్' అన్న తాకీదు తోటే పరమ ప్రభువు అల్లాహ్ తన గ్రంథాలను అవతరింపజేశాడు, తన ప్రవక్తలనూ పంపాడు, ఇది ధర్మంలోని భాగం'**

*(అల్ హస్బతు ఫిల్ ఇస్లామ్: పు. 57)*

అల్లామా కుర్తుబీ ఇలా అంటున్నారు :

إن الأمر بالمعروف والنهى عن المنكر كان واجبًا فى الأمم المتقدمة، وهو فائدة الرسالة وخلافة النبوة

**'మా'రూఫ్‌ను ఆదేశించడం, మున్కర్‌ని వారించడం కడచిన సముదాయాలకు విధి అయినది. ఇదే దైవదౌత్యానికి ప్రయోజనం, ఇదే దైవదౌత్యానికి ప్రాతినిధ్యం'.**

*(అల్ జామిఅ లి అహ్కామిల్ ఖుర్ఆన్ : రెండవ సంపుటం, 4వ భాగం, పుట. 31)*

అల్లామా సైఫుద్దీన్ ఆమదీ ఇలా అంటున్నారు :

مامن أمة إلّا وقد أمرت بالمعروف كاتباع أنبيائهم و شراعهم، ونهت عن المنكر كنهيهم عن الإلحاد و تكذيب أنبيائهم

'ఎన్ని సముదాయాలు గడిచాయో వాటిలో ప్రతిదీ మారూఫ్‌ను ఆదేశించింది. ఉదాహరణకు, వారు తమ ప్రవక్తలు, షరీఅత్‌లను అనుసరించాలని ఆదేశించడం. అలాగే వారు మున్కర్‌ను వారించారు. ఉదాహరణకు, వారు దైవ నిరాకరణను, ప్రవక్తల తిరస్కారాన్ని ఆపడం.'

*(అల్ అహ్కామ్ ఫీ ఉసూలిల్ అహ్కామ్ : 1/308)*

ఇమామ్ రాజీ ఒక ప్రశ్నను లేవనెత్తుతూ ఇలా అంటారు :

الأمر بالمعروف والنهى عن المنكر والإيمان بالله... إن هذه الصفات الثلثة كانت حاصلة فى سائر الأمم

'అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్, దైవాన్ని నమ్మడం– ఈ మూడు గుణాలు సకల సముదాయాలలో ఉండేవి' *(మఫాతీహుల్ గైబ్, 4వ సంపుటం, 8వ భాగం, పు. 157)*

అల్లామా రషీద్ రజా మిస్రీ అంటున్నారు:

قد جرت سنة الأنبياء و السلف الصالحين على الدعوة إلى الخير و الأمر بالمعروف و النهي عن المنكر و إن كان محفوفاً بالمكاره و المخاوف

ప్రవక్తలు, దైవ సందేశహరులు, పూర్వ సంస్కర్తల సంప్రదాయం ఏమిటంటే వారు ఖైర్ (మంచి) వైపునకు పిలుపునిచ్చారు. మారూఫ్‌ని ఆదేశించారు, మున్కర్‌ని వారించారు. నిజానికి ఈ కార్యం కష్టాలతో శ్రమలతో కూడుకున్నదే అయినా.'

*(తఫ్సీరుల్ కుర్‌ఆన్ అల్ హకీమ్ (అల్ మనార్) : 4: 32)*

## అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ ముస్లిముల విధ్యుక్త ధర్మం

విజ్ఞులు చేసిన ఈ విశదీకరణలు తెలిపిన దాన్నిబట్టి **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** అన్ని కాలాల్లోనూ దైవ సందేశహరులు, వారి సముదాయాలు అందరు నిర్వహించిన కర్తవ్యమే. ఈ కార్యం కొరకే ముస్లిమ్ సముదాయం ఉనికిలోకి వచ్చింది. ఈ సముదాయం తన స్థానాన స్వీయ సంస్కరణ, తక్వా జీవితం గడపడం వరకే పరిమితమవడం దానికి తగనిది. అంతేకాకుండా అది ప్రపంచ

మార్గదర్శకత్వపు బాధ్యతను నిర్వర్తించవలసి ఉంది. అది ఉపాసన చేసేది, ప్రపంచం పట్ల త్యాగనిరతి గలదిగా కూడా మెలగాలి; దానికితోడుగా మార్గదర్శకత్వం, మార్గబోధనా బాధ్యతను సయితం నిర్వర్తించాలి. దైవారాధన, దైవ విధేయతలు, వాటితోపాటు దైవదాసుల మార్గబోధన, ఈ సముదాయం కార్యనిర్వహణలోని రెండు భాగాలు. నేడు ఒకవేళ అది వీటిలో ఏ ఒక్క అంశాన్ని వదలిపెట్టినా రేపు ప్రళయదినాన అది గట్టి పరీక్షను ఎదుర్కోవలసి వుంటుంది. పర్యవసానంగా అది నిష్ఫలమయినదిగా, పరాజిత సముదాయంగా పరిగణించబడుతుంది. దివ్య కుర్‌ఆన్‌లోని దిగువ ఆయత్‌లో దాని ప్రత్యేకతను ఇలా అభివర్ణించటం జరిగింది:

كُنتُمْ خَيْرَ أُمَّةٍ أُخْرِجَتْ لِلنَّاسِ تَأْمُرُوْنَ بِالْمَعْرُوْفِ وَتَنْهَوْنَ عَنِ الْمُنكَرِ وَتُؤْمِنُوْنَ بِاللّٰهِ ط (آل عمران:١١٠)

**ఇప్పుడు ప్రపంచంలో శ్రేష్ఠమయిన సముదాయం మీదే. మిమ్మల్ని మానవుల మార్గబోధనకు, సంస్కరణకు లోకంలో ప్రవేశపెట్టడం జరిగింది. మీరు సదాచారాన్ని ఆదేశిస్తారు, దురాచారాన్ని నిరోధిస్తారు, దైవాన్ని విశ్వసిస్తారు.** *(ఆలి ఇమ్రాన్: 110)*

ఈ ఆయత్‌లో ముస్లిమ్ సముదాయాన్ని 'ఖైర ఉమ్మహ్' (సముదాయాల్లో ఉత్తమమయింది) అని పేర్కొనడం జరిగింది. దాని గుణాలు రెంటిని ఎత్తిచూపడమూ జరిగింది. ఒకటి అది మారూఫ్‌ను ఆదేశిస్తుంది, మున్కర్‌ను వారిస్తుంది అన్నది; రెండవది అది అల్లాహ్‌ను విశ్వసిస్తుంది అన్నది. అల్లాహ్‌ను విశ్వసించడం అంటే మానవుడు ఆయన్ని తన ఆరాధ్యుడుగా, పాలకుడుగా అంగీకరించాలి. ఆయన ఆదేశాలకు ఎదురు పలక్కుండా పాటించాలి. విశ్వాసం అంటే హృదయ విశ్వాసం, పూర్ణ విధేయత అని భావం. కాగా విఖ్యాత వ్యాఖ్యానకర్త 'ఖాజిన్' ఈ సందర్భంలో 'దైవ విశ్వాసం' అన్న విశ్వాసాన్ని విశదీకరిస్తూ ఇలా వ్రాస్తున్నారు:

(وَتُؤْمِنُوْنَ بِاللّٰهِ) أي وتصدقور باللّٰه و تخلصون لـه التوحيـد والعبادة

**'మీరు దైవాన్ని విశ్వసిస్తారు' అంటే మీరు ఆయన ఉనికిని ధ్రువీకరిస్తున్నారు, ఆయన నిండు మనసుతో ఒక్కడే అని నమ్ముతారు, ఆయన్నే ఆరాధిస్తారు అని అర్థం.**
*(లుబాబిత్తావీల్ ఫీ మఆనీ అత్తన్జీల్: 1: 339)*

దీని భావమేమిటంటే ఈ సముదాయానికి 'ఖైర్ ఉమ్మహ్' బిరుదు ప్రాప్తమవడంలో గల అర్థం, ఒకవైపున అది చెడుగు నిండిన ప్రపంచం కొరకు శుభంగా పరిణ

మిస్తుంది, రుజుమార్గాన్ని చూపిస్తుంది, మరో వైపున అది పరమ ప్రభువు అల్లాహ్‌కు పూర్ణ విధేయత, ఆజ్ఞా పాలనను పాటిస్తుంది. ఈ ఇరు పక్ష కార్యం ఈ సముదాయాన్ని ఎంతో ఉన్నత స్థానానికి చేర్చుతుంది, మరే సముదాయమూ ఆ ఘనతను చేరుకోజాలదు. ఈ కార్యం వల్ల ఇందులో దైవదౌత్యపు గొప్పదనం ఉత్పన్నమవు తుంది. ఏ సముదాయంలోనయితే ఈ మహత్తు పుడుతుందో దాని కన్నా ఉత్తమ మయిన మరో జాతి దేవుని ఈ భూమిలో ఉండదు, ఉండజాలదు కూడా. అల్లామా సావీ ఈ ఆయత్ వివరణలో ఇలా అంటున్నారు:

**هذه الأمة لها شبه بالأنبياء من حيث إنها مهتدية في نفسها هادية لغيرها**

**ఈ సముదాయానికి దైవప్రవక్తలతో ఓ విధమయిన పోలిక ఉంది. ఎందుకంటే అది స్వయంగానూ సన్మార్గాన ఉంది, ఇతరులకూ సన్మార్గం చూపుతుంది.**

*(అస్‌సావీ, తఫ్సీర్ జలాలైన్‌కు వ్రాసిన టీకా : 1: 153)*

వాస్తవమేమిటంటే 'అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్' అల్లాహ్ పట్ల విశ్వాసం, ఆయన విధేయత 'ఖైర ఉమ్మహ్' (ఉత్తమ సమాజం)కు గల ప్రత్యేక లక్షణాలు. ఒకవేళ అది ఈ ప్రత్యేక లక్షణాలను కోల్పోయినట్లయితే దాని మహత్తు దాన్నుండి వెనిక్కి తీసుకోబడుతుంది. దానికీ ప్రపంచంలోని ఇతర జాతులకూ మధ్య ఎటువంటి వ్యత్యాసం మిగులదు. మహనీయ ఉమర్ (ర) ఒక హజ్జ్ సందర్భంలో పై ఆయత్ చదివి ఇలా అన్నారు :

**يـٰأيّها الناس. من سرّه أن يكون من تلك الأمة فليؤد شرط الله منها۔**

**జనులారా! మీలో ఎవరు ఈ 'ఉత్తమ సముదాయం'లో చేరదలచుకున్నారో వారు, దీనికిగాను అల్లాహ్ ఏ నిబంధనను పెట్టాడో దాన్ని నెరవేర్చాలి.**

*(జామిఉల్ బయాన్ ఫీ తఫ్సీరిల్ కుర్ఆన్ 4 : 27)*

ముజాహిద్ ఈ ఆయత్ వివరణలో ఇలా అంటున్నారు :

**كنتم خير الناس للناس على هذا الشرط أن تأمروا بالمعروف و تنهوا عن المنكر وتؤمنوا بالله**

**మీరు మానవుల ఎడల ఉత్తమ మానవులు,దానికి ఒకే నిబంధన, మీరు మారూఫ్‌ను ఆదేశిస్తారు, మున్కర్ నుండి ఆపుతారు, అల్లాహ్‌ను విశ్వసిస్తారు.**

*(జామిఉల్ బయాన్ ఫీ తఫ్సీరిల్ కుర్ఆన్ 4 : 28)*

అల్లామా కుర్తుబీ ఇలా అంటారు :

**(تَأْمُرُوْنَ بِالْمَعْرُوْفِ وَ تَنْهَوْنَ عَنِ الْمُنْكَرِ) مدح لهذه الامة ما أقاموا ذٰلک واتصفوا بـه فإذا تركـوا التغيير وتواطئوا على المنكر زال عنهم اسم المدح ولحقهم اسم الذم وكان ذلک سبباً لهلاكهم**

**పరమ ప్రభువు, 'మీరు మారూఫ్‌ను ఆదేశిస్తారు, మున్కర్‌ని నిరోధిస్తారు' అని సెలవివ్వడం వాస్తవానికి ఇది ఈ సముదాయానికి నిర్వచనం. అది ఈ మహత్కార్యం పైన నిలకడ చూపినంత కాలం, అందులో ఈ లక్షణం సజీవంగా ఉన్నంత కాలం ఇది దానికి వర్తిస్తుంది. కాని అది మున్కర్‌ను మార్చే కార్యం వదలి పెట్టినట్లయితే, మున్కర్‌ను అంగీకరిస్తే అల్లాహ్ దానికి ఇచ్చిన గుణవాచకపు నామం దాన్నుండి దూరమవుతుంది. ఆపైన దానికి ఖండన అతికిపోతుంది. ఇక ఇదే దాని అంతానికి మూలమవుతుంది.**

*(అల్ జామిఉల్ అహ్కాముల్ కుర్ఆన్, సం. 2, భాగం 4, పు. 111)*

ఇమామ్ రాజీ ఇదే వాస్తవాన్ని ఫిక్హ్, శాసనపరమయిన పరిభాషలో ఇలా వివరించారు:

**انه ثبت في أصول الفقه أن ذكر الحكم مقرونـا بالوصف المناسب لـه يدل على كون ذٰلک الحكم معلّلاً بذٰلک الوصف، فها هنـا حكم تعالى بثبوت وصف الخيرية لهذه الاُمة، ثم ذكر عقيبه هذا الحكم و هذه الطاعات، أعني الأمر بالمعروف و النهي عن المنكر و الْإيمان، فوجب كون تلک الخيرية معلّلة بهذه العبادات**

**ఫిక్హ్ శాస్త్రం (ధర్మశాస్త్రం)లో స్వీకృత నియమం ఏమిటంటే ఏదయినా ఆదేశాన్ని దానికి తగిన గుణంతోపాటు ప్రస్తావిస్తే ఆ గుణం ఆ ఆదేశానికి మూలం అన్న విషయానికి ఆధారభూతమవుతుందన్నమాట. ఇక్కడ ఈ సముదాయానికి అల్లాహ్ 'ఖైర్' (శుభం) అన్న గుణవాచకాన్ని ప్రకటించాడు. ఆ తరు వాత దానికి తోడుగా ఈ ఆదేశాన్ని, ఈ ఆరాధ నల్ని అంటే అమ్ర్ బిల్ మారూఫ్, నహీ అనిల్ మున్కర్‌ని, విశ్వాసాన్ని ప్రస్తావించాడు. దీన్ని బట్టి ఈ ఆరాధనలే 'ఖైర్' అనే ఈ గుణ వాచకానికి మూలం అన్న విషయం తప్పని సరి అవుతుంది.**

*(మఫాతీహుల్ గైబ్ (అత్ తఫ్సీరుల్ కబీర్) సం. 4, భాగం 8, పు. 157)*

**అమ్ర్ బిల్ మారూఫ్, నహీ అనిల్ మున్కర్** విశ్వాసులలో ఎన్నటికీ చెరగని గుణం. విశ్వాసి చిత్రం ఎప్పుడు ముందుకు వచ్చినా అందులో ఈ విశిష్టత తప్పక కానవస్తుంది. ఇది లేకుండా విశ్వాసిని గురించి ఊహించడమూ శక్యం కాదు. పరమ ప్రభువు విశ్వాసులను ఏ స్థితిలోనయితే చూడదలిచాడో ఆ స్థితిలో వారుండవలసి వస్తే వారు **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధిని నిర్వర్తిస్తూనే ఉండాలి. ఈమాన్ (విశ్వాసం)లో గల ప్రామాణికత, మనిషి పాపానికి దూరమయి మెలగటం మాత్రమే కాదు, మునిగిపోతున్న మానవతను ఆదుకోవడం వాస్తవ విశ్వాసం. తిరస్కారం, బహుదైవోపాసనలకు వ్యతిరేకంగా వ్యాకులత, అసహనం సృష్టించడం కూడా అతని బాధ్యతే. ప్రపంచం మార్గబోధనకు దూరమయి ఉండటం చూసి ఆవేదన చెందని విశ్వాసం దాని నిజ సారాన్ని కోల్పోయిందన్నమాట, అందులో విశ్వాస ఘనత లేదన్నమాట.

కుర్ఆన్ ముస్లిమ్ సముదాయాన్ని 'ఖైర ఉమ్మహ్' (ఉత్తమ సముదాయం) అన్న దానికి మూలం, ఆ సముదాయం 'మారూఫ్'ను ఆదేశిస్తుంది, 'మున్కర్'ని నిరోధిస్తుంది, అల్లాహ్‌ను విశ్వసిస్తుంది. ఇదేవిధంగా గ్రంథవహుల సత్యకాముకు లయిన వర్గాన్ని కుర్ఆన్, 'ఉమ్మతున్ కాయిమహ్' (సన్మార్గాన స్థిరంగా నిలబడే సముదాయం) అని అంటుంది. కారణం, ఈ వర్గానికి చెందినవారు దేవుని గ్రంథ పారాయణం చేస్తారు, ఆయన ఆరాధన చేస్తారు, దైవాన్నీ పరలోకాన్నీ విశ్వసిస్తారు. ఇంకా వారు-

**'మారూఫ్‌ని ఆదేశిస్తారు, మున్కర్‌ను నిరోధిస్తారు.'** *(ఆలి ఇమ్రాన్ : 114)*

**يَأْمُرُونَ بِالْمَعْرُوفِ وَيَنْهَوْنَ عَنِ الْمُنْكَرِ** (آل عمران: ١١٤)

దీన్ని బట్టి 'ఉత్తమ సముదాయం' కావడానికి, 'సన్మార్గాన స్థిరంగా నిలవడానికి' కేవలం వ్యక్తిగత గుణగణాలే కాదు, ఇతరుల సన్మార్గ బోధనకు, మార్గదర్శకత్వానికి అవసరమయిన గుణగణాలూ అవసరమే.

అల్లామా అబుస్సఊద్, ఈ వాక్యానికి ఈ పదాలలో వివరణ ఇచ్చారు :

**'మారూఫ్‌ని ఆదేశిస్తారు, మున్కర్‌ని నిరోధిస్తారు' అన్నది సన్మార్గాన స్థిరంగా ఉండేవారి అదనపు గుణాలుగా ప్రస్తావించబడ్డాయి. ఇలా సాధారణ యూదులకు భిన్నంగా, 'ఆత్మ పరిపూర్ణత'కు సంబంధించిన 'ప్రత్యేకతల' లోనూ 'ఇతరుల కన్నా పరిపూర్ణత'కు**

**(وَيَأْمُرُونَ بِالْمَعْرُوفِ وَيَنْهَوْنَ عَنِ الْمُنْكَرِ) صفتان أخريان لأمة أجريتا عليهم تحقيقا لمخالفتهم اليهود في الفضائل المتعلقة**

بتكميل الغير أثر بيان مباينتهم لهم في الخصائص المتعلقة بتكميل النفس، و تعريضاً بمداهنتهم في الاحتساب بل بتعكيسهم في الأمر باضلال الناس وصدّهم عن سبيل الله فإنه أمر بالمنكر ونهى عن المعروف

**సంబంధించిన 'ప్రత్యేకత' విషయంలోనూ వీరి పోకడ వేరయినదన్న విషయం తేటతెల్లం చెయ్యాలన్నది ఉద్దేశ్యం. ఇందులో యూదుల పట్ల అధిక్షేపణ కూడా ఉంది. వారు జనులను హెచ్చరించడంలో అలసత్వం చూపెట్టేవారని. అంతేకాక వారిని దారి తప్పిస్తున్నారని, దైవ మార్గం నుండి దూరం చేస్తున్నారని ఆరోపణ కూడా ఇందులో ఇమిడి వుంది. ఇది నిశ్చయంగా 'మున్కర్'ను ఆదేశించడం, 'మారూఫ్'ని నిరోధించడంతో సమానం.**

*(ఇర్షాదుల్ అక్లుస్సలీమ్ ఇలా మజాయా, అల్ కితాబుల్ కరీమ్, అల్ మారూఫ్, బి తఫ్సీర్ అబిస్స ఊద్ అలాహామిష్, అత్ తఫ్సీరుల్ కబీర్:2: 506)*

అబూ హయ్యాన్ అన్దులుసీ ఇలా అంటున్నారు :

لما كملو فى انفسهم سعوا فى تكميل غيرهم بهٰذين الوصفين

**వారు తమ స్వీయ విషయంలో పరిపూర్ణత పొందిన తరువాత, ఈ ('అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్') లక్షణాల ద్వారా ఇతరుల పరిపూర్ణతకు ప్రయత్నించారు.**

***(అల్ బహ్రుల్ ముహీత్: 3: 32)***

మహనీయ లుక్మాన్ బోధనల్లో 'నమాజ్ స్థాపన'తో పాటు **'అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్'** ప్రస్తావన కూడా ఉంది. ఇది వాస్తవానికి 'ఆత్మ పరిపూర్ణత' 'పరుల పరిపూర్ణత' అన్న రెండు శీర్షికలు. అల్లామా సయ్యిద్ మహ్మూద్ ఆలూసీ తన వ్యాఖ్యాన గ్రంథంలో ఇలా వ్రాశారు :

(يٰبُنَيَّ اَقِمِ الصَّلٰوةَ) تكميلا لنفسك ... (وَ اْمُرْ بِالْمَعْرُوْفِ وَانْهَ عَنِ الْمُنْكَرِ) تكميلاً لغيرك

**నా కుమారుడా! నమాజ్‌ని స్థాపించు. నీ ఆత్మ పరిపూర్ణతకు... మరి 'మారూఫ్'ని ఆదేశించు. మున్కర్‌ని నిరోధించు' ఇతరుల పరిపూర్ణతకు.**

*(రూహుల్ మఆనీ, సం. 11, భాగం 21. పు.88)*

ఇమామ్ రాజీ ఇదే విషయాన్ని కాస్త వివరంగా చెప్పారు :

إذا كملت انت فى نفسك بعبادة الله فكمّل غيرك، فإن شغل الأنبياء وورثتهم من العلماء هو أن يكملوا في أنفسهم ويكملوا غيرهم

**'దైవారాధన ద్వారా నీవు నీ ఆత్మ పరిపూర్ణత సాధించిన తరువాత ఇతరుల పరిపూర్ణతకూ పని చెయ్యి. ఎందుకంటే ప్రవక్తల, వారి వారసులయిన ధర్మపండితుల పని ఇదే. వారు తమ ఆత్మ పరిపూర్ణత సాధించేవారు, ఇతరుల పట్ల కూడా ఈ సేవ ఒనర్చేవారు.'**

*(మఫాతీహుల్ గైబ్: సం. 13 భాగం 25. పు. 130)*

తౌబా సూరాలోని ఒక ఆయత్ ఈ యదార్థాన్ని మరింతగా విశదీకరిస్తుంది. ఇందులో విశ్వాసుల లక్షణాలు తెలుపబడ్డాయి:

اَلتَّائِبُوْنَ الْعَابِدُوْنَ الْحَامِدُوْنَ السَّآئِحُوْنَ الرَّاكِعُوْنَ السَّاجِدُوْنَ الْاٰمِرُوْنَ بِالْمَعْرُوْفِ وَالنَّاهُوْنَ عَنِ الْمُنْكَرِ وَالْحَافِظُوْنَ لِحُدُوْدِ اللّٰهِ ؕ وَبَشِّرِ الْمُؤْمِنِيْنَ ۝ (التوبۃ:۱۱۲)

**"అల్లాహ్ వైపునకు మాటిమాటికీ మరలేవారు, ఆయనకు సేవా దాస్యం అర్పించుకునేవారు, ఆయన స్తోత్రం కీర్తించేవారు, ఆయన కొరకు భువిలో భ్రమించేవారు, ఆయన సమక్షంలో రుకూ, సజ్దా (ప్రార్థన)లు చేసేవారు, మంచిని ఆదేశించేవారు, చెడును వారించేవారు, అల్లాహ్ (నియమించిన) పరిధుల్ని కాపాడే వారు, (ఈ విధమయిన ఉత్తములు విశ్వాసులు, అల్లాహ్‌తో క్రయ విక్రయాల ఈ వ్యవహారం నెరిపేవారు). ప్రవక్తా, ఈ విశ్వాసులకు శుభ వార్తను అందజెయ్యి".**

*(అత్ తౌబా: 112)*

ఈ ఆయత్‌లో ఏ లక్షణాలనయితే ప్రస్తావించడం జరిగిందో వాటిలో కొన్ని విశ్వాసులకు వ్యక్తిగతంగా సంబంధించినవి, మరికొన్నేమో ఇతరుల మధ్య వారి కార్య క్రమాన్ని సూచించేవి. పశ్చాత్తాపంతో దైవం వైపునకు మరలడం, ఆరాధనలు, దైవస్తోత్ర గానం, ఆయన మార్గంలో పయనం, కృషి, రుకూ, సజ్దాలువంటి గుణాలన్నీ వారి వ్యక్తిత్వం వరకు పరిమితమయిన గుణగణాలు. ఇక ఇతరులకు సంబంధించిన వారి కార్యకలాపాలను అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ రూపేణ ప్రస్తావించడంజరిగింది.

అల్లామా ఇబ్ను కసీర్ (రహ్మ) ఇలా సెలవిస్తున్నారు :

**ينفعون خلق الله، ويرشدونهم إلى طاعـة الله بأمرهم بالمعـروف و نهيم عن المنكر مع العلم مما ينبغي فعله ويجب تركـه وهو حفظ حـدود الله في تحليلـه وتحريمه علمـاً وعمـلاً، فقاموا بعبادة الحق و نصح الحق، ولهذا قال "وَ بَشِّرِ الْمُؤْمِنِيْنَ" لأن الإيمان يشمل هـذا كلـه، والسعادة كل السعادة لمن اتصف به**

**వారు దేవుని దాసులయిన మానవులకు ప్రయోజనం చేకూర్చుతారు. అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్ ద్వారా వారికి దైవ దాస్య మార్గం చూపుతారు. దీనితోపాటు వారికి తెలుసు ఏ పని చేయవలసిందో ఏది చేయ కూడనిదో. దీన్నే దైవ పరిధుల్ని కాపాడట మని అంటారు. అంటే పరమ ప్రభువు హలాల్, హరామ్‌కు సంబంధించిన ఏ పరిధుల్ని నియ మించాడో వాటిని జ్ఞానం ద్వారానూ, ఆచరణ ద్వారాను ఇరు విధాలా కాపాడటం అన్నమాట. ఈ విధంగా విశ్వాసులు అల్లాహ్ ఆరాధనతో పాటు దైవదాసులయిన మానవుల శ్రేయోభి లాష విధినీ నిర్వర్తిస్తారన్న మాట. అందువల్లనే 'విశ్వాసులకు శుభవార్తను అంద జెయ్యి' అన్న మాటనూ పలకడమయినది. ఎందుకంటే 'విశ్వాసం' లేదా ఈమాన్ అన్నది సకల విషయాలనూ పరివేష్ఠించి ఉంది. వీటిని పొంది ఉన్న వారికే శుభం అన్నది చేకూరు తుంది.**

*(తఫ్‌సీర్ ఇబ్ను కసీర్ : 2: 392)*

అల్లామా సయ్యిద్ మహ్మూద్ ఆలూసీ ఈ వాస్తవాన్ని ఒక్క వాక్యంలో ఇలా నుడివారు:

**كانه قيل: الكاملون في انفسهم المكمّلون لغيرهم**

**అంటే ఈ ఆయత్‌లో చెప్పిన మాట, వారు తమ వ్యక్తిత్వంలో పరిపూర్ణులయి ఉంటారు, ఇతరుల పరిపూర్ణతకు కృషి సలుపుతారు.**

*(రూహుల్ మఆనీ, సం.6, 11వ భాగం, పు. 32)*

ఇమామ్ రాజీ ఈ ఆయత్ వ్యాఖ్యానంలో ఇలా సెలవిచ్చారు: **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్'** కేవలం ఆరాధనే కాదు, అత్యంత కష్టసాధ్యమయిన ఆరాధన కూడా!

كل ما سبق من الصفات عبادات يأتي بها الإنسان لنفسه ولَا تعلق لشي ء منها بالغير. أما النهي عن المنكر فعبادة متعلقة بالغير... النهي عن المنكر أصعب أقسام العبادات

**'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్' ప్రస్తావనకు పూర్వం ఏ లక్షణాలనయితే ప్రస్తావించడం జరిగిందో అవి ఆరాధనలు. మనిషి తన వ్యక్తిత్వం కొరకు ఆచరించేవి. వాటిలో ఏ లక్షణమూ ఇతరులకు సంబంధిం చింది కాదు. కాని మున్కర్ నుండి వారించడం అన్న ఆరాధన ఇతరులకు సంబంధించింది. మున్కర్ని నిరోధించడం క్లిష్టతరమయిన ఆరాధన.**

*(అత్ తఫ్సీరుల్ కబీర్, సం. 8, 16వ భాగం, పు. 163)*

ఇమామ్ ఇబ్ను తయిమియ్య ఇలా నుడివారు :

ومن عبادته وطاعة أمره الأمر بالمعروف والنهى عن المنكر بحسب الامكان

**అల్లాహ్ ఆరాధన, ఆయన విధేయతలో, తన శక్తిమేరకు మారూఫ్ను ఆదేశించడం మున్కర్ని నిరోధించడం కూడా చేరి ఉంది.**

*(రిసాలతుల్ ఉబూదియ : పు. 13)*

యదార్థానికి పరమ ప్రభువు అల్లాహ్ ముస్లిమ్ సముదాయం చేత ప్రపంచంలో అత్యంత క్లిష్టమయిన కార్యాన్ని చేయించాలని కోరుతున్నాడు. ఈ మహత్కార్యాన్ని నిర్వర్తించడాన్నే **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** అని పేర్కొనడం జరిగింది. ఇది ఈ సముదాయంలో ధర్మం, విశ్వాసాల ఆవశ్యకత; వారు ప్రపంచానికి ప్రసిద్ధ సత్కార్యాలన్ని ఆదేశించాలి, చెడుల నుండి వారించాలి. ఇది వాస్తవంగా దైవ ప్రవక్తల కార్యం. ముస్లిమ్ సముదాయం ప్రవక్తలకు ప్రాతినిధ్యం వహించడం అవసరం. అది గనక ఈ కార్యాన్ని వదలిపెట్టినట్లయితే తన నిజస్థానంలో మనజాలదు. హజ్రత్ హసన్ బస్రీ (రహ్మ) ఇలా అన్నారు:

قال النبيﷺ: من أمر بالمعروف و نهٰى عن المنكر فهو خليفة الله فى أرضه وخليفة رسوله وخليفة كتابه

**ప్రవక్త మహనీయులు (స) సెలవిచ్చిన దాని ప్రకారం, ఏ వ్యక్తి అయితే ప్రసిద్ధ సత్కార్యాల పట్ల ఆదేశిస్తాడో, చెడుల నుండి నిరోధిస్తాడో అతను దేవుని భూమిపైన దేవుని ప్రతినిధి (ఖలీఫా), దైవగ్రంథానికీ ప్రతినిధి.**

*(అల్ జామిఅ లి అహ్కాముల్ ఖుర్ఆన్ లి అబీ అబ్దుల్లాహ్ అల్ ఖుర్తుబీ. సం. 2, భాగం. 4, పు. 31)*

## అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ విధి- హదీసుల నిర్ధారణ

ఇక ఈ చర్చ సందర్భంలో కొన్ని హదీసులు ముందుంచుతున్నాము. వీటిపైన ఒకసారి దృష్టి సారిస్తేనే తెలిసిపోతుంది, దైవ సందేశహరులు ప్రసిద్ధ సత్కార్యాన్ని ఆదేశించడాన్ని, చెడును నిరోధించడాన్ని ప్రస్తావిస్తూ దాన్ని ధర్మజ్ఞానం, తక్వా, బంధుత్వ సంబంధాలు వంటి అత్యున్నత లక్షణాలకు సమానంగా చూపెట్టారు. మరో మాటలో చెప్పాలంటే మానవ పరిణతి ఏమిటంటే, అతను ఆలోచన, ఆచరణల వ్యక్తిగత సుగుణాలతో పాటు సందేశ ప్రచారం, ఇతరుల సంస్కరణ విషయంలో కూడా సంఘర్షణ చేస్తూ ఉండాలి. ఈ కార్యానికి ఆయన (స) ధర్మంలో మౌలిక ప్రాధాన్యత నిచ్చారు. ఏ వ్యక్తిలో **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్** మున్కర్ పట్ల బాధ్యతా భావం లేదో అతన్ని ఇస్లామీయ సమాజంలోని మంచి వ్యక్తిగా పరిగణించడానికి నిరాకరించారు. ఇంకా చివరి మాట ఏమంటే, ఈ కార్యం పట్ల ఆయన(స) తాకీదుగా ఆజ్ఞాపించడమేకాక దీన్ని వదలడం వల్ల దైవాగ్రహం అవతరించే ప్రమాదాన్నీ వ్యక్తం చేశారు.

దుర్ర బిన్తు అబీ లహబ్ (ర) ఇలా అన్నారు :

**قام رجل إلى النبيﷺ وهو على المنبر فقال : يا رسول الله، أي الناس خير؟ فقالﷺ: خير الناس أقرأهم و أتقاهم و آمرهم بالمعروف و أنهاهم عن المنكر و أوصلهم للرحم**

**ప్రవక్త మహనీయులు (స) మింబర్ పైనుంచి సద్బోధన చేస్తూ ఉండగా ఒక వ్యక్తి లేచి నిల బడ్డాడు, ఆయన(స) వైపునకు ముందుకు సాగి ప్రశ్నించాడు, 'దైవప్రవక్తా, మానవుల్లో అత్యుత్తమమయిన వాడెవడు?' దానికి ఆయన ఇలా నుడివారు : 'వారిలో అందరికన్నా అధికంగా దైవ గ్రంథం పఠించేవాడు, వారిలో అత్యధికంగా ధర్మనిష్ఠగలవాడు, వారిలో అత్యధికంగా మంచిని ఆదేశించి చెడును నిరోధించేవాడు, ఇంకా అందరికన్నా అధికంగా సంబంధాలను కలిపి ఉంచేవాడు'.**

*(ముస్నద్ అహ్మద్ : 7/ 162,*
*అత్తర్గీబ్ వత్తర్హీబ్ : 3: 162)*

మహనీయ అబూహురైరా (ర) ఉల్లేఖనంలో ప్రవక్తశ్రీ(స) ఇలా సెలవిచ్చారు:

الْإسلام أن تعبد الله لاَ تشرك به شيئاً، وتقيم الصلاة، وتؤتي الزكاة، وتصوم رمضان، وتحج البيت، والأمر بالمعروف والنهي عن المنكر وتسليمک على اهلک، فمن انتقص شيئًا منهن فهو سهم من الْإسلام يدعه، ومن تركهن كلهن فقد ولى الإسلام ظهره

ఇస్లామ్ అన్నది, నీవు అల్లాహ్ దాస్యం చెయ్యాలి; ఆయనతోపాటు మరి దేన్నీ సహ వర్తిగా భావించరాదు; నమాజ్ స్థాపించాలి; జకాత్‌నివ్వాలి; రమజాన్ నెలలో రోజావ్రతాన్ని పాటించాలి; దైవగృహం హజ్జ్ యాత్రచెయ్యాలి; మారూఫ్‌ను ఆదేశించాలి, మున్కర్‌ని నిరోధిం చాలి; ఇంటివారలకు సలామ్ చెయ్యాలి. వీటిలో ఏ ఒక్కదాన్ని వదలిన వ్యక్తి అయినా అతను ఇస్లామ్‌లో ఒక అంశాన్ని వదలినట్లే. మరెవరయితే ఈ విషయాలన్నింటినీ వదలి పెడతాడో అతను ఇస్లామ్‌కే వెనుతిరిగాడన్న మాట.

*(రవాహుల్ హాకిమ్ : 1: 21 (అత్తర్గీబ్ వత్తర్హీబ్ : 3: 164)*

హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్(ర) ప్రవక్త శ్రీ (స) ద్వారా ఉల్లేఖించారు :

ليس منا من لم يرحم صغيرنا، و يوقر كبيرنا و يأمر بالمعروف و ينه عن المنكر

ఆ వ్యక్తి మాలోని వాడు కాదు, మన పిన్నలపైన కరుణ చూపనివాడు, మన పెద్దలను గౌరవిం చనివాడు, మారూఫ్‌ను ఆదేశించనివాడు, మున్కర్‌ని నిరోధించనివాడు.

*(రవాహు అహ్మద్ వ తిర్మిజీ వ ఇబ్ను హిబ్బాన్ ఫీ సహీహ, (అత్తర్గీబ్ వ త్తర్హీబ్ : 3 : 164)*

హజ్రత్ హుజైఫా(ర) ఉల్లేఖనంలో ప్రవక్త(స) ఇలా నుడివారు :

والـذي نفسى بيـده لتامرنّ بالمعروف ولتنهونّ عن المنكر أو ليوشكنّ اللّٰـه أن يبعث عليكم عذابًا منـه فتدعون فلا يستجيب لكم

ఎవరి గుప్పెట్లో నా ప్రాణముందో ఆయన మీద ఒట్టు, మీరు తప్పక మారూఫ్‌ను ఆదేశించాలి, మున్కర్‌ను నిరోధించాలి. లేకపోతే అల్లాహ్ తన శిక్షను అవతరింపజేసే సమయం ఎంతో దూరాన లేదు. అప్పుడు మీరు దుఆ చేసినా అది స్వీకరించబడదు.

*(తిర్మిజీ, అబ్వాబుల్ ఫితన్, బాబు మాజాఅ ఫిల్ అమ్ర్ బిల్ మారూఫ్ వ న్నహీ అనిల్ మున్కర్)*

హజ్రత్ జాబిర్ (ర) ప్రకారం :

قال رسول الله ﷺ: "أوحى الله عز جل إلى جبرئيل عليه السلام أن اقلب مدينة كذا و كذا بأهلها، فقال يارب إن فيهم عبدك فلانا لم يعصك طرفة عين، قال فقال: قَلِّبها عليه و عليهم فإن وجهه لم يتمعَّرْ فِيَّ ساعةً قَطُّ

దైవ సందేశహరులు (స) ఇలా సెలవిచ్చారు, అల్లాహ్, మహనీయ జిబ్రయీల్ (అ)ని వహీ చేసి ఫలానా పట్టణాన్ని ఆ పట్టణవాసులతో సహా తల్లక్రిందులు చేసి వేయవలసిందని ఆదేశించాడు. దానికి జిబ్రయీల్ (అ) 'దేవా, అందులో నీ భక్తుడు ఫలానా వ్యక్తి కూడా ఉంటాడు కదా, అతను క్షణకాలంపాటు కూడా ఏ పాపమూ చేసి ఎరుగడు కదా అని విన్నవించుకున్నారు. ఆ సమయాన అల్లాహ్ జిబ్రయీల్‌ని ఇలా ఆదేశించాడని ప్రవక్తశ్రీ(స) పలికారు, ఆ పట్టణాన్ని ఆ వ్యక్తితో పాటు అందులోని సమస్త జనులను కలిపి తల్లక్రిందులు చేసి వేయి. ఎందుకంటే (ఆ పట్టణంలో నా అవిధేయత జరుగుతూ ఉన్నా) ఒక గడియ కాలం కూడా అతని ముఖాన నా కోసం బాధతో రంగు మారలేదు.

*(రవాహుల్ బైహకీ ఫీ షుఅబిల్ ఈమాన్ (మిష్కాతుల్ మసాబీహ్, కితాబుల్ ఆదాబ్ బాబు ఫిల్ అమ్ర్ బిల్ మారూఫ్)*

## అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ విధి- సముదాయ ఏకాభిప్రాయం

ప్రాచీన పండితులు మొదలుకొని ఆధునికుల వరకు, అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్‌ని ధర్మంలో మౌలికమయిన విషయంగా ప్రస్తావించనివారు, దీన్ని ముస్లిమ్ సముదాయం ఆచరించవలసిన ప్రముఖ విధిగా పేర్కొననివారు మీకు ఏ ఒక్క జ్ఞాన సంపన్నుడూ ప్రాప్తం కారు.

జహ్హాక్ ఇలా అంటున్నారు :

الأمر بالمعروف والنهى عن المنكر فريضة من فرائض الله

అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్ అన్నది పరమ ప్రభువు అల్లాహ్ నిర్ణయించిన ఒక విధి. దీన్ని అల్లాహ్ విశ్వాసులకు తప్పని

كتبها الله على المؤمنين

సరి అయినదిగా నిర్ధారించాడు.

(షౌకానీ, ఫత్‌హుల్ కదీర్ : 2: 363)

ఇమామ్ గజాలీ ఇహ్యా ఉల్ ఉలూమ్‌లో 'అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్' అనే విషయం మీద చర్చను ఇలా ప్రారంభించారు :

الأمر بالمعـروف والنهى عن المنكر هـو القطب الأعظم فى الدين، وهو المهمُّ الذي ابتعث الله له النبيين أجمعين، و لوطوى بساطه وأهمل علمـه وعملـه لتعطلت النبوة وأضمحلت الديانة، و عمت الفترة، وفشت الضلالـة و شاعت الجهالـة، و استشرى الفساد، واتسع الخـرق و خربت البلاد، و هلكـ العبـاد، و لم يشعروا بالهلاكـ إلاّ يوم التناد، وقد كان الذي خفنا أن يكون، فإنا لله و إنا إليه راجعون، إذقد اندرس من هذا القطب عمله و علمه، وانمحق بالكلية حقيقته و رسمه، فاستولت على القلوب مداهنـة الخلق، وانمحت عنهـا مراقبة الخالق، واسترسل الناس فى اتبـاع الهوى والشهـوات استرسال

అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్ ధర్మానికి సంబంధించిన మహోజ్జ్వలమయిన స్తంభం. ఈ మహత్కార్య పరిపూర్తికే పరమ ప్రభువు ప్రవక్తలనందరినీ పంపాడు. ఈ చదరంగాన్ని చుట్టిపెట్టినట్లయితే దీని జ్ఞానాన్ని, దీనిపట్ల ఆచరణను త్యజించినట్లయితే ప్రవక్తల కార్యం నిలిచిపోతుంది, ధర్మం బలహీనపడిపో తుంది. ఈ పరిస్థితిలో అజ్ఞాన కాలం సర్వ సాధారణమయిపోతుంది. మార్గవిహీనత పెరిగి పోతుంది. అజ్ఞానం ప్రబలిపోతుంది. కల్లోలం దారి చేసుకుంటుంది. చెడు అన్నది విస్తృత మవుతుంది. జనావాసాలు శిథిలమయి పోతాయి. మానవులు హతులయిపోతారు. ప్రళయానికి పూర్వం వారికి తమ వినాశం పట్ల స్పృహ కూడా కలగదు. కాని ఎంత విచార కరమయిన విషయం, మాకు ఏ ప్రమాదం పట్ల భయముండేదో అది నేడు వాస్తవమయి పోయింది, ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజిఊన్. ఇప్పుడు ఈ ధార్మిక ప్రాతిపదిక పట్ల జ్ఞానమూ ఆచరణలు, రెండూ అంతమయి పోయాయి. దీని బాహ్యరూపమూ వాస్తవికత రెండూ పూర్తిగా సమసిపోయాయి.

అంతర్యాలపైన మానవుల పట్ల రాజీపడి తలవంచే భావన సర్వవ్యాపకమయిపోయింది. దైవం పట్ల స్ఫురణ కూడా మిగల్లేదు. జనులు మనోకాంక్షల అనుసరణలో పశువుల్లా బరి

البهائم، وعزَّ على بساط الأرض مؤمن صادق لا تأخذه فى الله لومة لائم. فمن سعى فى تلافى هذه الفترة وسد هذه الثلمة، إما متكفلا بعلمها أو متقلّداً لتنفيذها، مجدداً لهذه السنة الداثرة، ناهضاً بأعبائها، و متشمرًا فى إحيائها كان مستأثراً من بين الخلق بإحياء سنة سنة أفضى الزمان إلى إماتتها، ومستبداً بقربة تتضاءل درجات القرب دون ذروتها.

తెగించి పోతున్నారు. అల్లాహ్ విషయంలో ఏ నిందించే వాని నిందనూ ఖాతరు చేయని సత్యవ్రతుడయిన విశ్వాసి ఉనికే భూతలాన కానరాకుండా పోయింది. అందువల్ల ఈ అజ్ఞాన అవస్థను దూరం చెయ్యడానికి, ఈ గండిని పూడ్చడానికీ ప్రయత్నం చేసే వ్యక్తి- అతను శిక్షణా బోధనలు, ప్రచార కార్యాలు చేపట్టే బాధ్యత వహించినా లేదా ఆ కార్యాన్ని అమలుపరిచే బాధ్యతలు స్వీకరించినా, ఇలా ఈ అంతమయిపోతున్న ప్రవక్త సంప్రదాయాన్ని పునరుజ్జీవింపజేయడానికి, ఈ భారాన్ని మోయ డానికి లేచి నిలబడి దాని నవ జీవనానికి నడుంబిగించినట్లయితే, అతని స్థానం మానవు లం దరి మధ్యన అత్యున్నతమయి విశేషంగా అలరారుతుంది. అతను, కాలం రూపుమాపిన సంప్రదాయాన్ని బ్రతికించినవాడవుతాడు. అతనికి దైవసన్నిధిలో అత్యంత సామీప్యం ప్రాప్తమవుతుంది- మరే సామీప్యమూ దాని ఉన్నత స్థాయిని చేరుకోజాలదు.

ఆ తరువాత ఆయన తొలి అధ్యాయాన్ని ఈ వివరణతో ప్రారంభిస్తారు :

الباب الأول فى وجوب الأمر بالمعروف والنهى عن المنكر و فضيلته و المذمة فى إهماله و إضاعته. و يدل على ذلك بعد إجماع الأمة عليه، وأشارات العقول السليمة إليه، الآيات و الأخبار والآثار

తొలి అధ్యాయం, 'అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్' విధి అయినది అన్న విషయంలో. ఇందులోనే దీని మహత్తు, దీన్ని వదలిపెట్టడం, దీన్ని నష్టపరచటం పట్ల ఖండనల ప్రస్తావన కూడా ఉంది. ఈ విషయా లన్నింటికీ సముదాయంలోగల ఏకాభిప్రాయం, సామాన్య బుద్ధి వివేకాలు వాటి సూచనల తరువాత కుర్ఆన్ ఆయత్‌లు, ప్రవక్త(శ్రీ (స) హదీసులు, సహచర మాన్యులు వదలిపెట్టిన ఆచరణావశేషాలు- అన్నీ ఆధార భూతమయి నిలుస్తాయి.

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2: 333)*

అబూ బక్ర్ జస్సాస్ ఇలా అంటున్నారు :

أكد الله تعالى فرض الأمر بالمعروف والنهي عن المنكر في مواضع من كتابه ، وبينه رسول الله ﷺ في أخبار متواترة عنـــه فيـــه، وأجمـــع السلف وفقهـــاء الأمصار على وجوبه

పరమ ప్రభువు అల్లాహ్ తన గ్రంథంలో అనేక చోట్ల 'అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్' విధిని తాకీదుగా మరీ సెలవిచ్చాడు. ప్రవక్త(శ్రీ (స) అనేక హదీసుల పరంపరలో సవివరంగా దీన్ని ప్రస్తావించారు. సముదాయంలోని పూర్వీకులు, విభిన్న ప్రదేశాల లోని ఫుకహా కూడా ఇది విధి అవటం పట్ల ఏకాభిప్రాయం కలిగి ఉన్నారు.

*(అహ్కాముల్ కుర్ఆన్ : 2: 608)*

అల్లామా ఇబ్ను హజ్మ్ ఇలా అంటున్నారు :

اتفقت الأمة كلها على وجوب الأمر بالمعروف والنهى عن المنكر بلا خلاف من أحد منهم

సముదాయం పూర్తిగా 'అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్' విధి అన్న విషయంలో ఏకాభిప్రాయం కలిగి ఉంది. ఇందులో ఏ ఒక్కరి భేదాభిప్రాయమూ లేదు.

*(అల్ ఫస్లు ఫిల్ మిలల్ వల్ అహ్వా వన్నహ్ల్:4: 171)*

ఇమామ్ నవవీ (రహ్మ) ఇలా వ్రాశారు :

قد تطابق على وجوب الأمر بالمعروف والنهى عن المنكر الكتاب والسنة وإجماع الأمة. وهو أيضاً من النصيحة التي هي الدين

'అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్' అన్నది విధి అనే విషయంలో గ్రంథం, సంప్రదాయం, సముదాయం ఏకాభిప్రాయం అన్నీ సమైక్యంగా ఉన్నాయి. ధర్మం అన్నది శ్రేయోభిలాషగా పేర్కొనడం జరిగింది. 'అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్' అన్నది ఈ శ్రేయోభిలాషలోని భాగమే. *(షరహ్ ముస్లిమ్, సం.1, భాగం 2, పు. 20)*

ఇమామ్ షౌకానీ ఇలా అన్నారు :

وجوبه ثابت بالكتاب والسنة، وهو من أعظم واجبات الشريعة، وأصل

'అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్' విధి అవడం పట్ల గ్రంథం, సంప్రదాయం

عظيم من أصولها، وركن مشيد من أركانها وبه يكمل نظامها ويرتفع سنامها

**రూఢీపరుస్తున్నాయి. ఇది షరీఅత్‌లో మహత్తర మయిన విధి, అందులో మౌలికమయింది, దాని మౌలికమయిన అంశాలలో ఒక పటిష్ఠ మయిన అంశం. దీని ద్వారానే షరీఅత్ వ్యవస్థ పరిపూర్ణమవుతుంది. దీని శిఖరం ఉన్నత మయింది.** *(ఫత్‌హుల్ కదీర్ : 1: 337)*

మారూఫ్‌ను ఆదేశించడం, మున్కర్‌ని నిరోధించడం ముస్లిమ్ సముదాయం పదవీ బాధ్యత. ఏ ప్రభుత్వ వ్యవస్థ నిజభావంలో ఇస్లామీయ ప్రభుత్వమో అది పూర్తిగా కనిపెట్టుకు ఉంటుంది. సముదాయం ఈ విధి పట్ల ఏమరుపాటు వహించ కుండా జాగ్రత్త పడుతుంది. ఇమామ్ ఇబ్ను తైమియ్య ప్రకారం, **అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్** మున్కర్, జిహాద్ అన్నవి షరీఅత్‌లోని అతి వివరమయిన నిరంతరాయ మయిన ఆదేశాలు. సముదాయంలో ఏ వర్గమయినా వీటిని వదలుకుంటే ఇస్లామీయ ప్రభుత్వం దానికి వ్యతిరేకంగా యుద్ధం సలుపుతుంది.

كل طائفة خرجت عن شريعة من شرائع الإسلام الظاهرة المتواترة فإنه يجب قتالها بإتفاق أئمة المسلمين. و إن تكلمت لشهادتين فإذا أقروا بالشهادتين وامتنعوا عن الصلوات الخمس وجب قتالهم حتى يصلوا... و كذلك إن امتنعوا عن الأمر بالمعروف والنهي عن المنكر وجهاد الكفار إلى أن يسلموا أو يؤدوا الجزية عن يدوهم صاغرون

**ఏ వర్గమయినా ఇస్లామీయ ప్రభుత్వపు ఏదయినా విశదమయిన నిరంతర ఆదేశాన్ని వ్యతిరేకిస్తే, ముస్లిముల సమస్త ధర్మవేత్తల ఏకాభిప్రాయం ప్రకారం, వారితో యుద్ధం సలపవలసి ఉంటుంది. వారు దేవుని ఏకత్వం (తౌహీద్) దైవదౌత్యం (రిసాలత్)ని ధ్రువీకరిం చినాసరే. ఉదాహరణకు ఒకరు తౌహీద్, రిసాలత్‌ని ధ్రువీకరించడంతోపాటు అయిదు వేళల నమాజ్ వదలిపెట్టినట్లయితే అతనితో యుద్ధం అవసరం, అతను నమాజ్ చెయ్యడం, ప్రారంభించనంతవరకు... అలాగే ఒకరు అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌ని వదలి వేసినా, ధిక్కారులు ఇస్లామ్ స్వీకరిం చడమో లేదా అల్పులయి తమ చేత్తో జిజ్‌యా చెల్లించడమో చేయనంతవరకు వారితో యుద్ధం సలపడాన్ని మానుకున్నా అటువంటి వారితోనూ యుద్ధం సలపడం జరుగుతుంది.**

*(ఫతావా ఇబ్ను తైమియ్యా సంకలనం : 4: 281)*

## ఒక ఆయత్ నిజ భావం

ఈ చర్చ సంపూర్ణమవ్వాలంటే ఈ క్రమంలో ఒక ఆయత్ వివరణ జరగాలి. అప్పటి వరకు ఈ చర్చ ముగియదు. ఆ ఆయత్ మాఇద సూరాలో పద్నాల్గవ రుకూలో వస్తుంది. దాని పదాలు ఇవి :

يٰاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا عَلَيْكُمْ اَنْفُسَكُمْ لَا يَضُرُّكُمْ مَنْ ضَلَّ اِذَا اهْتَدَيْتُمْ
(المائدة:١٠٥)

**"విశ్వసించిన వారలారా, మీ స్వంత విషయాన్ని గురించి చింతించండి, మీరు స్వయాన సన్మార్గాన ఉన్నట్లయితే, ఇతరుల మార్గవిహీనత వల్ల మీకు ఎలాంటి కీడూ వాటిల్లదు."**

*(అల్ మాఇద : 105)*

ఈ ఆయత్ పదాల వల్ల ఒక అనుమానం కలుగుతుంది. **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధి కాకపోవడమేకాక, అసలు దాని అవసరం కూడా లేదేమో అనిపిస్తుంది. మనిషి మోక్షం కొరకు తను వ్యక్తిగతంగా తన స్వీయ చింతన చేస్తే సరిపోతుంది, తన ఆత్మప్రక్షాళన, స్వీయ సంస్కరణ, స్వీయ సుశిక్షణ కోసం పాటుపడితే సరిపోతుందన్న సందేహం కలుగుతుంది. కాని వ్యాఖ్యాతలందరూ ఈ భావాన్ని తప్పని ఏకాభిప్రాయం తెలిపారు. ఎందుకంటే ఈ భావం కుర్ఆన్ హదీసుల అనేక విశదీకరణలకు విరుద్ధమయింది. వాస్తవమేమంటే తిరస్కారం, బహుదైవభావనల వాతావరణంలో సత్యం మీద నిలకడతో జీవిస్తూ నిరంతరం ధర్మ ప్రచార కార్యంలో నిమగ్నులయి ఉన్నటువంటి విశ్వాసులకు ఈ ఆయత్‌లో సాంత్వన ఇవ్వడం జరిగింది. ఇందులో చెప్పిన విషయం ఏమిటంటే, మీ సంకల్పం, సాహసం ఏ మాత్రం దెబ్బతినకపోతే మీరు దైవధర్మాన్ని వదలకుండా బలంగా పట్టుకుని ఉన్నట్లయితే దాన్ని లేశమంతయినా జారనివ్వకపోతే ప్రతీప శక్తులు మీకు ఎటువంటి నష్టాన్నీ కలిగించలేవు. ఇందులో, విశ్వసించినవారు **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**ని వదలి పెట్టినా వారు సాఫల్యం పొందుతారన్న విషయం ప్రస్తావనకే రాలేదు. కొందరు వ్యాఖ్యాతలు ఈ సందర్భంలో ఒక ప్రత్యేక కోణాన్ని పేర్కొన్నారు. అంటే మీరు రుజుమార్గాన ఉన్నట్లయితే, సన్మార్గానికి దూరమయినవారు మీకు హాని కలిగించలేరు అని కుర్ఆన్ అంటోందని వారి అభిప్రాయం. మనిషి సన్మార్గాన ఉండటం అన్నది, అతను తన సంస్కరణతో పాటు ఇతరుల సంస్కరణకూ పాటుపడుతూ ఉన్నప్పుడే సాధ్యమవుతుంది. ఈ ప్రయత్నాన్ని విరమించుకున్న తరువాత మనిషి తన వరకు ఎంతగా సదాచారుడయి ఉన్నా నిజ మార్గానికి దూరమయిపోతాడు. ఇది కేవలం ఒక సూక్ష్మమయిన కోణం మాత్రమే కాదు. ఇందులో కుర్ఆన్ హదీసుల సారం ఏకత్రమయి ఉంది. జమఖ్‌షరీ ఈ ఆయత్ విషయంలో ఇలా వ్రాస్తున్నారు :

ليس المراد ترك الأمر بالمعروف و النهي عن المنكر، فإن من تركهما مع القدرة عليهما فليس بمهتد، و إنما هو بعض الضلال الذين فصلت الآية بينهم وبينه

దీని ఉద్దేశం అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్ అన్నదాన్ని విరమించుకోవాల న్నది కాదు. ఎందుకంటే శక్తి కలిగీ దీన్ని వదలిపెట్టిన వ్యక్తి మార్గబోధన పొందినవాడు కాజాలడు, అతను దారి తప్పినవారిలోని వాడు; అటువంటి వారికీ అమ్ర్ బిల్ మారూఫ్, నహీ అనిల్ ముస్కర్ అనే విషయాలకీ మధ్య ఈ ఆయత్ దూరాలను పెంచింది.

*(అల్ కష్షాఫ్ అన్ హకాఇక్అత్తన్జీల్ : 1 : 386)*

అల్లామా అబుస్సఊద్ ఇలా అంటున్నారు :

و لاَ يتوهّمنّ أن فيه رخصة في ترك الأمر بالمعروف والنهى عن المنكر مع استطاعتهما كيف لاَ و من جملة الاهتداء أن ينكر على المنكر حسبما تفى به الطاقة

ఈ ఆయత్‌లో శక్తి ఉన్నా అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్‌ని త్యజించే అనుమతి ఉందని ఎవరయినా అనుకోరాదు. ఇది తప్ప యిన అభిప్రాయం. ఎందుకంటే మార్గబోధన కలిగి వుండటమంటే తన శక్తిమేరకు చెడు పట్ల విరోధం తెలుపుతూ ఉండాలి.

*(ఇర్షాదుల్ అక్లుస్సలీమ్ ఇలా మజాయా అల్ కితాబుల్ కరీమ్– 4: 199, 200)*

ఇదే విషయాన్ని జస్సాస్ ఈ పదాలలో తెలిపారు :

ومن الاهتداء اتباع أمر الله في انفسنا وفي غيرنا فلا دلالة فيها إذًا على سقوط فرض الأمـــر بالمعروف والنهي عن المنكر

సన్మార్గ బోధన పొందడమంటే తన స్వీయ విషయంలోనూ ఇతరుల విషయంలోనూ దైవా దేశ పాలన చేయాలి. కనుక ఆయత్‌లో అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్ విధి రద్దయిందన్న దానికి ఎటువంటి ఆధారం లేదు.

*(అహ్కాముల్ కుర్ఆన్ : 2 : 592)*

మహనీయ అబూ బక్ర్ ఒక ప్రసంగంలో, మీరు ఈ ఆయత్‌ని రాయితీగా భావిస్తారు. అల్లాహ్ మీద ఒట్టు ఆయన ఇంతకన్నా కఠోరమయిన ఆయత్ కుర్ఆన్‌లో అవతరింపజేయలేదు అన్నారు. *(జామిఉల్ బయాన్ ఫీ తఫ్సీరిల్ కుర్ఆన్ : 7: 60)*

మరో ఉల్లేఖనం ప్రకారం; మీరు ఈ ఆయత్‌ని పఠిస్తారు, అల్లాహ్ దీన్ని ఏ సందర్భం, ఏ పూర్వాపరాలలో అవతరింపజేశాడో దానికి భిన్నమయిన పూర్వ రంగంలో ప్రయోగిస్తారు. నేను దైవ సందేశహరులు ఇలా సెలవీయగా విన్నాను :

**إن الناس إذا رأوا المنكر بينهم فلم ينكروه يوشك أن يعمّهم الله بعقابه**

**జనం తమ మధ్యన మున్కర్‌ను చూసి దాన్ని వారించకపోయినట్లయితే అల్లాహ్ అటువంటి వారి మీద శిక్షను అవతరింపజేయడం ఎంతో దూరంలో ఉండదు.**

*(ముస్నద్ అహ్మద్, 1: 18, తిర్మిజీ, కితాబుల్ ఫితన్, బాబు, మాజాఅ ఫిల్ అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్. వ రవాహు అబూదావూద్, ఇబ్ను మాజ, నసాయి ప్రభృతులు)*

మొత్తానికి ఈ ఆయత్ ద్వారా అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ విధి అన్న విషయం రద్దు కాదు. పైగా అది విధి అవడాన్ని మరింత దృఢపరు స్తుంది. కుర్‌ఆన్, హదీసుల్లో **అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్** మున్కర్‌ని ధర్మంలో ఓ ప్రముఖమయిన విధిగా పేర్కొనడం జరిగింది. నేటి వరకు జ్ఞాన సంపన్నుడయిన ఏ పండితుడూ దాని ఈ స్థానాన్ని కాదనలేదు. మనం దైవధర్మాన్ని మనలో నిజ స్థితిలో చూడదలచినట్లయితే, దానితోపాటు ధర్మాన్ని ప్రపంచంలో సర్వాధికృత గలదిగా, సర్వోన్నతమయిందిగా చూడాలని కోరుకున్నట్లయితే మారూఫ్‌ను ఆదేశించడం, మున్కర్‌ని నిరోధించడం తప్ప మరో మార్గం లేదు. అల్లాహ్ మన నుండి కోరేదీ ఇదే, ప్రవక్తలందరి మార్గమూ ఇదే.

وَمَنْ يُّطِعِ اللّٰهَ وَ رَسُوْلَهٗ فَقَدْ فَازَ فَوْزًا عَظِيْمًا۔

**“ఏ వ్యక్తి అయితే అల్లాహ్, ఆయన సందేశ హరుని విధేయత పాటిస్తాడో అతను మహత్తర మయిన సాఫల్యాన్ని సాధించినట్లు.”**

*(అల్ అహ్జాబ్ : 71)*



# 3. ఫర్జ్ కిఫాయ లేదా ఫర్జ్ అయిన్

**ఒక** విషయంలో ధర్మవేత్తలలో ఎవరికీ ఎటువంటి భేదాభిప్రాయం లేదు, ఇది ఫర్జ్ లేదా 'విధి' అన్న విషయాన్ని అందరూ అంగీకరిస్తారు. అయితే ఒక భేదాభి ప్రాయం తప్పక ఉండేది. ఈ విధి ఎటువంటిది, ఇది ఫర్జ్ అయిన్‌గా పరిగణించ బడుతుందా లేదా ఫర్జ్ కిఫాయగానా? ఈ ప్రశ్నను పరిశీలించడానికి ముందు ఈ రెంటికీ మధ్య గల వ్యత్యాసాన్ని అవగతం చేసుకోవటం అవసరం. ఈ వ్యత్యాసాన్ని అల్లామా ఇబ్ను బదరాన్ హన్బలీ చాలా ఉత్తమ రీతిలో వివరించారు. మేము దాన్ని ఇక్కడ సంక్షిప్తంగా పేర్కొంటున్నాము.

## ఫర్జ్ కిఫాయ, ఫర్జ్ అయిన్‌ల వ్యత్యాసం

ఫర్జ్ కిఫాయ, ఫర్జ్ అయిన్ రెంటిలోనూ ఆరాధనా భావం,ఔచిత్యం ఉన్నాయి. కాని వ్యత్యాసముంది, ఫర్జ్ కిఫాయలో ప్రతి వ్యక్తికీ బాధ్యతాభారం వేయడం ఉద్దేశం కాదు. ఇందులో షరీఅత్ కోరేదేమిటంటే ఆ కార్యంలో గల ఔచిత్యం నెరవేరాలి. కనుక ఏ ఒక్క వ్యక్తి ద్వారానయినాసరే ఆ ఔచిత్యం నెరవేరినట్లయితే దాని ఉద్దేశ్యం తీరిపోతుంది, ఇతరులను దాని కొరకు ఇబ్బంది పెట్టవలసిన అవసర ముండదు. దీనికి భిన్నంగా ఫర్జ్ అయిన్‌లో గల ఉద్దేశ్యం ఏమిటంటే, ఏ వ్యక్తులకయితే ఆ ఆదేశం ఇవ్వడం జరుగుతుందో వారిలో ప్రతి ఒక్కరూ దాన్ని నెరవేర్చాలి.

*(అల్ ముద్‌ఖల్ ఇలా మజ్‌హబుల్ ఇమామ్ అహ్మద్ బిన్ హన్బల్ : పు. 103, 104)*

మౌలానా అబ్దుల్ అలీ అన్సారీ (బహ్రుల్ ఉలూమ్‌లో) ఇలా అంటారు :

المقصود من الإيجاب قد يكون إتعاب المكلّف بالاشتغال به كما في الأركان الأربعة وقد يكون المقصود شيئًا آخريجب لأجله

ఏదయినా విషయాన్ని వాజిబ్‌గా పరిగణించడ మంటే ఉద్దేశ్యం ఒక్కోసారి, ఆదేశించబడిన వ్యక్తిని దాన్ని నిర్వర్తించే శ్రమలో నిమగ్నం చెయ్యడం తప్పనిసరి అవుతుంది. ఉదాహరణకు ధార్మిక విధులయిన (నమాజ్, రోజా, హజ్జ్, జకాత్) వాటిలో మాదిరిగా ఒక్కోసారి

ما يحصل المقصود بحصوله فإذا حصل المقصود لا يبقى الواجب واجبًا كالجهاد فإنه إنما وجب لإعلاء كلمة الله تعالىٰ، فإذا أتى به البعض حصل الإعلاء، وسقط الوجوب

ఉద్దేశ్యం ఏదో ఉంటే, ఆ ఉద్దేశ్యాన్ని సాధించడానికి మరేదో వేరే ఆచరణ విధి అవుతుంది. ఉదాహరణకు 'జిహాద్'. ఇది దైవ వచన సమున్నతి కొరకు విధ్యుక్తమయింది. కొందరు వ్యక్తులు ఈ జిహాద్ విధిని నిర్వర్తించినట్లయితే దైవవచన సమున్నతిని సాధించడం జరుగుతుంది. అప్పుడు ఆ విధి ఇతరుల నుండి తొలిగిపోతుంది.

*(ఫవాతహుర్ రహ్మూత్, షరహ్ ముసల్లముస్సుబూత్ : 1: 63)*

## ఫర్జ్ కిఫాయ అందరికీ విధి అవుతుందా?

ఫర్జ్ కిఫాయ, ఫర్జ్ అయిన్‌లో గల ఈ వ్యత్యాసం పట్ల పండితులందరి మధ్య ఏకాభిప్రాయముంది. అయితే వారి మధ్య ఒక భేదాభిప్రాయముంది. ఫర్జ్ కిఫాయ అందరిపైనా విధి అయినదా కొందరిపైనేనా అన్న విషయంలో భేదాభిప్రాయముంది. అంటే అది అందరిపైనా ఫర్జ్ అయినప్పటికీ కొందరు దాన్ని నిర్వర్తిస్తే అందరినుంచీ తొలగిపోతుందా లేదా అది కొందరిపైనే విధి అవుతుందా? ధర్మవేత్తలు అత్యధికంగా మొదటి అభిప్రాయాన్నే బలపరిచారు. కాని కొందరు, ఇమామ్ రాజీ, అల్లామా ఇబ్ను సుబ్కీ, ఇమామ్ షాతిబీ వంటి పరిశోధకులు రెండవ అభిప్రాయానికే ప్రాధాన్యత నిచ్చారు. రెండవ అభిప్రాయాన్ని అంగీకరించేవారిలోనూ అభిప్రాయ భేదముంది. ఏ కొందరు వ్యక్తులపైన ఫర్జ్ కిఫాయ విధి అవుతుందో వారు నిర్దిష్టించబడి ఉన్నారా లేదా నిర్దిష్టం కారా? ఇబ్ను సుబ్కీ ప్రకారం అంగీకృత పంథాననుసరించి వారు నిర్దిష్టం కారు. ఎందుకంటే వారు నిర్దిష్టం అవడానికి ఏ ఆధారమూ లేదు. అయితే ఒక అభిప్రాయం ప్రకారం వారు అల్లాహ్ వద్ద నిర్దిష్టింపబడి ఉన్నారు. ఇంతకూ ఈ విధిని నిర్దిష్ట వ్యక్తులు నిర్వర్తించినా లేదా మరెవరు నిర్వర్తించినా అందరి బాధ్యతా తొలగిపోతుంది. ఒక అభిప్రాయం ప్రకారం ఫర్జ్ కిఫాయను నిర్వర్తించే సామర్థ్యమున్న వారే దానికి నిర్దిష్ట పరచబడినవారు. *('జమ్‌ఉల్ జవామి' షర్హుల్ జలాల్ అల్ మహల్లీ, హాషియ అల్ బనానీ : 1: 186, 187)*

ఇమామ్ షాతిబీ ప్రకారం ఫర్జ్ కిఫాయ అన్నది దాన్ని నిర్వర్తించే సామర్థ్యమున్న వారికే ఫర్జ్ (విధి) అవుతుంది. ఇమామ్ షాతిబీ అభిప్రాయాన్ని మేము ముమ్ముందు ఆయన మాటల్లోనే ఉటంకించనున్నాము.

## అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్- ఫర్జ్ కిఫాయ

సర్వసాధారణంగా ధర్మవేత్తలందరి దృష్టిలో అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్ ఫర్జ్ కిఫాయగానే పరిగణించబడుతుంది. కొందరు మాత్రం దాన్ని ఫర్జ్ అయిన్‌గా కూడా పరిగణించారు.

అల్లామా సయ్యిద్ మహ్మూద్ ఆలూసీ ప్రకారం :

إن العلماء اتفقوا على أن الأمر بالمعروف والنهي عن المنكر من فروض الكفاية، ولم يخالف ذلک إلا النزر

**ధర్మవేత్తలు సర్వసాధారణంగా అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్, ఫర్జ్‌కిఫాయ అన్న విషయంలో ఏకాభిప్రాయం కలిగి ఉన్నారు. కేవలం కొందరు మాత్రమే విభేదించారు.**

*(రూహుల్ మఆనీ, సం.2, భాగం. 4, పు.238)*

ఇక్కడ మరో విషయం గుర్తుంచుకోవలసి వుంటుంది. 'జమ్హూర్' (సర్వ సాధారణ ధర్మవేత్తల)లో కొందరి అభిప్రాయంలో ఫర్జ్ కిఫాయ అందరికీ విధి అవుతుంది కాని కొందరు ఆచరిస్తే ఆ బాధ్యత అందరి నుండీ తొలగిపోతుంది. అలాగే మరికొందరి అభిప్రాయంలో ఫర్జ్ కిఫాయ కొందరికే విధ్యుక్తమవుతుంది.

## జమ్హూర్‌లో అత్యధికుల అభిప్రాయం- తొలి ఆధారం

ధర్మవేత్తలలో అత్యధికులు ఏర్పరచుకున్న అభిప్రాయానికి ఇక్కడ వారి ఆధారాలను ఉటంకిస్తున్నాము. వారి తొలి ఆధారం కుర్ఆన్‌లోని ఈ రెండు ఆయత్‌లు :

١- وَلْتَكُنْ مِّنْكُمْ أُمَّةٌ يَّدْعُوْنَ إِلَى الْخَيْرِ وَيَأْمُرُوْنَ بِالْمَعْرُوْفِ وَيَنْهَوْنَ عَنِ الْمُنْكَرِ (آل عمران:١٠٤)

**"మీలో కొందరు మంచి వైపునకు పిలిచేవారు, సత్కార్యాలను ఆదేశించేవారు, దుష్కార్యాలను నిరోధిస్తూ ఉండేవారు తప్పనిసరిగా ఉండాలి."**

***(ఆలి ఇమ్రాన్ : 104)***

٢- كُنْتُمْ خَيْرَ أُمَّةٍ أُخْرِجَتْ لِلنَّاسِ تَأْمُرُوْنَ بِالْمَعْرُوْفِ وَتَنْهَوْنَ عَنِ الْمُنْكَرِ (آل عمران:١١٠)

**"ఇప్పుడు ప్రపంచంలో శ్రేష్ఠమయిన సముదాయం మీదే. మిమ్మల్ని మానవుల మార్గబోధనకు, సంస్కరణకు లోకంలో ప్రవేశపెట్టడం జరిగింది. మీరు సదాచారాన్ని ఆదేశిస్తారు, దురాచారాన్ని నిరోధిస్తారు."**

***(ఆలి ఇమ్రాన్: 110)***

ఇబ్నుల్ అరబీ మాలికీ ప్రకారం "ఈ రెండు ఆయత్‌లు, అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ అన్నది ఫర్జ్ కిఫాయ అన్న విషయానికి ఆధారాలు." *(అహ్కాముల్ కుర్‌ఆన్ : 1: 292).* తొలి ఆయత్ ప్రకారం సముదాయంలో ఒక వర్గం తప్పనిసరిగా ఉండాలి, అది **అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్** మున్కర్ విధిని నిర్వర్తించాలి. మరి రెండవ ఆయత్ ద్వారా వ్యక్తమయ్యే దాన్నిబట్టి ఇది సముదాయం మొత్తం చేయ వలసిన కార్యం. దీన్నిబట్టి, **అమ్ర్ బిల్ మారూఫ్,** వ నహీ **అనిల్** మున్కర్ సముదాయం మొత్తం విధిగా ఆచరించవలసిన బోధనలే అయినప్పటికీ కొందరు వ్యక్తులు దాన్ని నిర్వర్తించినట్లయితే అది సముదాయం మొత్తం జనుల నుండి తొలిగిపోతుంది.

చాలామంది వ్యాఖ్యాతలు, తొలి ఆయత్‌లోని పదం 'మిన్ (మీలో) అన్నది 'కొందరి'నే సూచించడానికి వచ్చిందని అంటారు. దీనిద్వారా తేలేదేమిటంటే **అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్** మున్కర్‌ని నిర్వర్తించడం సముదాయంలోని ప్రతి వ్యక్తికి తప్పనిసరి కాదు. ఇది కేవలం కొందరు వ్యక్తులకే విధి అవుతుంది. కాగా జమఖ్‌షరీ, కాజీ బైజావీ ఇలా అంటున్నారు :

**من للتبعيـض، لأن الأمـر بالمعروف والنهي عن المنكر من فروض الكفاية**

**'మిన్' అన్న పదం 'కొందరి'ని సూచిస్తోంది. ఎందుకంటే అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ అన్నది ఫర్జ్ కిఫాయగా పరిగణించ బడుతుంది.**

*(అల్ కష్షాఫ్ అన్ హకాయిక్‌అత్తన్జీల్ : 1: 388)*

ఇదే ఆయత్ విషయంలో అబూ బక్ర్ జస్సాస్ ఇలా వ్రాశారు :

**و حقيقتـه تقتضي البعض دون البعض، فدل على أنه فرض على الكفاية إذا قام به بعضهم سقط عن الباقين**

**దీని వాస్తవికత (అమ్ర్ బిన్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కొరకు) కేవలం కొందరు వ్యక్తులనే కోరుతుంది, అందరినీ కాదు. దీన్ని బట్టి ఇది ఫర్జ్ కిఫాయ అని ద్యోతకమవుతోంది. ఈ బాధ్యతను కొందరు వ్యక్తులు నిర్వర్తించి నట్లయితే మిగతా వారి నుండి దీని బాధ్యత రద్దయిపోతుంది.** *(అహ్కాముల్ కుర్‌ఆన్ :2: 37)*

ఇదే విషయాన్ని ఇమామ్ గజాలీ చాలా విశదంగా, వివరంగా వ్రాశారు :

**فيها (أي الآية) بيان أنه فرض**

**ఈ ఆయత్ తెలిపిన విషయం ఏమిటంటే, అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**

كفاية لا فرض عين، وأنه إذا قام به أمة سقط الفرض عن الآخرين إذ لم يقل: كونوا كلّكم آمرين بالمعروف بل قال: و لتكن منكم أُمة، فإذًا مهما قام به واحد أو جماعة سقط الحرج عن الآخرين.

అన్నది ఫర్జ్ కిఫాయా, ఫర్జ్ అయిన్ కాదు. ఇంకా ఏమిటంటే ఒక్క వర్గమయినా దీన్ని నిర్వర్తించినట్లయితే ఇతర వ్యక్తులందరి నుండి అది రద్దయిపోతుంది. ఎందుకంటే అల్లాహ్, మీరందరూ మారూఫ్‌ని ఆదేశించేవారుగా మారిపోవాలని కోరలేదు. ఆయన, మీలో ఒక వర్గం (ఈ కార్యం కొరకు) తప్పనిసరిగా ఉండాలని మాత్రమే అన్నాడు. కాగా ఒక వ్యక్తి లేదా ఒక వర్గం ద్వారా ఈ బాధ్యత నెరవేరినట్లయితే ఇతరుల నుండి ఈ విధి రద్దయిపోతుంది.

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2: 334)*

## రెండవ ఆధారం

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ ఫర్జ్ కిఫాయ అవడానికి రెండవ ఆధారం ఏమిటంటే ఈ కార్యం చాలా ఉన్నతమయిన సామర్థ్యాన్ని కాంక్షిస్తుంది. దీని కొరకు మనిషికి షరీఅత్ పట్ల విస్తృత జ్ఞానముండాలి, అతనికి మనస్తత్వ శాస్త్ర పరిజ్ఞానమూ ఉండాలి, దూరదృష్టి కలవాడయి ఉండాలి, సందర్భాన్నీ పూర్వోత్తర పరిస్థితుల సున్నితత్వాన్నీ అర్థం చేసుకున్నవాడయి ఉండాలి, ఏ వ్యక్తితో ఏ విధంగా వ్యవహ రించాలో బాగా ఎరిగినవాడయి ఉండాలి. ఇటువంటి సామర్థ్యాలు ప్రతి వ్యక్తిలోనూ ఉండవన్న మాట తెలుస్తూనే ఉంది. అందువల్ల ఈ కార్యం ఫర్జ్ అయిన్ కాజాలదు. జమఖ్‌షరీ ఇలా అంటున్నారు :

لأنهُ لاَ يصلح الّا من علم المعروف والمنكر، وكيف يرتب الأمر في إقامته، وكيف يباشر، فإن الجاهل ربما نهى عن

ఎందుకంటే ఈ కార్యానికి తగినవాడు, మారూఫ్ అంటే ఏమిటో మున్కర్ అని దేన్నంటారో బాగా తెలిసినవాడు కావడం అవసరం. దీన్ని ఏ విధంగా నెలకొల్పాలో కూడా ఎరిగిన వాడవడమూ అవసరం. దీన్ని ఏవిధంగా నిర్వర్తించాలో కూడా తెలిసిన వాడవడం అవ

المعروف وأمر بمنكر، و ربما عرف الحكم في مذهبه، و جهله في مذهب صاحبه فنهاه عن غير منكر، وقد يغلظ في موضع اللين و يلين في موضع الغلظة، وينكر على من لاَ يزيده إنكاره إلا تمادياً أو على من الإُنكار عليه عبث

సరం. ఎందుకంటే అజ్ఞాని అయిన వ్యక్తి ఎరుగక పోవడం చేత తరచుగా మారూఫ్‌ని నిలిపివేస్తాడు, మున్కర్‌ని ఆదేశిస్తాడు. మరో విషయం ఏమిటంటే అతను తాను అనుస రించే ఫిక్‌హ్ పంథాలో ఒక విషయంపట్ల ఆజ్ఞ ఉన్న విషయం తెలిసినవాడయి ఉండవచ్చు, కాని ఏ వ్యక్తితో అతనికి వ్యవహారం ఎదుర యిందో అతని పంథాలో ఆ విషయానికి సంబంధించిన ఆదేశమేమిటో అతనికి తెలియకపోవచ్చు. అందువల్ల సంబోధితుని పంథాలో ఒక విషయం మున్కర్ కాకపోయి నప్పటికీ అతను దాన్ని నిరోధించడం సాధ్యమే. అలాగే ఒక్కో సారి మృదుత్వం చోట కాఠిన్యాన్ని కఠినత్వం చోట మార్దవాన్నీ అవలంబించ వచ్చు. నిరోధించవలసిన వ్యక్తిని తిరుగుబాటులో ఇంకా పెంచివేస్తాడు. లేదా ఏ వ్యక్తిని నిరోధించడం వ్యర్థమో అటువంటి వ్యక్తిని నిరోధించడమూ సాధ్యమే.

*(అల్ కష్షాఫ్ అన్ హకాయిక్‌అత్తన్జీల్ : 1: 389)*

## ఫర్జ్ అయిన్- ఆధారాలు

ఎవరయితే అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌ని ఫర్జ్ అయిన్ అని అంటారో వారు **'వల్తకుమ్ మిన్‌కుమ్ ఉమ్మతున్'** (మీలో ఒక సముదాయం....) అన్న ఆయత్‌లో ఇది ఫర్జ్ కిఫాయగా పేర్కొనబడిందన్న విషయాన్ని అంగీకరించరు. వీరి దృష్టిలో 'మిన్' (మీలో) అనే ప్రత్యయం 'కొందరు' అనే భావంలో రాలేదు. దానికి బదులుగా, కుర్‌ఆన్‌లో మరో ఆయత్‌లో **'యగ్‌ఫిర్ లకుమ్ 'మిన్' జునూబికుమ్'**లో వచ్చినట్లే ఇక్కడా ప్రయోగించబడింది. (జస్సాస్, అహ్కాముల్ కుర్‌ఆన్: 2: 37, 38). ఆ విధంగా ఈ ఆయత్ అనువాదం, దైవం మీ కొన్ని పాపాలను మన్నిస్తాడు అన్నది సరయినది కాదు. సరయిన అనువాదం, మీ పాపాలను మన్నిస్తాడు అన్నదే. అంటే

వారి దృష్టిలో పై ఆయత్ భావం మీరు తప్పనిసరిగా ఒక సముదాయంగా రూపొం దవలసి ఉంది, అది మారూఫ్‌ను ఆదేశించేది మున్కర్‌ను నిరోధించేదయి ఉండాలి.★

పోతే, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధిని కేవలం జ్ఞాన సంపన్నులే నిర్వర్తించగలరంటే అది సరయినది కాదు. ప్రతి ముస్లిమ్ వ్యక్తికి ధర్మంలోని ప్రాథమిక విషయాలు తెలిసే ఉంటాయి. నమాజ్ రోజా విధి అయినవి అని ఎవరికి తెలియదు? వ్యభిచారం, సారాయి హరామ్ అని ఎవరికి తెలియదు? ఈ ప్రముఖ విషయాలు తెలియని ముస్లిమ్ కూడా ఎవరయినా ఉంటాడని మనం ఊహించ నయినా లేము. కాగా వీటి విషయంలో **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధిని నిర్వర్తించడం ప్రతి ముస్లిమ్ వశంలో ఉన్న విషయమే. దీనికి ఏ ప్రత్యేక జ్ఞాన సామర్థ్యం అవసరముండదు. అయితే సాధారణ మనిషి శాస్త్రీయ సమస్యల్లో, పరిశోధ నాత్మక విషయాల్లో అభిప్రాయం వెలిబుచ్చలేడు, వెలిబుచ్చడం సరయినదీ కాదు. కాని అతి స్పష్టమయిన మారూఫ్ కార్యాలు, మున్కర్ పనులు ఏవయినా ఒక జ్ఞాని ఆదేశం చడమయినా నిరోధించడమయినా చేసినట్లే ఒక సాధారణ వ్యక్తి కూడా ఆ బాధ్యతను నిర్వర్తించడం కష్టతరం కాదు.

మరో చర్చ సందర్భంలో అల్లామా అబ్దుల్ కాదిర్ ఔదహ్ షహీద్ ఇలా అంటారు:

**إن وضع واجب الأمر بالمعروف و النهي عن المنكر على عاتق الجاهل لن يؤدي إلى الاضرار التي يتوقعونها لأن الجاهل بطبيعة الحال لاَ يأمرولاَ ينهى الّا ماهو ظاهر لاَ خلاف عليه كأداء الصلٰوة**

**అజ్ఞాని మెడ పైన అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ బాధ్యత పెట్టడం వల్ల వారికి అనిపిస్తున్న ఆ నష్టం వాటిల్లదు. ఎందుకంటే అజ్ఞాని అతను పూర్తిగా వ్యక్తమయిన వాటినే లేదా విభేదం లేని వాటినే ఆదేశిస్తాడు లేదా వారిస్తాడు. ఉదాహరణకు నమాజ్‌ని ఆచరించే ఆదేశమివ్వడం, లేదా**

---

★ ఈ ఆధారంలో ఒక స్పష్టమయిన లోపముంది. సముదాయం మొత్తంపైన **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధి అయినట్లయితే అది సముదా యంలోని ప్రతి వ్యక్తిపైన విధి అవడం అవసరం కాదు. ఎవరయితే దీన్ని ఫర్జ్ కిఫాయ అంటారో వారు కూడా దీన్ని సముదాయం మొత్తంపైన విధి కాదనే అంటారు. (కొందరికి దీనిపట్ల భేదమూ ఉంది) అయితే కొందరు, దాన్ని కొందరు నిర్వర్తిస్తే సముదాయం మొత్తం నుండి అది తొలిగిపోతుందని అంటారు. ఈ ఆధారం ద్వారా పై వాదన రద్దు కాదు.)

దొంగతనం, వ్యభిచారం నుండి వారించడం. و النهى عن السرقة والزنا.
(అత తష్రీఉల్ జనాయిఅల్ ఇస్లామీ : 1: 495)

ముఫ్తీ షేఖ్ ముహమ్మద్ అబ్దుహూ అభిప్రాయంలో **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** ఫర్జ్ అయిన్. ఆయన 'వల్తకుమ్ మిన్కుమ్ ఉమ్మతున్' అనే ఆయత్ వివరణలో ఇలా అంటారు:

> ఈ సంబోధన ఒక ఊహ ఆధారమయినదని భావించవలసి ఉంటుంది. అదేమిటంటే, ముస్లిమ్ వ్యక్తి తనకు విధి అయిన విషయాలను గురించి తెలియకుండా ఉండలేడు. ఎందుకంటే అతనికి (షరీఅత్ని) తెలుసుకునేందుకు మారూఫ్, మున్కర్ల మధ్య వ్యత్యాసాన్ని చూపేందుకు ఆదేశించడం జరిగింది. పైగా (మారూఫ్ వ మున్కర్ లను తెలుసుకోవడం చిక్కుపడిన సమస్య కాదు. ఎందుకంటే) మారూఫ్ అని అంటే భావం, అది సాధారణంగా పలికినప్పుడు, మానవుని మేధ, సద్బుద్ధి, నైజం ఎరిగిన విషయాలన్నమాట. దీనికి భిన్నంగా మున్కర్ అన్నవి, మానవుని బుద్ధి, సవ్యమయిన నైజాలు ఇష్టపడని విషయాలన్నమాట. అదేమిటో తెలుసుకునేందుకు ఇబ్ను ఆబిదీన్ వ్రాసిన టీకాలు, ఫత్హుల్ కదీర్, మబ్సూత్ ఇత్యాదివి చదవవలసిన అవసర ముండదు. దాని వైపునకు మార్గదర్శకత్వానికి- సహజగుణం సవ్యంగా ఉండటంతో పాటు- దైవగ్రంథం, దైవ సందేశహరుని సంప్రదాయం తోడుగా ఉంటే సరి పోతుంది. ఇవి నిరంతరాయంగా పరంపరానుగతంగా మన వరకు నిరంతర ఆచరణల రూపేణ చేరాయి. ఈ విషయాన్ని గురించి, ఏ వ్యక్తి కూడా ఎరుక లేకుండా ఉండటానికి (షరీఅత్ రీత్యా) వీల్లేదు. ముస్లిమ్ అయిన వ్యక్తి ముస్లిమ్ కాగలగాలంటే ఈ విషయం తెలుసుకోగలగాలి. ఎవరయితే మంచిని ఆదేశించడాన్ని చెడును నిరోధిం చడాన్ని (అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్)ని సర్వసాధారణంగా తిరస్కరిస్తారో వారు వాస్తవానికి ముస్లిములు అజ్ఞానులయి ఉండటాన్ని మంచీ చెడుల మధ్య వ్యత్యాసాన్ని తెలుసుకోకుండా, మారూఫ్, మున్కర్ల మధ్య విభేదాన్ని అర్థం చేసుకోకుండా ఉండటాన్ని ధర్మసమ్మతమే అని భావిస్తారన్న మాట. నిజానికి ధర్మం రీత్యా ఇటువంటి భావానికి ఎటువంటి అర్థమే లేదు.
>
> (తఫ్సీర్ అల్ కుర్ఆన్ అల్ హకీమ్ : (అల్ మనార్) : 4/37.

ఇదే చర్చ సందర్భంలో మరోచోట ఇలా అంటారు :

فريضة الأمر بالمعروف والنهى عن المنكر آكد من فريضة الحج، و لم يشترط فيها الإستطاعة لأنها مستطاعة دائماً

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ విధి, హజ్జ్ విధి కన్నా ఎంతో తాకీదు చేయ బడినది. ఎందుకంటే హజ్జ్‌కు స్థోమత అన్నది షరతు. కాని దీనికి స్థోమత షరతు కాదు. దీన్ని ఎట్టిపరిస్థితిలోనూ అమలు జరపడం సాధ్యమే.**

*(తఫ్సీర్ అల్ కుర్ఆన్ అల్ హకీమ్ : (అల్ మనార్) : 4/ 35)*

యదార్థం ఏమిటంటే, మంచి అన్న దాన్ని ఆదేశించడానికీ చెడును నిరోధించ డానికీ ఒక్కోసారి ఇజ్తిహాద్ (అన్వయ) కృషి కూడా అవసరమవుతుంది. దీని బాధ్యత జ్ఞాన సంపన్నులయిన పండితులపైనే విధితమవుతుంది. ఇదే విధంగా ఒక సాధారణ వ్యక్తి ఇతరులకు ధర్మం గురించి ప్రాథమిక విషయాలు తెలుపడం కూడా **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** అన్న నిర్వచనం కిందే వస్తుంది. ఈ కార్యం ఒకప్పుడు శాస్త్రీయ విధానంలో జరిగితే మరొకప్పుడు అతి సాధారణ రీతిలో జరుగు తుంది. దీనిగ్గాను ఒక్కోసారి కుర్ఆన్ హదీసుల విస్తృత అధ్యయనం అవసరమయి ధార్మిక శాస్త్రాలలో లోతయిన అంతర్ జ్ఞానం ఉద్దిష్టమయి ఉంటే మరోసారి ధర్మంలోని ప్రాథమిక జ్ఞానం, దాని సూత్రప్రాయమయిన బోధనల జ్ఞానమే సరిపోతుంది. ఈ కార్యంలో ఎదురయ్యే సమస్యలు విభిన్నంగా ఉంటాయి. కొన్నింటి పరిష్కారం కొరకు ఉన్నతశ్రేణి శాస్త్రీయ ప్రావీణ్యం, సమకాలీన పరిస్థితుల పట్ల అసామాన్య మయిన అవగాహన అవశ్యమయి ఉంటుంది. మరి కొన్నింటి విషయంలో అతి కొద్ది జ్ఞానం, అవగాహనా శక్తి ద్వారా వాటి పరిష్కారం సాధ్యమవుతుంది. అందువల్ల ఉన్నత స్థాయిలో ఈ కార్యాన్ని చేపట్టలేనివారు దీన్ని పూర్తిగానే వదలి వేయాలన్నమాట సరయినది కాదు. తమ స్థాయిలో, తమ పరిమితుల్లోనూ వారు ఈ కార్యనిర్వహణ చేయకూడదన్న మాట ఎంతమాత్రం తగదు, వారు చేయగలిగిన మేరకు చేస్తూ ఉండాలి.

## అత్యధికుల దృక్కోణం- ఆక్షేపణ

మన పండితులు చాలామంది చేసే దావా ప్రకారం **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** మొత్తం సముదాయం 'ఉమ్మత్'పైన విధి అయినది; కాని

దాన్ని కొందరు నిర్వర్తించినా మొత్తం సముదాయంపై నుండి అది రద్దయిపోతుంది. దీనికి కారణంగా వారు చెప్పేదేమిటంటే, ప్రతి వ్యక్తిలోనూ దీని సామర్థ్యం ఉండదు. అందువల్ల అది అందరికీ విధి కాజాలదు. కాని ఈ వాదన దాని దావాలోనే స్వయంగా ఖండన కలిగివుంది. ఎందుకంటే షరీఅత్‌లో ఏ కార్యమయినా, ఏ ఆదేశమయినా ఒక వ్యక్తికి విధి అవడం అంటే అర్థం అతనికి ఆచరణ యోగ్యమయినప్పుడే అది అతనికి విధి అవుతుంది. ఒకరిలో దాన్ని ఆచరించే స్థోమతే లేకపోయినట్లయితే అతనికి అది విధి కూడా కాదు. ఈ సూత్రం ప్రకారం **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** అన్నది కూడా సముదాయంపైన విధి కాజాలదు. అది కేవలం దాన్ని నిర్వర్తించగల సామర్థ్యం గలవారికే విధి కావాలి. ఇమామ్ షాతిబీ తదితర పండితుల అభిప్రాయం ఇదే. వారి ప్రకారం, ఈ కిఫాయ విధి పూర్తి సముదాయంపైన విధికాదు. దీన్ని చేయగల స్థోమత గలవారికే ఇది విధి. కాగా ఇమామ్ షాతిబీ ఇలా అంటారు:

**إن الطلب وارد على البعض دون البعض، كيف كان، ولكن على من فيه اهلية القيام بذلك الفعل المطلوب، لا على العموم جميعا**

**ఇది కొందరినే కోరుతోంది. ఆ కొందరు కూడా ఎలా ఉన్నాసరే తప్పక నిర్వర్తించి తీరాలని కాదు. నిజానికి అవశ్యమయిన కార్యాన్ని సాధించగల సామర్థ్యం ఉన్న వారినే అది చెయ్యాలని కోరుతుంది. సర్వసామాన్యంగా అందరినీ కాదు.**

దీనికి ఆయన ఇచ్చే ఒక్క వాదన రూపం ఇదే ఆయత్, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** వచ్చిన ఆయత్. ఇందులో కుర్‌ఆన్ ఆదేశం, "మీలో ఒక వర్గం ఈ కార్యనిర్వహణ కొరకు తప్పనిసరిగా ఉండాలి" అన్నది. దీన్నిబట్టి ఈ కార్యం అది పూర్తి సముదాయంపైన విధికాదు, కేవలం ఒక వర్గం పైన మాత్రమే. ఇంకా ఇటువంటి మరికొన్ని ఆయత్‌లు ఉదాహరించి ఆయన ఇలా అంటారు :

**وفى القرآن من هذا النحو أشياء كثيرة ورد الطلب فيها نصا على البعض لاَ على الجميع**

**కుర్‌ఆన్‌లో ఇటువంటి అనేక విషయా లున్నాయి. వాటిలో అతి స్పష్టంగా కొందరినే కోరడం జరిగింది, అందరినీ కాదు.**

*(అల్ మువాఫికాత్ ఫీ ఉసూల్ అష్షరీఅ : 1/ 176)*

ఇమామ్ రాజీ **వల్తకుమ్ మిన్‌కుమ్ ఉమ్మతున్** విషయంలో ఇలా అంటారు : కొందరు, **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** అన్నది కేవలం ఉలమాకే ప్రత్యేకం, ఎందుకంటే దీనికి రెండు కారణాలున్నాయి. మొదటి కారణం, దీనికి శాస్త్రీయ జ్ఞానం అవసరం. రెండవ కారణం ఆయన మాటల్లో ఇది :

إنا أجمعنا على أن ذلك واجب على سبيل الكفاية بمعنى أنه متى قام به البعض سقط عن الباقين، و إذا كان كذلك كان المعنى: ليقم بذلك بعضكم فكان في الحقيقة هذا إيجاباً على البعض، لاَ على الكل

మేము ఒక విషయాన్ని అంగీకరించాము, అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ అన్నది 'కిఫాయ విధి' (ఫర్జ్ కిఫాయ). దీని భావం, దీనిపైన కొందరు అమలు జరిపినట్లయితే మిగతా వారి నుండి అది రద్దయిపోతుంది అన్నమాట. భావం ఇదయినప్పుడు ఆయత్ అర్థం ఏమిటంటే, మీలో కొందరు తప్పనిసరిగా ఈ కార్యాన్ని నిర్వర్తించాలి. అంటే వాస్తవానికి దీన్ని కొందరిపైన విధిగా నిర్ణయించడం అన్నమాట. అందరిపైన కాదు.

*(మఫాతీ హుల్ గైబ్ (అల్ తఫ్సీరుల్ కబీర్) నాల్గవ సంపుటం, 8వ భాగం, పు. 146).*

## అభ్యంతరానికి సమాధానం

ఇది దాదాపు ఇమామ్ షాతిబీ అవలంబించిన దృక్కోణమే. అంటే ఫర్జ్ కిఫాయ అన్నది దాన్ని నిర్వర్తించగల సామర్థ్యం ఉన్నవారికే విధి అవుతుంది. ఫర్జ్ కిఫాయను సముదాయం మొత్తానికి విధిగా భావించేవారు దీనికి సమాధానం ఇచ్చారు. అది, వారి ప్రకారం ఇలా ఉంటుంది: ఫర్జ్ కిఫాయ నిర్వర్తించడం జరగకపోతే సముదాయం (ఉమ్మత్) మొత్తం పాపంలో మునిగిపోతుంది అన్నది. ప్రశ్న ఏమిటంటే, ఫర్జ్ కిఫాయను నిర్వర్తించడం కేవలం ఉమ్మత్‌లో కొందరు వ్యక్తులకే తప్పనిసరి అయినట్లయితే అది నిర్వర్తించబడకపోయినట్లయితే సముదాయం మొత్తం ఎలా పాపంలో పడిపోతుంది అన్నది. (కొందరయితే దీన్నీ అంగీకరించరు. వారి ప్రకారం ఫర్జ్ కిఫాయను వదలడంవల్ల కేవలం దాన్ని నిర్వర్తించగల సామర్థ్యం ఉన్నవాళ్ళే పాపంలో పడిపోతారు.

*(అల్ మువాఫికాత్ : 1/177)*

నిజానికి ఈ అభిప్రాయం కూడా సరయినది కాదు, 'ఫర్జ్ కిఫాయ' నిర్వర్తనను గురించిన ఆదేశం కుర్‌ఆన్‌లో కేవలం కొందరు వ్యక్తులకే చేయడం జరిగిందన్నది సరయినది కాదు. అది మొత్తం సముదాయానికి ఆదేశమయింది. ఉదాహరణకు జిహాద్ ఫర్జ్ కిఫాయ. కాని దాని ఆదేశం ఈ పదాలలో ఇవ్వడం జరిగింది كُتِبَ عَلَيْكُمُ الْقِتَالُ: (మీకు యుద్ధం విధిగా చెయ్యడం జరిగింది). ఈ పదాలను ఉద్దేశించింది సముదాయంలో ఏ ఒక్క వర్గం కాదు, మొత్తం సముదాయం. (ఇరుపక్షాల

వాదనలను తెలుసుకునేందుకు చూడండి; ముసల్లముస్సుబూత్, దాని టీకా, *ఫవాతహుర్రహమూత్, ఈజిప్ట్ ముద్రణ, ముస్తస్ఫా లిల్ గజాలి, సం.1, పు.63- 66; రూహుల్ మఆనీ, సం.1, 2వ భాగం, పు.500).*

**వల్తకుమ్ మిన్‌కుమ్** అన్న ఆయత్‌లో **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** కొరకు ఒక వర్గం ఉండటం తప్పనిసరి అని సూచించడం జరిగిన మాట నిస్సందేహంగా నిజమే. కాని దీనివల్ల ఇది సముదాయం మొత్తంపైన విధి కాదని రుజువు కాదు. ఎందుకంటే పరమ ప్రభువు ఆ వర్గాన్ని నిర్ధారిస్తే, ఆ వర్గానికే ఇది విధి అయిందని అనుకునేందుకు వీలుండేది. కాని ఆయన ఏ వర్గాన్నీ నిర్ధారించలేదు. దీన్నిబట్టి సంబోధన పూర్తి సముదాయానికే వర్తిస్తుందని తెలుస్తోంది. అయితే కొందరు వ్యక్తులు ఈ విధిని అమలుపరచినా సరిపోతుంది గనక 'మీలో ఒక వర్గం ఈ కార్యనిర్వహణకు ఉండాలి' అని నిర్దేశించాడు. బైజావీ ఈ విషయంలో ఇలా అంటున్నారు :

**خاطب الجميع، و طلب فعل بعضهم ليدل على أنه واجب على الكل حتى لو تركوه رأساً أثموا جميعاً، ولكن يسقط بفعل بعضهم. وهكذا كل ماهو فرض كفاية**

**అందరినీ సంబోధించడమయితే జరిగింది, కాని దాన్ని అమలుపరచడం వరకు కొందరినే కోరడం జరిగింది. తద్వారా అది అందరికీ విధి అన్న విషయం నిర్ధారితమవ్వాలన్నది ఉద్దేశ్యం. వారు దాన్ని పూర్తిగా వదలిపెడితే అందరూ దానిపట్ల పాపకూపంలో పడిపోతారు. అయితే వారిలో కొందరు దాన్ని నిర్వర్తించినట్లయితే అందరిపై నుండి దాని బాధ్యత తొలగిపోతుంది. ఫర్జ్ కిఫాయ అయిన ప్రతి ఆచరణ విషయానికి ఇదే పరిస్థితి వర్తిస్తుంది.** *(అన్వారుత్తన్జీల్ వ అస్రారుత్తావీల్: 1/ 174).*

ఇదే విషయాన్ని షేఖ్ ఇస్మాయీల్ హక్కీ ఈ పదాలలో వివరించారు :

**إن 'من' في قولـه (مِنكُم) للتبعيض وتوجيـه الخطاب إلى الكل مع إسناد الدعوة إلى البعض لتحقيق معنى فرضيتها**

**'మిన్‌కుమ్'లోని 'మిన్' అన్న పదం కొందరిని సూచించడానికి ప్రయుక్తమయింది. సందేశ ప్రచారం లేదా 'పిలుపు'ను కేవలం కొందరు వ్యక్తులతో సంబంధం ఉన్నట్టు ప్రకటించినా, సంబోధన అందరి వైపునకు ఉన్నందుకు కారణమేమిటంటే, ఇది ఫర్జ్ కిఫాయ అవడం**

على الكفاية، وأنها واجبة على الكل، لكن بحيث إن اقامها البعض سقطت عن الباقين، و لو أخلّ بها الكل أثموا جميعاً لاَ بحيث يتحتّم على الكل إقامتها

రూఢమవ్వాలన్నది, శుభం వైపునకు పిలుపు నివ్వడం అందరికీ విధి అన్న విషయం విశద మవ్వాలన్నదీను. అయితే దీన్ని కొందరు వ్యక్తులు నిర్వర్తించినా మిగతా అందరి బాధ్యత తీరిపోతుంది. కాని అందరూ దీన్ని విడనాడితే అందరూ పాపాత్ములయిపోతారు. అంతేగాని శుభం వైపునకు పిలుపునివ్వడం అందరికీ విధి కాదు.

*(రూహుల్ బయాన్ : 1/ 352).*

## సరయిన దృక్కోణం

మేము ఇరుపక్షాల వాదనలు క్లుప్తంగా వివరించాము. ఈ వాదనలపైన అభ్యంతరాలయ్యాయి. వాటికి సమాధానాలూ ఇవ్వబడ్డాయి. అయినప్పటికీ వాస్తవమేమిటంటే ఇవి పూర్తిగా లోప రహితమయినవి కావు, వీటివల్ల అసలు సమస్య సరయిన విధంగా పరిష్కృతమూ కాలేదు. దీని సమంజసమయిన పరిష్కారం కొందరు ఇతర పండితులు సూచించారు. వీరిలో ఇమామ్ షాతిబీ రచన అయిన 'అల్ ముఆఫికాత్ ఫీ ఉసూలిష్షరీఅ'కు టీకా, విషయాల అనుక్రమణిక వ్రాసిన షేఖ్ అబ్దుల్లా దరాజ్ కూడా ఉన్నారు. ఇతఃపూర్వం ఇమామ్ షాతిబీ అభిప్రాయం ఏమిటో ప్రస్తావించాము. ఆయన దృష్టిలో ఫర్జ్‌కిఫాయ కేవలం, దాన్ని నిర్వహించగల సామర్థ్యం ఉన్నవారికే వర్తిస్తుంది. దానికి ఆధారంగా ఆయన **వల్తకుమ్ మిన్‌కుమ్ ఉమ్మహ్** అనే ఆయత్‌తో పాటు ఇతర ఆయత్‌లు సయితం ఉటంకించారు. షేక్ అబ్దుల్లా దరాజ్ దీంతో విభేదిస్తూ ఇలా అన్నారు :

هـذه الآيات لاَ تـدل على أن الطلب متوجـه إلى البعض بـل للمانـع ان يقـول المعنى يجب الجميع أن ينهضوهم لـذلک، ويعـدوهم لـه، ويعـاونوهم بكل

ఈ ఆయత్‌లు, ఈ ఆదేశం కొందరినే దీన్ని అమలుపరచమని కోరుతున్నాయన్న విషయాన్ని ధ్రువపరచడం లేదు. ఎందుకంటే ఈ వాదనను విభేదించే వ్యక్తి, ఈ ఆయత్‌ల భావం, ఈ కార్యనిర్వహణ కొరకు కొందరిని నిలబెట్టడం అందరి బాధ్యతే అని, అలా వారిని సిద్ధపరచడం, వారికి అన్ని విధాలా తోడ్ప డటం, ఆ విధంగా దీని ఔచితీ విజ్ఞత నెరవేరేలా

الوسائل، ليتحقق هـذا المهم من المصلحـة، فإن لم يحصل هـذا المهم مـن المصلحـة أثم جميع المكلفين المتأهل وغيره

చెయ్యడం, అది నిజమయ్యేలా చెయ్యడం అవసరం అని అనగలడు. ఎందుకంటే ఒకవేళ ఈ కార్యం నెరవేరకపోతే సామర్థ్యం ఉన్నవారు, లేనివారు సంబోధితులు అందరికి అందరూ పాపంలో పడిపోతారు.

*(అల్ ముఆఫికాత్ ఫీ ఉసూలుష్షరీఅ : 1/ 176*
*(పాదసూచి నెం:2)*

విచిత్రమయిన విషయం ఏమిటంటే స్వయాన ఇమామ్ షాతిబీ తన చర్చకు చివరన తెలిపిన దాని ప్రకారం ఓ ప్రత్యేక కోణంలో పరికించినట్లయితే ఈ చర్చ ఎటువంటి నిజమయిన చర్చ కానేకాదు, ఆ కోణం షేఖ్ అబ్దుల్లా దరాజ్ ముందుంచిన కోణమే. ఇమామ్ షాతిబీ గారి పదాలు పరిశీలించండి:

قد يصح أن يقال: إنه واجب على الجميع على وجه من التجوز، لأنّ القيام بذلك الفرض قيام بمصلحة عامة، فهم مطلوبون بسدها على الجملة، فبعضهم هو قادر عليها مباشرة وذلك من كان أهلالها، والباقون و إن لم يقدروا عليها، قادرون على إقامة القادرين، فمن كان قادراً على الولاية فهو مطلوب بإقامتها، ومن لاَ يقدر عليها مطلوب بأمر آخر و هو إقامة ذلك القادر و إجباره على القيام بها، فالقادر إذاً مطلوب بإقامة الفرض، وغير

ధర్మసమ్మతమయిన రూపంలో, శుభం వైపునకు పిలుపునిచ్చే కార్యం అందరి పైనా విధి అని చెప్పడం కూడా ఓ విధంగా సరయినదే. ఎందు కంటే ఈ విధి నిర్వహణ వాస్తవంగా ధర్మంలోని ఓ సర్వసాధారణ విజ్ఞతను నెరవేర్చడమవు తుంది, దీన్ని నిర్వర్తించే ఆదేశం మొత్తానికి అందరికీ వర్తిస్తుంది. అది ఎలా అంటే వీరిలో కొందరయితే స్వయంగానే దాన్ని నిర్వహించ గల సామర్థ్యం కలిగి ఉంటారు. వీరు దీని శక్తి, స్థోమతలు కలిగి వుంటారు. మిగతా వారిలో దీని సామర్థ్యం శక్తి లేకపోయినప్పటికీ సామర్థ్యం ఉన్నవారికి ఈ కార్యం కొరకు సన్నద్ధ పరచగలుగుతారు. దాని శక్తి వారికి తప్పక ఉంటుంది. కాగా ఎవరయితే దాన్ని స్వయంగా అమలు చెయ్యగల సామర్థ్యం కలిగి ఉన్నాడో అతన్ని దాన్ని ఆచరించేందుకు ఆదేశించడం జరిగింది. మరెవరయితే అమలు జరిపే సామర్థ్యం కలిగిలేడో అతను శక్తి గల వ్యక్తిని

القادر مطلوب بتقديم ذلك القادر إذ لَا يتوصل إلى قيام القادر إلَا بالإقامة من باب ما لاَيتم الواجب إلا به، وبهذا الوجه يرتفع مناط الخلاف، فلايبقى للمخالفة وجه ظاهر

**దాన్ని ఆచరించేందుకు సన్నద్ధం చేసే, దాన్ని నిర్వహించేందుకు ఒత్తిడి తెచ్చే బాధ్యత కలిగి ఉంటాడు. శక్తి గలవాణ్ణి విధి నిర్వహణకు, శక్తిలేని వాణ్ణి, శక్తి ఉన్నవాణ్ణి ప్రోత్సహించేం దుకు ఆదేశించడం జరిగింది. శక్తిగలవాడు, తనను నిలబెట్టినప్పుడే నిలబడినట్లయితే అతన్ని నిలబెట్టడం తప్పనిసరి. ఇది ఎలా ఉ ందంటే ఒక విధి నిర్వహణకు అవసరమయిన వస్తువు కూడా విధి అయిపోయినట్లే అన్న మాట. ఈ విధంగా విభేదానికి ఆధారం అంత మయి పోతుంది, వ్యతిరేకతకు స్పష్టమయిన కారణ మేదీ మిగలదు.**

*(అల్ మువాఫికాత్ ఫీ ఉసూలిష్షరీఅ : 1/ 178- 179)*

ఇమామ్ షాతిబీ ఇచ్చిన ఈ వివరణ వల్ల ఫర్జ్ కిఫాయ సముదాయం (ఉమ్మత్) మొత్తానికి విధి అవుతుందా లేదా కేవలం దానికి చెందిన కొందరు వ్యక్తులపైనా అన్న సమస్య పరిష్కృతమయిపోతుంది. అలాగే **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** అన్నది ఫర్జ్ కిఫాయనా లేదా ఫర్జ్ అయినా అన్న చర్చ కూడా అంతమయి పోతుంది. ముఫ్తీ షేక్ ముహమ్మద్ అబ్దుహూ ఈ రీతిలోనే ఈ సమస్య పట్ల యోచిం చారు. ఆయన దృష్టిలో **అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్** మున్కర్ ఫర్జ్ అయిన్ కోవకు చెందింది. దీన్ని ఫర్జ్ కిఫాయగా భావించేవారి ఒక వాదన (మేము లోగడ సూచించినట్లు) కుర్‌ఆన్ ఈ కార్యానికి వాడిన పదాలు **వల్తకుమ్ మిన్‌కుమ్ ఉమ్మహ్** అన్నవి. 'మిన్' అంటే ఇక్కడ కొందరికి వర్తించే ప్రత్యేయం. షేఖ్ ముహమ్మద్ అబ్దుహూ వీరి ఈ వాదనను అంగీకరించి ఈ ఆయత్‌ని ఈ విధంగా విశదీకరించారు. **అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్** మున్కర్ ఫర్జ్ కిఫాయ అయినప్పటికీ ఫర్జ్ అయిన్ స్థాయిని చేరుకుంటుంది. ఆయన ఇలా అంటారు, 'మిన్'ని కొందరికి వర్తించేదిగా అంగీకరించిన తరువాత కూడా ఆయత్ భావం ఏమిటంటే, మీలో ఒక ప్రత్యేకమయిన సముదాయం ఉండాలి, అది శుభం వైపునకు పిలుపునిచ్చేదిగా **అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్** మున్కర్ విధిని నిర్వర్తించేదిగా ఉండాలి. ఈ ఆదేశానికి విశ్వాసులందరూ సంబోధితులే. ఎందుకంటే వారే తమలో నుంచి ఒక వర్గాన్ని ఈ విధిని నిర్వర్తించడానికి ఎంపిక చేయడానికి బాధ్యులు. అంటే రెండు విధాల విధులు: ఒకటి ముస్లిము

లందరిపైనా విధించబడేది, రెండు, వారు ఈ పిలుపునకు ఎంపిక చేసే వర్గం లేదా సంఘంపై తారసపడేది.

ఈ యదార్థాన్ని అర్థం చేసుకునేందుకు తొలుత, కుర్ఆన్ ఇక్కడ ప్రయోగించిన పదం 'ఉమ్మత్' (సముదాయం, సమాజం, సంఘం, వర్గం) అనే దాన్ని సరిగ్గా అర్థం చేసుకోవాలి. 'ఉమ్మత్' అంటే సాధారణతః చెప్పే అర్థంలా కేవలం వర్గం అన్నది సరయినది కాదు. వర్గం అన్న పదంలో సామాన్యత ఉంది. కాని 'ఉమ్మత్' అన్న దానిలో ప్రత్యేకత ఉంది. దీనిభావం పరస్పరం సంబంధం కలిగిన వ్యక్తుల సమూహం అని భావం, వారి మధ్యన సమైక్యత ఉంటుంది, వారంతా కలసి ఒక శరీరావయవాల్లా రూపొందుతారు. సందేశం వైపునకు పిలుపు కొరకు ఒక ఉమ్మత్‌ని రూపొందించడం ముస్లిములందరి బాధ్యత అని అన్నప్పుడు దాని భావం, దాన్ని ఉనికిలోకి తేవడానికి, దాని పనిలో దానికి సహాయపడటానికి, దాని ప్రగతిని పర్యవేక్షించడానికి ప్రతి వ్యక్తి తన శక్తి మేర సంకల్పం, ఆచరణల ద్వారా అందులో తప్పనిసరిగా పాల్గొనవలసి ఉంటుంది. మరి ఆ 'ఉమ్మత్' వల్ల ఏదయినా పొరపాటు లేదా తప్పుత్రోవ పట్టడం జరిగినట్లయితే దాన్ని సరయిన దారి వైపునకు మరల్చడం అందరి బాధ్యత. *(రషీద్ రజా, తఫ్సీరుల్ కుర్ఆన్ అల్ హకీమ్ (తఫ్సీర్ అల్ మనార్) : 4/36, 37)*

ధర్మప్రచారం, సముదాయ సంస్కరణ, శ్రేయోభిలాష కార్యం సులువయిన కార్యం కాదన్న విషయంలో సందేహం లేదు. అయినప్పటికీ ప్రతి వ్యక్తీ దాన్ని తన శక్తి, సామర్థ్యం మేరకు నిర్వర్తించగలడు. ఎవరిలోనయినా మానవ ప్రపంచం మొత్తాన మంచిని సుస్థాపితం చేయగల స్థోమత, చెడును తుడిచిపెట్ట గల శక్తి ఉన్నట్లయితే అతను తప్పనిసరిగా ఈ విధిని ఇదే విస్తృత స్థాయిలో నిర్వహించవలసి ఉంటుంది. కాని ఎవరిలో ఇంత సామర్థ్యం ఉండదో అతను తగినంత పరిమిత పరిధిని ఎంపిక చేసుకోగలడు. కాని అతనిలో ఏ కోణంలోనూ ఈ కార్యసామర్థ్యం లేకపోయి నట్లయితే అతనికి మరో మార్గం తెరిచే ఉంది. అతను సమర్థులయిన వ్యక్తుల్ని ఈ కార్యం కొరకు ఉత్తేజపరచగలడు, సన్నద్ధపరచగలడు, వారితో సహకరించగలడు. తద్వారా **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధిని అతను ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగానయినా నిర్వర్తించగలుగుతాడు. తద్వారా అతను పూర్తిగా ఆ విధిని వదలిపెట్టినవాడుగా పరిగణించబడడు.

## సాధారణ పండితులందరి (జుమ్‌హూర్ ఉలమా) పంథా- విశదీకరణ

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**ని ఫర్జ్ కిఫాయ అనేవారు, దీన్ని ఫర్జ్ అయిన్ అనేవారు ఇరువురి వాదనల వివరాలు చర్చించాము. మొదటి దృక్కోణం

అధిక సంఖ్యాకులయిన పండితులందరిది,★ ఈ విషయంలో కొన్ని కోణాలు మరింత విశదీకరణను కోరుతున్నాయి.

1. **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**ని మనం ఫర్జ్ అయిన్ అనకుండా అధిక సంఖ్యననుసరించి ఫర్జ్ కిఫాయగానే పరిగణించినా దానివల్ల దాని విధి స్థాయి ఏమాత్రం మారదు. పైగా అది ఫర్జ్ అయిన్ లాంటి స్థాయినే కలిగి ఉంటుంది. కొందరు వాజిబుల్ అయిన్, వాజిబుల్ కిఫాయలోని వాస్తవికత పరస్పరం భిన్నమని భావిస్తారు. కాని ఈ అభిప్రాయం సరయినది కాదు. అల్లామా ఆమిదీ ఇలా నుడివారు:

**لا فرق عند أصحابنا بين واجب العين والواجب على الكفاية من جهة الوجوب لشمـول حـد الواجب لهما، خلافاً لبعض الناس مصيراً منه إلىٰ أن واجب العين لاَ يسقط بفعل الغير، بخلاف واجب الكفابة، وغايــة الاُختلاف في طريق الإسقاط، وذٰلک لاَ يوجب الاِختلاف في الحقيقة**

**మా పండితుల దృష్టిలో వాజిబ్ అయిన్, వాజిబ్ కిఫాయలలో వాజిబ్ (విధి) అవడం పట్ల ఎటువంటి వ్యత్యాసం లేదు. ఎందుకంటే రెండున్నూ విధిగానే పరిగణించబడతాయి. కొందరికి ఇందులో భేదాభిప్రాయముంది. దీనికి ఆధారం, వాజిబ్ అయిన్ ఇతరులు నిర్వర్తిస్తే రద్దయిపోదు, వాజిబ్ కిఫాయ రద్దయి పోతుంది. కాని ఈ భేదాభిప్రాయం ద్వారా రద్దయ్యే మార్గాలలో గల వ్యత్యాసం మాత్రమే రుజువవుతుంది, కాని వాజిబ్ అవడం పట్ల, దాని వాస్తవికత పట్ల విభేదం తప్పనిసరిగా ఏర్పడదు.**

*(అల్ ఇహ్కామ్ ఫీ ఉసూలిల్ అహ్కామ్: 1/ 141, 142)*

2. ఫర్జ్ అయిన్ అయిన అంశం పట్ల సమాజంలోని ప్రతి వ్యక్తికీ బాధ్యత విధ్యుక్తమవుతుంది. మరి ఫర్జ్ కిఫాయ బాధ్యత మొత్తం సముదాయం పైన పడుతుంది. కనుక ఫర్జ్ అయిన్ నిర్వర్తనకు ఒక్కొక్క వ్యక్తి చింతించినట్లే ఫర్జ్ కిఫాయను నిర్వర్తించడానికీ సముదాయం మొత్తం చింతిస్తూ ఉండవలసివుంటుంది. ఎందుకంటే ఫర్జ్ కిఫాయను వదలివేసిన సముదాయం, అది కావాలని వదలినా, ఏమరుపాటు వల్ల పొరపాటుగా వదలినా, దాని వ్యక్తులందరూ పాపంలో పడిపోతారు. అయితే వారిలో కొందరు దాన్ని నిర్వర్తించినా దాని బాధ్యత అందరి నుండి తొలగిపోతుంది. మరి దాన్ని నిర్వర్తించినవారికి దాని పుణ్యఫలం ప్రాప్తమవుతుంది. తదనుగుణంగానే

★ *(వారిని పారిభాషికంగా 'జుమ్‌హూర్ ఉలమా' అని వ్యవహరిస్తారు.)*

మౌలానా అబ్దుల్ అలీ అన్సారీ, వాజిబ్ అలల్ కిఫాయను ఈ పదాలలో నిర్వచించారు:

الواجب الذى من شأنه أن يثاب الآتون ولاَ يعاقب التاركون، إذا أتى به البعض، وإن لم يات أحد يعاقب الكل

**ఇది ప్రత్యేకమయిన వాజిబ్, దీన్ని ఆచరించిన వారు పుణ్యఫలం పొందుతారు, మరి వదలిన వారు శిక్ష పొందరు. కాని అలా జరగాలంటే జనం దాన్ని నిర్వర్తించాలి, ఎవరున్నూ దాన్ని నిర్వర్తించకపోయినట్లయితే అందరికి అందరూ శిక్షార్హులవుతారు.**

*(షరహ్ ముసల్లముస్సుబూత్ : 1/ 62, 63)*

దీని భావమేమిటంటే, ఏదయినా సముదాయం దైవం పట్టు నుండి తప్పించుకో గోరితే దాని వ్యవస్థలో నిత్యం **అమ్ర్ బిల్ మారూఫ్** వ **నహీ అనిల్** మున్కర్ విధి నిర్వ హణ జరుగుతూ ఉండాలి, అందులో మంచిని ఆదేశించేవారు, చెడుల నుండి నిరోధించేవారు సతతం మెలకువగా ఉండాలి.

3. ఫర్జ్ కిఫాయ మహత్తరమయిందా ఫర్జ్ అయిన్ మహత్తరమయిందా? జలాలుల్ మహల్లీ ప్రకారం పుకహా ఈ ప్రశ్నను చర్చించలేదు. కాని వారి వ్రాతలవల్ల తెలిసిన దాన్ని బట్టి వారు ఫర్జ్ అయిన్‌ని మహత్తుగలదిగా భావించినట్టు అనిపిస్తుంది. ఎందుకంటే షరీఅత్ ఫర్జ్ కిఫాయకు ఎదురుగా దీనికి ప్రాముఖ్యాన్నిచ్చింది. శక్తిగల ప్రతి వ్యక్తిని దీన్ని అమలు చెయ్యమని కోరింది. అయితే దీనికి భిన్నంగా అల్లామా అబూ ఇస్‌హాక్ ఇస్‌ఫరాయినీ, ఇమాముల్ హరమైన్, అల్లామా అబూ ముహమ్మద్ జువైనీ అభిప్రాయంలో ఫర్జ్ కిఫాయకు ఫర్జ్ అయిన్ కన్నా అధిక మహత్తు ఉంది. ఎందుకంటే ఫర్జ్ కిఫాయను కొందరు వ్యక్తులు సరిగ్గా నిర్వర్తిస్తే దీనివల్ల దాని బాధ్యత తారసిల్లిన వ్యక్తులందరూ పాపం నుండి తప్పించుకుంటారు. కాని ఫర్జ్ అయిన్‌ని నిర్వర్తించడం వల్ల దాన్ని చెయ్యకపోవడం వల్ల కలిగే పాపం నుంచి మాత్రమే ఆ వ్యక్తి తప్పించుకోగలడు, అంతేగాని ఇతరుల్ని పాపం నుండి తప్పించే అంశం ఇందులో లేదు, ఆ ప్రశ్నే తలెత్తదు. *(షరహ్ జలాలుల్ మహల్లీ అలా జమ్ ఉల్ జవామీ; మఅ హాషియ అల్ బనానీ: 1/ 185, 186).* ఈ కోణంలో చూసినట్లయితే **అమ్ర్ బిల్ మారూఫ్** వ **నహీ అనిల్ మున్కర్** ప్రాముఖ్యత, దాన్ని ఫర్జ్ కిఫాయగా అంగీకరించినప్పటికీ మరీ పెరిగిపోతుంది.

4. దైవధర్మం వైపునకు ప్రపంచానికి పిలుపునివ్వడం, దాన్ని స్థాపించడం, ఆధిక్యత గలదిగా చెయ్యడం కూడా **అమ్ర్ బిల్ మారూఫ్** వ **నహీ అనిల్** మున్కర్‌గానే పరిగణించబడుతుంది. అలాగే ఒక నమాజ్ చెయ్యని వ్యక్తికి నమాజ్‌ని గురించి

హితవు గరపడమయినా ఒక త్రాగుబోతును త్రాగుడు నుండి మాన్పించడానికి ప్రయత్నించడమయినా **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**గానే పరిగణించబడుతుంది. వీటిలో మొదటి పని సతతం చెయ్యవలసిందయితే రెండవ పని తాత్కాలికమయింది, తత్సమయమయింది. ఎందుకంటే మొదటి పని తీరు ఎటువంటిదంటే ప్రతి వ్యక్తి తన శక్తిమేర జీవితాంతం నిర్వర్తించగలడు. ఏ వ్యక్తి అయినా ఎప్పటికయినా ఈ పని ముగిసిపోయిందనీ అనలేడు, ఇక దీని ఆవశ్యకత తీరిపోయిందనీ అనలేడు. ఈ కోణంలో **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**ని ఫర్జ్ అయిన్ అని చెప్పటం తప్పు కాదు. కాని రెండవ పని తీరు ఎటువంటిదంటే దీన్ని నెరవేర్చడానికి ప్రతి వ్యక్తి అందులో నిమగ్నమయి ఉండవలసిన అవసర ముండదు. ఒకడు లేదా కొందరు ఈ పనికి సరిపోతారు, ఉదాహరణకు ఒక కూటమిలో షరీఅత్‌కు వ్యతిరేకమయిన మాట ఏదయినా జరుగుతుందనుకోండి, దానిని మాన్పించడం ఆ కూటమిలో ఉన్నవారి విధి. కాని ఈ పని ఆ కూటమిలోని వ్యక్తు లందరూ ఒకేసారి నిర్వర్తించనూ లేరు, నిజానికి అలా నిర్వర్తించే అవసరమూ లేదు. ఇటువంటి పరిస్థితిలో ఏ ఒక్క వ్యక్తి కూడా సంస్కరణకు సమంజసమయిన ప్రయత్నం చేసినట్లయితే అందరి బాధ్యతా తీరిపోతుంది. కాని ఒకవేళ ఆ కూటమి మొత్తమే ఏమరుపాటును పాటిస్తే అందరికి అందరూ పాపంలో పడిపోతారు. **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** కార్యాన్ని ఈ రూపంలో చూసినట్లయితే దాన్ని ఫర్జ్ కిఫాయగానే పరిగణించవలసి ఉంటుంది, ఇది ఫర్జ్ అయిన్ కాదు.

5. **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**ని ఫర్జ్ కిఫాయ అని చెప్పిన దాని భావం, భువిలో ఏదైనా మూలలో ముస్లిమ్ సమాజంలోని ఎవరో ఒక వ్యక్తియో లేదా ఎవరో కొందరు వ్యక్తులో కలసి ఈ విధిని నిర్వహిస్తున్నట్లయితే మొత్తం సముదాయం ఈ విధి బాధ్యత నుండి విముక్తి పొందినట్లే అన్నది కాదు. **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** కోరే ఆవశ్యకత ఏమిటంటే ఒకవైపున ధర్మం ఏమిటో తెలియని జనంలో ధర్మం గురించి అవగాహనా కార్యం చేపట్టాలి. మరో వైపున ముస్లిములలోనూ ఈ కార్యక్రమం చేపట్టాలి. మొదటి కార్యం ఎంత కఠినమయిందో రెండవ కార్యం కాఠిన్యం అంతకన్నా తక్కువేమీ కాదు. ఎందుకంటే ముస్లిమ్ సము దాయం అన్నది ఏదో చిన్న సముదాయం కాదు. నేడు అది ప్రపంచంలో అందరికన్నా పెద్ద సముదాయం. 120 కోట్ల ప్రజల సముదాయం. అది ఒక భూభాగంలో నివాసం ఏర్పరచుకొని లేదు. విభిన్న ప్రాంతాలలో వ్యాపించి ఉంది. అది మాటలాడే భాష ఒక్కటి కాదు. అనేక భాషలు మాటలాడేవారు అందులో ఉన్నారు. ఈవిధంగా ఈ సముదాయం ఒక ధార్మిక ఏకాంకం (Unit) అయినప్పటికీ అందులో అనేకానేక నాగరిక, నైసర్గిక, భిన్నత్వాలు కలిసి ఉన్నాయి. ఈ కారణంగా సహజంగానే ఇందులోని

ఒక వర్గంలోని అనేక సమస్యలు ఇతర వర్గంలోని సమస్యలకు భిన్నమయినవి. ఇందులోని ఓ వర్గం ఓ విధమయిన పరిస్థితులకు లోనయి ఉంటే మరో వర్గం విభిన్నమయిన పరిస్థితులలో చిక్కుకుని ఉంది. అందువల్ల ఒక్క వ్యక్తియో ఒక్క సంఘమో కలసి **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్** మున్కర్‌కు సంబంధించిన విస్తృత కార్యక్రమాన్ని పూర్తి సముదాయంలోనూ దాని వెలుపలనూ నిర్వర్తించడం సాధ్యంకాని విషయం. ఈ కార్యనిర్వహణకు విభిన్న దేశాలలో, వివిధ ప్రాంతాలలో అనేక సంఘాలు, సంస్థలు పనిచేసినప్పుడే అది సాధ్యమవుతుంది. మనం కేవలం ఒక సంస్థను ఊహించగలం. అది తన అసాధారణమయిన వనరులతో సాధనాలతో ప్రపంచమంతటా **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్** మున్కర్ విధిని నిర్వర్తిస్తుందని. కాని అప్పటికీ అది ప్రతి భూభాగంలోనూ ప్రతి ప్రాంతంలోనూ అక్కడి పరిస్థితుల రీత్యా, అక్కడి అవసరాలకు తగినట్టుగా పనిచేయగల కార్యకర్తలు దానికి అవసరమవు తారు. అప్పుడే వారక్కడ పనిచేయగలుగుతారు. దివ్యకుర్‌ఆన్ ఈ కార్యాన్ని చేసే పద్ధతిని ఇలా తెలిపింది :

فَلَوْلَا نَفَرَ مِنْ كُلِّ فِرْقَـةٍ مِّنْهُمْ طَائِفَـةٌ لِيَتَفَقَّهُـوْا فِي الـدِّيْنِ وَلِيُنْذِرُوْا قَوْمَهُمْ اِذَارَجَعُوْا اِلَيْهِمْ لَعَلَّهُمْ يَحْذَرُوْنَ (التوبة: ۱۲۲)

**"విశ్వాసులయిన వారు ఎల్లరికి ఎల్లరూ కలిసి బయల్దేరే అవసరమేమీ లేకపోయింది. కాని వారి జనావాసాల్లోని ప్రతి భాగం నుండి కొందరు వచ్చి ధర్మావగాహన పెంచుకోవడం, తిరిగి వెళ్ళి తమ ప్రాంతాల సామాన్య పౌరు లలో జాగరూకత కలిగించడం ఎందుకు జరగ లేదు. అలా జరిగి ఉంటే వారు (ముస్లిమేతర వైఖరికి) దూరంగా మెలిగేవారు."**

*(అత్ తౌబా : 122)*

కాజీ బైజావీ ఈ ఆయత్ విశదీకరణ చేసిన కొన్ని అవసరమయిన భాగాలను మేము ఇక్కడ ఉటంకిస్తున్నాము:

فهلاّ نفر من كل جماعة كثيرة كقبيلة وأهل بلدة جماعة قليلة ...ليجعلوا غايـة سعيهم ومعظم غرضهم من الفقاهـــة، إرشاد

**కాగా ప్రతి పెద్ద సముదాయంలో నుంచి, ప్రతి తెగ, ప్రతి నగరం నుంచి, ఒక చిన్న వర్గం ఎందుకు బయలుదేరలేదు,.... తద్వారా అది ధర్మం పట్ల సరయిన అవగాహన, బోధన పొంది, తన ఈ ప్రయత్నంలో తన జాతికి సన్మార్గం చూపాలన్న ఉద్దేశ్యం, లక్ష్యం కలిగి**

**వుండి, దాన్ని దేవుని శిక్ష పట్ల భయపెట్టగలగ దానికి.** **القوم وانذارهم**

*(అన్వారుత్తన్జీల్ వ అస్రారుత్తావీల్ : 1/ 425)*

భావమేమిటంటే **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** అన్నది కేవలం భిన్న దేశాలలో, విభిన్న ప్రదేశాలలో నిర్వర్తించబడటం సరిపోదు. ప్రతి నగరంలోను, ప్రతి జనావాసంలోను, ప్రతి పల్లెలోను, ప్రతి పట్టణంలోనూ దీని వ్యవస్థ ఏర్పడటం తప్పనిసరి. అల్లామా బగవీ ఇదే ఆయత్ ప్రస్తావనలో ఇలా అంటున్నారు :

> "ఫిక్హ్ అన్నది ధర్మ అవగాహనకు మారు పేరు. అది రెండు రకాలు: ఫర్జ్ అయిన్, ఫర్జ్ కిఫాయ. మొదటి రకంలో పరిశుద్ధత, నమాజ్, రోజా తదితర ఆదేశాలున్నాయి. వీటిని తెలుసుకోవడం ప్రతి ముస్లిమ్ వ్యక్తికి విధి అయిన విషయం. అలాగే షరీఅత్ ఎవరికైనా వాజిబ్ (విధిగా) చేసిన ఆరాధన అయినా దాని ఆదేశాలు తెలుసుకోవడం అతనికి ఫర్జ్ అయిన్ అవుతుంది. ఉదాహరణకు జకాత్, హజ్జ్. ఇవి ఎవరికి వాజిబ్ (విధి) అవుతాయో వారు వాటి ఆదేశాలు తెలుసుకోవడం తప్పనిసరి. ఫర్జ్ కిఫాయ ఏమిటంటే, మనిషి ఇజ్తిహాద్ చేయగలిగే, ఫత్వా ఇవ్వగలిగే స్థాయి వరకు జ్ఞాన సముపార్జన చేయాలి. ఒక నగరంలోని జనులెల్లరూ ఈ స్థాయి జ్ఞాన సముపార్జన చేయలేకపోయినట్లయితే అందరూ పాపాత్ములయి పోతారు. కాని ఒకవేళ ఒక్కో పట్టణంలో ఒక్కో వ్యక్తి అయినా ఈ మేరకు జ్ఞానసముపార్జన చేయగలిగినట్లయితే అందరిపై నుంచీ ఆ భారం తొలగి పోతుంది. మరి ఆ పట్టణవాసుల బాధ్యత ఏమిటంటే వారు తమ వ్యవహారాలలో ఆ వ్యక్తిని అనుసరించాలి."

*(మఆలిముత్తన్జీల్ అలా హామిషుల్ ఖాజిన్ : 3/ 138)*

అంటే ధర్మం పట్ల విస్తృత జ్ఞానం గల వ్యక్తులు ప్రతి జనావాసంలో ఉండటం తప్పనిసరి అవుతుంది. అప్పుడే జనం వారి ద్వారా మార్గదర్శనం పొందగలరు, తమకు షరీఅత్ ఆదేశాలు తెలియని వ్యవహారాలన్నింటిలో వారిని అడిగి తెలుసుకోగలరు. ఒకవేళ ఏదయినా జనావాసంలో ఇటువంటి జ్ఞాన సంపన్నుడయిన ఒక్క వ్యక్తి కూడా లేకపోతే అక్కడి జనులందరూ పాపులయిపోతారు, దైవం వద్ద వారు పట్టుబడతారు.

6. ఇమామ్ ఇబ్ను తైమియ్యా (రహ్మ) ఇలా సెలవిస్తున్నారు :

الأمر بالمعروف والنهى عن المنكر لاَ يجب على كل أحد بعينه، بل هو على الكفاية، كما دل عليه القرآن. و لما كان الجهاد من تمام ذلک كان الجهاد أيضاً من فروض الكفاية

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ ఫర్జ్ అయిన్ కాదు, అందువల్ల ప్రతి ఒక్కరికీ విధి కాదు. ఇది ఫర్జ్ కిఫాయ. కుర్ఆన్ దీన్నే బలపరుస్తుంది. జిహాద్ కూడా దీని అంతర్భాగమే కాబట్టి, జిహాద్‌తోనే అది పరిపూర్ణమవుతుంది కాబట్టి, ఇది కూడా ఫర్జ్ కిఫాయగానే ఎంచబడుతుంది.**

*(అల్ హస్బహ్ ఫిల్ ఇస్లామ్ : పు. 61)*

జిహాద్ గురించి ఫుకహా వ్రాసిన దాని ప్రకారం, ఏదయినా నగరంపైకి శత్రువు దాడి చేసినప్పుడు ఆ నగరవాసులందరికీ, శత్రువును ఎదుర్కోగల వారందరికీ, జిహాద్ ఫర్జ్ (విధి) అవుతుంది. నగరవాసులు శత్రువును ఎదుర్కొనే శక్తి లేనివారయితే లేదా శక్తి కలిగీ ఏమరుపాటు లేదా అలసత్వం చూపుతున్నట్లయితే వారికి చేరువన ఉన్న వారికి శత్రువును ఎదుర్కోవడం విధి అయిపోతుంది. ఒకవేళ వారున్నూ ఎదుర్కోలేని అశక్తులయినట్లయితే వారికి దగ్గర ఉన్నవారికి ఈ విధి విధితమవుతుంది. ఈవిధంగా క్రమంగా తూర్పు పడమరలలోనున్న ఇస్లామ్ అనుయాయులందరికీ జిహాద్ (శత్రువును ఎదుర్కోవడం) విధి (ఫర్జ్) అవుతూ పోతుంది. *(ఫత్‌హుల్ కదీర్ వల్ ఇనాయతు అలల్ హిదాయ : 4/ 280, 281)*

సరిగ్గా ఇదేవిధంగా, దీని ఆధారంగా ఊహ తెలిపే దాని ప్రకారం, ఎక్కడయితే మారూఫ్ స్థాపితం కాలేదో మున్కర్ కొనసాగుతున్నదో అక్కడి జనుల బాధ్యత, మారూఫ్‌ను స్థాపించడానికి, మున్కర్ నుండి వారించడానికి ప్రయత్నం చేస్తూ ఉండటం. కాని ఒకవేళ వారు ఆ బాధ్యతను గుర్తించలేకపోతే లేదా గుర్తించినా ఏమరుపాటువహిస్తూ ఉన్నట్లయితే వారికి చుట్టు పట్ల నున్న వారి బాధ్యత, అక్కడికి వెళ్ళడం, అక్కడ **అమ్ర్ బిల్ మారూఫ్** వ **నహీ అనిల్** మున్కర్ విధిని నిర్వర్తించడం. ఉదాహరణకు ఒక ముస్లిమ్ జనావాసం మున్కరాత్ (చెడుగుల)లో నిండా మునిగి ఉందనుకోండి, లేదా దాని నమ్మకాలు చెడిపోయాయనుకోండి, వారిని సంస్కరించే ఏ ఒక్క వ్యక్తి కూడా ఆ జనావాసంలో లేకపోయినట్లయితే షరీఅత్ రీత్యా దగ్గర ఉన్న వారిపైన వారి సంస్కరణా బాధ్యత మోపబడుతుంది. వారు కూడా ఆ విధి నిర్వర్తనలో పాల్గొనకపోతే, జిహాద్ మాదిరిగానే ఆ విధి క్రమంగా పూర్తి సముదాయం పైన విధిత మవుతూ పోతుంది.

7. సాధారణతః పండితులందరూ **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**ని ఫర్జ్ కిఫాయగా పేర్కొన్నా కొన్ని సందర్భాలలో అది ఫర్జ్ అయిన్‌గా కూడా మారిపోతుంది. అటువంటి కొన్ని సందర్భాలను దిగువన పేర్కొంటున్నాము :

1. ఏ వ్యక్తినయితే ఇస్లామీయ రాజ్యం ఈ కార్యం కొరకు నియోగిస్తుందో అతనికి అది ఫర్జ్ అయిన్ అవుతుంది. నిజాముద్దీన్ నీషాపూరి ఇలా అంటున్నారు.

**إن نصب لذلك رجل تعين عليه بحكم الولاية، وهو الْمُحْتَسِب**

**ఒకవేళ ఎవరినయినా అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కార్యం కొరకు నియమించి నట్లయితే రాజ్యాదేశం మూలంగా అది అతనికి తప్పనిసరి అవుతుంది. ఇటు వంటి ఉద్యోగిని 'ముహ్తసిబ్' అని అంటారు.**

*(గరాయిబుల్ కుర్‌ఆన్ వ రగాయిబుల్ ఫుర్కాన్ అలా హామిష్ ఇబ్ను జరీర్: 4/ 30)*

2. ఎక్కడయినా మారూఫ్‌ని రూపుమాపడం జరుగుతున్నా లేదా మున్కర్‌కు పాల్పడటం జరుగుతున్నా, దాని ఎరుక కేవలం ఒక్క వ్యక్తికే ఉన్నట్లయితే అతనికి **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** ఫర్జ్ అయిన్ అయిపోతుంది. ముల్లా అలీ కారీ ఇలా నుడివారు :

**إن الأمر بالمعروف والنهي عن المنكر فرض كفاية إن علم بـه أكثر من واحـد وإلا فهـو فرض عين على من رآه**

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ నిస్సందేహంగా ఫర్జ్ కిఫాయగానే పరిగణించ బడుతుంది, అయితే అది తెలిసినవారు ఒకరు కన్నా మించినవారయి ఉండాలి. అలా కాకపోతే అది ఫర్జ్ అయిన్ అవుతుంది– ఆ వ్యవహారం గురించి ఎరుక ఉన్న వ్యక్తికి.**

*(అల్ ముబీన్ అల్ ముయీన్ లిఫహ్మిల్ అర్బయీన్ : పు. 189)*

3. **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విషయంలో సాధారణంగా చర్చ అవసరమయినప్పుడు, ఏ వ్యక్తిలో ఈ సామర్థ్యం ఉంటుందో అతనికి అది ఫర్జ్ అయిన్ అవుతుంది. ఇబ్నుల్ అరబీ మాలికీ ఇలా సెలవిచ్చారు :

**الأمر بالمعروف و النهى عن**

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ అన్నది ఫర్జ్ కిఫాయ. .... అప్పుడప్పుడు అది**

المنكر فرض كفاية ... وقد يكون فرض عين إذا عرف المرء من نفسه صلاحية النظر والاستقلال بالجدال أو عرف ذلك منه

ఫర్జ్ అయిన్‌గా మారిపోతుంది – మనిషి తనలో చింతన, యోచనల శక్తిసామర్థ్యం ఉన్నట్లు గుర్తించినా లేదా తాను చర్చ జరపగలనని, వాదించగలనని భావించినా లేదా అతనిలో ఆ సామర్థ్యం ఉన్నట్లు ఇతరులు గుర్తించినా అతనికి అది విధితమయిపోతుంది.

*(అహ్కాముల్ కుర్‌ఆన్ : 1/ 292)*

4. ఎవరిలోనయినా అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌ని నిర్వర్తించే శక్తి ఉన్నట్లయితే ఇంకా మరెవరూ దానిని నిర్వర్తించేవారు లేకపోతే అతనికి అది ఫర్జ్ అయిన్ అవుతుంది. ఇమామ్ ఇబ్ను తైమియ్య ప్రకారం,

و هـو فرض على الكفـايـة، ويصير فرض عين على القـادر الذى لم يقم به غيره

వాస్తవానికి అది ఫర్జ్ కిఫాయ, అయితే ఒక వ్యక్తి దాని శక్తిసామర్థ్యాలుండి, మరెవరూ దాన్ని నిర్వహించగలవారు లేని పరిస్థితుల్లో అతనికి అది ఫర్జ్ అయిన్‌గా మారిపోతుంది.

*(అల్ హస్బతు ఫిల్ ఇస్లామ్: 34)*

ఇదే విషయాన్ని ఇమామ్ గజాలీ ఈ పదాలలో నుడివారు :

إن الأمر بالمعـروف و النهى عـن المنكر واجب و ان فرضه لاَ يسقط مع القدرة الآ بقيام قائم به

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ వాజిబ్ (విధి) అయినది, శక్తి ఉన్న పక్షంలో ఆ విధి రద్దు కాజాలదు – మరొకరెవరయినా దాన్ని నిర్వర్తిస్తూ ఉంటే తప్ప.

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 339)*

ఈ వివరణల వల్ల తెలిసేదేమిటంటే అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌ని ఫర్జ్ కిఫాయగా అంగీకరించడం చేత నిస్సందేహంగా ఒక ఫలితం ఏర్పడు తుంది, కొందరు ఈ కార్యంలో నిమగ్నులవుతారు. మరికొందరు నిమగ్నులవరు. కాని ఒకటి మాత్రం తప్పనిసరిగా జరగదు, పరిస్థితులు ఈ కార్యాన్ని ఎంతగా కోరినా దాన్ని అసలే పట్టించుకోకుండా ఉండటం మటుకు జరగదు. ఏ వ్యవహారంలో ఎప్పుడు అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ అవసరం ఏర్పడినా అది తప్పనిసరిగా నెరవేరి తీరుతుంది. ఇందులో ఏమరుపాటుకు అలసత్వానికి ఏమాత్రం అనుమతి లభించదు.



# 5. అర్థం, వివరణ

## అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్- నైతిక పరిభాష కాదు

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** అన్నది విప్లవాత్మక కార్యానికి చిరు నామా. ఈ కార్యాన్ని పరమ ప్రభువు అల్లాహ్ ముస్లిమ్ సముదాయం ద్వారా చేయించ దలిచాడు. అందువల్ల **మారూఫ్** అన్నా **మున్కర్** అన్నా అసలేమిటో తెలుసు కోవడం అవసరం. మారూఫ్‌ని ఆదేశించడం అంటే, మున్కర్‌ని వారించడం అంటే దేన్నంటారో అర్థం చేసుకోవడం తప్పనిసరి. ఇది తెలుసుకోకుండా మనం దాన్ని ఎన్నటికీ సరిగ్గా నిర్వర్తించలేము. సాధారణ వ్యవహారంలో 'మారూఫ్' అన్న పదం నైతిక సుగుణాలను పేర్కొనేందుకు వాడతారు. అవి సుగుణాలని ప్రతి ఒక్కరూ అంగీకరిస్తారు. అదేవిధంగా మున్కర్ అన్న పదం నైతిక దుర్గుణాలను తెలిపేందుకు ప్రయోగిస్తారు. అవి దుర్గుణాలని ప్రతి సామాన్యబుద్ధి (Common sense) ఒప్పుకుంటుంది. అందువల్ల **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** అంటే అర్థం, మంచి పనులను ఆదేశించడం, చెడులను ఖండించడం అని గ్రహిస్తారు సామాన్యంగా. కాని నిజం ఏమిటంటే కుర్‌ఆన్ తెలిపిన భావం కాదిది. ఇది మన ప్రయోగం, ఇంకా నిజం చెప్పాలంటే మన సంకుచిత బుద్ధి ఉత్పన్నం చేసిన భావం ఇది. కుర్‌ఆన్ దృష్టిలో మారూఫ్, మున్కర్‌ల పరిధి కేవలం నైతికత వరకు పరిమితం కాదు. ఇంకా అది, 'అమ్ర్' (ఆదేశం) 'నహీ' (వారించడం) అనే పదాలు కేవలం ఉపదేశం, ఉద్బోధల కొరకు ప్రయోగించనూ లేదు. కుర్‌ఆన్ పరిభాషలో **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** అన్న దాని భావం చాలా విస్తృతమయింది. అందులో ధర్మాన్ని దాని నిజ స్థితిలో కాపాడటం, దాన్ని సుస్థాపితం చెయ్యటం, దాన్ని అన్నింటిపైన ఆధిక్యత గలదిగా చెయ్యడం ఇత్యాది సకల ప్రయత్నాలూ చేరి ఉన్నాయి.

ఏ వ్యక్తి ఆంతర్యంలో 'మారూఫ్ వ మున్కర్' విషయంలో పరిమిత భావన ఉంటుందో అతను నైతికతా ఉపదేశాలు చేసి సంతృప్తి చెందుతాడు, **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** బాధ్యత తీరిపోయిందని. ముస్లిమ్ సముదాయం

తన విధి నిర్వహణ పట్ల కర్తవ్యాన్ని ముగించుకుంది అని భావిస్తాడు. ధర్మ సంస్థాపనా భారం మోసే చింత, ఆలోచన అతనికి అసలే కలగదు, అది తన బాధ్యతగా కూడా అతను పరిగణించడు. అంతేకాదు, అసలు ధర్మ సంస్థాపనం అన్నది అతని దృష్టిలో ముస్లిమ్ సముదాయం కార్య పరిధులకు సుదూరమయిన విషయమూ కావచ్చు. అల్లాహ్ ధర్మ సంస్థాపనాదేశం ఇచ్చాడని అతనికి చెబితే, నైతిక బోధనల ప్రచారంతో మన బాధ్యత తీరిపోతుందని అంటాడు. దీని భావం ఏమిటీ, అతను కేవలం **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** పరిభాషను అర్థం చేసుకోకపో వడమే కాదు, ఇంకా దాని తప్పుడు అర్థాన్ని పలికాడన్నది కూడా కాదు, వాస్తవానికి దీన్ లేదా ధర్మం అన్న దాని నిజ భావన కూడా అతని ఆంతర్యంలో చోటు చేసుకోలేదని భావం. ఇంకా ముస్లిమ్ సముదాయాన్ని ఏ కార్యసిద్ధికై దైవం పక్షాన నియోగించడం జరిగిందో, అతను ఆ కార్యం ఎటువంటిదో కూడా ఎరుగడు.

## అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ - నిజ భావం

**'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** అన్నది పూర్తిగా శుద్ధమయిన కుర్ఆన్ పారిభాషిక పదం. దాన్ని కొన్ని అంశాల ప్రాతిపదికగా పరిశీలించడం అవసరం. అప్పుడే దాని నిజ భావం విశదమవుతుంది.

**మొదటి అంశం:** దివ్య కుర్ఆన్, **'అమ్ర్ బిల్ మారూఫ్ నహీ అనిల్ మున్కర్'** పారిభాషిక పదాన్ని దైవప్రవక్తల కార్యంగా ప్రయోగించింది. ఇది నిజం కూడాను. ప్రవక్తలు కేవలం నైతిక బోధనలు చేయడానికి ప్రభవించరు. నిజానికి నైతిక బోధనలు వారి విస్తృత కార్యంలో కేవలం ఒక భాగం మాత్రమే. వారు మానవులకు ఒకే దేవుని ఆరాధన, ఆయన దాస్యం చేసే సందేశం అందజేస్తారు. దాని భావం, మానవుడు కేవలం అల్లాహ్ సమక్షంలోనే తలవంచాలి, జీవితపు ప్రతి వ్యవహారంలోనూ ఆయన ఆదేశ పాలనే చేయాలని పిలుపునిస్తారు. వారు కోరేది, జీవితపు ఏదో ఒక కోణంలో సంస్కరణ కాదు, వారు సకల కోణాలలో సంస్కరణను అభిలషిస్తారు. వారి కృషి అంతటికీ మూలం మానవుడు సంపూర్ణంగా అల్లాహ్ దాసుడయిపోవాలన్నది. తన విశ్వాసాలలో, సిద్ధాంతాలలో, దాస్య మర్యాదల్లో, నైతికత, వ్యవహారాలలో, సభ్యతా సంస్కృతుల్లో, సామాజిక విషయాల్లో, ప్రభుత, రాజకీయ వ్యవహారాల్లో- ఒక్కమాటలో చెప్పాలంటే జీవితపు ప్రతి ఆచరణ దేవుని ఆజ్ఞలకు లోబడి ఉండాలి అన్నది.

వారి (ప్రవక్తల) ఈ కృషినే **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'**గా పేర్కొనడం జరిగింది. దీన్నిబట్టి అతి స్పష్టంగా తెలిసేదేమిటంటే, మారూఫ్ అంటే

అందులో, ప్రవక్తలు అవలంబించాలని ఆదేశించే సకల విషయాలూ ఉన్నాయన్న మాట. అలాగే వారు వారించే సమస్త వ్యవహారాలు 'మున్కర్'లో చేరి ఉన్నాయన్న మాట. ఇంకా వారు ఆదేశించేదయినా, వారించేదయినా (అమ్ర్ వ నహీ) వాటి సంబంధం పూర్తి జీవితంతో ఉంటుంది, జీవితపు ఏదో ఒక కోణంతో కాదు అని కూడా దీన్నిబట్టి ద్యోతకమవుతుంది.

**రెండవ అంశం :** ప్రవక్తల జీవితాశయం ఏదో అదే ముస్లిం సముదాయం ఉనికికి పరమార్థం. అందువల్ల ఈ సముదాయం కూడా ప్రపంచానికి మారూఫ్‌ను ఆదేశించే మున్కర్ నుంచి నిరోధించే బాధ్యత కలిగివుంది. ఈ కర్తవ్యం కారణంగానే దాన్ని 'ఖైర ఉమ్మత్' (శ్రేష్ఠ సముదాయం)గా పేర్కొనడం జరిగింది. ఒకవేళ **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**కు భావం కేవలం నైతిక బోధనలు, ఉపదేశాలే అయినట్లయితే ప్రపంచంలో విభిన్న వర్గాలు, సంఘాలు నిత్యం ఈ కర్తవ్యం నెరవేరుస్తూనే ఉంటాయి. ప్రస్తుత కాలాన్నే తీసుకున్నా ఇందులో అనైతికత దాని చివరి అంచులకు చేరుకుంది, అనేక నైతిక మూల్యాలు మారిపోయాయి, అయినప్పటికీ ప్రతి చోటా నైతికతా పాఠాలు, ఉపదేశాలు కొనసాగుతూనే ఉన్నాయి, నైతిక విషయాల మీద వ్యాసాలు వస్తూనే ఉన్నాయి. అనేక సంస్థలు, సంఘాలు నీతి ప్రచారానికి తమ శక్తిని వినియోగిస్తూనే ఉన్నాయి. ముస్లిమ్ సముదాయం కూడా ఇదే కృషిలో నిమగ్నమయినట్లయితే అది నైతిక సంస్కరణ చేసే వర్గాలలో ఒక వర్గంగా మారిపోతుంది. కేవలం ఈ ఒక్క ఆచరణ వల్ల అది ప్రపంచ సముదాయాల్లో 'ఖైర ఉమ్మత్' (శ్రేష్ఠ సముదాయం) అవడానికి కారణమేదీ లేదు. యదార్థం ఏమిటంటే అది కేవలం నైతిక సంస్కర్తగా మారడం మాత్రమే ఉద్దేశం కాదు, నిజానికి అది జీవితపు అన్నిరంగాలలో సంస్కరణా బాధ్యతను నెరవేర్చవలసి వుంది. అప్పుడే దాని పని ప్రవక్తల కార్యంతో సమాన కార్యంగా, ప్రవక్తల కార్యంగా పరిగణించబడుతుంది, దాని స్థానం ప్రత్యేక వర్గ స్థానంగా రూపొందుతుంది. పరమ ప్రభువు అల్లాహ్ దానికి 'శ్రేష్ఠ సమాజం' స్థానాన్ని ప్రసాదించింది అది ధర్మంలో ఏదో ఒక భాగాన్ని ప్రచారం చెయ్యాలని కాదు. ఈ స్థానం దానికి ప్రాప్తమయింది, ప్రపంచంలో దైవ ధర్మాన్ని, పరిపూర్ణ ధర్మాన్ని సుస్థాపితం చెయ్యాలని, దాన్ని సమస్త జీవన రంగాలపైన ఆధిక్యత గలదిగా చెయ్యాలని. అందుకే అది ఉనికిలోకి వచ్చింది. అల్లామా అబూ హయ్యాన్ అందులూసీ ఇలా సెలవిచ్చారు, ఎవరికయితే కుర్ఆన్ ఖైర ఉమ్మత్ అన్న బిరుదునిచ్చిందో వారికి ఆ బిరుదునివ్వడానికి కారణం:

وهى سبقهم إلى الإيمان برسول الله وبدارهم إلى نصرته، ونقلهم عنه علم الشريعـة، وافتتاحهم البـلاد

వారు దైవ సందేశహరులు (సల్లల్లాహు అలైహి వ సల్లమ్)ని విశ్వసించడంలో ముమ్మందు ఉన్నారు, ఆయన (స)కు తోడ్పడటానికి ప్రప్రథమంగా ముందడుగు వేశారు, ఆయన్నుండి షరీఅత్ జ్ఞానం గ్రహించి ఇతరులకు అంద జేశారు. దైవ వచనాన్ని సమున్నత పరచడానికి దేశాలను జయించారు.

*(అల్ బహ్రుల్ ముహీత్ : 3/ 30)*

**మూడవ అంశం :** ఆలి ఇమ్రాన్ సూరాలో దివ్య కుర్ఆన్, **'శుభం వైపునకు పిలుపు'**నిచ్చేందుకు, **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'**ని ఆచరించేందుకు ముస్లిమ్ సముదాయాన్ని ఒకేసారి ఆదేశించింది. ఇవి రెండు వేర్వేరు ఆదేశాలు కావు. రెండవ ఆదేశం మొదటి ఆదేశానికి విపులీకరణ మాత్రమే. **'శుభం వైపునకు పిలుపు'** అన్న దాని భావం, ప్రపంచానికి పరిపూర్ణ దైవధర్మం (దీన్), సంపూర్ణ దైవ శాసనాంగం (షరీఅత్) వైపునకు పిలుపునివ్వడం. వ్యాఖ్యాతలు ఇదే మాటను సకారాత్మకంగాను, నకారాత్మకంగాను, ఇరుకోణాలలో, **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** అన్న పారిభాషిక పదబంధంలో వివరించడం జరిగిందని అంటారు. మేము ఇక్కడ ఇమామ్ రాజీ, నిజాముద్దీన్ నీషాపూరీ వ్రాసిన పదాలను ఉటంకిస్తున్నాము. ఇమామ్ రాజీ ఇలా అంటున్నారు :

الـدعوة إلى الخـير جنس تحتـه نوعان: احدهما الترغيب في فعل ما ينبغي وهو الأمر بالمعروف، والثاني الترغيب في ترك ما لاَ ينبغي وهو النهي عن المنكر

**'దావత్ ఇలల్ ఖైర్ (శుభం వైపునకు పిలుపు)' ఒక విస్తృత ఆదేశం. దీని విధానాలు రెండు. ఒకటి, చెయ్యవలసిన కార్యాల కొరకు ఇతరుల్ని పురికొలపడం. దీన్ని 'అమ్ర్ బిల్ మారూఫ్' అని పేర్కొంటాము. రెండు, చేయదగని పనులను విసర్జించేందుకు పురికొలపడం. దీన్ని 'నహీ అనిల్ మున్కర్' అని అంటాము.**

*(అల్ తఫ్సీర్ అల్ కబీర్, నాల్గవ సంపుటి, 8వ భాగం, పు. 146)*

నిజాముద్దీన్ కుమ్మీ నీషాపూరీ ఇలా వ్రాస్తున్నారు:

**ولاَ جرم اتبعه النوعين زيادة فى البيان**

**ఖచ్చితమయిన విషయమేమిటంటే పరమ ప్రభువు, 'శుభం వైపునకు పిలుపు' అన్న తరువాత దాని రెండు విధానాల (అమ్ర్ బిల్ మారూఫ్ నహీ అనిల్ మున్కర్) ప్రస్తావన విశదీకరణకు చేశాడు.**

*(గరాయిబుల్ కుర్ఆన్ వ రగాయిబుల్ ఫుర్కాన్, అలా హామిష్, ఇబ్ను జరీర్ : 4/30)*

దీన్నిబట్టి విశదమయ్యేదేమిటంటే దావత్ ఇలల్ ఖైర్, అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్- ఈ రెండు ఆదేశాల ఉద్దేశ్యం ప్రపంచాన్ని దైవధర్మం వైపునకు పిలువడం, దాన్ని పరిపూర్ణంగా ఆధిక్యత గలదిగా, సమున్నతమయిందిగా చేసే కృషి సలపడం అన్నమాట.

## పండితుల విశదీకరణలు

మారూఫ్ వ మున్కర్ పరిధి నైతికత వరకే పరిమితం అన్న వాదన నిరాధారమయినది. దీనికి శాస్త్రీయమయిన ప్రాతిపదిక ఏదీ లేదు. పదమూడు శతాబ్దులలో ఏ పండితుడూ ఇవి కేవలం నైతిక పరిభాషకు చెందిన విషయాలని వాదించలేదు. యదార్థం ఏమిటంటే మారూఫ్ వ మున్కర్ అన్న పదాలు చాలా విస్తృత అర్థమున్న పదాలు. వీటిలో విశ్వాసాలు, ఆరాధనలు, నైతికత, వ్యవహారాలు సర్వమూ చేరి ఉన్నాయి. వాటిని ఏదో ఒక జీవన విభాగంతో ముడిపెట్టడం వాటి విస్తృతిని అంత మొందించడమే అవుతుంది. ఇక్కడ కొందరు పండిత మాన్యుల స్పష్టీకరణలు ముందుంచుతున్నాము. దీనివల్ల, మారూఫ్ అంటే నైతిక సుగుణాలని, మున్కర్ అంటే నైతిక దుర్గుణాలని అనే అభిప్రాయాలు సమూలంగా తుడుచుకుపోతాయి.

కాజీ షౌకానీ :

**أخرج ابن ابى حاتم عن أبى العالية قال: كل آية ذكرها الله فى القرآن فى الأمر بالمعروف فهو الاسلام والنهى**

**ఇబ్ను అబీ హాతిమ్ ఉల్లేఖనం ప్రకారం, అబుల్ ఆలియ ఇలా అన్నారు, కుర్ఆన్‌లో 'అమ్ర్ బిల్ మారూఫ్' ప్రస్తావన ఉన్న ప్రతి ఆయత్ లోని మారూఫ్ అంటే ఇస్లామ్ అని, 'నహీ అనిల్ మున్కర్' అన్న దాని భావం విగ్రహా**

عن المنكر فهو عبادة الاوثان انتهى، وهو تخصيص بغير مخصص فليس فى لغة العرب ولاَ فى عرف الشرع مايدل على ذلك

రాధనను నిరోధించడం' అని అర్థం. కాని 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'ని ఇలా ప్రత్యేకించడానికి ఎటువంటి ఆధారం లేదు. అరబీ భాషలోను షరీఅత్ ప్రయోగం లోను ఇలా ప్రత్యేకించడానికి ఆధారభూత మయిన విషయం ఏదీ లేదు. (అందువల్ల ఇది సర్వసాధారణమయినది, ప్రత్యేకం కాదు.)

*(ఫత్హుల్ కదీర్ : 1/ 466)*

అబూ హయ్యాన్ అందులుసీ :

فسر بعضهم المعروف بالتوحيد والمنكر بالكفر ولاشك أن التوحيد رأس المعروف و الكفر رأس المنكر، ولكن الظاهر العموم في كل معروف مأمور بــه في الشرع، وفي كل منهي نهى عنه في الشرع

కొందరు మారూఫ్ అంటే తౌహీద్ అనీ మున్కర్ అంటే కుఫ్ర్ అనీ వ్యాఖ్యానించారు. తౌహీద్ అన్నింటికన్నా పెద్ద మారూఫ్ అన్న విషయంలో సందేహం లేదు, అలాగే కుఫ్ర్ అన్నింటికన్నా గొప్ప మున్కర్ అన్న విషయంలోనూ సందేహం లేదు. కాని స్పష్టమయిన విషయం ఏమిటంటే ఈ పదాలలో సర్వ సాధారణత, విస్తృతి ఉంది. మారూఫ్ అంటే షరీఅత్ ఆదేశించిన ప్రతి విషయం ఉద్దేశించబడింది. అలాగే మున్కర్‌లో షరీఅత్ వారించిన సమస్త విషయాలూ ఉద్దేశించబడ్డాయి.

*(అల్ బహ్రుల్ ముహీత్: 3/ 16)*

ఇమామ్ రాజీ :

رأس المعروف الإيمان بالله، و رأس المنكر الكفر بالله

మారూఫ్‌కు మూలం అల్లాహ్ పట్ల విశ్వాసం, మున్కర్‌కు మూలం అల్లాహ్‌ను తిరస్కరించడం.

*(అత్ తఫ్సీరుల్ కబీర్, 8వ సంపుటి, 16వ భాగం, పు.162)*

అబూబక్ర్ జస్సాస్ :

المعروف هو أمر الله ... والمنكر هو مانهى الله عنه

**మారూఫ్ అని అంటే అల్లాహ్ ఆదేశం..... మరి అల్లాహ్ దేన్ని వారించాడో అది మున్కర్.**

*(అహ్కాముల్ కుర్ఆన్ : 22/ 44)*

హదాదీ :

المعروف هو السنة، والمنكر هو البدعة

**మారూఫ్ అంటే సున్నత్, మున్కర్ అంటే బిద్అత్.** *(రూహుల్ బయాన్ : 1/ 959)*

అల్లామా సయ్యిద్ మహ్మూద్ ఆలూసీ :

والمتبادر من المعروف الطاعات و من المنكر المعاصى الّتى أنكرها الشرع

**స్పష్టంగా గమనిస్తే మారూఫ్ అన్న దానిలో సకల విధేయతలు చేరి ఉన్నాయి, మరి మున్కర్ అంటే షరీఅత్ వారించిన సమస్త పాప కార్యాలు ఉద్దేశించబడ్డాయి.**

*(రూహుల్ మఆనీ : సం.2; భాగం 4; పు. 244)*

అల్లామా ఇబ్ను హజర్ హైతమీ :

المراد بالأمر بالمروف والنهى عن المنكر الأمر بواجبات الشرع والنهى عن محرماته

**'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్' అంటే ఉద్దేశ్యం, షరీఅత్ విధిగా నిర్ణయించిన వాటిని ఆదేశించడం, మరి వేటినయితే షరీఅత్ నిషేధించిందో వాటిని వారించడం లేదా నిరోధించడం.**

*(అజ్ జవాజిర్ అన్ ఇక్తిరాఫ్ అల్ కబాయిర్ : 2/ 155)*

ఇబ్ను మాలిక్ :

(المنكر) هو ماليس فيه رضا الله من قول أو فعل والمعروف ضده

**ఏ మాటలో లేదా ఏ చేతలో అల్లాహ్ అభీష్టం చేరి లేదో అది మున్కర్, అయితే మారూఫ్ దానికి వ్యతిరేకమయినది.**

*(మబారిక్ అల్ అజ్హార్, షర్హ్ మషారిక్అల్ అన్వార్ : 1/ 48)*

ముల్లా అలీ కారీ :

المنكر ما أنكره الشرع، وكرهه، و لم يرض به

**మున్కర్ అన్నది షరీఅత్ వారించినదీ, దానికి అయిష్టమయినదీ, దేనిపట్ల అది సంతసించదో అటువంటి ప్రతిదీ.**

*(అల్ ముబీనుల్ ముయీన్ లి ఫహ్ముల్ అర్బయీన్: పు. 188)*

అల్లామా మనావీ :

(من رأى منكم منكراً) شيئاً قبحه الشرع فعلاً أو قولاً (فليغيره)

**మీలో ఎవరు 'మున్కర్'ను చూస్తాడో- అంటే షరీఅత్‌కు ఇష్టం కానిదాన్ని, అది ఆచరణ అయినా, మాట అయినా - దాన్ని మార్చి వెయ్యాలి.**

*(అత్‌తయ్‌సీర్, బి షరహ్ అల్ జామె అస్సగీర్ : 1/ 418)*

ఇమామ్ ఇబ్ను తైమియ్య :

يدخل في المعروف كل واجب وفى المنكر كل قبيح و القبائح هى السيئات وهى المَحظورات كالشرك و الكذب والظلم و الفواحش

**మారూఫ్ అన్న దానిలో ప్రతి 'విధి' అయినది, 'మున్కర్'లో ప్రతి 'అసహ్యం' అయినదీ చేరి ఉన్నాయి. అసహ్యం అయినదంటే చెడులన్న మాట. అంటే షరీఅత్ వారించిన విషయా లన్నీ. ఉదాహరణకు, బహుదైవారాధన, అబద్ధం, దుర్మార్గం, సమస్త అశ్లీల కార్యాలు.**

*(అల్ అకీదతుల్ అస్ఫహానియ : పు. 121)*

హజ్రత్ షాహ్ అబ్దుల్ హక్ ముహద్దిస్ దహలవీ ప్రఖ్యాత హదీసు సంకలనం 'మిష్కాతుల్ మసాబీహ్'కి ఫార్సీలోనూ అరబీలోనూ టీకా వ్రాశారు. తన ఫార్సీ టీకాలో మారూఫ్ వ మున్కర్‌కు అర్థం ఈ పదాలలో వివరించారు :

'మారూఫ్' అన్నది మఆరిఫత్ నుండి గ్రహించబడింది. దీని అర్థం 'గుర్తించడం'. అంటే షరీఅత్‌లో పరిచయమున్న, గుర్తింపు ఉన్న, షరీఅత్‌లో దాని నిరూపణ ఉన్న విషయం అన్నమాట. దీనికి వ్యతిరేకంగా 'మున్కర్' అన్నది. అంటే, గుర్తింపు

లేనిది. దాని గురించి షరీఅత్‌లో ఆచరించాలని ఆదేశం లేనిది అన్నమాట.

(షైఖ్ అబ్దుల్ హక్ ముహద్దిస్ దహలవీ, అష్‌అతుల్ లమ్‌ఆత్ : 4/173, అధ్యాయం : అమ్ర్ బిల్ మారూఫ్)

మరికొన్ని ఉల్లేఖనాల టీకాలోనూ హజ్రత్ ముహద్దిస్ దహలవీ ఈ భావాన్ని స్పష్టపరిచారు. చాలా ప్రఖ్యాత హదీసును ఈవిధంగా అనువదించారు :

**'من رای منکم منکرا فلیغیّره بیده'**

**"మీలో ఎవరయినా షరీఅత్‌కు విరుద్ధమయిన పని ఏదయినా చూసినట్లయితే దాన్ని మార్చి వేయాలి, జనుల్ని దాన్నుండి వారించాలి, (అంటే, సాధ్యమయితే శక్తితో దాన్ని ఆపి వెయ్యాలి)" *(ముస్లిమ్).***

*(అష్‌అతుల్ లమ్‌ఆత్: 4/174)*

ముస్నద్ అహ్మద్, తిర్మిజీలలో ఒక ఉల్లేఖనముంది : **کل معروف صدقة**

ముహద్దిస్ దహలవీ దానికి అనువాదం, వివరణ ఇలా చేశారు :

షరీఅత్‌లో పరిచయమయి ఉన్న ప్రతి సత్కార్యాన్ని చెయ్యడం సదకాగా పరిగణించబడుతుంది.

*(అష్‌అతుల్ లమ్‌ఆత్ : 2/ 55; కితాబుజ్జకాత్, బాబు ఫజ్‌లుస్సదకా)*

సహీహ్ ముస్లిమ్‌లో హజ్రత్ ఆయిషా (ర) ఉల్లేఖనం ఒకటుంది. అందులో దైవ సందేశహరులు (స) ఇలా సెలవిచ్చారు: 'ఆదమ్ సంతానంలోని ప్రతి వ్యక్తిని అల్లాహ్ పుట్టించిన తీరు రీత్యా అతని శరీరంలో మూడు వందల అరవయి కీళ్ళున్నాయి. మనిషి తక్బీర్ చెప్పడం, తహ్మీద్ పలకడం, తస్బీహ్ చెయ్యడం, ఇస్తిగ్‌ఫార్ చెయ్యడం లేదా దారిలో రాయి ఉన్నా ముల్లు ఉన్నా మరేమయినా అడ్డంకి ఉన్నా తొలగించడం, మారూఫ్‌ని ఆదేశించడం, మున్కర్‌ని వారించడం (ఇవన్నీ దానికి కృతజ్ఞతా విధానాలు).

ఈ చివరి వాక్యాన్ని ఆయన ఈ పదాలలో అనువాదం, విశదీకరణ చేశారు: 'లేదా అతను మారూఫ్‌ని ఆదేశించాడు, అంటే ఏదయినా షరీఅత్‌లో చేయ దగిన కార్యాన్ని ఆదేశించాడు, అది షరీఅత్‌లో గుర్తించబడింది, పరిచయం పొందినదీ అన్నమాట. అలాగే మున్కర్‌ను వారించాడు, అంటే షరీఅత్ గుర్తింపు పొందనటువంటి పనిని నిరోధించాడన్నమాట.' *(పైన పేర్కొన్న పుస్తకాలు- పుట. 52)*

ఇదే సందర్భంలో ఆయన ఇలా అంటున్నారు : "పైన ఏ మాటలు, ఏ

చేతలనయితే ప్రస్తావించడం జరిగిందో అవన్నీ ఒకవైపున ఉంటే, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** మరోవైపున ఉంది. ఈ రెండు ఆచరణల (మంచిని ఆదేశించడం, చెడును వారించడం) ప్రాముఖ్యత వాటన్నింటికన్నా అధికమయినది.

వాస్తవమేమిటంటే **'మారూఫ్'** అన్న పదం కేవలం ఉన్నత నైతిక ప్రమాణాలకే ప్రయోగించడం జరగదు, ఉన్నత నైతికత అందులో ఒక భాగం మాత్రమే. అదేవిధంగా **'మున్కర్'**లో దుష్ట నైతిక గుణాలు తప్పక చేరి ఉన్నాయి. కాని దాని అర్థం కేవలం దుర్గుణాలు అని మాత్రమే కాదు. ఆ విధంగా ధర్మం యావత్తు 'మారూఫ్' అనబడుతుంది, మరి ఏ జీవన సిద్ధాంతం, ఏ జీవిత విధానం దానికి వ్యతిరేకమయినదో అది 'మున్కర్' అనబడుతుంది. దీన్నే ఈ విధంగా కూడా చెప్పవచ్చు. అల్లాహ్ ఉనికి, ఆయన గుణగణాలు, ప్రవక్త దైవదౌత్యం, ఆయన సంప్రదాయం, షరీఅత్, సమస్త ఇస్లామీయ శాసనాంగం అంతా మారూఫ్; మరేమో అల్లాహ్, ఆయన సందేశహరుల తిరస్కారానికి, ధర్మం, ధర్మశాస్త్రం, షరీఅత్ వీటి విరోధానికి మారు పేరు మున్కర్. ఈ విషయం చాలా సున్నితమయింది, మరి ఎంతో మహత్తు గలది, అందువల్ల మేము దాన్ని మరో కోణంలో ఇంకా కాస్త చర్చించదలిచాము.

## అల్లాహ్ శాసనం 'మారూఫ్', దానికి విరుద్ధమయిన చట్టం 'మున్కర్'

మనిషి సామాజిక జీవితానికి శాసనం, చట్టం కావాలి, అది అతని అవసరం. అయితే మనిషికి చట్టం అనుగ్రహించే అధికారం కేవలం పరమ ప్రభువు అల్లాహ్‌కు మాత్రమే ఉంది. మానవుడయితే వ్యక్తిగత జీవితంలోనూ ఒక చట్టం అంటూ లేనిదే మనజాలడు, అలాగే సామూహిక జీవితంలోనూ చట్టం అతని ఆవశ్యకతే. కాని స్వయంగా తానే చట్టం ఏర్పరచుకుని దాన్ని అమలుపరచడం అతనికి అధర్మమయినది. పరమ ప్రభువు ప్రసాదించిన చట్టం మారూఫ్, మరే చట్టం ఈ చట్టానికి విరుద్ధమయినదో అది మున్కర్.

మనిషి అల్లాహ్‌ను చట్ట నిర్మాతగా అంగీకరిస్తే అతని జీవితం 'మారూఫ్'కు లోబడిన జీవితమవుతుంది, అది సరయిన దిశలో సాగుతుంది. కాని మనిషి అల్లాహ్‌ను ఈ స్థానంలో స్వీకరించడానికి నిరాకరిస్తే ఇక రెండే మార్గాలు అతనికి మిగులుతాయి. ఒకటి చట్టం రూపొందించే, నిర్ణయాలు గైకొనే అధికారం మనోకాంక్షలకు, బుద్ధిజ్ఞానాలకు అప్పగించి వాటి ఆదేశాలను పాలించడం. రెండు, తన వంటి మరో వ్యక్తియో లేదా వర్గమో ఎన్నుకుని వారి దాస్యం స్వీకరించడం. ఈ రెండు మార్గాలూ అతనికి వినాశకరమవుతాయి. **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** అన్న దాన్ని పాటించడమంటే భావమేమిటంటే మానవుణ్ణి ఏకైక దేవుని దాసునిగా చెయ్యడం,

అల్లాహ్ తప్ప ప్రతి ఒక్కరి దాస్యం నుండి విముక్తిని కలిగించడం. అల్లాహ్ శాసనం ఆధిక్యత నొందడానికి, సమున్నతమవడానికి వచ్చింది. ఎవరయితే అల్లాహ్‌ను విశ్వ సిస్తారో, ఆయన పట్ల దృఢ విశ్వాసం కలిగి ఉంటారో వారు దీన్ని సమున్నత పరచ డానికి, దీనికి విరుద్ధమయిన చట్టాలను రూపుమాపడానికి కృషి చెయ్యాలి. ఇది వారి విధి.

దైవ ధర్మాన్ని యథాతథంగా స్వీకరించాలని, అందులో మరో ఆలోచన అయినా ఆచరణ అయినా మిశ్రమం కారాదని అల్లాహ్ కోరుకుంటాడు. ప్రతి జీవన వ్యవహా రంలోనూ దైవ శాసనమే చెలామణి కావాలి, ఆయన ఆదేశాలనే ఎల్లరూ పాటించాలి. శాసన నిర్మాణం అల్లాహ్ అధికారం. మనం స్వయాన ఒక్క చట్టమూ చెయ్యజాలము, ఆయన ప్రసాదించిన చట్టంలో ఎటువంటి ప్రక్షిప్తమూ చెయ్యలేము. అల్లాహ్ ధర్మానికి విముఖులవడం, దానిపట్ల తిరుగుబాటు మాత్రమే 'మున్కర్' కాదు, ఆయన ధర్మంలో మార్పు చెయ్యడం కూడా మున్కర్‌గానే పరిగణించబడుతుంది. అందులో హెచ్చుతగ్గులు చేసి దాన్ని అనుసరించడం కూడా మున్కర్ అవుతుంది. అల్లాహ్ మన నుండి 'మున్కర్' అనుసరణను కోరడంలేదు, 'మారూఫ్' అనుసరణను కోరుతున్నాడు. 'మారూఫ్‌ను అనుసరించడం' అంటే అర్థం, అల్లాహ్ ధర్మం ఏవిధంగా ఉందో దాన్ని యథాతథంగా స్వీకరించడం అన్నమాట, ఇంకా దాన్ని మన ఆంతర్యం లోనూ, బాహ్యంలోనూ ఆధిక్యత పొందేలా చిత్తశుద్ధితో కృషి చెయ్యడం అన్నమాట.

ఇమామ్ ఇబ్ను తైమియ్య (రహ్మ) ఇలా నుడివారు :

**الأمر والنهي من لوازم وجود بني آدم، فمن لم يأمر بالمعروف الذي أمر الله به ورسوله، وينه عن المنكر الـذى نهى الله عنـه ورسولـه، و يؤمـر بالمعروف الذى امر الله بـه و رسولـه و ينه عن المنكر الذى نهى الله عنه و رسولـه والا فلا**

**ఆదేశమివ్వడం, వారించడం అన్నది మానవ జీవితంలో అనివార్యమయిన అంశం. ఇక ఎవరయినా ఓ వ్యక్తి, అల్లాహ్, ఆయన సందేశహరుడు ఆదేశించిన 'మారూఫ్'ని ఆదేశించకపోతే ఇంకా, అల్లాహ్ ఆయన సందేశహరుడు వారించిన 'మున్కర్'ని వారిం చకపోతే; లేదా అల్లాహ్ ఆయన సందేశ హరుడు ఆదేశించిన 'మారూఫ్'ను అతనికి ఆదేశించక, అల్లాహ్ ఆయన సందేశహరుడు వారించిన మున్కర్ పట్ల అతనికి వారించక పోతే దాని తప్పనిసరి అర్థం ఒకటే - అతను**

بـدّ أن يأمر و ينهٰى، و يؤمر و ينهٰى إما بما يضاد ذلک و إما بمايشترک فيه الحق الذى انزله اللّٰه بالباطل الذي لم ينزله الله، وإذا اتخذ ذلک دينا كان ديناً مبتدعاً

**ఏది ఆదేశించినా, లేక దేన్ని వారించినా, ఇంకా అతనికి దేన్ని ఆదేశించినా, మరి అతనికి దేని పట్ల వారించినా అది అల్లాహ్, ఆయన ప్రవక్త బోధనలకు విరుద్ధమయినదయినా అయి ఉంటుంది లేదా అందులో అల్లాహ్ పంపిన సత్యతతోపాటు అల్లాహ్ పంపని మిథ్య కూడా కలసి ఉంటుంది. అతను ఈ విధానాన్ని ధర్మంగా అవలంబిస్తే అది కాల్పనిక ధర్మమవు తుంది (కాని దైవం ప్రసాదించిన ధర్మం కాదు).**

*(అల్ హస్బతు ఫిల్ ఇస్లామ్: పు. 87)*

పండితుల ఈ విశదీకరణల వల్ల తేలేదేమిటంటే, 'మారూఫ్ వ మున్కర్' అన్నవి నైతిక పరిభాష కాదు, ఇవి షరీఅత్ పరిభాషా పదాలు. దేవుని ధర్మం, ఆయన షరీఅత్ మన నుండి కోరే ఆవశ్యకతలకు ఓ సమగ్రమయిన భావాన్వయం అన్నమాట. దైవధర్మం ఏ విశ్వాసాలను, ఏ సిద్ధాంతాలను, ఏ ఆరాధనా సూత్రాలను, ఏ నైతికతను ఏ వ్యవహార సరళిని, ఏ నాగరికత, రాజకీయ విధానాలను మనల్ని ఆదేశిస్తుందో అవన్నీ సర్వం మారూఫాత్ (మారూఫ్‌కు బహువచనం) అన్నమాట. అలాగే ఏ నమ్మకాలను, ఏ సిద్ధాంతాలను, ఏ ఆరాధనా విధానాలను, ఏ నైతిక సూత్రాలను, ఏ నాగరికతా, రాజకీయ చట్టాలను అది వారిస్తుందో అవి మొత్తం మున్కరాత్ (మున్కర్‌కు బహు వచనం) అన్నమాట. వీటిని ఆదేశించడం, వారించడం (అమ్ర్; నహీ) గురించే ముస్లిమ్ సముదాయానికి ఆదేశమయింది.

## 'మారూఫ్' 'మున్కర్' అన్నవి షరీఅత్ నిర్ణయిస్తుంది

ఇక్కడ ఓ అపోహ దూరం కావడం అవసరం. ఈ అపోహ దూరం అవనంత వరకు మారూఫ్, మున్కర్‌ల సరయిన అర్థం విశదమవదు. అదేమిటంటే మారూఫ్ అన్న పదంలో తెలిసి ఉండటం, పరిచయముండటం, ఇష్టమయినది అన్న భావం; ఇంకా మున్కర్ అన్న పదంలో తెలియనిది, ఇష్టం లేనిది అన్న భావం ఇమిడివుంది. అయితే దీని భావం, మనిషికి తెలిసినదీ, పరిచయమయినదీ లేదా ఏదయినా వర్గంలో పరిచయమయినదీ, ఇష్టమయినదీ ప్రతిదీ మారూఫ్ అని కాదు. అలాగే ఒక వ్యక్తి లేదా వర్గం ఎరుగనిదీ, వారికి ఇష్టం కానిదీ అది మున్కర్ అనీ భావం కాదు. ఎందు

కంటే మారూఫ్, మున్కర్ అన్న పదాలు కుర్ఆన్ హదీసులలో ఓ ప్రత్యేక భావం కలిగి ఉన్నాయి. దాని విశ్లేషణ ద్వారా తెలిసే దాన్ని బట్టి విశ్వాసమయినా, ఆచరణ అయినా అల్లాహ్ షరీఅత్‌కు పరిచయమయినదీ, ఇష్టమయినదీ మాత్రమే మారూఫ్‌గా పరిగణించబడుతుంది. మరే విశ్వాసం, ఆచరణ ఆయన షరీఅత్‌కు పరిచయం కానిదో, ఇష్టం లేనిదో అది మున్కర్. మన బుద్ధి ఏదయినా ఆలోచనను కనిపెట్టినా లేదా ఏదయినా విధానం ప్రజల మధ్య ప్రసిద్ధి చెందినా దాన్ని జనం ఇష్టపూర్వకమయిన దృష్టితో చూసినా, అది కుర్ఆన్ హదీసుల రీత్యా కూడా మారూఫ్ అయినప్పుడే 'మారూఫ్'గా పరిగణించబడుతుంది. అదేవిధంగా మన బుద్ధీ వివేకాలు దేన్నయినా గుర్తించకపోవడం, లేదా ఇష్టపడకపోవడం లేదా సామాన్యంగా సంప్రదాయంలో రివాజు పొందకపోవడం, ప్రసిద్ధి చెందకపోవడం, జనం ఇష్టపడకపోవడం దాన్ని మున్కర్‌గా చేసి పెట్టదు, దాన్ని షరీఅత్ కూడా మున్కర్‌గా నిర్ణయిస్తే తప్ప. ఏ నమ్మకమయినా మరే ఆచరణ అయినా షరీఅత్ దాన్ని మారూఫ్ లేదా మున్కర్‌గా నిర్ణయించినప్పుడే అది మారూఫ్ లేదా మున్కర్‌గా నిర్ణయమవుతుంది. తత్సమయపు మేధావులు ఏదయినా ఆచరణను మారూఫ్‌గా నిర్ణయించవచ్చు కాని అది షరీఅత్ దృష్టిలో మున్కర్ కావచ్చు. లేదా ఏదయినా నమ్మకం వారి దృష్టిలో మున్కర్ కావచ్చు కానీ షరీఅత్ దాన్ని మారూఫ్‌గా నిర్ణయించడం సాధ్యమే.

ఇమామ్ రాగిబ్ (రహ్మ) ఇలా అంటున్నారు :

**المعروف اسم لكل فعل يعرف بالعقل اوالشرع حسَنَهُ و المنكر ما ينكربهما**

**మారూఫ్ అన్నది, దాని మంచితనం బుద్ధి ద్వారా గ్రహించగలగాలి, షరీఅత్ దాన్ని మంచి దని నిర్ణయించాలి. మున్కర్ అన్న దాన్ని బుద్ధీ, షరీఅత్‌లు ఇష్టం కానిదిగా నిర్ణయించాలి.**

*(అల్ మఫ్రదాత్ ఫీ గరీబ్ అల్ కుర్ఆన్– మూల పదం, 'ఉర్ఫ్' పుట, 334)*

దీని భావం, మారూఫ్, మున్కర్‌లను గ్రహించడంలో 'బుద్ధి' స్థానం షరీఅత్‌కు సమానమయినదని కాదు, ఎందుకంటే బుద్ధి అన్నది ఈ వ్యవహారంలో స్వతంత్రమయి నది కాదు; అది షరీఅత్‌కు లోబడి ఉంది. దీనితోపాటు మరో విషయం ఏమిటంటే బుద్ధిలో కల్మషం లేకపోతే అది సరయిన స్థితిలో ఉన్నట్లయితే అది అల్లాహ్ అనుగ్ర హించిన షరీఅత్‌తో సంపూర్ణంగా సామరస్యం కలిగి వుంటుంది. కారణం, ఏ షరీఅత్ ఆదేశమయినా బుద్ధిజ్ఞానాలకు విరుద్ధమయినది కాజాలదు. ఈ కారణంగానే

ఇమామ్ రాగిబ్ షరీఅత్‌తో పాటు బుద్ధినీ ప్రస్తావించారు. నిజానికి ఏ సందర్భాలలో బుద్ధి మారూఫ్, మున్కర్‌ల నిర్ణయం చేయలేకపోతుందో అక్కడ షరీఅత్ మాత్రమే నిర్ణాయక స్థానం కలిగి ఉంటుంది. దాని విశదీకరణ ఆయన 'మున్కర్' వివరణలో చేశారు. ఆయన ఇలా స్పష్టపరిచారు:

**المنكر كل فعل تحكم العقول الصحيحة بقبحه او تتوقف فى استقباحه واستحسانه العقول فتحكم بقبحه الشريعة**

**మున్కర్ అన్నది కుశలబుద్ధి చెడుగా నిర్ణయించిన దాన్ని అనవచ్చు; లేదా దేన్నయితే మంచిదనీ లేదా చెడ్డదనీ బుద్ధి నిర్ణయించజాలదో, మరేమో షరీఅత్ దేన్ని చెడుగా నిర్ణయిస్తుందో దాన్ని మున్కర్ అనవచ్చు.**

*(అల్ మఫ్రదాత్ ఫీ గరీబ్ అల్ కుర్‌ఆన్ : మూల పదం 'నకర్')*

ఇబ్ను అబీ జమ్రా ప్రకారం, ఏ ఆచరణ షరీఅత్ సదాచరణ అన్నదో అది మారూఫ్, అది రివాజుకు, సంప్రదాయానికి అనుకూలమయినదయినా ప్రతికూల మయిన దయినా. ఎందుకంటే చట్టం చేసే హక్కు రివాజుకు లేదు, షరీఅత్‌కే ఉంది:

**يطلق اسم المعروف على ما عرف بادلة الشرع من اعمال البرّ، سواء جرت به العادة ام لا**

**మారూఫ్ అన్నదాని వర్తింపు ప్రతి సత్కార్యానికి అవుతుంది, అది షరీఅత్ ఆధారంగా గ్రహించబడి ఉండాలి, సాధారణ రివాజుకు అనుకూలంగా ఉన్నా లేకపోయినా.**

*(ఫత్‌హుల్ బారీ : 10/ 432)*

కొన్ని సందర్భాలలో పండితులు, ముస్లిమ్ సమాజంలో ఏదైనా విషయం ప్రసిద్ధి పొందడం లేదా ప్రసిద్ధి పొందకపోవడాన్ని లేదా ఆ సమాజం ఇష్టాయిష్టాలను ప్రస్తావిస్తారు. అలా ప్రస్తావిస్తున్నప్పుడు, మారూఫ్, మున్కర్ల నిర్ణయంలో షరీఅత్‌తో పాటు ముస్లిమ్ సమాజం స్వీకారాస్వీకారాల జోక్యం కూడా బహుశా ఏమయినా ఉందేమో అనిపిస్తుంది. కాని ఇది సరయినది కాదు. విశ్వాసుల మధ్య పరిచయమయి, వారు సరయినదని భావించే నమ్మకాన్నీ ఆచరణను మారూఫ్ అని అంటాము, అందులో సందేహం లేదు. అలాగే ఏ ఆలోచనల్ని ఏ ఆచరణల్ని వారు ఎరుగరో, దేన్ని వారు ఇష్టపడరో దాన్ని మున్కర్ అని నిర్ణయిస్తాము. అందులోనూ సందేహంలేదు. దీనికి కారణం ఇది వారి బుద్ధి నిర్ణయమన్నది కాదు, లేదా వారి అనుభవం రీత్యా లేదా వారి వంశానుగతంగా, జాతీయ సంప్రదాయాలకనుగుణంగా ఉందని కాదు,

అల్లాహ్‌ను, దైవ సందేశహరుణ్ణి నమ్మేవారు దేన్ని మారూఫ్ అని లేదా మున్కర్ అని అంటారో దైవధర్మం వెలుగులో, దాని షరీఅత్ అనుసరణలోనే అంటారు అన్న కారణం గానే అలా నిర్ణయిస్తాము. వారి మధ్యన, అల్లాహ్ షరీఅత్ దేన్ని మారూఫ్ అని అంటుందో మరి ఏ నమ్మకం, ఆచరణల్ని, షరీఅత్ మున్కర్‌గా నిర్ణయిస్తుందో వారి దృష్టిలోనూ ఎటువంటి సంకోచం లేకుండా మున్కర్‌గానే పరిగణించబడుతుంది. షరీఅత్ మారూఫ్‌గా నిర్ణయించిన దాన్ని వారు ఎన్నటికీ మున్కర్‌గా ఎంచి వదిలి పెట్టరు. మరే ఆచరణను షరీఅత్ మున్కర్‌గా పరిగణిస్తుందో దాన్ని మారూఫ్‌గా అవలంబించడం అన్నదీ వారు ఎన్నడూ చెయ్యరు.

అల్లామా ఇబ్ను జరీర్ తబరీ ఇలా అంటున్నారు :

اصل المعروف كل ما كان معروفا، ففعله جميل مستحسن غير مستقبح فى اهل الايمان بالله و انّها سميت طاعة الله معروفا لِانه مما يعرفه اهل الايمان ولاَ يستنكرون فعله، و اصل المنكر ما انكره الله ورأوه قبيحا فعله ولذلک سميت معصية الله منكرًا لِاَن اهل الايمان يستنكرون فعلها و يستعظمون ركوبها

'మారూఫ్' అన్న దాని మూలం, (షరీఅత్ దృష్టిలో) సుపరిచితమయినది, తెలిసినది, ప్రసిద్ధమయినది ప్రతిదీ అన్నమాట. కాగా దాన్ని ఆచరించడం దైవ విశ్వాసం గల వారిలో సరయినది, ఉత్కృష్టమయినది కావడమే కాక వారు దాని పట్ల ఎంతమాత్రం అయిష్టత కనబరచరు. దైవ విధేయతను మారూఫ్ అనడానికి కారణం విశ్వసించేవారు దాన్ని బాగా ఎరుగుదురు, దాన్ని ఆచరించడం పట్ల అయిష్టతను వెలిబుచ్చరు, 'మున్కర్'కు మూలం అల్లాహ్ ఇష్టపడని ప్రతిదీ అన్నమాట. దాని ఆచరణను విశ్వసించినవారు ఏవగించుకుంటారు. ఈ కారణంగా అల్లాహ్ పట్ల పాపాన్ని మున్కర్ అని అంటారు. విశ్వసించేవారు దాన్ని ఇష్టపడరు, దానికి పాల్పడటం మహాపరాధంగా పరిగణిస్తారు.

*(జామిఉల్ బయాన్ ఫీ తఫ్సీరుల్ కుర్ఆన్ : 4/ 28)*

ఇమామ్ షౌకానీ ముస్లిమ్ సముదాయం వ్యక్తులను గురించి ఇలా అంటారు:

انهم يامرون بماهو معروف فى هذه الشريعة وينهون عما هـو

ఈ షరీఅత్‌లో 'మారూఫ్' అయిన దాన్ని వారు ఆదేశిస్తారు, మరేది 'మున్కర్'గా పరిగణించ

منكر، فالدليل على كون ذلك الشئ معـروفـا اومنكـرا هـو الكتاب او السنة

బదుతుందో దాన్ని వారిస్తారు. కాగా ఒక వస్తువు మారూఫ్ లేదా మున్కర్ అనదానికి ఆధారం దైవగ్రంథం లేదా ప్రవక్త సంప్రదాయం.

*(ఇర్షాద్ అల్ ఫ హౌల్ ఇలా తహ్కీకుల్ హక్ మిన్ ఇల్మిల్ ఉసూల్ : పుట. 74)*

అందువల్లనే మనం గమనించగలం, ప్రామాణికమయిన సముదాయపు పండిత గణ్యులు మారూఫ్, మున్కర్ల నిర్వచనం బుద్ధి వివేకాలు, తాత్వికత, తర్కశాస్త్రం పరిభాషలోనో లేదా తమ సమకాలీన ఆచార వ్యవహారాల వెలుగులోనో పేర్కొనలేదు. దానిగ్గాను స్వచ్ఛమయిన షరీఅత్ పరిభాషనే ప్రయోగించారు. వారి దృష్టిలో మారూఫ్, మున్కర్ అన్న పదాలు పరమ ప్రభువు అల్లాహ్ పట్ల విధేయత, అవిధేయత, హలాల్, హరామ్, ఫర్జ్, నఫ్ల్ అభిలషణీయమయినది, అయిష్టకరమయినదీ అన్న వాటిని వ్యక్తం చేస్తాయి. దీనిభావం ఏమిటంటే అల్లాహ్ ప్రదానం చేసిన షరీఅత్ 'మారూఫ్, మున్కర్'లను నిర్ణయిస్తుంది. మరే మార్గాన్ననుసరించి కూడా దాని నిర్ధారణ జరగదు. ఎందుకంటే దైవం ఇచ్చిన షరీఅత్ మాత్రమే మనకు తెలుపుతుంది, ఏ ఆచరణల పట్ల అల్లాహ్ సంతోషిస్తాడో, ఏ ఆచరణలు ఆయన అయిష్టతకు కారణమవుతాయో, ఇంకా ఏది హలాల్ అయినదో మరేది హరామ్ అయినదో, ఏ పని చెయ్యడం అవసరమో, లేదా ఇష్టకరమయినదో, మరే పని చెయ్యడం అధర్మం, అనవసరమయినదో!

అల్లామా ఇబ్నె అసీర్ 'మారూఫ్' అన్నదాన్ని ఈ పదాలలో నిర్వచించారు :

(المعروف) اسم جامع لكل مـا عرف من طاعة الله والتقرب اليه والاحسان الى الناس وكل مـا ندب اليه الشرع ونهى عنه من المُحَسّنات والمقبّحات وهو من الصفات الغالبة اى امر معروف بين

మారూఫ్ అన్నది ఒక సమగ్రమయిన భావన. ఇందులో అల్లాహ్ విధేయత, ఆయన సామీప్యం, జనుల ఎడల ఉత్తమ వైఖరి, ఇంకా షరీఅత్ ప్రోత్సహించిన సమస్త సదాచారణలూ ఇందులో చేరి ఉన్నాయి. మరేమో షరీఅత్ వారించిన చెడులను తప్పించుకు మనగలగటం కూడా 'మారూఫ్'లోనే చేరి వుంది. ఇది ఆధిక్యత గల గుణగణాలలోనిది. అంటే 'మారూఫ్' అన్నదాని భావం, జనుల మధ్య ప్రసిద్ధమయినది, సుపరిచితమయినది, దాన్ని

الناس اذارأوه لَا ينكرونه

చూసినంతనే అయిష్టత కనబరచనటువంటిది.

*(అన్నిహాయ ఫీ గరీబుల్ హదీస్ వల్ అసర్, మూల పదం 'ఉర్ఫ్' : 3/ 216)*

మున్కర్‌ని నిర్వచిస్తూ ఈ మహనీయులే ఇలా అంటున్నారు :

المنكر... ضد المعروف، و كل ما قبح الشرع و حرمه و كرهه فهو منكر

**'మున్కర్' అన్నది మారూఫ్‌కు వ్యతిరేకమయినది. షరీఅత్ దేన్నయితే ఏవగించుకున్నదో, హరామ్, మక్రూహ్‌గా పరిగణించిందో అది 'మున్కర్'.** *(అన్నిహాయ ఫీ గరీబుల్ హదీస్ వల్ అసర్, మూలపదం 'నకర' : 5/115)*

అల్లామా సావీ ఇలా వ్రాస్తున్నారు :

المعروف المراد بــه ماطلبه الشارع اماعلىٰ سبيل الوجوب كالصلوٰت الخمس وبرّ الوالدين و صلة الرحم اوالندب كالنوافل و صدقات التطوع ... المنكر المراد به مانهى عنه الشارع اما على سبيل الحرمة كالزنا و السرقة اوعلى سبيل الكراهة

**మారూఫ్ అంటే ఉద్దేశం, షరీఅత్ ప్రదాత (అల్లాహ్) మనల్ని విధిగా నిర్ణయించినవి, ఉదాహరణకు (అయిదు వేళల నమాజ్, లేదా తల్లిదండ్రుల ఎడల ఉత్తమ వ్యవహారం, రక్త సంబంధీకుల పట్ల ప్రేమ, వాత్సల్యం, లేదా ఆయన అభిలషణీయంగా ఎంచినవి, ఉదాహరణకు, నఫ్ల్ నమాజ్‌లు, నఫ్ల్ దాన ధర్మాలు... మున్కర్ అని అంటే షరీఅత్ ప్రదాత హరామ్‌గా నిర్ణయించినది, నిషేధించినది, ఉదాహరణకు, వ్యభిచారం, దొంగతనం, లేదా వేటి పట్ల ఆయన అయిష్టతను ప్రకటించాడో అవి.** *(అల్ జలాలైన్ వ్యాఖ్యాన గ్రంథం పైన అల్లామా 'సావీ' టీకా : 1/ 152)*

అల్లామా అబ్దుల్ కాదిర్ ఔదహ్ షహీద్ ఇలా అన్నారు :

الامربالمعروف والنهى عن المنكر يدخل فيه الامر بكل ما اوجبت الشريعة عمله اوجبت للناس فعله من

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌లో, షరీఅత్ విధిగా నిర్ణయించినదీ లేదా ఇష్టమయినదిగా ప్రకటించినదీ అయిన ప్రతి ఆచరణ చేరి ఉంది. ఉదాహరణకు నమాజ్,**

صلاة وصيام وحج وتوحيد وغير ذلک، والنهی عن المنكر يدخل فيه النهی عن كل ما خالف الشريعة من افعال وعقائد فيد خل فيه النهی عن التثليث وعن القول بصلب المسيح وقتله ويد خل فيه النهی عن الترهب وعن شرب الخمر وعن اكل لحم الخنزير وغير ذلک مما تخالف فيه الشريعة الاسلامية الاديان الاخرى

రోజా, హజ్జ్, తౌహీద్ మొదలయినవి. నహీ అనిల్ మున్కర్‌లో షరీఅత్‌కు విరుద్ధమయిన ఆచరణలన్నీ, నమ్మకాలన్నీ చేరి ఉన్నాయి. ఇందులో త్రిత్వ (Trinity) నమ్మకంతో పాటు, హ(జత్ మసీహ్ (ఏసు-అ)ని శిలువ పైన ఎక్కించడం లేదా ఆయన్ని చంపారన్న నమ్మ కాన్ని నిరాకరించడం కూడా చేరి ఉన్నాయి. అలాగే సన్యాసత్వం, సారాయి త్రాగడం, పంది మాంసం భుజించడం, ఇంకా ఇస్లామీయ షరీఅత్ ఇతర మతాలతో విభేదించే విషయా లన్నిటినీ వారించడం కూడా చేరి ఉంది.

*(అత్తష్రీ'అల్ జనాయిఅల్ ఇస్లామీ మకారినా బిల్ కానూన్ అల్ వజ్‌యీ : 1/497)*

ఈ వివరణల వల్ల పూర్తిగా విశదమయిపోతుంది, మారూఫ్, మున్కర్ అన్నవి సాధారణ పదాలు కావు, ఏ విషయానికయినా వాటిని వర్తింపజేయడానికి. వీటిద్వారా అల్లాహ్ ఇష్టాయిష్టాలు వ్యక్తమవుతాయి. ఒక విషయాన్ని మారూఫ్‌గానయినా మున్కర్‌గానయినా నిర్ణయించడం మానవుని పని కాదు. ఇది పరమ ప్రభువు బాధ్యత. అల్లాహ్ నియమించిన షరీఅత్ మాత్రమే తేల్చి చెప్పగలదు ఏది మారూఫో మరేది మున్కరో. ఏ వ్యక్తి అయితే ఒక విషయాన్ని మారూఫ్‌గానయినా మున్కర్‌గానయినా నిర్ణయించడం దైవ శాసనాంగం హక్కు కాదు, తనదే అని అనుకుంటాడో అతను అల్లాహ్ స్థానంలో తన వ్యక్తిత్వాన్నే శాసన ప్రదాతగా శాసన నిర్మాతగా భావిస్తున్నాడన్న మాట. ఇలా చెయ్యడం దైవ తిరస్కారమే కాదు, ఆయన పట్ల తిరుగుబాటు కూడా. దీని తలంపే మనిషి కంపించిపోవడానికి సరిపోతుంది.



# 6. విస్తృతి, సమగ్రత

## 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'

## సందేశాత్మకం, శిక్షణాత్మకం!

'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్' వాస్తవానికి రెండు కార్యక్రమాల సంగ్రహణం. సందేశం, ప్రచారం; వ్యవస్థీకరణ, శిక్షణ. ఈ రెండు కార్యాలు సహజ మయిన క్రమంలో అమలు జరగాలి. తొలుత దైవధర్మం వైపునకు జనుల్ని పిలువడం జరుగుతుంది, ఆ తరువాత ఆ జనుల్ని వ్యవస్థీకరించడం, వారికి శిక్షణ గరపడం జరుగుతుంది, ఆ పిలుపు, ఆ సందేశానికి తోడుగా నిలువడానికి ఇష్టపడినవారు, దానికి సిద్ధమయినవారు ఆ వ్యవస్థకు, ఆ శిక్షణకు అర్హులు. ఈ వ్యవస్థీకరణ, ఈ శిక్షణలపైనే ఆ సందేశం ప్రజల్లో ఆమోదముద్ర పొంది విజయాన్ని సాధిస్తుందా లేదా పరాజయం పాలవుతుందా అన్నది ఆధారపడివుంటుంది. వ్యవస్థ పటిష్ఠమయి, శిక్షణ సరయిన రీతిలో జరిగినట్లయితే సందేశం విజయం సాధిస్తుంది. లేకపోతే దాని పరాజయం నిశ్చితమే. అందువల్ల ఒకవైపున సందేశ ప్రచారం, మరోవైపున వ్యవస్థీకరణ, శిక్షణల మధ్యన ఎంతో లోతయిన మరీ దగ్గరి సంబంధముంది. సందేశం అంటూ లేనిదే వ్యవస్థ అయినా శిక్షణ అయినా ఉనికిలోకే రావు. అలాగే వ్యవస్థీకరణ, శిక్షణలు లేకుండా సందేశం అన్నది దాని అంతిమ గమ్యాన్ని చేరుకోనూ జాలదు.

సందేశ ప్రచార సంబోధితులు, శిక్షణల సంబోధితులు వేర్వేరు అన్న విషయంలో సందేహం లేదు. ధర్మ సందేశం ఎవరికి అందజేయబడుతుంది? దాన్ని ఇంకా స్వీకరించనివారికి! మరి ఎవరయితే సందేశాన్ని స్వీకరించారో వారిని వ్యవస్థీకరించి వారికి శిక్షణ గరపడం జరుగుతుంది. అయినప్పటికీ ఈ రెండు పనులూ ఒకే లక్ష్యసిద్ధి కొరకు నిర్వర్తించబడతాయి. ఒక వ్యక్తి అల్లాహ్‌ను, దైవ సందేశహరుణ్ణి విశ్వసించేవాడు, దైవధర్మాన్ని సత్యధర్మంగా స్వీకరించినవాడు ఆ ధర్మం వైపునకే ప్రపంచానికి పిలుపు నిస్తాడు. దాని ఆధారంగా ప్రజల్ని ప్రోగుచేస్తాడు. దీనికి భిన్నంగా ఏ వ్యక్తి అల్లాహ్‌ను,

ప్రవక్తనూ తిరస్కరించేవాడో, దైవధర్మానికి వ్యతిరేకియో అతను నిర్మించే ప్రచార సాధన మయినా వ్యవస్థ అయినా తిరస్కారం ఆధారంగా ఏర్పడుతాయి. బాహ్యంలో ఇవి రెండు వేర్వేరు పనులుగా కనబడినా వాస్తవానికి ఒకే ఉద్దేశ్యంతో చేసే పనికి రెండు విభిన్న కోణాలు.

ముస్లిమ్ సముదాయం సందేశ ప్రచారం, దీనితోపాటు వ్యవస్థీకరణ, శిక్షణ ఉభయ కార్యాలూ నిర్వహించవలసి వుంటుంది. మరో విధంగా చెప్పాలంటే అది **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** విధిని తన అంతర్గత పరిధిలోనూ నిర్వహించవలసి ఉంటుంది. తన వెలుపలనూ నిర్వర్తించవలసి ఉంటుంది. సముదాయం దాని పరిధికి వెలుపల చేసే పనిని సందేశ ప్రచార కార్యం అని అంటారు. మరి అది తన పరిధి లోపల నిర్వహించే కార్యాన్ని వ్యవస్థీకరణ, శిక్షణ అని అంటారు. మన దివ్యగ్రంథ వ్యాఖ్యాతల ప్రకారం, **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'**లో, విశ్వాసంతోపాటు  ఇస్లాం పిలుపు,  దైవేతరుల ఆరాధనా దాస్యాల వ్యతిరేకత, తిరస్కారం, బహు దైవ భావనల ఖండన, దైవమార్గంలో సతత సమరం కూడా చేరి ఉన్నాయి. ఇంకా ఇస్లామీయ శిక్షాస్మృతి సంస్థాపన, దైవమార్గంలో ధనం వెచ్చించడం, ప్రవక్త సంప్రదాయం అనుసరణ, ధర్మంలో కొత్త విషయాల విసర్జన పట్ల ఉపదేశం ఇత్యాదివి కూడా చేరి ఉన్నాయి.  ఇవి రెండు  విధాల కార్యకలాపాలని తెలుస్తూనే ఉంది. మొదట ప్రస్తావించిన కార్యాలు సందేశ ప్రచారానికి చెందినవి. తరువాత ప్రస్తావించినవి వ్యవస్థకు, శిక్షణకు సంబంధించినవి. వ్యాఖ్యాతలు, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**లో ఈ రెండు కోవలకు చెందిన పనులూ చేరి ఉన్నాయని భావించడం మాత్రమే కాదు, దీనికి సంబంధించిన దాదాపు ప్రతి ఆయత్ సందర్భం లోనూ ఈ రెండు విధాల పనుల్ని ఒకేసారి ప్రస్తావిస్తూ కూడా ఉంటారు.  ఆ ప్రత్యేక ఆయత్, దాని పదాల బాహ్య భావం రీత్యా, సందేశం వైపు పిలుపునకు సంబంధించిన దయినా లేదా వ్యవస్థీకరణ, శిక్షణలకు సంబంధించినదయినా. అంటే దివ్యకుర్ఆన్లో ఎక్కడెక్కడ, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్** మున్కర్ ఆదేశం వచ్చిందో అక్కడల్లా ఓ నిర్దేశన అందులో నిబిడీకృతమయి ఉందన్నమాట. దాని ప్రకారం, సముదాయం తన సంస్కరణతోపాటు ఇతరుల మధ్య దైవధర్మ సంస్థాపన కూడా చెయ్యాలన్నమాట. ఈ సందర్భంలో దీన్ని కాస్త విశదంగా చర్చించడం సబబుగా ఉంటుంది.

## 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్' - ఇతరులలో నిర్వర్తించ వలసిన బాధ్యత

పరమ ప్రభువు ముస్లిమ్ సముదాయం చేత ఏ కార్యసిద్ధిని కోరుతున్నాడో దాన్ని ఆయన ఈ పదాలలో వివరించాడు :

كُنتُم خَيرَ اُمَّةٍ اُخرِجَت لِلنَّاسِ تَاْمُرُوْنَ بِالْمَعرُوفِ وَ تَنْهَوْنَ عَنِ الْمُنكَرِ وَ تُؤمِنُوْن بِاللهِ (آل عمران:١١٠)

**"ఇప్పుడు ప్రపంచంలో శ్రేష్టమయిన సముదాయం మీదే. మిమ్మల్ని మానవుల మార్గబోధనకు, సంస్కరణకు లోకంలో ప్రవేశపెట్టడం జరిగింది. మీరు సదాచారాన్ని ఆదేశిస్తారు, దురాచారాన్ని నిరోధిస్తారు, దైవాన్ని విశ్వసిస్తారు."**

*(ఆలి ఇమ్రాన్ : 110)*

ఆయత్ భావ ప్రకటనా శైలి అతి స్పష్టంగా తెలుపుతోంది, ఇందులో ఏ **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** ప్రస్తావన ఉందో దాన్ని ఉమ్మత్ లేదా ముస్లిమ్ సముదాయం, తన పరిధికి వెలుపల నిర్వర్తించవలసి ఉంది అని. ఈ సముదాయం, ఒక సముదాయ రూపంలో 'జనుల కొరకు ప్రభవింపజేయబడింది; ప్రభవింపజేయబడటానికి కారణం, జనులకు మారూఫ్‌ని ఆదేశించడం, మున్కర్ నుండి వారించడం. అది స్వయంగా ఉనికిలోకి రాలేదు, నిజానికి ఓ నిర్ణీత లక్ష్యంతో మానవుల సంస్కరణార్థం, మార్గబోధనార్థం ప్రభవింపజేయబడింది. ఓ ఘనమయిన కార్యం అది నిర్వర్తించ వలసి ఉంది. అది ప్రపంచానికి సన్మార్గ బోధన చెయ్యడం, సత్యధర్మం వైపునకు పిలుపునివ్వడం. ఏ వర్గానికయినా దాని జీవన లక్ష్యం నిర్ధారించుకోవడానికి, ఏ సమాజానికయినా తన దారిని అన్వేషించుకోవడానికి స్వేచ్ఛ ఉంది. కాని శ్రేష్ఠ సమాజం (ఖైర ఉమ్మత్) అన్న పేరున్న సమాజం తన ఈ స్వేచ్ఛను వదలుకున్న సమాజం. అది అల్లాహ్ ప్రసాదించిన ధ్యేయాన్ని, ఎదురు పలకకుండా స్వీకరించిన సముదాయం. అందువల్ల అది తనకంటూ స్వయంగా ఏదయినా దారిని నిర్ణయించు కునేందుకు దానికి ఎటువంటి అధికారమే లేదు, ఆ దారిన పరుగెత్తడం సుదూర విషయం. ఏ రోజునయితే ముస్లిమ్ సముదాయం ఈ 'అపరాధా'నికి పాల్పడుతుందో ఆ రోజున అది శ్రేష్ఠ సమాజంగా మిగులదు. దానికి ప్రపంచంలో **అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్ మున్కర్** ఆదేశం ప్రాప్తమయింది. ఈ ఆదేశాన్ని పాలించడం దాని జీవిత లక్ష్యం. దాన్ని దైవం తరఫున ఈ బాధ్యతపైన, ఈ డ్యూటీ నిర్వర్తించేందుకు నియోగించడం జరిగింది. ఈ సముదాయం సఫలతా నిష్ఫలతల తీర్పు రేపు ప్రళయ దినాన

దీని ఆధారంగానే జరగనున్నది, ఇది ఈ బాధ్యతను సరిగ్గా నిర్వర్తించిందా లేదా? అన్న విషయమే చూడటం జరుగుతుంది.

షైఖ్ అబు స్సఊద్ 'ఉఖ్రిజత్ లిన్నాస్' (మానవుల కొరకు ప్రభవింపజేయ బడింది) అన్న పదాల వివరణ ఇలా చేశారు :

**أُخْرِجَتْ لِلنَّاسِ صفة لِأُمة واللام متعلقة باخرجت اى اظهرت لهم فقيل بخير امة اى كنتم خير الناس للناس فهو صريح فى ان الخيرية بمعنى النفع للناس و ان فهم ذٰلک من الإخراج لهم ايضا اى اخرجت لِاَجلهم و مصلحتهم**

**'మానవుల కొరకు ప్రభవింపజేయబడింది' అన్న ముక్క ముస్లిమ్ సముదాయానికి గుణ వాచకం, లిన్నాస్‌లోని 'లామ్' (లి) అన్నది 'ప్రభవింపజేయ బడింది' అన్నదానికి సంబంధించింది. భావ మేమిటంటే, 'అది జనుల కొరకు ప్రభవింప జేయబడింది' అన్నమాట. కొందరు 'లామ్' (లి) అన్నది 'శ్రేష్ఠ సమాజం'తో సంబంధం గల విభక్తి అన్నారు. దాని భావం, మీరు జనుల కొరకు శ్రేష్ఠమయిన వారు అన్నది. ఇది ఒక విషయానికి స్పష్ట మయిన ఆధారం అంటే శ్రేష్ఠులు కావడం అన్న దాని భావం, జనులకు ప్రయోజనం చేకూర్చడం అన్నమాట. ఈ విషయం మొదటి భావాన్ని తీసుకున్నా అర్థమవుతుంది. ఎందుకంటే ఈ సముదాయం జనుల కొరకు ప్రభవింప జేయబడిందంటే జనుల మేలు కొరకు, వారి బాగు కొరకు ఉనికిలోకి వచ్చిం దనే అర్థం వస్తుంది.**

*(ఇర్షాద్ అల్ అక్లుస్సలీమ్ ఇలా మజాయా అల్ కితాబుల్ కరీమ్ : 2/ 496)*

ఇమామ్ రాజీ ఇలా నుడివారు :

**قوله أُخْرِجَتْ لِلنَّاسِ فيه قولَان الأول: ان المعنى كنتم خير الأمم المخرجة للناس فى جميع الأعصار، فقوله أُخْرِجَتْ**

**'ఉఖ్రిజత్‌లిన్నాస్' 'జనుల కొరకు ఆవిర్భవింప జేయబడిన' అన్నదానికి రెండు విధాల వ్యాఖ్యా నాలున్నాయి. ఒకదాని ప్రకారం, జనుల సంస్కరణ మార్గబోధన కొరకు సర్వకాలాలలో ఎన్ని సముదాయాలనయితే ప్రభవింపజేయడం**

لِلنَّاسِ ای اظهـرت للناس حتی تمـيّزت و عرف وفصل بينها و بين غيرهـا، و الثـانی: ان قولـه للنـاس من تمـام قولـه کنـتم و التقــديــر کنتــم للنــاس خيرامـة

జరిగిందో వీటనన్నింటిలో మీరు శ్రేష్ఠమయిన సముదాయం. కాగా 'ఉఖ్రిజత్ లిన్నాస్' అన్నదాని భావం ఏమిటంటే అది జనుల కోసం ఆవిర్భవింపజేయబడింది- కడకు అది అలాగే ప్రత్యేకమయిపోయింది, అలాగే గుర్తించబడింది. దాన్ని, ఇతర సముదాయాల నుండి వేరుగా ప్రస్ఫుటపరచడం జరిగింది. రెండవ వ్యాఖ్యానం ప్రకారం, అన్నాస్ 'జనులు' అన్న పదం (కున్తుమ్) 'మీరు' అన్న పదంతో ప్రారంభమయిన వాక్యంలోని భాగమే. దాన్నిబట్టి భావం మీరు జనుల కొరకు ఉత్తమ సముదాయం అన్న అర్థం వస్తుంది.
*(మఫాతీహుల్ గైబ్, సం.4, భాగం 8, పుట. 156).*

హజ్రత్ అబూహురైరా(రజి) ఇలా నుడివారు:

كُنتُمْ خَيْرَ اُمَّةٍ اُخْرِجَتْ لِلنَّاسِ قال خيرالناس للنّاس تأتون بهم فی السـلاسل فی اعناقهــم حتی يدخلوا فی الاسلام

"మీరు జనుల కొరకు ఆవిర్భవింపజేయబడిన ఉత్తమ సముదాయం". దీని భావం ఏమిటంటే, మీరు మానవుల కొరకు ఉత్తమ మానవులు, వారిని మెడలలో సంకెళ్ళు వేసి తెస్తారు, వారు ఇస్లామ్‌లోకి ప్రవేశిస్తారు.[1]

1. బుఖారీ, కితాబుత్తఫ్సీర్, ఆలి ఇమ్రాన్ సూరా, కుంతుమ్ ఖైర ఉమ్మతిన్ ఉఖ్రిజత్ లిన్నాస్' అధ్యాయం: హజ్రత్ అబూహురైరా నుడివిన దాని భావం, ముస్లిమ్ సము దాయం ఇతరుల్ని బలవంతాన ఇస్లామ్ స్వీకరింపజెయ్యాలన్నది కాదు, వారి తలకి తమ ధర్మం తప్పనిసరిగా రుద్దాలనీ కాదు. దీని భావం ఏమిటంటే ఏ 'శుభం' ప్రాబల్యం పొందాలని ఈ సముదాయం నిరంతరం కృషి సలుపుతూ ఉంటుందో, ఆ 'శుభా'నికి ఈ సముదాయం, తన నైతిక ప్రవర్తన ద్వారా, తన శీల స్వభావాల ద్వారా, తన సచ్ఛరిత ద్వారా, ప్రతీప శక్తుల ఎడల తన నడవడి ద్వారా ఓ సంపూర్ణ ఆదర్శంగా, పరిపూర్ణ దర్పణంగా నిలువాలి. కడకు ఏ హృదయాలలో ఈ సముదాయం పట్ల ద్వేషం, వైషమ్య భావాలు నిండి ఉన్నాయో అవి కూడా ఈ 'శుభం' వైపునకు (మెడల్లో సంకెళ్ళు వేసి లాగినట్లు) ఆకర్షితులయి పరుగిడి రావాలి. సముదాయం ఈ రూపంలో ప్రత్యక్షమయినప్పుడు జనుల

ముస్లిమ్ సముదాయం గురించి మహనీయ అబూ హురైరా (ర) తెలిపిన (ఖైరున్నాసి లిన్నాస్) 'మానవుల కొరకు ఉత్తమ మానవులు' అన్న మాటను హాఫిజ్ ఇబ్ను హజర్ ఇలా వివరించారు :

**ای خیر بعض الناس لبعضهم ای انفعهم لهم وانما کان ذٰلک لکونهم کانوا سببًا فی اسلامهم**

**అంటే జనులలో కొందరు కొందరి కొరకు ఉత్తమమయిన వారన్నమాట. భావమేమిటంటే, వారు వీరికి గొప్ప ప్రయోజనం చేకూర్చుతారు, ఎందుకంటే వారు వీరి ఇస్లామ్‌కు కారణభూతు లవుతున్నారు.** *(ఫత్‌హుల్ బారీ : 8/156)*

మేము పైన ఉటంకించిన ప్రస్తావనల్లో కొన్ని 'పద'బద్ధమయిన చర్చలు వచ్చే శాయి. అవి నిశ్చయంగా సాధారణ పఠితలకు ఆసక్తికరమయిన విషయాలు కావు. కాని వాటిని ఉటంకించడానికి కారణం, కుర్‌ఆన్‌లోని ఓ ఉపదేశానికి స్వచ్ఛమయిన శాస్త్రీయ, సాహితీ పరమయిన విశదీకరణ కావాలన్నది. ఆ ఉపదేశం కూడా ముస్లిమ్ సముదాయ జీవన లక్ష్యానికి సంబంధించింది. కుర్‌ఆన్ ప్రకారం, 'ముస్లిమ్ సముదాయం జనుల కొరకు ఆవిర్భవింపజేయబడింది.' ఈ చర్చల వెలుగులో దీని భావం, ఈ సముదాయం మానవులందరికీ, ప్రపంచంలోని ప్రతి జాతి, ప్రతి సముదాయం, ప్రతి సమాజం కన్నా అధికంగా ప్రయోజనం చేకూర్చే సముదాయం అన్నమాట. కారణం, ఇది వారికి రుజుమార్గం చూపుతుంది. దైవధర్మం వైపునకు పిలుస్తుంది, ఇస్లామ్, దైవ విధేయతా పరిధిలోకి వారిని తీసుకువస్తుంది. ఇదే మాటను కుర్‌ఆన్ ఆ తరువాత ఈవిధంగా వివరిస్తుంది, 'మీరు ప్రసిద్ధమయిన మంచిని ఆదేశిస్తారు, చెడుల నుండి నిరోధిస్తారు' అని. దీన్నిబట్టి కచ్చితంగా తేలేదేమిటంటే **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** అన్నది వాస్తవానికి సందేశ ప్రధానమయిన కార్యం. ముస్లిమ్ సముదాయం, మానవాళి మొత్తం మధ్యన దీన్ని నిర్వర్తించవలసి ఉంది. **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'**లోని ఈ సందేశ కోణాన్ని కాదనేవాడు, కుర్‌ఆన్ పదాల పట్ల సరిగ్గా యోచించనయినా లేదు లేదా ఇష్టపూర్వకంగానయినా దాన్ని నిరాకరించదలిచాడు.

---

*అంతర్యాలు ఇస్లామ్ కొరకు విప్పారుతాయి. ఈ సముదాయం ఎవరినయితే ఈ శుభం పట్ల తిరుగుబాటు వహించినందుకు పట్టుకున్నదో వారు అల్లాహ్ కారుణ్యా నికి అర్హు లయిపోతారు.*

## 'మానవుల సమక్షంలో సాక్ష్యం'

సరిగ్గా ఈ ఆయత్‌లో చెప్పిన విషయమే మరో పదాలలో మరోచోట దివ్య కుర్‌ఆన్‌లో ఇలా పలకడం జరిగింది :

وَكَذٰلِكَ جَعَلْنَا كُمْ اُمَّةً وَّ سَطًا لِّتَكُوْنُوْا شُهَدَاءَ عَلَى النَّاسِ وَيَكُوْنَ الرَّسُوْلُ عَلَيْكُمْ شهيدًا (البقرة: ۱۴۳)

**'మేము మిమ్మల్ని ఒక 'మధ్యస్థ సముదాయం'గా చేశాము- తద్వారా మీరు సకల మానవాళికి సాక్షులు కాగలగాలని, దైవ సందేశహరుడు మీకు సాక్షి కాగలగాలని'.**

*(అల్ బకర : 143)*

ఇక్కడ ముస్లిమ్ సముదాయాన్ని 'మధ్యస్థ సమాజం'గా పేర్కొనడం జరిగింది. అక్కడ 'ఉత్తమ సమాజం' అనడం జరిగింది. ఈ రెంటిలో అర్థమూ ఉద్దేశ్యాల వ్యత్యాసం ఏదీ లేదు. ఎందుకంటే ఉత్తమ సమాజం అన్నది, ఆలోచనలరీత్యా ఆచరణల రీత్యా అతివాదానికి దూరమయినదీ సురక్షితమయినదయి ఉండాలి, జీవనరంగంలో అది సంతులనం, మధ్యస్థంగా సుస్థిరంగా నిలవాలి. సముదాయం చెయ్యవలసిన కార్యాన్ని ఇక్కడ 'మానవుల సమక్షంలో సాక్ష్యం'గా పేర్కొనడం జరిగింది. అక్కడేమో 'మానవుల కొరకు ప్రభవింపజేయబడ్డారు, ప్రసిద్ధమయిన మంచిని ఆదేశిస్తారు, చెడులను నిరోధిస్తారు' అన్న పదాలు ప్రయోగించబడ్డాయి. అయితే 'మానవుల సమక్షంలో సాక్ష్యం' అన్న దానిలో జనులకు మారూఫ్ (ప్రసిద్ధ మయిన మంచి)ని ఆదేశించడం, చెడులను నిరోధించడం అనేది తప్పక చేరి ఉంది. రెండు భావాన్వయాలూ సముదాయానికున్న సందేశ ప్రధానమయిన బాధ్యతలను గుర్తు చేస్తున్నాయి.[1]

## సముదాయం సంస్కరణ, శిక్షణ

ఈ వివరణల వల్ల తెలిసిందేమిటంటే ముస్లిమ్ సముదాయం గురించి కుర్‌ఆన్ ప్రకటన 'మీరు జనుల కొరకు ఆవిర్భవింపజేయబడిన ఉత్తమ సముదాయం' అన్నది దాని సందేశాత్మక బాధ్యతల ప్రకటన. అయితే సముదాయం అంతర్గత శిక్షణ, ఈ వ్యవస్థీకరణల కర్తవ్యం ఈ ఆయత్‌లో ఉద్దేశించబడలేదని భావించరాదు. ఎందుకంటే ముస్లిమ్ సముదాయం, ఇస్లామ్ పిలుపు పట్ల ఏమరుపాటు వహించజాలనట్లే తన

1. 'మానవుల సమక్షంలో సాక్ష్యం'పై సవివరమయిన చర్చకు రచయిత ఉర్దూ కృతి 'తజల్లియాతె కుర్‌ఆన్' చదవండి.

స్వీయ సంస్కరణ, వ్యవస్థీకరణల పట్లనూ అది క్షణకాలం పాటు కూడా అశ్రద్ధ చూప జాలదు. అది తన పరిధికి వెలుపల చెయ్యదలచిన కార్యాన్ని తన అంతర్గతంగానూ చెయ్యడం తప్పనిసరి. అది ఇతరుల పట్ల **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్** మున్కర్ బాధ్యతను నిర్వర్తించడానికి ముందు అది తొలుత స్వయంగా తనకే మారూఫ్ ఆదేశాన్ని జారీ చేస్తుంది, మున్కర్‌నూ వారిస్తుంది. అది తనపైన మారూఫ్‌ను స్థాపింప జేయలేకపోతే, తన్ను తాను మున్కర్ నుండి వారించలేకపోతే ఇతరులకు నిజభావంలో అది మారూఫ్‌ను ఆదేశించజాలదు, మున్కర్‌నూ వారించజాలదు. అందువల్ల ఈ రెండు విధాల పనులూ ఈ ఆయత్ భావంలో చేరి ఉన్నాయి.

అల్లామా సావీ ఇలా అన్నారు :

**قولـه للناس انما عبرباللام دون من اشارة الى ان هذهٖ الامة نفع و رحمة لنفسها وللخلق عموماً فى الدنيا بالدعاء لجميع الاَمم وفى الاٰخرة بالشهادة للانبياء**

**కుర్ఆన్ 'జనుల కొరకు' అని చెబుతుంది. 'జనుల నుండి' అని అనలేదు. ఇందులో ఒక సంకేతముంది, ఈ సముదాయం తన కొరకూ సకల దైవ సృష్టి మానవుల కొరకూ ప్రపంచం లోనూ పరలోకంలోనూ ఆపాదమస్తకం ప్రయో జనమూ కారుణ్యమే కాగలదు. అది ప్రపంచంలో సకల జాతులకు సత్యధర్మం వైపునకు పిలుపుని స్తుంది, పరలోకంలో దైవప్రవక్తల ఎడల సాక్ష్యం పలుకుతుంది.**

*(తఫ్సీర్ జలాలైన్ పైన 'అస్సావీ' టీకా :1/ 153)*

ముల్లా జీవన్ ఈవిధంగా వ్రాశారు :

**اخرجت للنـاس اى للانبيـاء للشهادة علىٰ دعوتهم اوللكفار لقتالهم او للمومنين عامة**

**(ఈ సముదాయం) జనుల కొరకు ప్రభవింప జేయబడింది. అంటే ప్రవక్తల కొరకు– వారి పిలుపునకు సాక్ష్యం పలకడానికి, తిరస్కారుల కొరకు– వారితో (సత్యం కొరకు) పోరు సలప డానికి, సాధారణ విశ్వాసుల (సంస్కరణ) కొరకు.**

*(అత్ తఫ్సీరాత్ అహ్మదియ్య : పుట. 124)*

అల్లామా సావీ చెప్పిన ఈ పదాలు- 'ఈ సముదాయం తన కొరకూ సకల దైవ సృష్టి మానవుల కొరకూ ప్రపంచంలోనూ పరలోకంలోనూ ఆపాద మస్తకం ప్రయోజ

నమూ కారుణ్యమే కాగలదు' తెలిపే దాన్ని బట్టి ఈ సముదాయం సందేశా త్మక, సంస్కరణాత్మక ఉభయ కార్యాలూ చేపట్టవలసి ఉంటుంది. ఇది ఉత్తమ సమాజం కావటాన అది **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** విధిని తన పరిధిలోనూ నిర్వర్తించవలసి ఉంటుంది. వెలుపలనూ నిర్వర్తించవలసి ఉంటుంది. ఇదే మాటను ముల్లా జీవన్ ఇలా నుడివారు, 'ఈ సముదాయం తిరస్కారుల కొరకు- పోరాడటానికి, సాధారణ విశ్వాసుల కొరకూ ప్రభవింపజేయబడింది' అని. [1]

## ఇది కుర్ఆన్ ఇచ్చిన సర్వ సాధారణ ఆదేశం

**'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** విస్తృతిని, సమగ్రతను అర్థం చేసుకునేందుకు మరో ఆయత్‌ని గమనించండి. ఇందులో ముస్లిం సముదాయానికి ఆదేశమయింది:

وَلْتَكُنْ مِّنْكُمْ اُمَّةٌ يَّدْعُوْنَ اِلَى الْخَيْرِ وَ يَأْمُرُوْنَ بِالْمَعْرُوْفِ وَ يَنْهَوْنَ عَنِ الْمُنْكَرِ وَاُولٰئِكَ هُمُ الْمُفْلِحُوْنَ (آل عمران: ١٠٤)

**'మీలో కొందరు మంచి వైపునకు పిలిచేవారు, సత్కార్యాలను ఆదేశించేవారు, దుష్కార్యాలను నిరోధిస్తూ ఉండేవారు తప్పనిసరిగా ఉండాలి. ఈ కార్యాలు చేసే వారే సాఫల్యం పొందేవారు.'**

*(ఆలి ఇమ్రాన్ : 104)*

మునుపటి ఆయత్‌లో 'జనుల కొరకు ప్రభవింపజేయబడ్డారు' అన్న పదాలు, ఈ సముదాయం సకల మానవాళి కొరకు ప్రభవింపజేయబడింది అన్న అర్థాన్ని, వారికి మారూఫ్‌ని ఆదేశించేందుకు మున్కర్‌ని వారించేందుకు అన్న అర్థాన్నీ తెలుపు తున్నాయి. మరి ఈ ఆయత్‌లోనయితే శుభం వైపునకు పిలువడానికి, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**నకూ అన్న సర్వసామాన్య భావాన్నీ ఆదేశ రూపంలో అందజేయడం జరిగింది. అంటే ఈ ఆయత్‌లోనూ 'జనుల కొరకు ప్రభవింపజేయ బడటం' అన్న భావం స్ఫురిస్తుంది. ఎందుకంటే ఇక్కడ సముదాయం ఏదో ఒక

---

*1. అల్లామా సావీ, ముల్లా జీవన్ తమ వివరణల్లో ముస్లిమ్ సముదాయం ప్రవక్తల ఎడల సాక్ష్యం పలకడాన్నీ ప్రస్తావించారు. భావమేమిటంటే, ఏవిధంగానయితే ముహమ్మద్ (స) దైవధర్మం అందజేశారో, అన్ని కాలాలలో దైవప్రవక్తలు తమ తమ జాతులకు దైవధర్మం అందజేస్తూ ఉన్నారు అని ముస్లిమ్ సముదాయం ప్రళయం నాడు సాక్ష్యం పలుకుతుందన్నమాట. ఇప్పుడే జాతి అయినా ఈ యదార్థాన్ని కాదంటే అది అబద్ధం పలుకుతోంది, (దైవధర్మాన్ని పాటించకపోయే) తన అపరాధాన్ని దాచి పెడుతోంది.*

వర్గానికో, సమాజానికో **'అమ్ర్ బిల్ మారూఫ్, నహీ అనిల్ మున్కర్'** విధిని నిర్వర్తించాలని బోధించబడలేదు, విషయం సర్వసామాన్యంగా ఆదేశించడం జరిగింది. అందువల్ల ఈ సముదాయానికి ప్రతి వర్గంలో, ప్రతి సమాజంలో అంటే సమస్త మానవాళి మధ్యన మారూఫ్‌ని ఆదేశించాలని, మున్కర్‌ని వారించాలని విధిగా నిర్ణయించడం జరిగింది.

అల్లామా సయ్యద్ మహ్మూద్ ఆలూసీ ఇలా అంటున్నారు:

**حذف المفعول الصريح من الأفعال الثلاثة اما للاعلام بظهوره اى يدعون الناس و لو غير مكلّفين و يامرونهم و ينهونهم و اما للقصد الى ايجاد نفس الفعل على حد فلان يعطى اى يفعلون الدعاء و الأمر و انهى ويوقعونها**

**విశదమయిన 'కర్మ' వాచకాన్ని మూడు క్రియా వాచకాల నుండీ లుప్తం చెయ్యడం జరిగింది (అంటే ఆయత్‌లో, శుభం వైపునకు పిలుపు, మంచికి ఆదేశం, చెడును వారించడం ఎవరి పట్ల నిర్వర్తించాలో తెలుపలేదు). ఇలా లుప్తం చెయ్యడం రెండు కారణాల వల్ల జరిగింది. (ఒకటి) ఈ క్రియల కర్మ స్వయంగానే విశద మయింది అన్న విషయం ప్రస్ఫుటపరచడానికి. అంటే వారు జనులకు పిలుపునిస్తారు, జనులు ఆ పిలుపునకు తగినవారా, కారా అన్న ప్రమేయం లేకుండా అందరికీ పిలుపునిస్తారు, మారూఫ్‌ను ఆదేశిస్తారు, మున్కర్‌ను వారిస్తారు. (రెండు) లేదా ఇలా లుప్తపరచడానికి కారణం, అసలు ఉద్దేశ్యం, క్రియను అమలు పరచడం. ఉదాహరణకు, ఫలానా వ్యక్తిని దాత అని అంటారు (అతను ఎవరికి ఇస్తాడో చెప్పడం ఉద్దేశమయి ఉండదు). అదేవిధంగా వారు సందేశం అందజెయ్యడం, మంచిని ఆదేశించడం, చెడును వారించడం అనే విధి నిర్వహణ చేస్తారు, ఆ కార్యాల నిర్వహణను అమలుపరుస్తారు.**

*(రూహుల్ మఆనీ, రెండవ సంపుటం, 4వ భాగం, పుట- 238)*

అంటే అల్లామా దృష్టిలో ఆయత్‌లోని సాధారణతకు రెండు కారణాలు కావచ్చు. ఒకటి, వినాయింపు లేకుండా ఎల్లరికీ మారూఫ్ ఆదేశమిచ్చి, మున్కర్‌ని నిరోధించాలి అన్నది. రెండవది, ఈ సముదాయం చేత మారూఫ్‌ను ఆదేశించే మున్కర్‌ని వారించే కార్యం నిర్వహించబడుతూ ఉంటుంది అన్నది. ఈ కార్యం ఏ సమాజం, ఏ వర్గం మధ్యన నిర్వర్తించబడాలి అన్న విషయం తెలుపడం ఉద్దేశ్యం కానేకాదు. కాని ఇలా అయినట్లయితే ఆయత్‌లోని సాధారణతలోని ఉద్దేశ్యం పూర్తిగా విశదమవదు. చాలా స్పష్టమయిన విషయమేమిటంటే కుర్‌ఆన్‌లో '**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**' ఆదేశం సర్వసాధారణంగా ఇవ్వడం జరిగింది. ముస్లిమ్ సముదాయం అంతే సాధారణతతో దాన్ని అమలుపరచాలి.

ఒకవైపున అగణ్యమయిన మానవులు దైవధర్మం ఏమిటో అసలు ఏమాత్రం ఎరుగకనే ఏమరుపాటులో జీవిస్తున్నారు. మరోవైపున ముస్లిమ్ సముదాయంపైన **అమ్రెబిల్ మారూఫ్ వ నహీ మున్కర్** విధి విధితమవుతుంది. ఈ విధి సముదాయంపై నుండి తొలగాలంటే సముదాయం తన శక్తినంతా ఉపయోగించి దైవధర్మాన్ని మానవాళి నంతటికీ చేరవేసేందుకు ప్రయత్నం చేయాలి. మానవుల్లో దైవధర్మమేమిటో అసలు పూర్తిగా ఎరుగనివారూ ఉన్నారు, లేదా దాన్ని నమ్మినా దానికి తిరుగుబాటు దారులుగానో లేదా విముఖులయినవారు గానో ఉన్నారు. సముదాయం చేయవలసిన ఈ పనిని మేము ఈ వర్గాలలో ఏ ఒక్క వర్గానికో ప్రత్యేకించలేము. ఎందుకంటే మానవుల ఒక వర్గాన్ని దైవశిక్ష నుండి రక్షించే ప్రయత్నం చేసే సముదాయం, మరో వర్గాన్ని అందులో చిక్కుకునేలా చేసినట్లయితే ఇది కుర్‌ఆన్ ఉద్దేశ్యాన్ని ఉల్లంఘించడమవుతుంది. అలా చేసి సముదాయం తన కర్తవ్యం పట్ల ఎన్నటికీ కృతకృత్యురాలు కాజాలదు. దైవధర్మం గురించి ఎరుగని ప్రతి వ్యక్తి, ప్రతి జాతి వరకు అది చేరాలని అల్లాహ్ కోరుకుంటున్నాడు. మారూఫ్ సమసిపోతున్న చోట అది పునరుజ్జీవింపజేయబడాలని, మరి ఎక్కడయితే మున్కర్ వర్ధిల్లుతుందో అక్కడ దాన్ని రూపుమాపాలని అల్లాహ్ కోరుకుంటున్నాడు. చెడుగు అన్నది ఏ వ్యక్తిలో ఉన్నా ఏ కుటుంబంలో, ఏ తెగలో ఉన్నా, ఏ వీధి చెడుగుల్లో మునిగి ఉన్నా, ఏ నగరం చెడుల్లో తేలియాడుతున్నా, చెడుగు అన్నది సముదాయంలో ఉన్నా లేదా దేశంలోనో ప్రాంతంలోనో ప్రబలుతున్నా అది తప్పనిసరిగా అంతం కావలసిందే. కడకు ప్రతి వ్యక్తి, ప్రతి సమాజంలోని ప్రజలు దైవధర్మం, ఆయన షరీఅత్‌కు విధేయులయి ఆయన ఆదేశాలకు తల ఒగ్గి జీవితం గడిపేవారయిపోవాలి.

వాస్తవం ఏమిటంటే **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** అన్నది కుర్‌ఆన్‌లోని అతి సమగ్రమయిన పారిభాషిక పదం. మారూఫ్ వ మున్కర్‌లో దైవ ధర్మం దాని సకల వివరాలతోనూ, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌**లో దైవధర్మంలోని ప్రతి అల్ప స్వల్పమయిన సేవ కూడా వచ్చేస్తుంది. ఈ కారణంగానే ఇబ్నుల్ అరబీ మాలికీ ఇలా అన్నారు :

**الامر بالمعروف و النّهى عن المنكر باب عظيم هو ابتداء الدين و الاِسلام وهو ايضاً انتهاؤه**

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ అన్నది ఓ మహత్తరమయిన విషయం. ఇస్లామ్ ధర్మానికి ఆరంభమూ అదే అంతమూ అదే.**

*(అహ్కాముల్ కుర్‌ఆన్ : 1/ 295)*

దివ్యకుర్‌ఆన్ నిర్దేశాలు, పండితుల విశదీకరణల ద్వారా విదితమయ్యే దాన్ని బట్టి '**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**'లో సందేశ ప్రచారం, వ్యవస్థీకరణ, శిక్షణలు ఉభయ విధాల కార్యాలూ చేరి ఉన్నాయి. దీని భావమేమిటంటే ఈ విధిని ముస్లిమ్ సముదాయం ఇస్లామేతర వాతావరణంలోనూ నిర్వర్తించవలసి ఉంటుంది, ఇస్లామీయ వాతావరణంలోనూ నిర్వర్తించవలసి ఉంటుంది. ఇస్లామేతర వాతావరణంలో మిథ్యా వాదాలపైన విమర్శలు చెయ్యడం, తిరస్కారం, బహు దైవ భావనల కెదురుగా ఇస్లామ్‌ను బలోపేతంగా ముందుంచడం, మిథ్యను సమసింపజేసి సత్యాన్ని జయింపజేసేందుకు కృషి సలపడం, ఈ మార్గంలో ధన ప్రాణాలను పణంగా పెట్టడం '**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**' అనిపిస్తుంది. ఇస్లామీయ సమాజంలో ఈ పని- సమాజాన్ని పటిష్ఠపరచడం, అందులో చెడు పొడసూపకుండా చూడటం, దాన్ని సంస్కరించే ప్రయత్నం చెయ్యడం, ఇంకా అది ప్రపంచంలో ఇస్లామ్ ఉన్నతికి మార్గమయ్యేలా దాన్ని సమాయత్తపరచడం - ఇవీ ఈ విధి నిర్వహణలోని అంశాలు.



# 7. ధర్మ సందేశం

ప్రవక్త మహనీయులు ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లమ్)కు దైవధర్మం అత్యంత వ్యతిరేక వాతావరణంలో అవతరించిన విషయం ఒక చారిత్రక వాస్తవం. దాని వ్యవస్థ సమకాలీన వ్యవస్థతో, దాని నైజం సమకాలీన నైజంతో పూర్తిగా భిన్న మయినది. దాని ఆచరణా విధానం ఆ కాలంలో ప్రపంచం సాగుతున్న దారులకు ఎంతో వేరయినది. ఆ ధర్మాన్ని జనులు అర్థం చేసుకోలేకపోయారు. దాని పేరెత్తితేనే గాభరా పడిపోయేవారు. సాహసవంతులెవరయినా దాన్ని స్వీకరించినా వారు తమ తెగ పరిధులకు దూరమయి పోయేవారు. వాతావరణం వారిని స్వీకరించడానికి, వారిని భరించడానికీ సిద్ధపడేది కాదు. కాని క్రమేణ పరిస్థితులు మారసాగాయి. వాతావరణం లో నెమ్మదిగా మార్పు రాసాగింది. జనులు దైవధర్మానికి దగ్గరవసాగారు. భిన్న వర్గాల నుండి జనం ఆకర్షితులయి దాని నీడలోకి చేరసాగారు. దాని పునాదులు పటిష్టమవసాగాయి. ఈ ధర్మం కొరకు ప్రవక్తశ్రీ (స) ఆయన సహచర మాన్యులు ఎన్నో త్యాగాలు సమర్పించారు. ఇటువంటి త్యాగాలు చరిత్ర ఉదాహరణగా చూపదలిచినా చూపజాలదు. వారు నిర్ధనులు, బలహీనులు, అల్పసంఖ్యాకులు. దీనికి భిన్నంగా వీరి విరోధులు అన్నివైపులా వ్యాపించి ఉన్నారు. ధన సామగ్రి మెండుగా ఉన్నవారు. సంఖ్యా బలమూ అధికమే. అయినప్పటికీ ఆయన (స) సహచరులు ఎన్నడూ ధైర్యం వీడలేదు, సహనం స్థయిర్యంతో ప్రతీప శక్తుల్ని ఎదిరిస్తూనే ఉన్నారు. కడకు విరోధి బలగాలపైన వారికి ఆధిక్యత ప్రాప్తమయింది. దేవుని ఆ నేలపైన ఆయన ప్రభుత నెలకొన్నది. నేటికి 1400 ఏళ్ళకు పూర్వం గడించిన ఈ మహత్కార్యం, '**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముంకర్**'కు సమగ్రమయిన, ప్రామాణికమయిన, ఆచరణాత్మకమయిన వ్యాఖ్యానం! ఈ మహత్కార్యాన్ని విశ్లేషిస్తే అది మూడు భిన్నకార్యాల సంచయనం అని తేలుతుంది:

**1)** ధర్మప్రచారం **2)** దైవమార్గంలో సతత సమరం **3)** ఇస్లామీయ రాజ్యస్థాపన

ఇందులో ప్రతి పని 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్' అనబడుతుంది. ఎందుకంటే వీటన్నింటి లక్ష్యం ఒక్కటే, మారూఫ్‌ని స్థాపించడం, మున్కర్‌ని రూపుమాపడం. ధర్మప్రచారమయినా, సతత సమరమయినా, రాజ్యమయినా **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** కొరకు కాకపోయినట్లయితే అది దైవధర్మ ప్రచారమూ కాదు, దైవమార్గంలో సమరమూ కాదు, అది దైవ ఆజ్ఞానుసారమయిన, దైవ శాసనబద్ధమయిన రాజ్యమూ కాదు.

తొలుత మనం ధర్మప్రచార విషయాన్ని చర్చిద్దాము. ఆ తరువాత దైవమార్గంలో సతత సమరం గురించి, పిదప ఇస్లామీయ రాజ్యం గురించి చర్చిద్దాం.

## ధర్మమూ షరీఅత్‌ల ప్రచారం

**'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** అనే ఈ పారిభాషిక పదాలలో 'ఆదేశం' 'నిషేధం' అన్న అంశాల కారణంగా కొన్ని సందర్భాలలో ఒక అనుమానం కలుగుతుంది, బహుశా ఇది సందేశాత్మకమయిన, ప్రచార సంబంధమయిన కార్యం కాదేమో, దీనికొరకు అధికారం, సత్తా తప్పక అవసరమేమో అనిపిస్తుంది. కాని గత పుటలలో మనం **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** అన్నదానికి పరిశీలించిన అర్థం, భావం, వివరణలలోనూ, దాని విస్తృతి, సమగ్రతల పట్ల చేసిన చర్చలలోనూ ఈ అనుమానం దానంతట అదే ఖండించబడుతుంది. ఇంకా **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'**లో ధర్మప్రచారం కూడా చేరి ఉందన్న విషయం పట్ల ఎటువంటి అనుమానం మిగులదు. అయినా, ఇక్కడ కొందరు విజ్ఞులయిన పండితుల రెండు మూడు విశదీకరణలు ప్రస్తుతపరుస్తున్నాము:

దివ్యకుర్ఆన్ 'ఖైర ఉమ్మత్' (శ్రేష్ఠ సమాజం)ప్రత్యేక లక్షణాన్ని గురించి తెలుపుతూ వివరించిన విషయం, అది మారూఫ్‌ని ఆదేశిస్తుంది, మున్కర్‌ని వారిస్తుంది అన్నది. దీన్ని అల్లామా ఇబ్నుజరీర్ ఇలా వివరించారు :

**قوله تامرون بالمعروف فانه يعنى تامرون بالايمان بالله ورسوله و العمل بشرائعه وتنهون عن المنكر يعنى وتنهون عن الشرك**

**'మీరు మారూఫ్‌ని ఆదేశిస్తారు' అని చెప్పడం పట్ల పరమ ప్రభువు అల్లాహ్ ఉద్దేశ్యం, అల్లాహ్‌ను, ఆయన సందేశహరుణ్ణి విశ్వసించాలని, ఆయన షరీఅత్‌ను అమలు పరచాలనీ మీరు ఆదేశిస్తారు అన్నమాట. అలాగే 'మున్కర్‌ని వారిస్తారు' అన్న దాని భావమేమిటంటే,**

بالله و تكذيب رسولـه و عن العمـل بما نهى عنـه

అల్లాహ్‌తో పాటు సహవర్తులను, ఆయన సందేశహరుని అబద్ధీకరణను, మరాయన ఏ ఏ విషయాలను వారించాడో వాటికి పాల్పడ కుండా ఉండాలనీ మీరు వారిస్తారు అన్నమాట.

*(జామిఉల్ బయాన్ ఫీ తఫ్సీరుల్ కుర్ఆన్: 4/ 28)*

ముల్లా జీవన్ ఇలా అంటున్నారు :

تامرون بالمعروف اى بالايمان بمحمـد والقـراٰن او بجميـع الطاعات و تنهون عن المنكر اى عن الكفر وسائر المعـاصى

'మీరు మారూఫ్‌ను ఆదేశిస్తారు' అంటే ముహమ్మద్(స)ని కుర్ఆన్‌ని విశ్వసించమని ఆదేశిస్తారు, మరో మాటలో సమస్త విధేయత లను పాటించమని ఆదేశిస్తారు అన్నమాట. 'మున్కర్'ని వారిస్తారు' అంటే తిరస్కారాన్నీ సమస్త పాపాలను వారిస్తారు అన్నమాట.

*(అత్ తఫ్సీరాతుల్ అహ్మదియ్యా : పుట. 124)*

అదే విధంగా కుర్ఆన్ ఆదేశం, శుభం వైపునకు పిలుపునకు, అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కొరకు సముదాయంలో ఒక వర్గం నిత్యం ఉండా లన్నది. దాని విషయంలో ఇమామ్ షౌకానీ ఇలా వ్యాఖ్యానించారు :

عن الضحاک فى قوله يامرون بالمعروف قال يدعون الى الاِيمان بالله ورسوله والنفقات فى سبيل الله وما كان من طاعة الله و ينهون عن الشرک والكفر

జహ్హాక్ ప్రకారం, మారూఫ్‌ని ఆదేశించే ఒక వర్గం మీలో ఉండాలన్న దైవాదేశానికి భావ మేమిటంటే, అల్లాహ్‌ను, ఆయన సందేశ హరుణ్ణి విశ్వసించాలని, ఆయన మార్గంలో ఖర్చు పెట్టాలని, ఆయన ఆదేశాన్ని ప్రతి దాన్నీ పాటించాలనీ పిలుపునిచ్చేందుకు, మున్కర్‌ను వారించేందుకు– అంటే తిరస్కారం, బహుదైవా రాధనలను వారించేందుకు (ఒక వర్గం ఉండాలి) అన్నమాట.

*(ఫత్‌హుల్ కదీర్: 1/ 471)*

ఈ విశదీకరణల తరువాత ఏ వ్యక్తీ ఈ వాస్తవికతను కాదనలేడు. సముదాయం లోని విజ్ఞులయిన పండితుల దృష్టిలో అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌లో

ఒక కోణం, జనుల్ని అల్లాహ్, దైవ సందేశహరుడు, కుర్ఆన్ వైపునకు పిలుపునివ్వడం కూడా ఉంది. అలాగే తిరస్కారం, బహుదైవవాదం, దైవ దౌత్యనిరాకరణను వారించటం కూడా అందులో ఉంది. అంతేకాదు, ప్రఖ్యాత తాబయీ (తాబయీ అంటే ప్రవక్త సహచరుల (సహాబా)కు అనుచరులు) అబుల్ ఆలియా ఇలా కూడా అన్నారు :

**كل ماذكره الله فى القرآن من الأمر بالمعروف و النهى عن المنكر، فالأمر بالمعروف دعاء من الشـرك الى الاسـلام و النهى عـن المنكر النهى عن عبادة الأوثان والشياطين**

**అల్లాహ్ దివ్యకుర్ఆన్‌లో అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ ప్రస్తావించిన ప్రతిచోటా అమ్ర్ బిల్ మారూఫ్ అని అంటే షిర్క్ నుండి ఇస్లామ్ వైపునకు మరలడానికి పిలుపునివ్వడం; నహీ అనిల్ మున్కర్ అని అంటే భావం విగ్రహాల, షైతానుల ఆరాధనను వారించడం.**

*(జామిఉల్ బయాన్ ఫీ తఫ్సీరుల్ కుర్ఆన్, ఇబ్ను జరీర్ : 10/ 109)*

## అమ్ర్ బిల్ మారూఫ్ ఆదేశమయింది మక్కాలో

**'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** అన్నది కేవలం రాజకీయ కార్యమా లేదా సందేశాత్మక కార్యం కూడానా అన్న అంశం తేల్చడానికి అత్యంత సంతృప్తికరమయిన మార్గం ఒక్కటే; దైవ సందేశహరులు(స) కార్యక్రమాలపైన దృష్టి సారిస్తే సరిపోతుంది. ఆయన అమ్ర్ బిల్ మారూఫ్ విధిని కేవలం అధికారం, సత్తా, ప్రభుత ప్రాప్తమయిన తరువాతనే నిర్వర్తించారా లేదా అంతకు పూర్వం కూడా నిర్వర్తించారా? అన్నది పరిశీలించాలి. ఆయన వ్యక్తిత్వమే మనకు ఆదర్శం. ఆయన అడుగుజాడలు ముద్రితమయిన దారినే మనం నడవవలసి వుంది, ఆయన చేసిన పనులే మనం చేయవలసి ఉంది. మన ప్రశ్నకు సమాధానం ఆరాఫ్ సూరాలో లభిస్తుంది. అందులోనే ఆయన(స)కు **అమ్ర్ బిల్ మారూఫ్** ఆదేశమయింది. ఆరాఫ్ సూరా మక్కీ సూరా. ఈ సూరాలో అమ్ర్ బిల్ మారూఫ్ ఆదేశం వల్ల తెలిసేదేమిటంటే ఇస్లామేతర వాతావరణంలో ధర్మ ప్రచారం కూడా 'అమ్ర్ బిల్ మారూఫ్'గానే పిలువ బడుతుంది. ఎందుకంటే ఆయన(స) మక్కాలో ఉన్నంతకాలం దైవధర్మ ప్రచారమే చేస్తూ ఉన్నారు. అప్పుడు ఆయన(స) అధికారంలో లేరు. రాజ్య శక్తి ద్వారా **అమ్ర్ బిల్ మారూఫ్** వ **నహీ అనిల్** మున్కర్ విధిని నిర్వర్తించడానికి. ఇది అమ్ర్ బిల్ మారూఫ్‌లో ధర్మప్రచారం కూడా చేరి ఉందనడానికి ఆధారం మాత్రమే కాదు, అమ్ర్

బిల్ మారూఫ్ అన్నది, ధర్మప్రచారంతోనే ప్రారంభమవుతుంది అనడానికి కూడా ఆధారమవుతుంది. దీని రాజకీయ రూపం ఆ తరువాతనే మొదలవుతుంది. ఇక ఆరాఫ్ సూరాలో అవతరించిన ఆదేశమేమిటో వినండి :

خُـذِ الْعَفْوَ وَ اْمُـرْ بِالْعُـرْفِ وَ اَعْرِضْ عَنِ الْجَاهِلِيْنَ (الاعراف:١٩٩)

**ప్రవక్తా, మెతక వైఖరిని, చూపోవు విధానాన్ని పాటించు, ప్రసిద్ధ సత్కార్యాలను బోధిస్తూ ఉండు, మూర్ఖులతో పేచీ పెట్టుకోకు.**
*(అల్ ఆరాఫ్ : 199)*

ఆయత్‌లో 'ఉర్ఫ్' అన్న పదం ప్రయోగించడం జరిగింది. ఇది ('మారూఫ్'కు మూల పదం) మారూఫ్‌కు సమానార్థకం, దైవధర్మం, ధర్మాదేశాలు (షరీఅత్) అన్నింటికీ వర్తిస్తుంది. బహు దైవ భావాలకే అధికారం, ప్రభుత ఉన్న వాతావరణంలో ఈ ఆదేశం ఆయన(స)కు ప్రాప్తమయింది, ఆ వాతావరణం, దాని నైజం, నిర్మాణం రీత్యా తౌహీద్ (దేవుని ఏకత్వ భావన)కు పూర్తిగా వ్యతిరేకమయింది. కాగా ఆయన(స) తౌహీద్ ప్రకటన చేయగానే వాతావరణమంతా శత్రువయిపోయింది. అన్ని వైపుల నుండి తూలనాడులు, వెటకారాలు, ఎదురుదాడులు మొదలయ్యాయి. ఆయన ఎన్నెన్నో బాధలు, ఇక్కట్లు, ఇబ్బందులు ఎదుర్కోవలసి వచ్చింది. వాటిని ఆలోచిస్తేనే అంతర్యం జలదరిస్తుంది. ఈ పూర్వ రంగంలో **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్** మున్కర్‌ని నిర్వర్తించడం అంటే స్పష్టమయిన అర్థం, పరిస్థితులు ఎంత కఠినమయినవయినా, ఎంతగా సున్నితమయినవయినా దైవధర్మం ఆయన దైవదాసులయిన మానవులకు నిరంతరం చేరవేస్తూ ఉండాలన్న మాట, అందులో ఎటువంటి లోటు రానివ్వరాదన్నమాట. ఇక్కడ ఓ మాట మరువరాదు. ఈ ఆదేశం ధర్మంలోని ఏదో ఒక కోణాన్ని ప్రచారం చెయ్యాలన్నది కాదు, పూర్తి ధర్మం ప్రచారం జరగాలి, ధర్మంలో ఏ భాగాన్నీ వేరు చెయ్యడానికి వీల్లేదు.

ఇమామ్ ఇబ్ను జరీర్ తబ్రీ (రహ్మ) ఇలా అంటున్నారు :

ان الله امر نبيه صلى الله عليه وسلم ان يامر الناس بالعرف و هو المعروف فى كلام العرب ... فمن المعروف صلة الرحم من

**జనులకు 'ఉర్ఫ్' పట్ల ఆదేశమివ్వాలని అల్లాహ్ తన ప్రవక్తకు చెప్పాడు. అరబీ సారస్వతంలో మారూఫ్‌ను ఉర్ఫ్ అని అంటారు... మరి మారూఫ్‌లో, మనతో సంబంధాన్ని త్రెంచే వారితో సంబంధాన్ని పటిష్టం చేసుకోవడం,**

قطع واعطاء من حرم والعفو عمن ظلم وكل ما امر الله به من الاعمال اوندب اليه فهو من العرف ولم يخصص اللـه من ذلک معنى دون معنى فالحق فيه ان يقال قد امر الله نبيه صلى الله عليه و سلم ان يامر عبـاده بالمعروف كله لاَ ببعض معانيه دون بعض

మనల్ని మన హక్కు నుండి వంచితులుగా చేసే వారికి వారి హక్కులను అందజెయ్యడం, మనపైన అన్యాయం చేసేవారిని మనం మన్నించడం వంటి ఆచరణలూ చేరి ఉన్నాయి. ఇంకా అల్లాహ్ ఆదేశించిన, ఆయన ప్రోత్స హించిన ఆచరణలన్నీ మారూఫ్‌లో చేరి ఉన్నాయి. తన ఈ ఉపదేశంలో 'మారూఫ్' అన్న పదానికి అల్లాహ్ ఏ ప్రత్యేక, పరిమిత అర్థాన్ని ప్రత్యేకించలేదు, అందువల్ల ఈ వ్యవహారంలో సరయిన విషయం ఏమిటంటే, అల్లాహ్ తన ప్రవక్తకు, తన దాసులయిన మానవులకు సమస్త ప్రసిద్ధ మంచి విషయాల (మారూఫాత్) పట్ల ఆదేశించమని ఆజ్ఞాపించాడు. అంతేగాని కొన్నింటిని ఆదేశించి కొన్నింటిని వదలిపెట్ట మని కాదు.

*(జామిఉల్ బయాన్ ఫీ తఫ్సీరుల్ కుర్ఆన్: 9/98)*

అమ్ర్ బిల్ మారూఫ్‌ని వ్యాఖ్యానిస్తూ 'ఖాజిన్', 'బగవీ' కేవలం కొన్ని పదాలే ప్రయోగించారు. అయినప్పటికీ ఈ ఆదేశం, దైవం తరఫున ముహమ్మద్(స)కు లభించిన ధర్మం మొత్తాన్ని ప్రచారం చెయ్యడం పట్ల ఆవృతమయి ఉందన్న విషయాన్ని సవివరంగా చెప్పివేశారు. 'ఖాజిన్' ఇలా అంటున్నారు :

و امر بالعرف يعنى وامر بكل ما امرک الله به وهو ما عرفته بالوحى من الله عز وجل وكل ما يعرفه الشارع

'ఉర్ఫ్'ను ఆదేశించు, అంటే అల్లాహ్ నీకు ఆదేశించిన ప్రతి విషయాన్నీ ఆదేశించు అని అర్థం. ఇందులో అల్లాహ్ పక్షాన అవతరించిన వహీ ద్వారా ఆయన(స)కు తెలిసిన ప్రతి విషయం ఇందులో చేరి వుంది; 'శాసనకర్త' (ప్రవక్త) ఎరిగిన ప్రతి విషయమూ ఉర్ఫ్‌గా పరిగణించబడుతుంది.

*(లుబాబుత్తావీలు అలా మఆనియిత్తన్జీల్: 2/ 270)*

అల్లామా బగవీ ఇలా అంటున్నారు-

وامر بالعرف ای بالمعروف وهو کل ما یعرفه الشرع

**'ఉర్ఫ్' అంటే 'మారూఫ్'ని ఆదేశించు. దీని ఉద్దేశం, షరీఅత్ ఎరుకలో ఉన్న ప్రతి విషయం అన్నమాట.**

*(మఆలిముత్తన్జీల్ అలా హామిషి అల్ ఖాజిన్: 2/ 270)*

అల్లామా సయ్యిద్ మహ్మూద్ ఆలూసీ ఇలా అంటున్నారు :

قال عطاء المراد بالعرف کلمة لاَ اله الاّ الله وهو تخصيص من غير داع

**'అతా' ప్రకారం, 'ఉర్ఫ్' అని అంటే ఉద్దేశం లా ఇలాహ ఇల్లల్లాహ్ అన్న సద్వచనం. కాని ఈ ప్రత్యేకత అకారణమయింది (అంటే ఇది సర్వసామాన్యం కావాలి).**

*(రూహుల్ మఆనీ, 5వ సంపుటం, 9వ భాగం, పుట. 137)*

## అమ్ర్ బిల్ మారూఫ్‌లో నహీ అనిల్ ముస్కర్ చేరి ఉంది

ఈ ఆయత్‌లో కేవలం 'అమ్ర్ బిల్ మారూఫ్' ప్రస్తావనే ఉంది, 'నహీ అనిల్ ముస్కర్' ప్రస్తావన లేదు. అలాగే కొన్ని ఆయత్‌లలోనూ హదీసుల్లోనూ కేవలం 'నహీ అనిల్ ముస్కర్' ప్రస్తావనే ఉంది, అమ్ర్ బిల్ మారూఫ్ ప్రస్తావన లేదు. అయితే ఇది కేవలం పదాల వరకే పరిమితం. నిజానికి అమ్ర్ బిల్ మారూఫ్ ఆదేశంలో నహీ అనిల్ ముస్కర్, నహీ అనిల్ ముస్కర్ ఆదేశంలో అమ్ర్ బిల్ మారూఫ్ వాటంతట అవే చేరి ఉన్నాయి. ముల్లా అలీ కారీ ఇలా అన్నారు :

الاٰمر بالمعروف يعم النهى عن المنكر

**అమ్ర్ బిల్ మారూఫ్‌లో నహీ అనిల్ ముస్కర్ చేరి వుంది.** *( మిర్కాతుల్ మసాబీహ్: 8/ 860)*

అల్కామీ ఇలా అంటున్నారు :

الاٰمر بالشیء نهى عن ضده

**ఏదయినా ఒక విషయాన్ని ఆదేశించడం (వాస్తవానికి) దాని వ్యతిరేక విషయాన్ని వారించడమే అవుతుంది.**

*(అల్ అక్లీల్ అలా మదారికుత్తన్జీల్ : 4/ 189)*

ఇదేవిధంగా ఒక హదీసులో దైవసందేశహరులు (స) 'మున్కర్‌ను మార్చే' ఆదేశమయితే ఇచ్చారు. అయితే దాని స్థానే మారూఫ్‌ని స్థాపించే ప్రస్తావన చెయ్యలేదు. దాని కారణం తెలుపుతూ ముల్లా అలీ కారీ ఇలా అన్నారు :

لِان النهى عن المنكر شامل له اذ النهى عن الشي امر بضده

**ఎందుకంటే నహీ అనిల్ మున్కర్‌లో అమ్ర్ బిల్ మారూఫ్ కూడా చేరి ఉంది. నిజానికి ఏదయినా ఒక విషయాన్ని వారించడం అంటే దాని వ్యతిరేక విషయాన్ని ఆదేశించడం అన్నమాట.**

*(అల్ ముబీనుల్ ముయీన్ లి ఫహ్మిల్ అర్బయీన్ : 189)*

## మారూఫ్‌ను ఆదేశించడం, మున్కర్‌ను వారించడం

పై చర్చను అలా ఉంచి, ఇదే ఆరాఫ్ సూరాలోని మరో ఆయత్‌లో ఈ రెండు ఆదేశాలు ఒకేచోట పేర్కొనబడ్డాయి. గ్రంథవహుల ప్రస్తావన ఇలా వుంది :

اَلَّذِیْنَ یَتَّبِعُوْنَ الرَّسُوْلَ النَّبِیَّ الْاُمِّیَّ الَّذِیْ یَجِدُوْنَهٗ مَكْتُوْبًا عِنْدَهُمْ فِی التَّوْرٰىةِ وَالْاِنْجِیْلِ یَاْمُرُهُمْ بِالْمَعْرُوْفِ وَ یَنْهٰىهُمْ عَنِ الْمُنْكَرِ وَ یُحِلُّ لَهُمُ الطَّیِّبٰتِ وَ یُحَرِّمُ عَلَیْهِمُ الْخَبٰٓىِٕثَ وَیَضَعُ عَنْهُمْ اِصْرَهُمْ وَالْاَغْلٰلَ الَّتِیْ كَانَتْ عَلَیْهِمْ فَالَّذِیْنَ اٰمَنُوْا بِهٖ وَعَزَّرُوْهُ وَ نَصَرُوْهُ وَاتَّبَعُوا النُّوْرَ الَّذِیْۤ اُنْزِلَ مَعَهٗۤ اُولٰٓىِٕكَ هُمُ الْمُفْلِحُوْنَ۠ (الاعراف:۱۵۷)

**వారు ఈ సందేశహరుడు, నిరక్షరాసి ప్రవక్తను అనుసరించేవారు. ఇతని ప్రస్తావన వారికి తమ వద్ద ఉన్న తౌరాత్‌లోనూ ఇన్జీల్‌లోనూ వ్రాత మూలకంగా కానవస్తుంది. అతను వారిని సత్కార్యాల కొరకు ఆదేశిస్తాడు, చెడు నుండి నిరోధిస్తాడు. వారి కొరకు పరిశుద్ధ పదార్థాలను ధర్మసమ్మతంగా, అశుద్ధ పదార్థాలను అధర్మ మయినవిగా నిర్ణయిస్తాడు. వారు మోస్తున్న బరువుల్ని వారి నుండి దించివేస్తాడు, వారిని బిగించుకున్న బంధనాలను విడదీస్తాడు. కనుక ఇతన్ని విశ్వసించి, ఇతన్ని సమర్థించి, సహక రించేవారు, ఇతనికి అవతరించిన జ్యోతిని అనుసరించేవారు– వీరే సాఫల్యం పొందేవారు.**

*(అల్ ఆరాఫ్ :157)*

ఈ ఆయత్‌లో దైవ సందేశహరుని మూడు లక్షణాలను పేర్కొనడం జరిగింది: మొదటిది, ఆయన మారూఫ్‌ని ఆదేశిస్తారు, మున్కర్‌ని వారిస్తారు. రెండవ లక్షణం, ఆయన పరిశుద్ధ పదార్థాలను హలాల్, ధర్మసమ్మతంగాను అశుద్ధమయిన వాటిని

హరామ్, అధర్మమయినవిగాను నిర్ణయిస్తారు. మూడవది, అనవసరమయిన భారాన్ని తొలగిస్తారు, బంధనాలను విడదీస్తారు. తరువాతి రెండు లక్షణాలు వాస్తవానికి తొలి లక్షణానికి విశదీకరణలు, వ్యాఖ్యానం వంటివే. పరిశుద్ధమయిన వాటిని ధర్మమయి నవిగా చెయ్యడం 'అమ్ర్ బిల్ మారూఫ్'లోని అంతర్భాగమే. అశుద్ధమయిన వాటిని అధర్మమయినవిగా నిర్ణయించడం 'నహీ అనిల్ మున్కర్'లో ఓ భాగమే. అదేవిధంగా మానవులకు స్వయంకృత ఆచార వ్యవహారాల నుండి విముక్తిని ప్రసాదించడం, అల్లాహ్ దాస్యం తప్ప ఇతం దాస్యాల నుండి స్వేచ్ఛను కల్పించడం కూడా **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**కు సంబంధించిన ఆవశ్యకతే.

ఇబ్ను తైమియ్య ఇలా అంటున్నారు :

**هو الذى امر الله علىٰ لسانه بكل معروف و نهى عن كل منكر و احلّ كل طيب وحرّم كل خبيث ... فبه كمل دين الله المتضمن للامر بكل معروف والنهى عن كل منكر واحلال كل طيب وتحريم كل خبيث ... وتحريم الخبائث يندرج فى معنى النهى عن المنكر كما ان احلال الطيبات يندرج فى الامر بالمعروف لان تحريم الطيبٰت مما نهى الله عنه و كذٰلك الامر بجميع المعروف والنهى عن كل منكر مما لا يتم الا للرسول الذى تمم الله به مكارم الاخلاق و المندرجة فى المعروف**

**ఆయన(స) నోటి ద్వారానే అల్లాహ్ ప్రతి మారూఫ్‌ని ఆదేశించాడు, మరి ప్రతి ముస్కర్‌ని వారించాడు, ప్రతి పరిశుద్ధ పదార్థాన్ని హలాల్ గావించాడు, ప్రతి అశుద్ధ పదార్థాన్ని హరామ్ గావించాడు - ఆయన ద్వారానే దైవ ధర్మం పరిపూర్ణమయింది, అందులో ప్రతి మారూఫ్ ఆదేశముంది. ప్రతి ముస్కర్ పట్ల నిషేధం ఉంది; ప్రతి పరిశుద్ధ వస్తువు హలాల్ చెయ్య బడింది, అశుద్ధ వస్తువు హరామ్ చెయ్య బడింది. అశుద్ధ వస్తువుల్ని హరామ్ చెయ్యడం 'నహీ అనిల్ ముస్కర్' భావంలో చేరి వుంది, పరిశుద్ధ పదార్థాలను హలాల్ చెయ్యడం 'అమ్ర్ బిల్ మారూఫ్'లో చేరి ఉన్నట్లే. అందువల్ల పరిశుద్ధ పదార్థాలను హరామ్‌గా పరిగణించడం, అల్లాహ్ నిషేధించిన కార్యాల్లోనిది. అదే విధంగా ఇదీ ఒక యదార్థమే- సకల మారూఫ్ విషయాలను ఆదేశించడం, సమస్త ముస్కర్ విషయాలను నిషేధించడం ఆ దైవ సందేశహరునికే తగు- ఆయన ద్వారానే అల్లాహ్ మారూఫ్‌లో చేరిఉన్న సమస్త ఉన్నత నైతికగుణాలను పరిపూర్ణం గావించాడు.** *(అల్ హస్బతు ఫిల్ ఇస్లామ్: పు.58)*

## ప్రతి వర్గానికీ మారూఫ్‌ని ఆదేశించారు, మున్కర్‌ని నిషేధించారు

ఆయత్‌లో 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్' ప్రస్తావన వచ్చిన సందర్భం, ప్రవక్త(స) యూదుల మధ్య ఈ కార్యం నిర్వర్తిస్తున్న సందర్భం. దీని అర్థం ఆయన(స) ఈ కార్యం ఇతరుల మధ్య నిర్వహించడం లేదన్నది కాదు. వాస్తవానికి వారు యూదులు, క్రైస్తవులు అయినా, ముష్రికులు, మునాఫికులు అయినా, వీరిలో ఏ వర్గమయినా వారి మధ్య ఆయన(స) సత్యధర్మ ప్రచారం చేసినప్పుడల్లా వారికి మారూఫ్‌ని ఆదేశించారు, మున్కర్ పట్ల వారించారు. అంతేకాదు, లోగడ ప్రస్తావించినట్లు, ఆయన తన సహచరులకు ఇచ్చే సుశిక్షణలు, సత్కార్యాలకు చేసే ఉపదేశాలు, గరిపే ఉత్తమ నైతిక బోధనలు, జీవన మర్యాదల ప్రబోధాలు సర్వం **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'**లోని అంతర్భాగమే. ఈ కార్యం సందేశ ప్రచారం ప్రారంభం నుండి అంతం వరకు కొనసాగింది. సందేశ ప్రదాత దాన్ని తన తనువులో ప్రాణం ఉన్నంత కాలం, తాను చలనహీనం అయ్యేంత వరకు నిర్వర్తిస్తూనే ఉంటాడు. ఈ కారణంగానే వ్యాఖ్యాతలు ఈ సందర్భాన్ని **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** యూదులకే ప్రత్యేకం అని భావించలేదు, దాన్ని చాలా విభిన్న, వైవిధ్య, విస్తృత కార్యంగా భావం గ్రహించారు.

హాఫిజ్ ఇబ్ను కసీర్ (రహ్మ) ఇలా అంటున్నారు :

**(يَامُرُهُمْ بِالْمَعْرُوْفِ وَيَنْهَاهُمْ عَنِ الْمُنكَرِ) هٰذه صفة الرسول صلى الله تعالىٰ عليه والہٖ وسلم فى الكتب المتقدمة، وهكذا كان حاله عليه الصلوٰة والسلام لاَ يامر الّا بخير و لاَ ينهى الّا عن شر... و من اهم ذٰلکَ و اعظمه ما بعثه الله به من الاُمر بعبادته وحده لاَ شريک لـه و النهى عن**

**'మారూఫ్‌ని ఆదేశిస్తారు, మరి మున్కర్‌ని వారిస్తారు'** అన్న ఆయన(స) ఈ లక్షణం, గత దైవిక గ్రంథాలలో పేర్కొనబడింది. ఆయన నిర్వహించిన పని కూడా ఇదే. ఆయన ఏ విషయాన్ని ఆదేశించినా అది శుభప్రదమయినదే అయ్యేది. మరి దేన్ని వారించినా అది చెడుగునే వారించేవారు... ఈ క్రమంలో ముఖ్యమయిన అంశం, అల్లాహ్ ఆయన(స)కు ఇచ్చి ఆవిర్భవింపజేసిన సందేశం. అంటే ఒకే దేవుని ఆరాధన చేసే ఆదేశం, ఆయన తప్ప ప్రతి దాని దాస్యాన్ని మాన్పించడం. ఆయన(స)కు మునుపు

عبادة من سواه كما ارسل به جميع الرسل قبله

కూడా సకల సందేశహరులు ఈ బోధనలే తీసుకువచ్చారు.

(తఫ్సీర్ ఇబ్ను కసీర్: 2/253- 254)

అల్లామా బగవీ ఇదే భాగానికి వివరణగా ఇలా అంటున్నారు :

(يَأمُرُهُمْ بِالْمَعْرُوْفِ) اى بالايمان (وَيَنْهٰهُمْ عَنِ الْمُنْكَرِ) يعنى عن الشرک، قيل المعروف الشريعة و السنة و المنكر ما لاَ يعرف فى شريعة ولاَ سنة، وقال عطاء يَأمُرُهُمْ بِالْمَعْرُوْفِ بخلع الانداد ومكارم الاخلاق وصلة الارحام (وَيَنْهٰهُمْ عَنِ الْمُنْكَرِ) عن عبادة الاوثان و قطع الارحام

ఆయన(స) మారూఫ్‌ని ఆదేశిస్తారు, అంటే ఈమాన్‌ని ఆదేశిస్తారు. మున్కర్‌ని వారిస్తారు అంటే షిర్క్‌ని నిషేధిస్తారు అన్నమాట. కొందరు మారూఫ్ అని అంటే షరీఅత్ అనీ, సున్నత్ అనీ, మరి మున్కర్ అంటే, షరీఅత్‌లో ప్రసిద్ధ మయినది, స్వీకారయోగ్యమయినదీ కానిదనీ అంటారు. అనుచరులయిన 'అతా' 'మారూఫ్‌ని ఆదేశిస్తారు' అని అంటే 'అల్లాహ్‌కు అబద్ధపు సహవర్తులయిన వారి నుండి వేరుపరచడానికి, ఉన్నత నైతిక ప్రవర్తనను అనుసరించడానికీ, బంధుత్వపు ప్రేమను పాటించడానికీ ఆయన(స) వారికి ఆదేశిస్తారనీ, మరి మున్కర్‌ని వారిస్తారంటే భావం, విగ్రహాల పూజను, బంధుత్వ సంబంధాల విరపును ఆయన(స) నిషేధిస్తారని భావం చెప్పారు.

(మఆలిముత్తన్జీల్ అలా హామిష్ అల్ ఖాజిన్:2/ 245)

షేఖ్ ఇస్మాయిల్ హక్కీ ఇలా అన్నారు :

(يَأمُرُهُمْ بِالْمَعْرُوْفِ) اى بالتوحيد وشرائع الاسلام (وَيَنْهَاهُمْ عَنِ الْمُنْكَرِ) اى عن كل مالاَ يعرف فى شريعة ولاَ سنة

'ఆయన వారికి మారూఫ్‌ని ఆదేశిస్తారు' అని అంటే, దేవుని ఏకత్వం, ఇస్లామీయ శాస నాంగం (షరీఅత్)ని ఆదేశిస్తారు. మరి 'వారికి మున్కర్‌ని వారిస్తారు' అని అంటే షరీఅత్, సున్నత్‌లలో ప్రసిద్ధమూ, ఇష్టకరమూ కాని ప్రతిదాన్నీ వారిస్తారు అని భావం.

(రూహుల్ బయాన్: 1/ 780)

ఇబ్ను జరీర్ తబరీ ఇలా అంటున్నారు :

یامـر هـٰـذا النبی الاُمی اتباعـه بالمعرف وهو الاُیمان بالله و لزوم طاعة فیما امرونهی، فذٰلک المعروف الــذی یامرهم به و ینهٰهم عن المنـکر و هـو الشرک بالله و الاِنتهـاء عما نهـاهم الله عنه

'ఈ నిరక్షరాసి అయిన ప్రవక్త తన అనుయాయులకు మారూఫ్‌ని ఆదేశిస్తారు'- మారూఫ్ అంటే ఉద్దేశ్యం, అల్లాహ్‌ను విశ్వసించడం, విధి నిషేధాలలో తప్పనిసరిగా ఆయన విధేయత పాటించడం. ఈ మారూఫ్‌నే ఆయన(స) వారికి ఆదేశిస్తారు. 'వారికి మున్కర్‌ని నిషేధిస్తారు' అంటే, అల్లాహ్‌తోపాటు ఆయనకు సహవర్తుల్ని కల్పించడాన్ని నిషేధిస్తారు, ఇంకా అల్లాహ్ ఏ విషయాలను నిషేధించాడో వాటికి దూరంగా ఉండాలని ఆదేశిస్తారు అని అర్థం.

*(జామిఉల్ బయాన్ ఫీ తఫ్సీరిల్ కుర్‌ఆన్: 9/53)*

ఇమామ్ రాజీ ఈ వాక్యానికి చాలా సమగ్రమయిన,అర్థవంతమయిన వ్యాఖ్యానం చేశారు. ఆయన వ్యాఖ్యానం పూర్తిగా ఇక్కడ ఉటంకించదగిందిగా భావిస్తున్నాము:

مجامع الاُمر بالمعروف محصورة فی قولـه علیه الصلوٰة والسلام التعظیم لاَمر الله والشفقة علی خلق الله، وذٰلک لِاَن الموجود اما واجب الوجود لذاته واما ممکن الوجود لذاته، اما الواجب لـذاتـه فهو الله جل جلاله، ولا معروف اشرف من تعظیمه واظهار الخضوع و الخشوع علیٰ باب عزته والاُعتراف بکونه

ప్రవక్త మహనీయులు (సల్లల్లాహు అలైహి వ సల్లమ్) పలికిన పదాలు, 'దేవుని ఆదేశాలు, ఆదరణ, ఆయన సృష్టి పట్ల వాత్సల్యం' అన్నవి 'అమ్ర్ బిల్ మారూఫ్'లోని సకల కోణాలను ఆవరించి ఉన్నాయి. దాని వివరాలు ఏమిటంటే ఉనికి గలవన్నీ రెండు విధాలు: ఒక విధమయి నవి తమ ఉనికిలో ఎవరి పట్లనూ అపేక్ష కలిగి లేవు (అంటే వాటికి ఎవరి ఆవశ్యకతా లేదు). రెండవ విధమయినవి తమ ఉనికిలో ఇతరుల ఆవశ్యకత కలిగి ఉన్నవి. నిరపేక్షాపరమయిన ఉనికి కేవలం పరమ ప్రభువు అల్లాహ్ ఉనికిపట్టు మాత్రమే. ఆయన పట్ల ఔన్నత్యాన్ని, మహత్యాన్ని ఘనతను అంగీకరించి, కొనియాడి ఆయన దాస్యం

చెయ్యడం, ఆయన సన్నిధానంలో వినయ వినమ్రతలు, భక్తిప్రపత్తులు ప్రకటించడం తప్ప మరో గొప్ప 'మారూఫ్' (ప్రసిద్ధ సత్కార్యం) లేదు. అలాగే ఆయనలో సమస్త సద్గుణాలు పరిణత స్థాయిలో ఉన్నాయని, సకల దోషాలకు అన్ని అవగుణాలకు ఆయన పరిశుద్ధుడు అని, విరోధులు, సహవర్తులకన్నా ఎంతో ఉన్నతుడు అని అంగీకరించాలి. ఇకపోతే తన ఉనికిలో ఇతరుల పట్ల అపేక్ష గల, ఇతరుల ఆవశ్యకత గల పదార్థాలు. అది సజీవ పదార్థం కాకపోయి నట్లయితే దానికి ప్రయోజనం చేకూర్చే ఏ మార్గమూ లేదు. ఎందుకంటే ప్రయోజనం పొందడానికి జీవం కలిగి ఉండటం అవసరం. అయినా దాన్ని కూడా గౌరవ మర్యాదలతో చూడటం అవసరం, ఎందుకంటే అదీ పరమ ప్రభువు సృష్టియే. ఇంకా సృష్టితాల ప్రతి కణం, పరమ ప్రభువు అల్లాహ్ లోపరహితుడు అనడానికి మరో పటిష్టమయిన ఆధారమయి నప్పుడు, మరో ప్రస్ఫుటవాదన అయినప్పుడు దాన్ని సాదరంగా చూడటం అవసరం అవు తుంది. మరి ఆ సృష్టి సజీవమయినదయితే మానవుడు దాని పట్ల ఏ మేరకు వాత్సల్యం ప్రకటించగలడో ఆ మేరకు ప్రకటించడం అవసరం. ఇందులోనే తల్లిదండ్రుల ఎడల సద్వర్తన, బంధుగణం పట్ల ప్రేమానురాగాలు, సదాచారాలను వ్యాపింపజేయడం కూడా చేరి ఉన్నాయి. దీన్నిబట్టి తెలిసేదేమిటంటే ప్రవక్త మహనీయులు(స) పలికిన మాట – 'అల్లాహ్ ఆదేశం పట్ల ఆదరం ఆయన సృష్టితాల పట్ల

موصوفا بصفات الكمال مبرأ عن النقائص و الآفات منزّهًا عن الاضداد والانداد، و اما الممكن لذاته فان لم يكن حيوانا، فلا سبيل الىٰ ايصال الخير اليه لِان الانتفاع مشروط بالحياة، ومع هذا فانه يجب النظر الىٰ كلها بعين التعظيم من حيث انها مخلوقة للّٰه تعالىٰ، و من حيث ان كل ذرة من ذرات المخلوقات لما كانت دليلا قاهرا وبرهانا باهراعلىٰ توحيده وتنزيهه فانه يجب النظر اليهــا بعين الاحترام، و امــا ان كان ذٰلک المخلوق من جنس الحيوان فانه يجب اظهار الشفقة عليه، بأقصى ما يقدر الانسان عليه ويد خل فيه برالوالدين و صلــة الارحام وبث المعروف، فثبت ان قولــه عليـه الصلوٰة و السلام التعظيم لِامر اللّٰه و الشفقة علىٰ خلق اللّٰه كلمة جامعة لجميع جهات الامر بالمعروف ... قوله (وَ

يَنْهَاهُمْ عَنِ الْمُنْكَرِ) المراد منه اضداد الاُمور المذكورة، وهى عبادة الاُوثان والقول فى صفات اللّٰه بغير علم والكفر بما انزل اللّٰه على النبيين و قطع الرحم و عقوق الوالدين

**వాత్సల్యం' ఎంత సమగ్రమయిన సూక్తియో! ఇది అమ్ర్ బిల్ మారూఫ్‌లోని సకల కోణాలను ఆవరించి ఉంది– 'మీరు వారిని మున్కర్ పట్ల వారిస్తారు' అన్న దైవోపదేశానికి భావమేమిటంటే పైన పేర్కొన్న విషయాలన్నింటికీ విరుద్ధమయిన వాటన్నింటినీ నిషేధించడం అన్నమాట. ఇందులో విగ్రహాల ఆరాధన, ఎటువంటి జ్ఞానం లేకుండానే అల్లాహ్ ఉనికి, ఆయన గుణగణాల పట్ల నోరు విప్పడం, ప్రవక్తల బోధనల నిరాకరణ, బంధుత్వాల తెంపుదల, తల్లిదండ్రుల అవిధేయత– అన్నీ చేరి ఉన్నాయి.**

*(మఫాతీహుల్ గైబ్ (అత్ తఫ్సీరుల్ కబీర్) 8వ సంపుటం, 15వ భాగం,పుట. 21)*

పండితుల ఈ పరిశోధనల సారం ఏమిటంటే దైవ సందేశహరులు (సల్లల్లాహు అలైహి వ సల్లం) మానవులకు పిలుపునిచ్చారు, వారు ఈ సువిశాల విశ్వాన్ని పరిశీలించి దీనిపట్ల యోచించాలని, తమ సృష్టికర్తను స్వామిని గుర్తించాలని. ఆయన(స) దేవుని నిజ భావనపట్ల ఎరుకపరిచారు. ఉన్నత నైతికతను ఉపదేశించారు. పరస్పరం ప్రేమానురాగాలతో జీవించడాన్ని నేర్పారు. దీనితోపాటు ఎవరయితే దైవధర్మాన్ని స్వీకరించారో ఆయన(స) వారికి అల్లాహ్ ఆరాధన, ఆయన ధర్మశాస్త్రం (షరీఅత్) అనుసరణను ఆదేశించారు. వారి శీల స్వభావాలను సంస్కరించారు. ఆయన(స) చేసిన సందేశాత్మక, శిక్షణాత్మక కార్యానికే కుర్‌ఆన్ '**అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్**' అని అన్వయించింది.

## అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్- హెచ్చరిక!

సుశిక్షణ గురించి తరువాత మాటలాడుకుందాము. పైన జరిగిన చర్చ ద్వారా ఒక విషయం తేటతెల్లమయిపోయింది. దైవధర్మాన్ని దాని నిజరూపంలో, స్వచ్ఛ రూపంలో అందజేయడం, ప్రపంచానికి దాన్ని అనుసరించమని పిలుపునివ్వడం కూడా **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**గానే పరిగణించబడుతుంది. దాన్ని తౌహీద్ (దేవుని ఏకత్వపు) పిలుపు అని కూడా అనవచ్చు. ఎందుకంటే ఇందులో ఒక

వైపున షిర్క్ (బహుదైవ భావన), దాని ఆధారంగా నిర్మాణమయ్యే జీవన వ్యవస్థ ఖండన, నిరాకరణా ఉంది, మరోవైపున దాస్యానికి అర్హుడు కేవలం అల్లాహ్ వ్యక్తిత్వం మాత్రమే కాని ఆయన తప్ప మరే ఉనికీ ఆరాధింపబడే, మనిషి తన ఆరాధ్యునిగా, ప్రభువుగా భావించే అస్తిత్వం లేదు అని నిరూపించడమూ జరిగింది; ఇంకా మానవుడు అల్లాహ్ దాస్యం పట్ల తిరుగుబాటు చేసినట్లయితే ఇహపరాలలో అతని సర్వ నాశనాన్ని ఎవరూ కాపాడలేరు అని కూడా తెలుపడం జరిగింది. ఈ ధర్మప్రచార కార్యానికి కుర్‌ఆన్, ఇన్జార్ (హెచ్చరిక), తబ్షీర్ (శుభవార్తనివ్వడం), ఇబ్లాగ్ (స్పష్టీకరణ), తజ్కీర్ (జ్ఞాపకం చెయ్యడం) తదితర పారిభాషిక పదాలనుపయోగించింది. ఈ పదాలలోనూ **అమ్ర్ బిల్ మారూఫ్ నహీ అనిల్ మున్కర్**లోనూ ధర్మప్రచారం మేరకు ఎటువంటి భేదం లేదు. ఉదాహరణకు ఇన్జార్- 'హెచ్చరిక'నే తీసుకోండి. ఈ పరిభాషను కుర్‌ఆన్, ప్రవక్తల సందేశ ప్రచార కార్యం సందర్భంలో అత్యధికంగా ప్రయోగించింది. ప్రవక్త మహనీయులు(స)ని పలుమార్లు 'నజీర్' (హెచ్చరించేవాడు) అనీ, 'నజీరుమ్ముబీన్' (అతి స్పష్టంగా హెచ్చరించేవాడు) అనీ ప్రకటించింది. ఆయనకు రెండవ లేదా మూడవ తూరి వహీ అవతరణ ఈ పదాలలో జరిగింది :

يٰاَيُّهَا الْمُدَّثِّرُ ○ قُمْ فَاَنْذِرْ ○ (المدثر:١،٢)

**కప్పుకుని, చుట్టుకుని పరుండేవాడా, లెయ్యి, లేచి హెచ్చరించు!'** ***(అల్ ముద్దస్సిర్: 1,2)***

మరో చోటనయితే ఇలా చెప్పడం జరిగింది :

اِنَّمَا اَنْتَ مُنْذِرٌ وَّ لِكُلِّ قَوْمٍ هَادٍ (الرعد:٧)

**నీవు కేవలం హెచ్చరించేవాడివి మాత్రమే. ప్రతి జాతికి ఒక మార్గదర్శకుడంటూ ఉన్నాడు.** ***(అర్ రాద్ : 7)***

'ఇన్జార్' అన్న దాని అసలు అర్థం మానవులకు అల్లాహ్ పట్ల తిరుగుబాటు వైఖరి వల్ల కలిగే వినాశకర దుష్పరిణామం గురించి హెచ్చరించడం. కాని దీని భావం, ఇన్జార్ (హెచ్చరిక) ఆదేశానికి ఉద్దేశ్యం కేవలం ఈ నకారాత్మక ఆచరణ వరకే పరిమితం అని కాదు. నిజానికి దీని ఉద్దేశం బహు విశాలమయింది. ఇందులో మానవుల మార్గబోధనకు సంబంధించిన పూర్తి కార్యక్రమం ఉంది. ఆ కార్యక్రమం దైవం తరపున ఆయన సందేశహరులపైన విధితమయినది. ఒక జాతి మధ్యన ఈ హెచ్చరిక కార్యం నిర్వర్తించబడిన తరువాత కూడా ఆ జాతి అల్లాహ్ వైపునకు మరలకపోతే ఆ జాతి పైన వాదన పూర్తి అయినట్లే. ఇక దేవుని శిక్ష అవతరించడమే తరువాయి. 'ఇన్జార్'లోని

ఈ భావార్థాన్ని దృష్టిలో ఉంచుకుని **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** మరి 'ఇన్జార్'లో గల భావపరమయిన సంబంధాన్ని గురించి ఇమామ్ ఇబ్ను తైమియ్యా నుడివిన ఈ పదాలను పరిశీలించండి:

**نفس الإنـذار امر بالمعروف و نهى عن المنكر**

**'ఇన్జార్'లోని సారాంశం, మారూఫ్‌ని ఆదేశించడం, మున్కర్‌ని నిరోధించడం.**

***(అల్ హస్బతు ఫిల్ ఇస్లామ్, పుట. 67)***

భావమేమిటంటే పరమ ప్రభువు ఆదేశంతో ఆయన సందేశహరులు తమ జాతులలో నిర్వర్తించే 'ఇన్జార్' విధిని **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** అని కూడా అంటారన్నమాట.

ఇక్కడ ఓ ప్రత్యేక కోణాన్ని విశదపరచడం అవసరం. దివ్యకుర్‌ఆన్‌లో ఇన్జార్‌తో పాటు సాధారణంగా తబ్షీర్ అన్న పద ప్రయోగమూ జరిగింది. ఇందులో శుభవార్త అన్న భావం ఉంది. దైవ సందేశహరులు ఒకవైపున విశ్వాసం, ఆచరణల్లోని చెడుగును దాని దుష్ట పర్యవసానాలను గురించి హెచ్చరించడంతో పాటు మరో వైపున సరయిన విశ్వాసం, సదాచరణ వల్ల ప్రాప్తమయ్యే సాఫల్యాలు, విజయాల శుభవార్తను సయితం తెలుపుతారు. ఈ ఉభయత్రా ప్రక్రియను వారు సాధారణంగా నిర్వర్తిస్తారు. కాని విరోధుల వద్ద ఎటువంటి ఆధారం సహేతుకత ఉండదు. వారు నిరాధార వాదనలతోనే ప్రవక్తల్ని ఓడించే ప్రయత్నం చేస్తారు:

**وَ مَا نُرۡسِلُ الۡمُرۡسَلِيۡنَ اِلَّا مُبَشِّرِيۡنَ وَمُنۡـذِرِيۡنَ وَ يُجَـادِلُ الَّـذِيۡنَ كَفَرُوۡا بِالۡبَاطِلِ لِيُدۡحِضُوۡا بِـهِ الۡحَقَّ وَاتَّخَذُوۡا آيَاتِىۡ وَمَا اُنۡذِرُوۡا هُزُوًا** (الكهف:٥٦)

**మేము దైవసందేశహరుల్ని శుభవార్తనిచ్చే వారుగా, హెచ్చరిక చేసేవారుగా తప్ప మరే సేవలు అందజేసే ఉద్దేశ్యంతోనూ పంపము. కాని తిరస్కారుల పరిస్థితి ఏమిటంటే వారు మిథ్యా ఆయుధాలు పట్టుకుని సత్యాన్ని లొంగదీసే కృషి చేస్తారు. వారు నా ఆయత్‌లను, వారికి చేయబడిన హెచ్చరికల్ని పరిహాస ప్రాయంగా పరిగణించారు.** *(అల్ కహ్ఫ్: 56)*

హెచ్చరిక, శుభవార్తల ఈ ప్రక్రియ ద్వారానే ప్రత్యర్థుల పట్ల వాదన పూర్తి అవుతుంది. నిసా సూరాలో కొందరు ప్రవక్తల ప్రస్తావన తరువాత ఇలా సెలవీయబడింది :

رُسُلاً مُّبَشِّرِينَ وَ مُنذِرِينَ لِئَلَّا يَكُونَ لِلنَّاسِ عَلَى اللّٰهِ حُجَّةٌ بَعْدَ الرُّسُلِ وَكَانَ اللّٰهُ عَزِيزاً حَكِيماً ۝ (النساء:١٦٥)

**ఈ సందేశహరులందరూ శుభవార్తనిచ్చే వారుగాను, భయపెట్టేవారుగానూ పంపించ బడ్డారు. తద్వారా వారి ప్రభవన తరువాత ప్రజల వద్ద అల్లాహ్ సమక్షంలో ఎలాంటి వాదన మిగులరాదన్నది ఉద్దేశ్యం, ఇంతకూ అల్లాహ్ ఎట్టి పరిస్థితిలోనూ అధిక్యత గల వాడు, వివేచనాపరుడూను.** *(అన్ నిసా : 165)*

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌లోనూ ఈ రెండు కోణాలూ ఉన్నాయి. మారూఫ్ ద్వారా ఉత్తమ ఫలితాలు, మున్కర్ వల్ల దుష్పరిణామాలు కలుగుతాయని ఎరుకపరచడం దాని విస్తృత ఆవశ్యకతలలోని విషయమే.

## ధర్మాన్ని అనుసరించే వారి మధ్య అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్

సందేశ ప్రచారం గురించి లోగడ చెప్పడం జరిగింది. ఇంకా ధర్మం స్వీకరించని వారి మధ్యన ఈ కార్యం నిర్వహించడం జరుగుతుంది. ధర్మాన్ని స్వీకరించినవారిలో ఏవయినా లోటుపాట్లు ఉన్నట్లయితే వారిని సంస్కరించడం జరుగుతుంది. వారికి శిక్షణ గరపడమూ జరుగుతుంది. కాని ఏ వ్యక్తి అయినా ఏ వర్గమయినా ధర్మాన్ని స్వీకరించినట్లు వాదిస్తూ ఉన్నప్పటికీ ధర్మానికి తిరుగుబాటు వైఖరిని అవలంబిస్తే లేదా ధార్మిక మూల్యాల పట్ల సూత్రాలు, సిద్ధాంతాల పట్ల సంశయాలకు సందేహాలకు గురయినట్లయితే నిశ్చయంగా అటువంటి వారి పట్లనూ సందేశాత్మక కార్యం నిర్వహించడం అవసరమవుతుంది. వారు సందేశ సంబోధితులు కాదని అనడం జరగదు. ఎందుకంటే ధర్మాన్ని స్వీకరించినట్లు వారు వాదించినప్పటికీ వారు తమ ఆలోచనల్లోను, ఆచరణల్లోనూ ధర్మ తిరస్కారుల వరుసలోనే ఉన్నారు.

నేడు ముస్లిమ్ సముదాయం స్థితిగతులను పరిశీలిస్తే అది సంస్కరణ, శిక్షణల ఆవశ్యకత ఎలాగూ కలిగి వుంది. దానితోపాటు ఎంతో కొంత సందేశ ప్రచారానికీ ఆవశ్యకత కలిగివుంది. ప్రస్తుతం అది ఆచరణాత్మకంగా రెండు వర్గాలుగా చీలిపోయి ఉంది. ఒకటి, సముదాయంలోని అత్యధిక సంఖ్య అల్లాహ్‌ను, దైవ సందేశహరుణ్ణి, పరలోకాన్ని విశ్వసిస్తుంది. కుర్‌ఆన్ హదీసుల్ని తమ జీవన నిబంధనావళిగా అంగీకరిస్తుంది, దానితోపాటు అనేక ఆచరణాత్మక, ఆలోచనాత్మక కొరతలకు లోనయి ఉంది. అందువల్ల అది ధర్మస్వీకారం కొరకు పిలుపునకు తగినది కాదు. అది కేవలం సంస్కరణ అవసర

మయిన వర్గం. మరోవర్గం వ్యక్తుల్లో ధర్మం పట్ల ఇంకా నమ్మక మయితే చావలేదు కానీ వారి అంతర్యాల్లో దాని పునాదులు మాత్రం అతలాకుతల మయిపోయాయి. ఆ వ్యక్తుల్ని ఈ సముదాయంతో కట్టి ఉంచే విషయం దేవుని గ్రంథం, ఆయన సందేశ హరుని సంప్రదాయం కావు, సామాజిక, అనువంశిక సంబం ధాలు. ఈ సంబంధాలు ఒక వర్గంతో కలిసిమెలిసి ఉన్నప్పుడు సహజంగా జనించే సంబంధాలే. ఈ సంబంధాలే గనక లేకపోతే బహుశా ధర్మంతోనూ సముదాయంతోనూ వీరి సంబంధం కూడా మిగిలేది కాదు. దీనికన్నా ఘోరంగా ఈ సముదాయంలో మరో రకం ప్రజలు కూడా ఉన్నారు. వీరికి కేవలం ఈ ధర్మం పట్లనే విభేదం లేదు. వారు బాహాటంగానే దీన్ని ఆట పట్టిస్తారు. అలా చేసి ఏ మాత్రం జంకరు, సిగ్గిల్లరు. వీరంతా ధర్మ సందేశానికి ఎంతో అర్హులన్న విషయం ద్యోతకమవుతూనే ఉంది. ధర్మ పరిధికి వెలుపల ఉన్న ముస్లిమేతరులు ఏ విధంగా ధర్మప్రచార ప్రబోధాలకు అర్హులో ఈ కోవకు చెందిన ముస్లిములు సయితం ధర్మం వైపునకు పిలుపునకు సమానంగా అర్హులయినవారే.

కుర్ఆన్ అవతరణా కాలంలో గ్రంథవహుల విశ్వాస ప్రధానమయిన రుగ్మతలు నేడు ముస్లిమ్ సముదాయంలోని చెడుగులకన్నా ఎంతో అధికంగా ఉండేవి. వారిలోని అధికాంశం దైవధర్మానికి దూరమయి తిరుగుబాటుకు లోనయింది. దేవుని అంతిమ ప్రవక్త(స) చేసిన దైవదౌత్య ప్రకటన తరువాత వారికి మోక్షమార్గం ఒకటే మిగిలింది. వారు ఆయన(స) దైవదౌత్యాన్ని స్వీకరించి ఆయన సముదాయంలో చేరిపోవడం. ఎందుకంటే అంతిమ ప్రవక్త ఆవిర్భావం తరువాత వెనుకటి ధర్మశాస్త్రాలన్నీ రద్దయి పోయాయి. ఇప్పుడు ఇక వారి ప్రాచీన ధర్మశాస్త్రాలను అమలుపరిచే అనుమతి ఏమాత్రం లేదు. వారి విశ్వాసాలు ఏ ధార్మిక గ్రంథాల ఆధారంగా ఏర్పడ్డాయో వాటి లోనూ అతి స్పష్టంగా ఆయన్ని (స) అనుసరించాలన్న ఆదేశం వస్తూనే ఉంది. కాని వారు ఆయన(స) శత్రుత్వంలో తమ గ్రంథాలలోనే ప్రక్షిప్తాలు చేసివేశారు.

ఈ విధంగా ఆయన్ని దైవ సందేశహరుడని, దైవం పంపిన ప్రవక్త అనీ నమ్మే అవసరంరాదని భావించారు. అయినప్పటికీ వారు తమ్ము తాము దైవ ధర్మ అనుయాయులుగా, ధర్మ ధ్వజవాహకులుగానే పరిగణిస్తూ వచ్చారు, నిజానికి వారు ధర్మపరిధి నుండి ఎన్నడో వెలికి వెళ్ళిపోయారు. అయితే వారిలో ఓ స్వల్పమయిన వర్గం ఉండేది, దాని వైఖరి ఈ సాధారణ వైఖరికి భిన్నంగా ఉండేది. వీరు స్వయంగా

సన్మార్గాన ఉండటమేకాక ఇతరుల సంస్కరణకూ ప్రయత్నిస్తూ ఉండేవారు. వారు తమ జాతి వారిని, ప్రవక్త మహనీయుల (స) వ్యతిరేకత పట్ల వారించేవారు, ఆయన్ని(స) విశ్వసించేందుకు పిలుపునిచ్చేవారు. వీరు చేసే ఈ సంస్కరణాత్మక, సందేశాత్మక కార్యాన్ని కుర్‌ఆన్ ఈ పదాలలో ప్రస్తావించింది:

وَ يَأْمُرُوْنَ بِالْمَعْرُوْفِ وَ يَنْهَوْنَ عَنِ الْمُنْكَرِ وَ يُسَارِعُوْنَ فِي الْخَيْرَاتِ

**మంచి (మారూఫ్)ని ఆదేశిస్తారు, చెడు (మున్కర్)ల నుంచి వారిస్తారు, సత్కార్యాల్లో నిమగ్నులయి ఉంటారు.**

***(ఆలి ఇమ్రాన్ : 114)***

దీనివల్ల రెండు విషయాలు ద్యోతకమవుతున్నాయి. **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** అన్నది సత్య తిరస్కారుల మధ్య సందేశాత్మక కార్యమేకాక స్వయంగా తన జాతీయులలో చేసే సంస్కరణాత్మక కార్యం కూడా ఇదేనని రూఢమవుతుంది. గ్రంథవహుల సత్యకాముకులయిన వర్గం తమ జాతికి వెలుపల ఇతర వ్యక్తులకు అల్లాహ్, ఆయన సందేశహరుల(స) పట్ల విశ్వాసం, విధేయతల పిలుపు నివ్వడం లేదని దీని అర్థం కాదు, భావం కేవలం ఏమిటంటే అది స్వయంగా తమ జాతిలోనూ సందేశాత్మక విధిని నిర్వర్తిస్తూ ఉంది అన్నది. ఈ కారణంగానే వ్యాఖ్యాతలు వీరు చేసే ఈ సందేశాత్మక కార్యాన్ని తమ జాతి వరకు ప్రత్యేకించలేదు. అది వారి సాధారణ విధానంగానే పేర్కొన్నారు. కాగా ఆలి ఇమ్రాన్ సూరాలోని పై వాక్యానికి వ్యాఖ్యానం వ్రాస్తూ ఇమామ్ ఇబ్ను జరీర్ తబరీ ఇలా అంటున్నారు :

يامرون الناس بالإيمان بالله و رسوله وتصديق محمّد صلى الله عليه وسلم وما جاء هم به و (يَنْهَوْنَ عَنِ الْمُنْكَرِ) يقول وينهون الناس عن الكفر بالله وتكذيب محمد و ما جاء هم به من عند الله

**వారు, అల్లాహ్, ఆయన సందేశహరుని పట్ల విశ్వసించేందుకు జనులను ఆదేశిస్తారు, ముహమ్మద్(స)ని ఆయన అందజేసిన ధర్మాన్నీ సత్యమయినదని రూఢపరిచేందుకు ఆదేశి స్తారు. మున్కర్‌ని వారిస్తారు అంటే, జనుల్ని అల్లాహ్‌ను తిరస్కరించకుండా, ముహమ్మద్ (స)ని, ఆయన దైవం వద్ద నుంచి తెచ్చిన ధర్మాన్ని అబద్ధీకరించ కుండా వారిస్తారు అని భావం.**

*(జామిఉల్ బయాన్ ఫీ తఫ్సీర్ అల్ కుర్‌ఆన్: 4/35)*

జస్సాస్ ఇలా అంటారు :

صفة لهٰؤلاءَ الَّذين اٰمنوا من اهل الكتاب لِاَنَّهم اٰمنوا بالله ورسوله و دعوا الناس الىٰ تصديق النبيً و الاِنكار علىٰ من خالفـه فكانوا ممن قال الله تعالىٰ (كُنْتُمْ خَيْرَ اُمَّةٍ اُخْرِجَتْ لِلنَّاسِ)

గ్రంథవహుల్లో విశ్వసించినవారి లక్షణం ఇది- వారు అల్లాహ్‌ను, ఆయన సందేశహరుణ్ణీ విశ్వ సించారు, వారు ప్రవక్త(స)ను రూఢీపరచమని, ఆయన్ని ఎదిరించేవారికి ప్రతికూలంగా నిలువమని జనులకు పిలుపునిచ్చారు. ఈ విధంగా వారు, 'ప్రపంచంలో శ్రేష్ఠ సము దాయం మీదే, మిమ్మల్ని మానవుల మార్గబోధ నకు, సంస్కరణకు ప్రవేశపెట్టడం జరిగింది' *(ఆలి ఇమ్రాన్ :110)* అన్న అల్లాహ్ సూక్తిలో చేరిపోయారు. *(అహ్కాముల్ కుర్ఆన్ : 2/ 45)*

## ఇది ఓ శాస్త్రీయ కార్యం కూడా!

ధర్మం వైపునకు పిలుపు ఏదో సాధారణ పని కాదు. ఇందులో బోధన, ప్రబోధన, ఉపదేశం, హితవు, జ్ఞాపిక వంటివి అవసరమయినట్లే ధర్మాన్ని పూర్తిగా సశాస్త్రీయ విధంగా ముందుంచడం, దాన్ని సాధారంగా ప్రవేశపెట్టడం, నిరూపించడం కూడా అవసరమవుతుంది. ధర్మానికి ఇలా శాస్త్రీయ పంథాలో సేవ ఒనర్చడం కూడా **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌**లోని ఓ కోణమే. ప్రవక్త శ్రేష్టులకు ఆయన మక్కాలో ఉన్నప్పుడే **అమ్ర్ బిల్ మారూఫ్** వ **నహీ అనిల్ మున్కర్** ఆదేశమయింది అన్న విషయం మనందరికీ తెలిసినదే. అప్పుడు ధర్మాన్ని పూర్తి బలంతో, ఆధారాలతో ముందుంచటం జరుగుతోంది. ఆయన ధర్మాన్ని స్వీకరించమని కేవలం హితవులు మాత్రమే గరపడంలేదు, ప్రత్యర్థుల ఆక్షేపణలకు అభ్యంతరాలకు సమాధా నాలూ ఇస్తూ ఉన్నారు. మరో వైపున గట్టి ఆధారాలతో ఈ ధర్మమే సత్యధర్మమని, దీని అనుసరణలోనే మానవాళి మోక్షం ఇమిడి ఉందని నిరూపిస్తూ కూడా ఉన్నారు. ధర్మాన్ని ఆధారాలతో నిరూపణలతో శాస్త్రీయ పంథాలో అందజేయడం కూడా ఆయనకు ఆదేశించిన '**అమ్ర్ బిల్ మారూఫ్**' లోని సువిస్తర కార్యంలోని అంతర్భాగమే అనడానికి ఇదీ ఓ ఆధారమే. ఇమామ్ రాజీ ప్రకారం వ్యాఖ్యాతలు, 'అమ్ర్ బిల్ మారూఫ్'ని ఈ విధంగానూ వివరించారు :

(وَاُمُرْ بِالْعُرْفِ) ای باظهـار الدين الحق وتقرير دلائله

**'మారూఫ్‌ని ఆదేశించు' అంటే భావం సత్య ధర్మాన్ని ఆధారాలతో నిరూపణలతో విశదీకరించాలి అని భావం.**

*(మఫాతీహుల్ గైబ్ (అత్ తఫ్సీరుల్ కబీర్) సం.6, భాగం 15, పుట. 79)*

ఇబ్నుల్ అరబీ మాలికీ ఇలా అంటున్నారు: ధర్మాన్ని శాస్త్రీయ విధానంతో అందజేయడం, దాన్ని ఆధారాలతో నిరూపించడం **'అమ్ర్ బిల్ మారూఫ్, వ నహీ అనిల్ మున్కర్'**లో అంతర్భాగమే. ఆయన పదాలలోనే చూడండి-

و من الاَمر بالمعروف و النهى عن المنكر نصرة الدين باقامة الحجة على المخالفين

**ప్రతికూలురపైన వాదన పూర్తి చేసి ధర్మంతో సహకరించడం కూడా అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌లో చేరి ఉంది.**

(అహ్కాముల్ కుర్ఆన్ : 1/ 122)

వాస్తవం ఏమిటంటే **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌లో** ధర్మం వైపునకు పిలుపునకు చేసే సంఘర్షణ పూర్తిగా చేరి ఉంది. దీని సహజమయిన ఆవశ్యకత, తప్పనిసరి ఆవశ్యకత- ప్రపంచాన్ని ధర్మం వైపునకు పిలువాలి; షిర్క్, తిరస్కారం (కుఫ్ర్), దైవదౌత్యం అబద్ధీకరణ, షరీఅత్ చట్టాల విరోధం నుండి ఆపాలి. ఇంకా దైవధర్మమే సత్యధర్మమని, ఇందులోనే మానవ మోక్షముందని ఆధారపూర్వకంగా రూఢీపరచాలి. ఆపైన ఈ ధర్మాన్ని సమున్నతపరచడానికి, సర్వవ్యాప్తం చేయడానికి సాధ్యమయిన ప్రతి యత్నమూ చేయాలి. ఈ కృషిలో నిమగ్నులయి ఉన్నవారు చాలా సౌభాగ్యవంతులు. ఇది అసలు తమకు విధియే కానట్టుగా, దైవగ్రంథంలో దీని ఆదేశమే లేనట్టుగా దీన్ని వదిలేసిన వారు దౌర్భాగ్యులు.



# 8. జిహాద్ ఫీ సబీలిల్లాహ్

## (దైవ మార్గంలో సతత సమరం)

### 'జిహాద్ ఫీ సబీలిల్లాహ్' భావం

'జిహాద్ ఫీ సబీలిల్లాహ్' అన్నది షరీఅత్‌లో ఓ ప్రత్యేక పారిభాషిక పదం. దీని భావం దేవుని మార్గంలో తన సర్వశక్తులూ ధారపోయడం అన్నది. దైవధర్మం, దాని కొరకు మనిషి తన ధనం, ప్రాణం, తన సంబంధాలు, తన కోరికలు, తన నైపుణ్యాలు, తన సౌఖ్యాలు, సౌలభ్యాలు, సర్వం త్యాగం చెయ్యాలని కోరుతుంది. ఇలా చెయ్యకుండా నిజభావంలో ధర్మావలంబనా జరగదు, ధార్మిక సేవా నెరవేరదు. అల్లాహ్ ఈ ఆదేశం ఏమిటంటే :

**వ జాహిదూ ఫిల్లాహి హక్క జిహాదిహీ–**

وَجَاهِدُوا فِي اللهِ حَقَّ جِهَادِهِ

**దైవ మార్గంలో 'జిహాద్' చెయ్యండి– జిహాద్ చెయ్య వలసిన నిజరూపంలో!** *(హజ్జ్ : 78)*

(الحج:٧٨)

### 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'- జిహాద్ ఫీ సబీలిల్లాహ్

జిహాద్ ఫీ సబీలిల్లాహ్ అన్నది చాలా విస్తృత అర్థం గల పరిభాష. 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్' కార్యక్రమమంతా జిహాద్‌గానే పరిగణించబడుతుంది. మనిషి ఏ మారూఫ్‌ను స్థాపించినా మరే మున్కర్‌ని రూపుమాపే ప్రయత్నం చేసినా అతను వాస్తవానికి అల్లాహ్ మార్గంలో జిహాద్ చేస్తాడు. అల్లామా ఇబ్ను ఆబిదీన్ జిహాద్‌ని గురించి ఇలా అంటున్నారు :

هذا عام يشمل المُجاهد بكل امر بمعروف و نهى عن المنكر

**జిహాద్ సామాన్యమయిన క్రియ, ఏ మారూఫ్‌ని ఆదేశించేవాడయినా మరే మున్కర్‌ని వారించే వాడయినా అతను జిహాద్ చేస్తున్నవాడే.**

*(రద్దుల్ ముహ్తార్ అలా దుర్రుల్ ముఖ్తార్ : 3/ 301)*

జిహాద్ ఫీ సబీలిల్లాహ్‌కు ఒక ప్రత్యేక రూపం, బలాన్నుపయోగించి దైవధర్మాన్ని సమున్నతపరచడం, సమాధిక్యత గలదిగా చెయ్యడం, ప్రపంచాన్ని కలతలు కల్లోలాలు లేకుండా ప్రక్షాళించి దైవదాసులయిన మానవుల కొరకు ప్రశాంతంగా దైవదాస్యం, దైవారాధన చేసుకునే వాతావరణం సృజించడం. ఇదొక వాస్తవం- కొన్ని సందర్భాలలో దేవుని భూమిని ఉపద్రవాల నుండి, కలుషితాల నుండి పరిశుద్ధపరచడానికి, సత్యం సత్యతలను సమున్నత పరచడానికి శక్తినుపయోగించడం అనివార్యమయిపోతుంది. ప్రపంచం సత్యానికీ న్యాయానికీ దాహార్తితో అలమటిస్తూ ఉంటే, మానవుడు తన తోటి మానవుల కొరకు క్రూర మృగమయిపోతే జాతులు, తెగలు దౌర్జన్యాలు, దుర్మార్గాల వల్ల ఆర్తనాదాలు చేస్తూ ఉంటే, దేవుని దాసులు కేవలం దైవాన్ని స్మరించడం మూలంగా వెతలు అనుభవిస్తూ ఉంటే, మానవులు దేవుని అభీష్టం మేరకు జీవించ గోరినందుకు బాధలకు గురవుతూ ఉంటే- ఇటువంటి పరిస్థితుల్లో ఎవరయితే ఈ దుర్మార్గాన్ని దౌర్జన్యాన్ని రూపుమాపగలరో వారు క్రియాశూన్యులయి మౌనం వహించడం మహా అపరాధం.

## దైవ మార్గంలో పోరు అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌లోని అంశమే

ప్రవక్త మహనీయులు (స), ఆయన సహచరులు (ర) మక్కాలో ఉన్నంత కాలం దేవుని ధరిత్రి నుండి మిథ్యను తుడిచిపెట్టే స్థితిలోను, సత్యధర్మాన్ని సుస్థాపించే వారుగాను లేరు. కారణం స్వయంగా వారే బాధితులయి ఉన్నారు, బలహీనులయి, వివశులయి ఉన్నారు. వారు దైవధర్మాన్ని అనుసరిస్తున్నందుకు వారిపైన దౌర్జన్యం జరిగేది. వారు సత్యధర్మాన్ని ఇతరులకు అందజేస్తున్నందుకు వారిపైన అక్రమాలు జరిగేవి. ఈ అన్యాయాలు, అధర్మాలు హద్దులు దాటి ఆఖరి అంచులకు చేరుకున్నప్పుడు ఆయన(స), ఆయన సహచరులు (ర) మదీనాకు వలసపోవలసి వచ్చింది. హిజ్రత్ తరువాత పీడన కాలం పరిసమాప్తం అయింది. దేవుని నేల నుంచి అధర్మాన్ని అన్యాయాన్ని బలంతో రూపుమాపి, దైవం పంపిన న్యాయ వ్యవస్థను, సంతులిత సమాజాన్నీ సంస్థాపించే శక్తి ఆయన(స)కు సంప్రాప్తించింది. అప్పుడు ఆయనకు

శక్తినుపయోగించి జిహాద్ చేసే ఆదేశమయింది. ఈ కార్యం కొరకు దివ్యకుర్‌ఆన్ వేరొక పరిభాషను ప్రయోగించింది. అది 'కితాల్ ఫీ సబీలిల్లాహ్' (దైవమార్గంలో యుద్ధం). అంటే భావం దైవప్రసన్నత బడయటానికి దైవధర్మ సమున్నతి, దైవధర్మ సముద్ధరణ, సమాధిక్యతల కొరకు చేసే యుద్ధం అన్నమాట. ఈ యుద్ధం, '**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్**'లోని విస్తృత కార్యంలోని ఓ భాగం అన్నమాట. ఈ కార్యం కొరకు ఆదేశం మదీనా పవిత్ర నగరిలో ఇవ్వబడినా దాని ప్రాతిపదికలు మక్కాలోని బోధనల్లోనే ఉన్నాయి. ఎందుకంటే **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్** ఆదేశం మక్కాలోనే అవతరించింది. కాగా అల్లామా షాతిబీ తన కృతి 'అల్ మువాఫికాత్ ఫీ ఉసూలి షరీఅ'లో ఇలా అంటున్నారు :

الجهاد الـذى شرع بالمدينة فرع من فروع الأمر بالمعروف و النهى عن المنكر وهو مقرر بمكة

**'మదీనాలో ప్రారంభమయిన జిహాద్, 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్'లోని ఓ అంశమే. మరి అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్ ఆదేశమేమో మక్కాలోనే విధితమయిపోయింది.**

*(అల్ మువాఫికాత్ ఫీ ఉసూలిష్షరీఅ : 3/ 50)*

ఈ గ్రంథ టీకా కర్త షేఖ్ అబ్దుల్లా దర్రాజ్ ఇలా అంటున్నారు :

بل هو اعلیٰ فروعه

**నిజానికి జిహాద్ ఫీ సబీలిల్లాహ్ అన్నది 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్'లోని అంశాలలో అన్నింటికన్నా ఉన్నతమయిన అంశం.** ***(అల్ మువాఫికాత్ ఫీ ఉసూలిష్షరీఅ :3/50)***

## విద్వాంసుల విశదీకరణలు

ఈ జిహాద్‌కు కొన్ని ప్రత్యేక పరిమితులు, నిబంధనలు ఉన్నాయి. అవి లేకుండా దాన్ని ఎట్టి పరిస్థితిలోనూ అనుమతించడం జరగదు. ప్రస్తుతం ఆ పరిమితులు, నిబంధనల చర్చ అనవసరం. ప్రస్తుతం ఒక విషయం విడమర్చి తెలుపడం అవసరం. **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్**లో ఏ విధంగానయితే ధర్మప్రచారం, ధర్మం వైపునకు పిలుపు చేరి ఉన్నాయో అదేవిధంగా ధర్మపరిరక్షణ, దాని సమున్నతి, సముద్ధరణ, సమాధిక్యతల కొరకు యత్నించడం, వాటి కోసం ధర్మాన్ని రూపుమాపకోరే వారితో పోరు సలపడం కూడా చేరి ఉన్నాయి. ఇక్కడ కొందరు ఎన్నదగ్గ పండితుల విశదీకరణలు ముందుంచుతున్నాము. దీనివల్ల మేము పైన పేర్కొన్న వాదనలు రూఢమవుతాయి.

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) ఇలా అన్నారు :

كُنتُمْ خَيْرَ أُمَّةٍ أُخْرِجَتْ لِلنَّاسِ يقول تأمرونهم بالمعروف ان يشهدوا ان لاَ الٰه الاّ اللّٰه و الاِقرار بمَا انــزل اللّٰــه و تقاتلونهم عليه و لاَ الٰه الاّ اللّٰه هو اعظم المعـروف و تنهونهم عن المنكر و المنكر هـو التكـذيب وهـو انكـر المنكر

"ప్రపంచంలో శ్రేష్ఠ సముదాయం మీరే, మిమ్మల్ని మానవుల మార్గబోధనకు, సంస్కరణకు ప్రవేశపెట్టడం జరిగింది." మీరు వీరికి 'మారూఫ్'ని ఆదేశిస్తారు; అంటే దైవం తప్ప మరో ఆరాధ్యుడు లేడని, ఇంకా ఆయన అవతరింపజేసిన ధర్మం సత్యమయినదని సాక్ష్యం పలకమని ఆదేశిస్తారన్నమాట. ఇదే ఆధారంగా మీరు వారితో (అవసరమయితే) జిహాద్ కూడా చేస్తారు. ఎందుకంటే అన్నింటికంటే గొప్ప మారూఫ్ 'లా ఇలాహ ఇల్లల్లాహ్' అన్నదే. మీరు వారికి 'మున్కర్'ని వారిస్తారు. అంటే దైవ తిరస్కారం పట్ల వారిస్తారు. దైవ తిరస్కారమే అన్నింటికన్నా పెద్ద మున్కర్ గనక.

*(జామి ఉల్ బయాన్ ఫీ తఫ్సీరిల్ కుర్ఆన్ (తబరీ) : 4/28)*

'కఫ్ఫాల్' ఇస్లామీయ తర్కశాస్త్రానికి చెందిన మహోన్నత పండితులు. ఆయన మహనీయ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్‌ని సమర్థిస్తూ ఇలా అంటారు :

تفضيلهم على الاُمم الذين كانوا قبلهم انما حصل لِاَجل انهم يامرون بالمعروف وينهون عن المنكر بآكد الوجوه وهو القتال، لِانّ الامر بالمعروف قديكون بالقلب و باللسان و باليد واقواها ما يكون بالقتال، لِاَنه القاء النفس فى خطـر القتـل، و أعـرف

గత సముదాయాలకు భిన్నంగా ముస్లిమ్ సముదాయం ప్రాముఖ్యానికి కారణం, అది మారూఫ్‌ను ఆదేశిస్తుంది, మున్కర్‌ని వారి స్తుంది. ఈ కార్యం అన్నింటికన్నా ప్రముఖంగా, ఉన్నతంగా నిర్వర్తిస్తుంది. అంటే జిహాద్ (నిరంతర కృషి) ద్వారాను, కితాల్ (పోరు) ద్వారాను. ఎందుకంటే అమ్ర్ బిల్ మారూఫ్ ఒక్కోసారి మనస్సు ద్వారాను, మరోసారి నోటి ద్వారాను, ఇంకోసారి చేత్తోనూ జరుగుతుంది. వీటన్నింటిలో పటిష్ఠమయిన విధానం కితాల్ ద్వారా

بالتوحيد و النبوة، و أنكر المنكرات الكفر بالله، فكان الجهاد فى الدين تحملا لِاعظم المضار لغرض ايصال الغير الى اعظم المنافع وتخليصه عن اعظم المضار، فوجب ان يكون الجهاد اعظم العبادات، و لما كان امر الجهاد فى شرعنا اقوى منه فى سائر الشرائع لاجرم صار ذٰلک موجباً لفضل هٰذه الاُمة على سائر الأمم، وهٰذا معنى ماروى عن ابن عباسؓ

జరిగేదే. ఎందుకంటే ఇందులో మనిషి మృత్యువును ఎదుర్కొంటాడు. అన్నింటికన్నా గొప్ప మారూఫ్ సత్యధర్మం, తౌహీద్, నుబువ్వత్‌ని విశ్వసించడం. అన్నింటికన్నా పెద్ద మున్కర్ దైవాన్ని తిరస్కరించటం. కాగా ధర్మమార్గంలో జిహాద్ అని అంటే భావం, మానవుడు ఇతరులకు అన్నింటికన్నా గొప్ప ప్రయోజనం చేకూర్చడానికి, వారిని అన్నింటికన్నా పెద్ద నష్టం నుండి కాపాడటానికి, తాను ఎంతటి పెద్ద హానినయినా ఎదుర్కొనేందుకు సిద్ధమవుతాడు. దీన్నిబట్టి 'జిహాద్' అన్నింటికన్నా గొప్ప ఆరాధన అన్న విషయం రూఢమయి తేలుతుంది. మన షరీఅత్‌లో జిహాద్ స్థానం మిగతా షరీఅత్‌ల కన్నా అత్యధిక ఉన్నతమయింది, ప్రస్ఫుటమయింది గనక జిహాద్ ముస్లిమ్ సముదాయం, మహత్తుకు గొప్పదనానికి కారణ భూతమయిపోయింది. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ సూక్తికి ఇదే భావం.

*(అత్‌తఫ్సీరుల్ కబీర్, సం.4, భాగం 8, పు.157)*

ఇమామ్ ఇబ్ను తైమియ్య ఇలా అంటున్నారు :

بيّن سبحانه ان هذه الاُمة خير الامم للناس فهم انفعهم لهم و اعظمهم احسانا اليهم لانهم كملوا امرالناس بالمعروف و نهيهم عن المنكر من جهة الصفة و القدر حيث امروا بكل معروف و نهوا عن المنكر لكل احد و اقاموا ذٰلک بالجهاد

అల్లాహ్ ఒక విషయాన్ని స్పష్టపరిచాడు, ముస్లిమ్ సముదాయం మానవుల ఎడల శ్రేష్ఠమయిన సముదాయం. అది అందరికన్నా అధికంగా ప్రయోజనం చేకూర్చే సముదాయం. అది చేసే మేలు అందరికన్నా గొప్పది. కారణం, అది జనులకు అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌ని గుణం రీత్యాను గణం రీత్యాను పరిపూర్ణం చేసి వేసింది, అది ప్రతి మారూఫ్‌ని ఆదేశించింది. ప్రతి మున్కర్‌ని

فی سبیل اللّٰــہ بانفسھم و اموالھم و ھٰــذا کمال النفع للخلق

వారించింది. మరి ధన ప్రాణాలతో దైవ మార్గంలో నిరంతర కృషి సలిపి (జిహాద్ చేసి) ఈ విధిని నిర్వర్తించింది- ఇది మానవులకు ప్రయోజనం చేకూర్చే అంతిమ సరిహద్దు!

*(అల్ హస్బతు ఫిల్ ఇస్లామ్: పుట. 59)*

మున్ముందు ఇదే చర్చను కొనసాగిస్తూ ఇలా అన్నారు:

فمعلوم ان الاَمــر بالمعــروف و النھی عن المنکر و اتمامــہ بالجھاد ھومن اعظم المعروف الذی امرنا بہ

మారూఫ్‌ను ఆదేశించడం, మున్కర్‌ని వారించడం, జిహాద్ ద్వారా దాన్ని పూర్ణం గావించడం మనకు ఆదేశించబడిన సత్కార్యాలలో కెల్లా గొప్ప సత్కార్యాలన్న విషయం అందరూ ఎరిగినదే. *(అల్ హస్బతు ఫిల్ ఇస్లామ్ : పు. 62)*

మరో సందర్భంలోనూ ఇమామ్ ఇబ్ను తైమియ్యా ఇలా అన్నారు :

ان اللّٰہ امر المومنین بالاُیمان و العمل الصالح و امرھــم بدعوۃ الناس و جھــاد ھــم علی الاُیمان و العمــل الصالــح کمــا قــال تعالیٰ وَ لَیَنۡصُرَنَّ اللّٰہُ مَنۡ یَّنۡصُرُہٗ اِنَّ اللّٰہَ لَقَوِیٌّ عَزِیۡزٌ ۝ اَلَّذِیۡنَ اِنۡ مَّکَّنّٰھُمۡ فِی الۡاَرۡضِ اَقَامُوا الصَّلٰوۃَ وَ آتَوُا الزَّکٰوۃَ وَ اَمَرُوۡا بِالۡمَعۡرُوۡفِ وَ نَھَوۡا عَنِ الۡمُنۡکَرِ وَلِلّٰہِ عَاقِبَۃُ الۡاُمُوۡر

పరమ ప్రభువు అల్లాహ్ విశ్వాసులకు విశ్వాసం, సదాచరణల ఆదేశమిచ్చాడు. దానితోపాటు జనులకు విశ్వాసం, సదాచరణల పట్ల పిలుపు నివ్వాలనీ, దాని కొరకు అవసరమయితే నిరంతర కృషి సలపమని (జిహాద్ చెయ్యమని) ఆదేశించాడు. ఆయన ఇలా సెలవిచ్చాడు,

"ఎవరయితే అల్లాహ్‌కు సహాయపడతారో వారికి అల్లాహ్ తప్పకుండా సహాయపడతాడు. అల్లాహ్ మహా శక్తిమంతుడు, బలోపేతుడు కూడా. అటువంటి వారికి మేము భువిలో అధికారం కట్టబెట్టినట్లయితే వీరు నమాజ్‌ని స్థాపిస్తారు, జకాత్ చెల్లిస్తారు, ప్రసిద్ధ సదాచారాలను ఆదేశిస్తారు, దురాచారాలను అరికడతారు. వ్యవహారాలన్నింటి అంతిమ పరిణామం అల్లాహ్‌కే హస్తగతమయి ఉంది".

*(అల్ హజ్జ్ : 40, 41)*

*(అల్ హస్బతు ఫిల్ ఇస్లామ్ : పు. 80)*

ఇమామ్ ఇబ్ను తైమియ్యా తన వాదనకు హజ్జ్ సూరాలోని ఏ ఆయత్‌ల నయితే ఆధారంగా చూపెట్టారో అవి, ముస్లిమ్ సముదాయం అధికారంలో వచ్చిన తరువాత నిర్వర్తించే కార్యాన్ని సూచిస్తున్నాయి. దాని వివరణ రానున్న అధ్యాయంలో చర్చిద్దాము. ఇక్కడ చెప్పదలచిందల్లా, అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌లో ధర్మసందేశ ప్రచారంతో పాటు జిహాద్ కూడా చేరి ఉందన్న విషయం మాత్రమే.

అల్లామా ఇబ్ను జరీర్ తబరీ ఇలా నుడివారు :

(وَلْتَكُنْ مِّنْكُمْ أُمَّـةٌ ... وَيَأْمُـرُوْنَ بِالْمَعْرُوْفِ) يقول يامـرون الناس باتباع محمـد صلى الله عليـه و سلم ودينه الـذى جاء بـه من عند اللّٰـه (وَيَنْهَـوْنَ عَنِ الْمُنْكَرِ) يعنى وينهـون عن الكفر باللّٰه و التكذيب بمحمد وبما جاء به من عند اللّٰه بجهادهم بالأيدى و الجوارح حتى ينقادوا لكم بالطاعة

**'మీలో ఒక వర్గం తప్పక ఉండాలి... అది మంచిని ఆదేశించేది'.. అంటే ముహమ్మద్ (స)ను ఆయన తెచ్చిన ధర్మాన్నీ అనుసరించ మని పిలుపునివ్వాలి. 'మరి చెడు నుంచి వారించేది' అంటే తన బాహుబలంతో జిహాద్ చేసి దైవ తిరస్కారం, ముహమ్మద్(స)ని, ఆయన తెచ్చిన ధర్మాన్నీ నిరాకరించడాన్ని వారించాలి, కడకు వారు మీకు విధేయులయి మీ (ఇస్లామ్) విధేయతను స్వీకరించాలి.**

*(జామిఉల్ బయాన్ ఫీ తఫ్సీరిల్ కుర్ఆన్: 4/27)*

అల్లామా కుర్తుబీ ఇలా అంటున్నారు :

إِنَّ أخصّ أوصاف المومن الامر بالمعروف والنهى عن المنكر ورأسها الدعاء الى الاسلام والقتال عليه

**'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్' విశ్వాసికి చెందిన అన్నింటికన్నా ప్రత్యేక లక్షణం. ఈ కార్యంలోని విభిన్న రూపాల్లో ఇస్లామ్ వైపునకు పిలుపునివ్వడం, దానికొరకు పోరు సలపడం ప్రముఖమయినది.**

*(అల్ జామిఉల్ అహ్కాముల్ కుర్ఆన్ : సం. 2, భాగం 4, పుట. 31)*

ఇమామ్ రాజీ ఇలా అంటున్నారు :

رأس المعـروف الايمـان باللّٰه ورأس المنكر الكفـر باللّٰه

**అన్నింటికన్నా గొప్ప మారూఫ్ అల్లాహ్‌ను విశ్వసించడం, అన్నింటికన్నా పెద్ద మున్కర్ అల్లాహ్‌ను కాదనటం. జిహాద్ తప్పనిసరిగా**

والجهاد يوجب الترغيب فى الايمان و الزجر عن الكفر والجهاد داخل فى باب الامر بالمعروف والنهى عن المنكر

**విశ్వాసం వైపునకు పురికొలిపే, తిరస్కారానికి దూరంగా ఉంచే సాధనం. మరి ఈ జిహాద్ 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్' లో చేరి ఉన్న అంశమే.**

*(అత్ తఫ్సీరుల్ కబీర్, సం.8, భాగం 16, పు.162)*

షమ్సుల్ అయిమ్మ సరఖ్సీ ఇలా నుడివారు :

و قد سمّى رسول اللهﷺ الجهاد سنام الدين وفيه امر بالمعروف و نهى عن المنكر وهو صفة هذه الأمة و فيه تعرض لِاعلىٰ الدرجات و هو الشهادة

**దైవ సందేశహరులు (స) జిహాద్‌ని ధర్మానికి చెందిన శిఖరాగ్రం అని సెలవిచ్చారు. జిహాద్‌లో మారూఫ్‌ని ఆదేశించడం, మున్కర్‌ని వారించడం జరుగుతుంది. ఇది ఈ (ముస్లిమ్) సముదాయం లక్షణం. పోతే, జిహాద్‌లో (సాఫల్య శ్రేయాల) అత్యంత ఉన్నత స్థాయి అంటే అమరగతి కొరకు మనిషి తన్ను తాను సమర్పించుకోవలసి వుంటుంది.**

*(షర్‌హ్అస్సియరుల్ కబీర్ : 1/ 19, 20)*

## షాహ్ వలీ ఉల్లాహ్ దృక్కోణం

మహనీయ షాహ్ వలీ ఉల్లా దెహలవీ (రహ్మ) దృష్టిలో ఈ సముదాయం శ్రేష్ఠ సముదాయం అవడానికి, జనుల కోసం ఆవిర్భవింపబడటానికి గల భావమేమిటంటే దైవ ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లమ్) ఏ లక్ష్యంతో ప్రపంచంలోకి వచ్చారో దాని ప్రచార ప్రసారాలు ధ్యేయంగా ఈ సముదాయం ప్రపంచమంతటా వ్యాపించి దైవమార్గంలో నిరంతర కృషి సలుపుతుంది. కాగా ఈ విషయాన్ని చర్చిస్తూ ప్రవక్త మహనీయుల (స) ద్వారా ప్రపంచానికి ఓ సమగ్రమయిన, సంపూర్ణమయిన ధర్మం, వెనుకటి మతాలనన్నింటినీ రద్దు పరచిన ధర్మం ప్రాప్తమయిందని చెబుతూ షాహ్ సాహెబ్ ఇలా అన్నారు: 'ఈ ధర్మం ముందుకు రావడానికి కారణం, విభిన్న జాతులు మతం పేరిట పోరాడుకుంటున్నాయి, మతం వాస్తవికత కనుమరుగయి పోయింది. కేవలం కొన్ని ఆచారాలు మాత్రం మిగిలాయి, (అట్టి తరుణంలో ఇస్లామ్ ఆవిర్భావం జరిగింది).

مسّت الحاجة الىٰ امام راشد يعامل مع الملل معاملة الخليفة الراشد مع الملوک الجائرة ... وهـٰذا الامام الذى يجمع الامم على ملـة واحدة يحتاج الى اصول ... منها ان يدعو قوما الى السنة الراشدة ويزكيهم ويصلح شأنهم، ثم يتخـذهـم بمنزلـة جوارحـهٖ فيجاهد اهل الارض ويفرقهم فى الآفاق وهو قولـه تعـالىٰ (كُنْتُمْ خَيْرَ اُمَّـةٍ اُخْرِجَتْ لِلنَّاسِ)

(ఈ కారణంగా) ఒక సన్మార్గగామి అయిన మార్గదర్శకుడు అవసరమయ్యాడు. అతను విభిన్న జాతులతో వ్యవహరించగలవాడయి ఉండాలి– దుర్మార్గులయిన రాజులతో సన్మార్గ గామి అయిన ఖలీఫా (పాలకుడు) వ్యవహరించేలా– సకల జాతుల వారిని ఒకే ధర్మం త్రాటిన ప్రోగు చేయగల ఈ మార్గదర్శకుడు కొన్ని సూత్ర ప్రాయమయిన విషయాలను ఆచరించేవాడయి ఉంటాడు. ఆ సూత్రాలలో ఒకటి, తొలుత అతను ఒక వర్గాన్ని సన్మార్గం వైపునకు పిలుపునిస్తాడు. ఆ వర్గం ప్రజల ఆత్మ ప్రక్షాళన చేస్తాడు, దాని పరిస్థితుల్ని చక్కబరుస్తాడు, ఆ తరువాత వారినే తన బాహు బలంగా మార్చుకుంటాడు. వారి సహకారంతో ప్రపంచవాసులతో పోరు సలుపుతాడు. ప్రపంచమంతటా దాన్ని ఈ పరిశుద్ధ లక్ష్యంతో విస్తరిల్ల చేస్తాడు. పరమ ప్రభువు, 'మీరు శ్రేష్ఠ సముదాయం, జనుల కోసం ఆవిర్భవింప జేయబడ్డారు' అని అన్నదానికి ఉద్దేశ్యమిదే.

ఇలా అన్న తరువాత షాహ్ సాహెబ్ ఇంకా ఇలా అన్నారు, "ధర్మం, దాని అంతిమ రూపంలో అవతరించినప్పుడు రోమా, పర్షియా రాజ్యాలు అప్పటి నాగరిక ప్రపంచమంతటా ఆవరించి ఉన్నాయి. ఆనాటి ఆలోచనలు, అభిప్రాయాలు, నాగరికత, సంస్కృతి-అన్నింటిపైనా వాటి ప్రభావం, అదుపు ఉండేవి. అందువల్ల ఆ రెంటినీ అంతమొందించడం అవసరమయింది. అప్పుడే వాటి స్థానే సత్యధర్మ ప్రభుత సుస్థాపితం కాగలుగుతుంది.

لما اراد اللّٰہ تعالیٰ اقامة الملة العوجاء وان يخرج للناس امة تامر هم بالمعروف و تناهم عن المنكر و تغير رسومهم الفاسدة كان ذٰلک موقوفا علیٰ زوال دولة هٰذين متيسر بالتعـرض لحالهما، فـان حالهمـا يسرى فى جميع الاُقاليم الصالحة او يكاد يسرى، فقضى اللّٰہ بزوال دولتهما و اخبر النبى صلى اللّٰہ عليه و لسم بان هلک كسرىٰ فلا كسرى بعده وهلک قيصر فلا قيصر بعده، و نزل الحق الدامغ لباطل جميع الاُرض فى دمغ باطل العرب بالنبى صلى اللّٰہ عليه وسلم و اصحابه ودمغ باطل هذين الملكين بالعرب و دمـغ سائـر البـلاد بملئهما و للّٰہ الحجة البالغة

అపసవ్యతకు గురయిన ధర్మాన్ని సరిదిద్ది, మానవులకు 'మారూఫ్'ను ఆదేశించే 'మున్కర్'ను వారించే, వారి చెడిపోయిన ఆచార వ్యవహారాలను రూపుమాపే ఓ సముదాయాన్ని అవిర్భవింపజేయాలని పరమ ప్రభువు సంకల్పించుకున్నప్పుడు- ఈ కార్యం జరగాలంటే రోమా, పర్షియా సామ్రాజ్యాల పతనం ద్వారానే సాధ్యం అయ్యేది; వాళ్ళ వ్యవహారంలో కలగజేసుకున్నప్పుడే ఈ మహత్కార్యం నిర్వర్తింప జెయ్యడం సులభమయ్యేది. ఎందుకంటే ఆ రాజ్యాల స్థితిగతులు అనాటి నాగరిక దేశాలన్నింటిపైనా పూర్తిగానో లేదా చాలావరకో ఆవరించి ఉండేవి, కనుక ఆ రెండు సామ్రాజ్యాల పతనాన్ని అల్లాహ్ తీర్మానించివేశాడు. ప్రవక్త మహనీయులు (స) (భవిష్యవాణిలా) ప్రకటించారు-కిస్రా హతమయ్యాడు, ఇతని తరువాత మరో కిస్రా ఎవ్వడూ పుట్టబోడు. ఇంకా కైసరు అంతమయ్యాడు, ఇతని తరువాత మరో కైసరు పుట్టబోడు. సత్యం అవతరించింది, భూతలం అంతటిపైని అసత్యం, మిథ్యల మాడు బద్దలుగొట్టే సత్యం అవతరించింది అని. అది ఎలా జరిగిందంటే, ప్రవక్తశ్రీ (స), ఆయన సహచరులు తొలుత అరేబియాలోని మిథ్యను అంతమొందించారు. తరువాత అరేబియా ఆ ఇరు రాజ్యాల మిథ్యను అంతమొందించింది. చివరికి ఆ రెంటి ద్వారా సకల రాజ్యాల మిథ్యను

**అణగదొక్కడం జరిగింది, మరి యదార్థానికి చేరే వాదనయితే అల్లాహ్ హస్తగతమయి ఉంది.**

*(హుజ్జతుల్లాహిల్ బాలిగ : 1/220-222)*

వాస్తవ మేమిటంటే ఈ సముదాయం దైవవచనాన్ని సమున్నత పరచడానికి ప్రభవించింది. ప్రపంచం నుంచి మిథ్యా వ్యవస్థను రూపుమాపి భూతలాన అల్లాహ్ ప్రభుతను స్థాపించడం దీని బాధ్యత. ఈ బాధ్యతను నేరవేర్చాలంటే, అది ఈ మార్గాన తన శక్తినంతటినీ ధారబోయాలి, తన ఆలోచనాత్మక, ఆచరణాత్మక సంపదలనన్నింటినీ సమర్పించుకోవాలి, తన ధన ప్రాణాలను త్యాగం చెయ్యడానికి సిద్ధమవ్వాలి- దీన్నే కుర్ఆన్ హదీసుల పరిభాషలో జిహాద్ ఫీ సబీలిల్లాహ్- దైవ మార్గంలో సతత సమరం- అనీ అంటారు, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** అని కూడా అంటారు.



# 9. ఇస్లామీయ రాజ్యం★

## అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్- అధికారం

అల్లాహ్ ఆలి ఇమ్రాన్ సూరాలో ముస్లిమ్ సముదాయానికి 'శుభం వైపునకు పిలుపు', 'అమ్ర్ బిల్ మారూఫ నహీ అనిల్ మున్కర్'ల ఆదేశం ఇచ్చిన తరువాత వెంటనే ఇలా సెలవిచ్చాడు :

وَلَا تَكُونُوا كَالَّـذِينَ تَفَرَّقُوا وَ اخْتَلَفُوا مِنْ بَعْدِ مَاجَاءَ هُمُ الْبَيِّنٰتُ وَ اُولٰئِكَ لَهُمْ عَذَابٌ عَظِيمٌ۝

(آل عمران:۱۰۵)

**వర్గాలు వర్గాలుగా చీలిపోయినటువంటి వారిలా, ప్రస్ఫుటమయిన బోధనలు పొందిన తరువాత మళ్ళీ విభేదాలకు లోనయిటువంటి వారిలా మీరున్నూ రూపొందేరు సుమా! ఈ వైఖరి నవలంబించిన వారు కఠినశిక్షకు పాత్రుల వుతారు.** ***(ఆలి ఇమ్రాన్ : 105)***

ఇక్కడ ఓ విషయం గమనార్హమయింది. **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** ఆదేశంతోపాటు వెంటనే విభేదాలు వ్యత్యాసాలను వారించడం జరిగింది. ఎందుకు? దీనికి అనేక కారణాలు కావచ్చు. కాని అన్నింటికన్నా పెద్ద కారణం, స్పష్ట మయిన కారణం ఏమిటంటే **'అమ్ర్ బిల్ మారూఫ వ నహీ అనిల్ మున్కర్'** విధి, ఏవిధంగా ధర్మప్రచార ఆవశ్యకతను చాటుతుందో అదేవిధంగా అది అధికారం, ప్రభుతను కూడా కోరుతుంది. అధికారం, సత్తా కావాలంటే సమైక్యత అవసరం. విభేదాలు, భిన్నత్వాలు నిండిన జాతి దేవుని నేలపైన అధికార సత్తాకు అర్హత పొందదు.

---

★ *ఇక్కడ 'ఇస్లామీయ రాజ్యం' దాని సవివరమయిన రూపం చర్చించడం జరగలేదు. ఈ పుస్తకం విషయ పరిధిననుసరించి కేవలం క్లుప్తమయిన ప్రస్తావన మాత్రమే ఉంది. దీని కొన్ని వివరాలు, రచయిత తన మరో పుస్తకం 'ముస్లిమేతరు లతో సంబంధాలు, వారి హక్కులు' (ఉర్దూ)లో అందజేశారు.*

అది పాలిత జాతిగానే మ్రగ్గి, అది ఇతరుల దాస్యంలో అణగిమణగి ఉండవలసి వస్తుంది. అది తనకు ఇష్టమయిన రాజకీయ వ్యవస్థను స్థాపించుకుని దాన్ని అమలు పరచుకోజాలదు, అది ఆ హక్కు తానే కోల్పోతుంది. ఈ యదార్థాన్నే ఇక్కడ ఈ ఆయత్‌లో ముస్లిములకు బోధపరచడం జరిగింది. ఇందులో వీరికి తెలిపిన విషయం ఏమిటంటే రాజకీయ రంగంలో **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** విధి నిర్వహణ మీకు సాధ్యమవ్వాలంటే మీ మధ్యన సమైక్యత నెలకొనాలి, మీ మధ్యన ప్రేమానురాగాల వల్ల మీరంతా ఏకైక శరీరంగా మారాలి. దీనికి భిన్నంగా మీరు తమ సమైక్యతను కోల్పోయినట్లయితే మీ రాజకీయ శక్తి ముక్కచెక్కలయిపోతుంది. అధికార సత్తా మీ నుండి తప్పనిసరిగా చేజారిపోతుంది. ఆ తరువాత కూడా మీరు మారూఫ్‌ని పాటించాలని, మున్కర్‌ని మానుకోవాలని బోధిస్తూ ఉండటం సంభవమే కాని మారూఫ్‌ని శాసనపరంగా అమలుపరచటం, మున్కర్‌ని రాజకీయంగా నిషేధించటం మీ వల్ల అలవికాని పనిగా మారిపోతుంది.

ఇమామ్ రాజీ ఈ ఆయత్‌కు రెండు సంబంధాలున్నట్లు చెప్పారు. ఒకటేమి టంటే మొత్తం వచన క్రమంతో దీని సంబంధం ఉంది. రెండవది, ప్రత్యేకంగా **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌**తో సంబంధం అని. అల్లామా రషీద్ రజా మొదటి సంబంధాన్ని ఇష్టపడ్డారు. అయితే రెండవ సంబంధాన్ని మొదటి దానిపైన ప్రాధాన్యమిచ్చారు.[1] ప్రస్తుతం ఆ రెండవ సంబంధం గురించి ఇమామ్ రాజీ పదాలలోనే తెలుసుకుందాం.

**انه تعالىٰ لمّا امر بالمعروف و النهي عن المنكر وذٰلک ممّا لايتم الّا اذاكان الأمر بالمعروف قادرا على تنفيذ هٰذا التكليف على الظلمة و المتغالين ولاَ تحصل هٰـذه القـدرة الاّ اذا حصلت الالفة والمُحبة بين اهل**

**పరమ ప్రభువు అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ పట్ల ఇచ్చిన ఆదేశం నెరవేరాలంటే; అమ్ర్ బిల్ మారూఫ్ విధి నిర్వహించే వ్యక్తి, దుర్మార్గులు, అత్యాచారులకు ప్రతిగా తన విధిని నిర్వర్తించగలిగే శక్తి కలిగి వుండాలి. ఈ శక్తి ప్రాప్తం కావాలంటే సత్య కాముకులు, ధర్మపరాయణుల మధ్య ప్రేమానురాగాలు వెల్లివిరియాలి. అందువల్లనే అల్లాహ్ వారిని**

1. *తఫ్సీర్ అల్ కుర్ఆనిల్ హకీమ్ (అల్ మనార్ : 4/ 48)*

الحق و الدين لاَجرم حذرهم تعالىٰ من الفرقة والاُختلاف لكى لا يصير ذٰلك سبباً لعجزهم عن القيام بهذا التكليف

**విభేదాల పట్ల విచ్ఛిన్నం పట్ల హెచ్చరించాడు; వారు అమ్ర్ బిల్ మారూఫ్ విధి నిర్వహణకు దూరమవకుండా ఉండాలని.**

*(మఫాతీహుల్ గైబ్, సం.4, భాగం 8, పు. 147)*

అల్లామా నిజాముద్దీన్ నీషాపూరీ కూడా 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్' ఆదేశం, మరి ఈ ఆయత్ మధ్యన ఇదే సంబంధముందని వివరించారు.[1] ఈ రెండు ఆయత్‌ల సంబంధం అలా ఉంచి, ఇమామ్ ఇబ్ను తైమియ్యా పలికినట్లు, సముదాయంలో సమైక్యత సృజించి దాన్ని విభేదాల నుండి, విచ్ఛిన్నాల నుండి కాపాడే ప్రయత్నం చెయ్యాలన్నది స్వయంగా '**అమ్ర్ బిల్ మారూఫ్**' అన్నదానిలో చేరి వుంది. కాగా ఆయన ఇలా సెలవిచ్చారు :

من الاُمر بالمعروف الامر بالاُئتلاف والاجتماع والنهى عن الفرقة

**సమైక్యతను, ప్రేమానురాగాలను ఆదేశించడం, విభేదాలను వారించడం కూడా అమ్ర్ బిల్ మారూఫ్‌లో అంతర్భాగమే.**

*(మజ్మూఅతుర్రసాయల్ కుబ్రా, అర్రిసాలతుస్సాబిఅ, అల్ వసీఅతుల్ కుబ్రా : 1/ 309)*

యదార్థం ఏమిటంటే **అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్** ముస్కర్‌ని చివరి దశ వరకు నిర్వర్తించడానికి శక్తి, అధికారం నిస్సంకోచంగా అనివార్యమైనవే. అధికార సత్తా అన్నది సమైక్యత లేనిదే ప్రాప్తమూ కాదు, మనగలనూ జాలదు.

దీన్నిబట్టి తెలిసేదేమిటంటే '**అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్** ముస్కర్' అన్నది కేవలం సందేశ ప్రచార కార్యమే కాదు, నిజానికి అది ఓ రాజకీయ క్రియ, ప్రక్రియ కూడా. ఇంతకన్నా సరయిన నిర్వచనం బహుశా ఇలా చెప్పడంలో ఉంది- '**అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్** ముస్కర్'అన్నది సందేశాత్మకమయినదీ రాజకీయ ప్రధానమయినదీను. గత అధ్యాయాల్లో దీని సందేశాత్మక కోణం పట్ల చర్చ, విశదీకరణ జరిగింది. ప్రస్తుతం ఇక్కడ '**అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్** ముస్కర్'ని రాజకీయ కోణంలో చర్చించడం అవసరం.

---

1. *గరాయిబుల్ కుర్ఆన్ వ రగాయిబుల్ ఫుర్కాన్ : 4/33*

అల్లాహ్ ఈ సముదాయంలోని ప్రప్రథమ, అత్యున్నత వర్గం గురించి వివరిస్తూ, వారు ధరణిలో అధికారం పొందిన తరువాత మారూఫ్‌ను ఆదేశిస్తారు, మున్కర్‌ని వారిస్తారు. మరే సిద్ధాంతాలు మూలసూత్రాలను తాము నమ్ముతారో, వాటిని మానవుల మధ్య అమలుపరుస్తారు అని సెలవిచ్చాడు. అంటే అధికారం ప్రాప్తమవక మునుపు ఏ ధర్మం వైపునకు వారు పిలుపునిస్తూ ఉన్నారో, అధికారం ప్రాప్తమవగానే దాన్ని మరచిపోయి, తమ మనోకాంక్షల పరిపూర్తిలో నిమగ్నులైపోరు అని సెలవిచ్చాడు. కాగా హజ్జ్ సూరా 41వ ఆయత్‌ని పరిశీలిస్తే తెలుస్తుంది, ప్రవక్త సహచరులకు అధికార సత్తా, ప్రభుతను ప్రసాదించే ముందే అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

اَلَّذِيْنَ اِنْ مَّكَّنّٰهُمْ فِى الْاَرْضِ اَقَامُوا الصَّلٰوةَ وَاٰتَوُا الزَّكٰوةَ وَ اَمَرُوْا بِالْمَعْرُوْفِ وَنَهَوْا عَنِ الْمُنْكَرِ وَلِلّٰهِ عَاقِبَةُ الْاُمُوْرِ (الحج:٤١)

**ఇటువంటి వారికి మేము భువిలో అధికారం కట్టబెట్టినట్లయితే వీరు నమాజ్‌ని స్థాపిస్తారు, జకాత్ చెల్లిస్తారు, ప్రసిద్ధ సదాచారాలను ఆదేశిస్తారు, దురాచారాలను అరికడతారు. వ్యవహారాలన్నింటి అంతిమ పరిణామం అల్లాహ్‌కే హస్తగతమయి వుంది.** ★

(అల్ హజ్జ్ : 41).

★ *హజ్జ్ సూరాలో ఈ ఆయత్‌కు ముందు ముహాజిర్ల ప్రస్తావన వుంది. అంటే ఈ ఆయత్‌లో అసలు వారి లక్షణాలే పేర్కొనబడ్డాయన్నమాట. కాని నిజానికి ఈ లక్షణాలు కేవలం ముహాజిర్లలోనే కోరడం జరగలేదు, సమస్త సముదాయం, దాని సకల వర్గాలలో ఇవి నెలకొనడం అవసరం. అందువల్లనే ఏ వ్యాఖ్యాతల దృష్టిలో ఆయత్‌ల పూర్వరంగం ఉండిందో వారు ముహాజిర్ల ప్రస్తావన ఉందన్నారు. కాని ఎవరయితే ఆయత్ ఉద్దేశ్యాన్ని గ్రహించారో వారు సముదాయంలోని ఇతర వర్గాలను సయితం, సమస్త సముదాయాన్నీ ఇందులో చేరి ఉన్నట్లు గ్రహించారు. కతాదా (రజి) ప్రకారం, ఇక్కడ ప్రవక్త సహచరులు ఉద్దేశించబడ్డారు; హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్(రజి) ప్రకారం, ముహాజిర్లు అన్సార్లు, తాబయీన్లు ఉద్దేశించబడ్డారు. ఇక్రిమ ప్రకారం అయిదు వేళల నమాజ్ ఆచరించేవారి ప్రస్తావన ఉంది. హసన్ బస్రీ, అబుల్ ఆలియ అభిప్రాయంలో, ఇది ముహమ్మద్(స) సముదాయంకు ఉద్దేశించబడిన ఆయత్ భావం, వారికి అధికారం ప్రాప్తమయితే వారు నమాజ్‌ని స్థాపిస్తారు అన్నది. ఇబ్ను అబీ నజీహ్ ప్రకారం, ఇది (ఇస్లామీయ రాజ్యంలోని) అధికారుల ప్రస్తావన. జహ్హాక్ ప్రకారం, ఎవరికయితే అల్లాహ్ ప్రభుత, రాజ్యం, సత్తా ప్రసాదిస్తాడో వారికి ఈ ఆయత్‌లో షరతు విధించబడింది (వారు*

## ఇస్లామీయ రాజ్య ప్రణాళి

ఈ కుర్ఆన్ ఆయత్‌ని ఇస్లామీయ రాజ్య ప్రణాళిక (Manifesto) అని చెప్ప వచ్చు. ఇందులో ముస్లిమ్ సముదాయం అధికార సత్తా పొందిన తరువాత నిర్వర్తించే రాజకీయ కార్యకలాపాలను పేర్కొనడం జరిగింది. దీన్నిబట్టి ఇస్లామీయ రాజ్యం ఏ ఆశయ సిద్ధికి ఉనికిలోకి వస్తుందో, దాని నైజం ఎటువంటిదో, దాని ఆచరణలు ఏ విధమయినవయి ఉంటాయో, అది తన సాధనా సంపత్తిని, వనరుల్ని ఏ మార్గంలో వెచ్చిస్తుందో అంతా తెలుసుకోవటం సులభతరమవుతుంది. యదార్థానికి దివ్య కుర్ఆన్‌లోని ఈ క్లుప్తమయిన ఆయత్ అతి స్పష్టంగా విశ్వాసుల చేతుల మీదుగా స్థాపించబడే రాజ్యం, దాని ప్రాథమిక విధులను ప్రకటిస్తుంది. ఈ వాస్తవాన్ని ప్రకటించ డానికే హాఫిజ్ అబుల్ బర్కాత్ నసఫీ, తదితర వ్యాఖ్యాతలు ఈ వ్యాఖ్యాన విధానాన్ని అవలంబించారు:

**هو اخبار من الله عما ستكون عليه سيرة المهاجرين ان مكّنهم فى الارض وبسط لهم فى الدنيا و كيف يقومون بامر الدين**

**ఇది అల్లాహ్ తరఫున ముందస్తు ప్రకటన. ఆయన ఒకవేళ ముహాజిర్లకు అధికారం ప్రసాదిస్తే, ధన సంపదల్లో విస్తృతిని అనుగ్రహిస్తే వారి శీల స్వభావాలు ఎలా ఉంటాయో, వారు ధర్మం విషయంలో ఎటువంటి బాధ్యతల్ని నిర్వర్తిస్తారో తెలిపారు.**

*(మదారి కుత్తన్జీల్ వ హకాయికుత్తావీల్-అబూ హయ్యాన్, అందులుసీ-అల్ బహ్రుల్ ముహీత్: 6/60)*

## విశ్వాసుల వ్యక్తిగత లక్షణాలు

హజ్జ్ సూరాలోని పైన పేర్కొన్న ఆయత్‌లో, అధికారం ప్రభుత పొందిన విశ్వా సుల లక్షణాలు నాల్గింటిని పేర్కొనడం జరిగింది - నమాజ్ స్థాపన, జకాత్ చెల్లింపు, అమ్ర్ బిల్ మారూఫ్, నహీ అనిల్ మున్కర్. మొదటి రెండు లక్షణాలు వారి వ్యక్తిగత స్వభావాన్ని తెలుపుతున్నాయి. తరువాతి రెండు గుణాలలో వారి సామూహిక, రాజకీయ

---

*ఈ షరతును నిర్వర్తించడం తప్పనిసరి). అల్లామా కుర్తుబీ తన వ్యాఖ్యాన గ్రంథంలో భిన్న వాక్కులను ఉటంకించి చివరి మాట పట్ల తన ఇష్టాన్ని వ్యక్తం చేశారు. (చూడండి 'అల్ జామిలి అహ్కాముల్ కుర్ఆన్. సం.6, భాగం. 12, పుట. 49)*

గుణాలు వివరించబడ్డాయి. ఆధునిక వ్యాఖ్యాతలు అల్లామా అహ్మద్ ముస్తఫా అల్ మరాగీ ఈ ఆయత్ వ్యాఖ్యానం తరువాత దాన్ని సంక్షిప్తంగా ఇలా తెలిపారు:

انهم هم الذين كملوا انفسهم باستحضار المعبود والتوجه اليه فى الصلوٰة علىٰ قدر الطاقة و كانوا عونا لامهم باعانة فقرائهم وذوالحاجة منهم وكملوا غيرهم فافاضوا عليهم من علومهم و اٰدابهم و منعوا المفاسد التى تعوق غيرهم عن الوصول فى الرقى الخلقى والادب السامى

వీరు ఎటువంటి వారంటే, వీరు నమాజ్‌లో శక్తి మేర ఆరాధ్యుని ప్రత్యక్షతా భావంతో ఆయన వైపునకు చిత్తం మరలించి తమ ఆత్మల పరిపూర్ణత సాధించినవారు. వారు నిరుపేద లకు, అగత్యపరులకు సహాయం అందజేసి తమ జాతి వారికి సహాయకులయినవారు, ఇంకా తమ కొరకు మాత్రమేకాక ఇతరులకూ పరిపూర్ణతను సాధించినవారు– ఇది వారిలో తమ శాస్త్రాలను, మర్యాదలను వ్యాపింప జేయడం ద్వారాను, ఇంకా వారిని నైతిక ఔన్నత్యాల నుండి, ఉన్నత సంస్కారాల నుండి వారించే చెడుగుల నుండి కాపాడటం ద్వారాను సాధించినవారు.

*(తఫ్సీరుల్ మరాగీ : 17/120)*

అల్లామా ఇబ్ను జరీర్ తబరీ ఈ ఆయత్ వ్యాఖ్యానంలో ఇలా నుడివారు :

يعنى بقوله اِنْ مَّكَّنّٰهُمْ فِى الْاَرْضِ ان وَطّنا لهم فى البلاد فقهروا المشركين وغلبوهم عليها وهم اصحاب رسول اللّٰه صلى اللّٰه عليه وسلم، يقول ان نصرنا هم علىٰ اعدائهم و قهروا مشركى مكة اطاعوا اللّٰه فَاَقَامُوا الصَّلٰوة بحدودها وَ اٰتُوا الزَّكٰوةَ، يقول و اعطوا زكوٰة اموالهم من جعلها

'వారికి మేము భువిలో అధికారం కట్టబెట్టినట్ల యితే, అంటే మేము వారిని నగరాలలో వసిం పజేయగా వారు బహు దైవారాధకుల బలిమిని అణచివేసినట్లయితే, వారిపైన ఆధిక్యత సాధిం చినట్లయితే అన్నమాట. దీని ఉద్దేశం దైవ సందేశహరుల సహచరులన్నమాట. భావం, మేము వారికి శత్రువులకు ప్రతిగా సహాయం అందజేసినట్లయితే, వారు బహు దైవారాధకుల పైన ఆధిక్యత పొందినట్లయితే వారు పరమ ప్రభువు విధేయత పాటిస్తారు, నమాజ్‌ని దాని సమస్త పరిమితులతో మర్యాదలతో స్థాపిస్తారు, జకాత్‌ని చెల్లిస్తారు - అంటే వీరు అల్లాహ్

اللّٰہ له، وَ اَمَرُوۡا بِالۡمَعۡرُوۡفِ يقول ودعوا الناس الیٰ توحيد اللّٰہ و العمل بطاعته و مايعرفـه اهل الاٗيمان باللّٰہ، وَنَهَوۡا عَنِ الۡمُنۡكَرِ، يقول و نهوا عن الشرک باللّٰہ و العمل بمعاصيه الذی ينكره اهل الحق والاٗيمان باللّٰہ

సూచించిన అర్హులయిన వారికి తమ సంపదల్లో నుంచి జకాత్ అందజేస్తూ ఉంటారు. 'మారూఫ్‌ను ఆదేశిస్తారు' అంటే జనులకు దేవుని ఏకత్వం వైపునకు, ఆయన విధేయత ఆజ్ఞాబద్ధత వైపునకు, ఇంకా విశ్వాసు లలో ప్రసిద్ధమయిన (స్వీకృతి పొందిన) ఆచరణల వైపునకు పిలుపునిస్తారు అన్నమాట. మరి 'ముస్కర్'ని వారిస్తారు అంటే అల్లాహ్‌తో పాటు ఆయనకు సహవర్తులను కల్పించడాన్ని సత్యవాదులు, విశ్వాసులూ ఇష్టపడనటువంటి అల్లాహ్ అవిధేయతను వారిస్తారు అన్నమాట.

*(జామిఉల్ బయాన్ ఫీ తఫ్సీర్ అల్ కుర్ఆన్ :17/115)*

ఇమామ్ షా వలీఉల్లా దెహ్లవీ ఇలా సెలవిచ్చారు :

اَقَامُوا لصَّلوٰة وَاٰتَوُ الزَّكوٰة اشاره است باقامت اركان اسلام وَ اَمَرُوۡا بِالۡمَعۡرُوۡفِ شامل است احياء علوم دين را وَنَهَوۡا عَنِ الۡمُنۡكَر شامل است جهاد كفار و اخذ جزيه رازيراكه منكرے زياده تر از كفر نيست و نهیے دروے بالاتر از قتل اهل كفر وگرفتن جزيه نه وشامل است اقامت حدود وتعزيرات رابرعصاة مسلمين

'నమాజ్‌ని స్థాపిస్తారు, జకాత్ చెల్లిస్తారు' అంటే ఇందులో వారు ఇస్లామ్ మౌలిక ప్రాతిపదికల్ని స్థాపిస్తారని సూచనప్రాయంగా చెప్పడం జరిగింది. 'మారూఫ్‌ని ఆదేశిస్తారు'. అంటే అందులో ధార్మిక శాస్త్రాలను పునరుజ్జీవింప జేయడమూ చేరి వుంది. అలాగే 'ముస్కర్‌ని వారిస్తారు' అంటే ఇందులో తిరస్కారులతో పోరు సలపడం, వారి నుండి జిజ్‌యా వసూలు చెయ్యడం కూడా చేరివుంది. ఎందుకంటే తిరస్కారం కన్నా పెద్ద 'ముస్కర్' మరొకటి లేదు. మరి తిరస్కారుల్ని వారించే అంతిమ రూపం వారిని తుదముట్టించడమే కాగలదు, వారి నుండి జిజ్‌యా వసూలు చెయ్యడమూ కాగలదు. అలాగే 'నహీ అనిల్ ముస్కర్'లోనే ఆజ్ఞోల్లంఘన చేసే

ముస్లిములపైన షరీఅత్ నిర్ణయించిన హద్దులు (శిక్షలు) విధించడమూ ప్రభుత్వ శిక్షలు (తాజీరాత్) విధించడమూ చేరి వుంది.★

అల్లామా కుర్తుబీ, అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ విషయంలో రాజ్య అధికారాలను ప్రస్తావిస్తూ ఇలా అన్నారు :

ان الامر بالمعروف لاَ يليق بكل احد و انما يقوم به السلطان اذا كانت اقامة الحدود اليه والتعزير الىٰ رأيه والحبس و الاِطلاق له و النفى والتغريب، فينصب فى كل بلدة رجلا صالحا قويّا امينا و يامره بذٰلک ويمضى الحدود على وجهها من غير زيادة۔ قال الله تعالىٰ اَلَّذِيْنَ اِنْ مَّكَّنّٰهُمْ فِى الْاَرْضِ اَقَامُوا الصَّلٰوةَ... الخ

అమ్ర్ బిల్ మారూఫ్ కొరకు ప్రతి ఒక్కడు సముచితం కాజాలడు. దాన్ని పరిపాలకుడే నిర్వర్తించవలసి ఉంటుంది. ఎందుకంటే హద్దుల్ని (శిక్షాస్మృతి)ని నెలకొల్పడం ప్రభుత్వ బాధ్యత. తాజీర్ (ప్రభుత్వం నిర్ణయించిన శిక్షలు) కూడా ప్రభుత్వ ఆదేశానుసారమే నెలకొంటాయి. అలాగే ఖైదు చెయ్యడం, విడుదల చెయ్యటం, దేశ బహిష్కరణ చెయ్యడం కూడా దాని అధికార పరిధికి చెందిన విష యాలే. కాగా అది ప్రతి నగరాన ఎవరయినా సదాచార పరాయణుడయిన వ్యక్తిని, దృఢ శీలుడు, నిజాయితీ పరుడయిన వ్యక్తిని ఈ పనికిగాను నియోగిస్తుంది, అతనికి దీని ఆదేశ మిస్తుంది, అతను హద్దుల్ని వాటి నిజ రూపంలో, ఎటువంటి అన్యాయం జరపకుండా విధిస్తాడు, దైవాదేశం ఇది : 'మేము వారికి భువిలో అధికారం కట్టబెట్టినట్లయితే వారు నమాజ్ స్థాపిస్తారు..'

*(అల్ జామిలి అహ్కాముల్ కుర్ఆన్, సం. 2, భాగం 4, పు. 31)*

★ *(ఇజాలతుల్ ఖిఫా అన్ ఖిలాఫతిల్ ఖులఫా :1/23- హజ్రత్ షా వలీయుల్లా ఇంకా ఇతర పండితులు 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్' పరిధిలో ఏ విషయాలనయితే ప్రస్తావించారో వాటి సందర్భాలు, ఆదేశాలు వేరున్నాయి. ప్రస్తుతం వాటిని చర్చించే అవకాశం ఇక్కడ దాని విస్తృతి సకారాత్మకతను సూచించడానికి మాత్రమే అది ప్రస్తావించడం జరిగింది.)*

ఇమామ్ ఇబ్ను తైమియ్యా ఇలా అంటున్నారు :

الاَمر بالمعروف و النهى عن المنكر لاَيتم الاّ بالعقوبات الشرعية، فان الله يزع بالسلطان ما لاَ يزع بالقراٰن، واقامة الحدود واجبة على ولاَة الاُمور، وذٰلك يحصل بالعقوبات على ترك الواجبات و فعل المُحرمات

**'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్' అన్నదాని పరిపూర్ణత సిద్ధించడం అన్నది షరీఅత్ విధించిన శిక్షల అమలు జరగకపోతే నెరవేరదు. ఎందుకంటే అల్లాహ్, ఏ పనులయితే కుర్‌ఆన్ ద్వారా నిరోధించబడవో వాటిని కూడా ప్రభుత్వం ద్వారా నిరోధిస్తాడు. హద్దులను స్థాపించటం (నెలకొల్పడం) అధి కారంలోఉన్న వారికి విధితమయిన విషయం. విధులను వదలినవారిని నిషిద్ధాలను ఆచరిం చిన వారిని శిక్షించడం ద్వారానే ఇది ప్రాప్త మవుతుంది.**

*(అల్ హస్బతు ఫిల్ ఇస్లామ్, పుట. 44)*

ఈ చర్చలన్నింటి సారాంశం ఏమిటంటే కుర్‌ఆన్‌లో, విశ్వాసులకు ప్రాప్తమయ్యే అధకార సత్తా, ప్రభుతను గురించి తెలిపిన విషయాలు ఇవి: వారు ఒక వైపున దైవ విధేయులు, ఆజ్ఞాబద్ధులు, ఆయన చూపిన పరిధులకు కట్టుబడి ఉంటారు. ఏ వ్యవహారంలోనూ తలబిరుసుతనం, తిరుగుబాటు వ్యక్తం కాదు. మరోవైపున దైవధర్మం వైపునకు పిలుపునిస్తూ ఉంటారు. విశ్వాసం, సదాచరణల ప్రచారం చేస్తూ ఉంటారు. ప్రపంచాన్ని షిర్క్ (బహుదైవభావన) పాప భావనల నుండి వారిస్తూ ఉంటారు. ధార్మిక శాస్త్రాలను, విద్యలను నిత్యం సజీవంగా ఉంచుతూ షరీఅత్ చట్టాలను అమలుపరుస్తూ ఉంటారు. ఇంకా దైవం ఏ విషయాలయినయితే విధిగా నిర్ణయించాడో వాటిని త్యజించినవారిని, మరే విషయాలను అల్లాహ్ నిషేధించాడో వాటికి ఒడిగట్టిన వారిని శిక్షిస్తారు. ఇక అన్నింటికీ చివరిమాట, వారు దైవమార్గంలో సతతం తమ పోరాటం, కృషి సాగిస్తూనే ఉంటారు, దాని ఫలితంగా కడకు చెడుల స్థానే మంచి అన్నది, శుభం అన్నది చోటుచేసుకోవాలి. ఎల్లెడలా దైవధర్మం సుస్థాపితమయి ఆధిక్యత నొందాలి.

## షరీఅత్‌ని అమలు జరపడమే అభీష్టం

ఇక్కడ ఓ విషయం మరువకూడదు. పైన పేర్కొన్న విజ్ఞుల వివరణల్లో ధర్మంలోని కొన్ని ప్రధాన అంశాలే ముందుకు వచ్చాయి. అయితే ఇస్లామీయ ప్రభుత్వం ఆ కొన్ని అంశాలలో మాత్రమే దైవాదేశాలను, దేవుని చట్టాలను తప్పక పాటించడం అవ

సరం అని అర్థం కాదు. నిజానికి ధర్మాన్ని పూర్తిగా పాటించడం, దాని విధేయత, దాని సేవ చేయడం ప్రభుత్వ ప్రధాన విధి. **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'**ని కుర్‌ఆన్ ఇస్లామీయ రాజ్యపాలకుల ప్రత్యేక లక్షణంగా పేర్కొన్నది. అది పైన పుటల్లో విశదీకరించినట్లు ఎంతో విస్తృతార్థంగల అంశం. 'మారూఫ్' అన్న దానిలో షరీఅత్ బోధించిన ప్రతి నమ్మకం, ఆచరణ చేరి ఉంది. అలాగే 'మున్కర్'లో షరీఅత్ నిషేధించిన సమస్త నమ్మకాలు, ఆచరణలు చేరి ఉన్నాయి. అందువల్ల **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** అంటే సమస్త ఆదేశాలు, నిషేధాల పట్ల, ఇస్లామీయ షరీఅత్ కోరే సరయిన వైఖరిని అవలంబించడం అవసరం. ఈ కారణంగానే అల్లామా ముహమ్మద్ ఖతీబ్ షర్‌బీనీ (మరణం 977 హి.) ఇస్లామీయ రాజ్యపాలకుల ఈ లక్షణాన్ని ఇలా నిర్వచించారు:

(وَ اَمَرُوا بِالْمَعْرُوفِ) ای الذی امر اللّٰہ تعالیٰ بہ ورسولہ (وَنَهَوْا عَنِ الْمُنكَرِ) ای الذی نہی اللّٰہ و رسولہ عنہ

**'వారు మారూఫ్‌ని ఆదేశిస్తారు' అని అంటే, అల్లాహ్, ఆయన సందేశహరులు ఆదేశించిన దాన్ని ఆదేశిస్తారు. మరి 'మున్కర్‌ని వారిస్తారు' అంటే, అల్లాహ్ ఆయన సందేశహరుడు ఏ విషయాలను వారించారో వాటిని నిషేధిస్తారు అని అర్థం.**

*(అల్ సిరాజుల్ మునీర్: 2/ 553)*

దీన్నిబట్టి విశదమయ్యేదేమిటంటే ఇస్లామీయ రాజ్యపాలకులు, 'మారూఫ్‌ని ఆదేశిస్తారు మున్కర్‌ని నిరోధిస్తార'ని అనడంలో గల అర్థం, వారు తమ అధికార పరిధిలో అల్లాహ్ షరీఅత్‌ని ఎటువంటి హెచ్చుతగ్గుల్లేకుండా అమలుపరుస్తారు. వారి ప్రభుత్వ వ్యవస్థ అంతా అల్లాహ్ అందజేసిన చట్టానికి విధేయమయి ఉంటుంది అన్నది.

## ఇస్లామీయ రాజ్య లక్ష్యం

వాస్తవానికి **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** మాత్రమే ఇస్లామీయ రాజ్య వ్యవస్థకు ప్రాతిపదిక; అది దీని కొరకే ఉనికిలోకి వస్తుంది, ఇదే ఇతర రాజ్యాలకూ ఇస్లామీయ రాజ్యానికీ గల వ్యత్యాసం. మారూఫ్‌ని ఆదేశించడం, మున్కర్‌ని నిరోధించడం మాత్రమే దీని ఉనికికి గల లక్ష్యం. ఈ లక్ష్యమే గనక దీని ఆశయాలలో లేకపోతే దీనిలో ఇస్లామీయ తత్వమే మిగులదు. ఇబ్ను అరబీ మాలికీ ఇలా అన్నారు:

الأمر المعـروف و النهى عـن المنكر الـذى هو اصل الدين و خلافة المسلمين

'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్' ధర్మానికి పునాది. ముస్లిముల ఖిలాఫత్ (రాజ్యం)కు మూలం.

(అహ్కాముల్ కుర్ఆన్ : 1/ 294)

అల్లామా ఇబ్ను తైమియ్యా ఇలా సెలవిచ్చారు :

اذا كان جمـاع الدين وجميع الولايات هو امـر و نهى فالأمـر الذى بعث الله بـه رسولـه هو الامر بالمعروف و النهى الـذى بعثه به هو النهى عن المنكر و هـذا نعت النبى و المومنـين

ధర్మం పూర్తిగా, ప్రభుత్వ హోదాలన్నీ వాస్తవానికి 'అమ్ర్ వ నహీ' (విధి నిషేధాలు) ద్వారానే వ్యక్తమయ్యే మాటయితే (ఇది ఒక విషయానికి సాక్షీభూతమవుతుంది) అల్లాహ్ తన సందేశహరుణ్ణి ఏ 'అమ్ర్' (ఆదేశం-విధి) ఇచ్చి పంపించాడో అది 'అమ్ర్ బిల్ మారూఫ్'. మరే 'నహీ' (నిషేధం) ఇచ్చి తన సందేశహరుణ్ణి పంపించాడో అది 'నహీ అనిల్ మున్కర్'. మరి ఆ అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ మాత్రమే ప్రవక్త, విశ్వాసులు, అందరి లక్షణం.

(అల్ హస్బతు ఫిల్ ఇస్లామ్ : పు. 30)

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ అన్నది ఇస్లామీయరాజ్యం చెయ్య వలసిన కార్యాల్లో ఒక కార్యం కాదు. నిజానికి అదే మొత్తం కార్యక్రమం. అది తన సకల సాధనాలను, వనరులన్నింటినీఈ కార్యక్రమాన్ని పరిపూర్ణంగా నిర్వర్తించడానికే వినియోగిస్తుంది. దాని విభాగాలన్నీ ఈ కార్యక్రమానికే లోబడి ఉంటాయి, దీని పరిపూర్తికే పని చేస్తాయి. అల్లామా ఇబ్ను తైమియ్యా, ఇబ్ను కయ్యిమ్ ముక్త కంఠంతో ఇలా అన్నారు :

جميع الولايات الاسلامية مقصودها الامر بالمعروف والنهى عن المنكر

సమస్త ఇస్లామీయ రాజ్య విభాగాల హోదాల లక్ష్యం కేవలం 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్' మాత్రమే.

(అల్ హస్బతు ఫిల్ ఇస్లామ్, పు. 30; అత్ తుర్కుల్ హిక్మియ్యా ఫిస్సియాసతిష్షరీయ్యా : పు. 217)

ఈ సంగ్రహ సూక్తికి సవివరమయిన టీకా కూడా ఇబ్ను తైమియ్య మాటల్లో తెలుసుకోండి :

**و الولاَيات كلها الدينية مثل امرة المؤمنين و مادونها من ملك ووزارة و ديوانية سواء كانت كتابة خطاب اوكتابة حساب لمستخرج اومصروف فى ارزاق المقاتلة او غيرهم و مثل امارة حرب و قضاء و حسبة وفروع هٰذهٖ الولاَيات انما شرعت للامر بالمعروف و النهى عن المنكر**

**ఇస్లామీయ రాజ్యంలోని సకల హోదాలు, ఉదాహరణకు ముస్లిముల నాయకత్వం, అంతకన్నా తక్కువ స్థాయి హోదా, ఉదాహరణకు ఉప నాయకత్వం, మంత్రి పదవి, సివిల్ వ్యవహారాలు, కార్యదర్శి వ్యవహారాలు, ఆర్థిక వ్యవహారాలు, సైనిక వ్యవహారాలు ఇత్యాదివి. లేదా రక్షణకు సంబంధించిన ఆయుధాల సరఫరా, న్యాయ విభాగం, ఆడిట్ విభాగం, ఈ విభాగాలన్నింటి విభిన్న శాఖలు, వగైరా– ఇవన్నీ అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కొరకు చట్టబద్ధం చెయ్యబడ్డాయి.**

*(అల్ హస్బతు ఫిల్ ఇస్లామ్: పు. 40)*

## 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'- 'నిఘా' కూడా అవసరమే

ఇస్లామీయ రాజ్యంలో దాని ఆర్థిక వ్యవస్థ షరీఅత్‌కు కట్టుబడి ఉండటం తప్పనిసరి అయినట్లే, దాని న్యాయస్థానాలలో ఇస్లామీయ చట్టాలు చెల్లుబాటు కావడం అవసరమయినట్లే, దాని విద్యా వ్యవస్థ ఇస్లామీయ బోధనలకనుగుణంగా రూపొందడం ముఖ్యమయినట్లే, అదేవిధంగా ముస్లిమ్ సముదాయంలో సాధారణ ధార్మిక, నైతిక సంస్కరణ జరుగుతూ ఉండటం, దానిపై నిఘా జరుపుతూ ఉండటం కూడా అత్యావశ్యమయిన అంశమే. ముస్లిమ్ ధర్మవేత్తలు **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** విషయం క్రింద దీన్ని చాలా ప్రముఖంగా పేర్కొన్నారు. అల్లామా ఇబ్ను ఖుల్దూన్ ఇలా నుడివారు :

**المنكر الذى هو فرض على القائم بامور المسلمين، يعين**

**నిఘా లేదా విమర్శన★ అన్నది 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'లోని ఓ ధార్మిక విధి. మరి అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్**

★ 'నిఘా' లేదా 'విమర్శన' అనే పదాలను మేము ఇక్కడ అరబీ పదం 'ఇహ్తిసాబ్' అన్న దానికి మారుగా ప్రయోగించాము. ఇహ్తిసాబ్ అంటే నిఘంటువు అర్థం 'లెక్కచూడటం'అన్నది. పారిభాషికంగా ప్రభుత్వ అధికారుల్నీ, ప్రజల అవసరాలనూ, ప్రజా ప్రయోజనాలనూ పరిశీలనా

మున్కర్ అన్నది ముస్లిముల పాలకునిపై విధితమయిన అంశం. అతను ఈ కార్యసిద్ధికి తాను యోగ్యుడని భావిం చిన వ్యక్తిని నియోగిస్తాడు. ఇక ఆ వ్యక్తికి ఈ విధి నిర్వహణ నిర్ణీత విధిగా తప్పనిసరి అయిపోతుంది. అతను ఈ కార్యనిర్వహణకు అనేక మంది సహాయకుల్ని నియోగిం చుకుంటాడు. మున్కరాత్ (చెడుగుల) ను గురించి ఆరా తీస్తూ ఉంటాడు, వాటికి తగిన రీతిలో శిక్షలు విధిస్తూ ఉంటాడు. జనుల్ని నగరాల్లో శాంతి, సౌకర్యాల కొరకు ప్రోద్బలం చేకూర్చేలా ప్రేరేపిస్తాడు.

لذٰلک من یـراه اهلا لـه فیتعین فرضه علیه و یتخذ الأعوان علی ذٰلک و یبحث عن المنکرات و یؤدب علی قدرهـا و یحمـل النـاس علی المصالح العامة فی المدینة

(ముకద్దిమ, ఇబ్ను ఖుల్దూన్, పు. 225)

ధర్మవేత్తలు విమర్శన, నిఘా విభాగం గురించి తెలిపిన పనులను మూడు విషయాలుగా విభజించవచ్చు:

1) ముస్లిమ్ సముదాయాన్ని ధార్మికంగా, నైతికంగా సంస్కరించడం. ఉదాహరణకు, నమాజ్ కొరకు ఆదేశించడం, మస్జిద్‌ల ఇమాములు, ముఅజ్జినుల పర్యవేక్షణ- వారు తమ విధి నిర్వహణలో ఎటువంటి తప్పిదం, లేదా లోటు రానివ్వకుండా, ఏమరుపాటు చూపకుండా ఉండేలా చూడటం, అర్హతలేనివారిని షరీఅత్ వ్యవహారాలలో అభిప్రాయ ప్రకటనలు చేయకుండా ఆపడం, అలాగే ఎవరయినా ఎటువంటి అనైతిక, షరీఅత్ వ్యతిరేక చేష్ట అయినా జరపకుండా గమనిస్తూ ఉండటం, ఉదాహరణకు పరాయి స్త్రీలతో మాటామంతి జరపడం, కలసిమెలసి ఉండటం వగైరా.

2) న్యాయస్థానాల పరిధికి బయట జరిగే వ్యవహారాల విషయంలో జోక్యం కల్పించుకోవడం లేదా న్యాయస్థానాలకు పోజాలనటువంటి వ్యవహారాలను చూసి కల్పించుకోవడం. ఉదాహరణకు, కొలతల్లో తూనికల్లో హెచ్చుతగ్గులు జరగడం, వ్యాపారాల్లో మోసం, దగా, ఆహార పదార్థాల్లో కల్తీ, అధర్మమయిన పదార్థాల క్రయ

*దృష్టితో చూడటం, వాటి పరిపూర్తికి అవసరమయిన చర్య తీసుకోవడం అన్నది ఉద్దేశ్యం. ఈ ఆశయాన్ని దృష్టిలో ఉంచుకుని మేము 'ఇహ్తిసాబ్' అన్నదానికి 'విమర్శన' అని ప్రయోగించాము. - అను)*

విక్రయాలు, ఇచ్చిపుచ్చుకోవడాల్లో షరీఅత్‌కు విరుద్ధ విధానాలు అవలంబించడం, అక్రమ నిల్వలు వగైరా.

3) ప్రజా సౌకర్యాల పట్ల నిఘా. ఉదాహరణకు, జనావాసాల్లో నీటి సరఫరా, రవాణా సౌకర్యాలు, ట్రాఫిక్ నియమాల ఏర్పాటు, వాటి పాలన, సత్రాల ఏర్పాటు, ప్రయాణీకుల సౌకర్యాలు, పురాతన కట్టడాల సమీక్ష, అవి పడిపోయే ప్రమాదముంటే ఎటువంటి ధన ప్రాణ నష్టం కలగకుండా పడగొట్టడం వగైరా★

నిఘా లేక విమర్శన అన్నది కేవలం ప్రభుత్వ స్థాయిన జరిగే కార్యం కాదు, సామాన్య ప్రజానీకానికీ ఈ హక్కు ఉంది. నిఘా కార్యానికి ప్రభుత్వ అధికారులు నియుక్తులయి ఉన్నప్పటికీ, అనధికార వ్యక్తులు సయితం, షరీఅత్‌కు విరుద్ధమయిన వ్యవహారాల విషయంలో ఎవరినయినా సరే, కడకు ప్రభుత్వ అధికారులనయినాసరే విమర్శించగలరు. అయితే సామాన్య జనులకు అది ఒక నఫ్ల్ (అదనపు) పని. కాని ప్రభుత్వ అధికారికి అది విధ్యుక్త ధర్మం. అల్లామా మావర్దీ ప్రకారం ఈ ఉభయుల స్థాయి రీత్యా దిగువ విధంగా తొమ్మిది కోణాల్లో వ్యత్యాసం ఉంటుంది :

1) 'ముహ్తసిబ్' (విమర్శనాధికారి)కి విమర్శన ప్రముఖమయిన విధి. అతనిపైన విమర్శనా విధులు ప్రభుత్వం పక్షాన నిర్ణయమవుతాయి. మరి వలంటీరు (స్వచ్ఛంద సేవకుడు)కు ఇది అదనపు విధి వంటిది. 2) విమర్శనాధికారి ఈ పని వదలి మరో కార్యం చేపట్ట లేడు. కాని వలంటీరుకు అలా చేసే అనుమతి ఉంటుంది. 3) ఏ వ్యవహారాలలో 'నహీ అనిల్ మున్కర్' తప్పనిసరి అవుతుందో అటువంటి విషయాలలో జనుల సహాయానికే విమర్శనాధికారి నియుక్తుడయి ఉంటాడు, కాని వలంటీరు దానికి నియుక్తుడయి ఉండడు. 4) ఎవరయినా ఈ సందర్భంలో సహాయం అర్థించినట్లే విమర్శనాధికారి సహాయం అందచేయడం తప్పనిసరి, వలంటీరుకు అది తప్పనిసరి కాదు. 5) పెద్దపెద్ద చెడుగులు (మున్కరాత్)ను గురించి ఆరా తీయడం, పరిశోధించడం, అవి ఎక్కడెక్కడ జరుగుతున్నాయో గుర్తించడం, అక్కడికి వెళ్ళి వాటిని ఆపడం, అలాగే ప్రసిద్ధ సత్కార్యాలు (మారూఫాత్) ఎక్కడెక్కడ వదలి వేయబడ్డాయో గమనించడం, అక్కడ వాటిని స్థాపించడం- ఇదంతా విమర్శనాధికారి విధులు. కాని

---

★ *వివరాలకు: అల్ అహ్కాముస్సుల్తానియ్యా, పు. 231 ఆపైన; అత్ తుర్కుల్ హిక్మియ్యా ఫి స్సియాసతి షరీయ, పు. 215 ఆపైన)*

వలంటీరుకు ఇలా ఆరా తీయడం, పరిశోధనలు జరపడం తప్పనిసరి కాదు. 6) విమర్శనాధికారి ఈ కార్యాలకే నియుక్తుడయి ఉంటాడు గనక, అవసరమయి నప్పుడల్లా జనులు అతని సహాయాన్నీ అర్థిస్తూ ఉంటారు గనక, అతను తన విధుల నిర్వహణకు సహాయకులను, కార్యకర్తలను నియమించుకోగలడు. అప్పుడే ఆ కార్యాలన్నింటినీ పూర్తిగా సమర్థవంతంగా, సునాయాసంగా నిర్వహించగలుగుతాడు. దీనికి భిన్నంగా వలంటీరు తన కొరకు సహాయకులను, కార్యకర్తలను కోరడం సరయినది కాదు★ 7) సాధారణ చెడుగుల విషయంలో విమర్శనాధికారికి 'తాజీర్' (ప్రభుత్వం పక్షాన శిక్షలు) విధించే అధికారం ఉంటుంది. అది షరీఅత్ విధించే 'హద్దులు' (శిక్షల) స్థాయికి చేరనదయి ఉంటుంది. (ఎందుకంటే షరీఅత్ హద్దుల్ని విధించే అధికారం ఇస్లామీయ న్యాయస్థానాలకే ఉంటుంది). కాని వలంటీరుకు 'తాజీర్' విధించే అధికారం ఉండదు.★★ 8) విమర్శనాధికారికి ప్రభుత్వ ధనాగారం (బైతుల్‌మాల్) నుండి జీతభత్యాలు ఇవ్వబడతాయి. కాని వలంటీరుకు ఇవ్వడం సరయినది కాదు 9) ఏ విషయాలకు సర్వసాధారణ శ్రేయాలతో సంబంధం ఉంటుందో వాటికి సంబంధించినంతవరకు విమర్శనాధికారి తన అన్వయ కృషినను సరించి పని చేయగలడు. అయితే వలంటీరుకు అలాంటి అనుమతి లేదు.★★★

ఇస్లామీయ రాజ్య లక్ష్యం, ఆశయం, దాని ఆచరణా విధానం, దాని నైజం ఇత్యాది విషయాల ఈ వివరణ వల్ల ఒక యదార్థం క్షుణ్ణంగా ముందుకువచ్చింది- **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** అన్నది, ఇస్లామీయ రాజ్యానికి స్వచ్ఛంద కార్యక్రమం కాదు, అది దీన్ని చేపట్టినా చేపట్టకపోయినా దానికి స్వేచ్ఛ ఉందనడానికి, లేదా ఈ కార్యక్రమం కేవలం అభిలషణీయమూ కాదు, చేస్తే పుణ్యఫలం లభిస్తుంది. లేకపోతే తప్పు కాదూ అనడానికి. నిజానికి ఇది అల్లాహ్ నిర్ణయించిన 'విధి'. దీన్ని నిర్వర్తించడం ఇస్లామీయ రాజ్యానికి ప్రత్యేక బాధ్యతగా అప్పగించడం జరిగింది. దీన్ని ఉపేక్షించడం అలా ఉంచి, దీని పట్ల లోపం రానివ్వడం, ఏమరుపాటు చూపడం కూడా ధర్మం కాదు, ఎందుకంటే దీనిపైనే ఆ రాజ్యం ఇస్లామీయ తత్వం ఆధారభూత

---

★ *దీన్ని గురించి 'వనరులు, సాధనాలు' అన్న శీర్షికన చర్చ చూడండి.*

★★ *దీన్ని గురించి 'అవధులు, మర్యాదలు' అన్న శీర్షికన సవివరమయిన చర్చ చూడండి.*

★★★ *అల్ అహ్కాముస్సుల్తానియ్య, పు.231*

మయి వుంది. దీని ఆధారంగానే అది ధార్మికమయినదా లేదా అన్న విషయమూ నిర్ధారితమవుతుంది.

## అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్- రాజ్యాధికారులకు విధి

ఇస్లామీయ రాజ్యం 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్' కొరకే ఉనికిలోకి వస్తుంది. అందువల్ల రాజ్యంలో మారూఫాత్ (ప్రసిద్ధ సత్కార్యాలు) స్థాపించడం, మున్కరాత్ (ప్రసిద్ధ దౌష్ట్యాలు) నిషేధించడం దాని పాలకుని బాధ్యత. అతను తన ఈ బాధ్యతను విడనాడితే రాజ్యం ఎన్నడూ తన లక్ష్యసాధనలో సఫలమవదు. అందువల్లనే ధర్మవేత్తలు, రాజ్య పరిపాలకునికి **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధి అని నొక్కి వక్కాణించారు. కాగా హజ్జ్ సూరాలోని ఆయత్‌పైన చర్చలో పేర్కొన్న దాని విషయంలో నవాబ్ సిద్దీక్ హసన్‌ఖాన్ మర్హూమ్ ఇలా వ్రాశారు:

**فيه ايجاب الامر بالمعروف و النهى عن المنكر على من مكّنه الله فى الاَرض واقــدره على القيام بذٰلك**

**ఇందులో, ఎవరికయితే భువిలో అధికార సత్తా ప్రసాదించాడో వారికి, ఇంకా ఆ బాధ్యత నిర్వర్తించగల శక్తి గలవారికి, అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌ని, అల్లాహ్ విధిగా నిర్ణయించాడు.**

*(ఫత్‌హుల్ బయాన్ ఫీ మకాసిదిల్ కుర్ఆన్ : 6/193)*

ఇస్లామీయ రాజ్య పరిపాలకునికి, **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** కేవలం విధి మాత్రమే కాదు, నిజానికి ఇతరులకు భిన్నంగా ఇతనిపై ఈ బాధ్యత అధికంగా మోపబడుతుంది. కారణం ఏమిటంటే, అతని వద్ద అసాధారణమయిన బలం ఉంటుంది. మరి **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** విధి అవడానికి ఆధారం బలం, సామర్థ్యాలే ప్రముఖమయినవి. ఇమామ్ ఇబ్ను తైమియ్యా ఈ సూత్రాన్ని ఇలా వివరించారు :

**ذوو السلطان اقــدر من غيرهم وعليهم من الوجوب مــا ليس على غيرهم، فان مناط الوجوب هو القــدرة فيجب على كل**

**అధికార సత్తా గలవారు (అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్) విషయంలో ఇతరుల కన్నా ఇతోధికంగా శక్తి కలిగి ఉంటారు. అందువల్ల అది వీరిపై ఏ మేరకు విధి అవుతుందో ఆ మేరకు ఇతరులపైన కాదు.**

انسـان بحسب قدرته

**ఎందుకంటే విధి అవడానికి ఆధారం సామర్థ్యం. అందువల్ల ప్రతి వ్యక్తికి అది అతని సామర్థ్యాన్ని బట్టి విధి అవుతూ ఉంటుంది.**

*(అల్ హిస్బతు ఫిల్ ఇస్లామ్ : పు. 30)*

ఇమామ్ షౌకానీ ప్రకారం, ఏ వ్యక్తి అయితే ఇతోధిక బలం సామర్థ్యం ఉన్నా **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్'** వదలి పెడతాడో అతను షరీఅత్ దృష్టిలో పాపం చేసినట్లే, ఇతరులకన్నా అధికంగా పాపం చేసినట్లు! కాగా ఆయన ఓ పుస్తకంలో ఇలా వ్రాశారు :

**من كان اقدر على الأمر بالمعروف والنهى عن المنكر كان ذنبه اشد و عقوبته اعظم و معصيته افظع، بهـذا جاءت حجج الله و قامت براهينه و نطقت بـه كتبه و ابلغتـه الى عباده رسله**

**ఏ వ్యక్తి అయితే 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్' చేయగల శక్తి ఇతరుల కన్నా అధికంగా కలిగి ఉన్నా ఈ విధి నిర్వర్తించడో అతని అపరాధమూ అధికంగా ఘోరమయి నదే, అతని శిక్ష కూడా కఠినమయినదే, అతని పాప స్థాయి కూడా చాలా జుగుప్సాకరమయి నదే. ఈ యదార్థం పట్ల అల్లాహ్ పక్షాన ఆధారాలు, స్పష్టీకరణలు వచ్చాయి. ఈ విషయాన్ని దైవగ్రంథాలూ చాటుతున్నాయి. ఈ సమా చారాన్ని ఆయన సందేశహరులూ జనులకు అందజేశారు.**

*(మజ్మూఅతురసాయిల్ అల్ మునీరియ, 2వ భాగం, అద్దవాఉల్ ఆజిల్ ఫీ దఫయిల్ ఉద్వా అస్సాయిల్, పు. 3)*

ఇమామ్ షౌకానీ వ్రాసిన ఈ వివరణ కుర్ఆన్ హదీసులను చాలా సవ్యంగా అన్వయింప చేస్తోంది. ఒకటి మాత్రం కాదనలేని సత్యం. ఒక సాధారణ వ్యక్తి **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్'**ని త్యజిస్తే ఎంత పెద్ద అపరాధమో అంతకన్నా ఎంతో తీవ్రమయిన అపరాధం ఒక రాజ్యపరిపాలకుడు దాన్ని త్యజించడం. ఎందు కంటే పరిపాలకుడు దాన్ని నిర్వర్తించే ప్రబల శక్తి కలిగి వుంటాడు, ఇంకా మరే ఇతర

వ్యక్తి కన్నా ఈ కార్యాన్ని ఎంతో సులువుగా మరెంతో సవ్యంగా నిర్వర్తించగలుగుతాడు. అందువల్ల అతను దాన్ని త్యజించడం మహా పాపం!

## అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్: అధికారుల సంస్కరణ

ఇస్లామీయ రాజ్యం స్వచ్ఛమయిన ధార్మిక రాజ్యం. అందువల్ల దాని పరిపాలకుడు దైవభక్తి పరాయణుడు, ధర్మనిష్ఠ గలవాడు, ప్రసిద్ధ సదాచరణలను (మారూఫాత్‌లను) ఆచరించేవాడు, ప్రసిద్ధ దౌష్ట్యాలను (మున్కరాత్‌లను) పరిత్యజించేవాడు కావడం అవసరం. అయితే సాధారణ మానవుల్లా అతనూ మానవుడే. అందువల్ల మారూఫాత్‌లను వదలనూ గలడు, మున్కరాత్‌లకు పాల్పడనూ గలడు. నిజానికి చెడి, చెడు దారిన పడే ఆస్కారం ఇతరులకన్నా ఇతనికే అధికంగా ఉంటుంది. ఇక ప్రశ్న ఏమిటంటే, అతను ఏదయినా మారూఫ్‌ని త్యజించినా లేదా ఏదయినా మున్కర్‌కి పాల్పడినా సాధారణ ముస్లిమ్ ప్రజానీకం కర్తవ్యం ఏమయి ఉండాలి అన్నది. ఇది చాలా చిక్కు సమస్య. దీన్ని సరిగ్గా అర్థం చేసుకునేందుకు తొలుత కొన్ని ప్రాథమిక సూత్రాలను పరిశీలించాలి.

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ అన్నది ప్రభుత్వ బాధ్యత, ప్రజల బాధ్యత కూడా. రాజ్యంలో ఏ పౌరుడయినా షరీఅత్‌కు విరుద్ధంగా ఆచరించినట్లయితే అతని పట్ల ప్రభుత్వం విచారణ జరిపించినట్లే, రాజ్యపాలకుల్ని విమర్శించే అధికారం ప్రజలకూ ఉంది. కాని దీనితోపాటు ఇస్లామీయ రాజ్యపాలకుల గౌరవ మర్యాదల్ని కాపాడే ఆదేశాలూ ఉన్నాయి. హదీసులో ఇలా వుంది:

**من اکرم سلطان اللّٰہ فی الدنیا اکرمہ اللّٰہ یوم القیامۃ، ومن اہان سلطان اللّٰہ فی الدنیا اہانہ اللّٰہ یوم القیامۃ**

**అల్లాహ్ ఎవరినయితే అధికారిగా నియమించాడో, అతన్ని ప్రపంచంలో గౌరవించినవాడిని అల్లాహ్ పరలోకంలో గౌరవిస్తాడు. (దీనికి భిన్నంగా) అల్లాహ్ అధికారిగా నియమించిన వ్యక్తిని ప్రపంచంలో హీనంగా నీచపరచిన వ్యక్తిని అల్లాహ్ ప్రళయదినాన నీచపరుస్తాడు.**

*(ముస్నద్ అహ్మద్ : 6/34, తిర్మిజీ. అబ్‌వాబుల్ ఫితన్, బాబు మాజాఅ ఫిల్ ఖులఫా)*

అధికారులకు మారూఫ్‌ని ఆదేశించడం, మున్కర్‌ని నిషేధించడం ప్రజల బాధ్యత అనడంలో సందేహం లేదు. అయితే ఈ విధి నిర్వహణ సమయాన వారు ఒక విషయాన్ని దృష్టిలో ఉంచుకోవాలి, అధికారుల గౌరవ మర్యాదలకు బాధ కలగకుండా, ప్రజల్లో వారికి అవమానం జరగకుండా వారి విలువకు ఎటువంటి లోపం రాకుండా జాగ్రత్త పడాలి. దీనికి అవలంబించవలసిన విధానం హదీసులో ఇలా చూపడం జరిగింది :

**من اراد ان ینصح لسلطان بامر فلا یبدله علانیة ولکن لیأخذ بیده فیخلوبه فان قبل منـــه فذک و الّا کان قد ادی الذی علیه له**

**అధికారికి ఏ వ్యవహారంలోనయినా హితవు గరపదలచిన వ్యక్తి దాన్ని బాహాటంగా ప్రకటించరాదు. అతన్ని చెయ్యి పట్టి మరో చోటికి తీసుకువెళ్ళి ఏకాంతంలో హితవు గరపాలి. అతను దాన్ని స్వీకరిస్తే సరి లేకపోతే హితవు గరిపిన వ్యక్తి బాధ్యత తీరిపోయింది.**

*(ముస్నద్ అహ్మద్ : 4/ 406)*

## ఇమామ్ గజాలీ అభిప్రాయం

ఉద్బోధన, హితవుల ద్వారా అధికారుల సంస్కరణకు సంబంధించినంత వరకు ఎవరికీ ఎటువంటి భేదాభిప్రాయం లేదు. ఈ బాధ్యత విభిన్న కాలాల్లో నెరవేరుతూ వచ్చింది, ఇతోధికంగా దీని సద్ఫలితాలే వెలువడ్డాయి కూడా. అసలు ప్రశ్న ఉద్భవించేది, అధికారి నోటిమాటకు, విమర్శన, పరామర్శలకు సకారాత్మకంగా స్పందించకపోగా తన తప్పుడు వైఖరిపైనే మొండిగా నిలబడిన సందర్భంలోనే. ఈ విషయంలో ఇమామ్ గజాలీ ఇలా సెలవిచ్చారు :

> పాలనాధికారి తన అజ్ఞానం, ఎరుక లేమి చేత మున్కర్ (ప్రసిద్ధ దౌష్ట్యాని)కి పాల్పడినట్లయితే ప్రజలు అతని ఎరుక లేమిని దూరం చేయాలి. పోతే ఆపైన ఏం చేయాలి అన్న విషయానికి వస్తే, ఉదాహరణకు ధనాగారంలో అధర్మమయిన సొత్తు ఉన్నట్లయితే దాన్ని స్వాధీనం చేసుకుని దాని హక్కుదారులకు అది అప్పగించడం, లేదా అతని బట్టల్లో పట్టు వస్త్రాలున్నట్లయితే వాటిని ఏరిపారేయడం, అతను త్రాగుబోతు అయినట్లయితే అతని బసలో దూరి మద్యపానీయాల

పాత్రలు పగులగొట్టడం. అయితే ఈ వ్యవహారాలలో ఒక వైపున అధికారి భయం అన్నది అంతమయిపోతుంది, ఇది నిషిద్ధ కార్యం, కాని దౌష్ట్యం జరుగుతూ ఉన్నప్పుడు మౌనం వహించడం కూడా నిషిద్ధమయిన అంశమన్నదీ వాస్తవమే. ఈ సంక్లిష్టత నుండి బయట పడటానికి చూడవలసిందేమిటంటే ఆ దౌష్ట్యం(మున్కర్) ఎంత పెద్దది, ఆ దౌష్ట్యాన్ని వారించడానికి శక్తినుపయోగిస్తే అతని భయం ఏ మేరకు తగ్గుతుంది అన్న అంశమూ బేరీజు వేసుకోవలసి ఉంటుంది. తదనుగుణంగానే చర్య గైకొనవలసి ఉంటుంది. ఇది పూర్తిగా అన్వయ కృషి (ఇజ్తిహాద్)కి సంబంధించిన వ్యవహారం. దీనికి ఏదయినా నిర్ణీత నియమం ఏర్పరచుకోవడం సాధ్యపడదు.

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 346)*

ఇస్లామీయ రాజ్యపాలకుడు లేదా పాలనాధికారి ఎరుకలేమి వల్ల లేదా క్షణిక ఉద్రేకం వల్ల ఏదయినా తప్పుకు పాల్పడినట్లయితే నోటి హితబోధన పనిచేయవచ్చు, సర్వసాధారణంగా అది పనిచేస్తుంది కూడా. అలాకాక అతను ముందుకు సాగి బుద్ధిపూర్వకంగా సత్కార్యాలను త్యజించి దుష్కార్యాలకు లోనవడమూ సాధ్యమే. అంతేకాక అతను రాజ్య వనరుల్ని, సాధనా సంపత్తిని అనేక మారూఫాత్‌ని రూపుమాపడానికి, అనేక మున్కరాత్‌ని వృద్ధి చెయ్యడానికీ వినియోగించడమూ సాధ్యమే, అతని సమయం చెడుల వ్యాప్తికి వినియోగమయి అతని యంత్రాంగం ధార్మిక విధుల్ని స్వయంగానూ వదిలి, అలా వదిలేవారినీ పట్టుకోవటం మానివేయవచ్చు. షరీఅత్ నిషేధించిన వాటిని స్వయంగానూ ఆచరిస్తూ అలా ఆచరించే వారిని శిక్షించడమూ మానివేయవచ్చు. ఇటువంటి పరిస్థితుల్లోనూ ఇస్లామీయ రాజ్య ప్రజలకు తమ శక్తినుపయోగించి తమ పాలనాధికారిని సంస్కరించే అధికారం ఉందా లేదా? వారు సహనంతోటే ప్రశాంతంగానే పరిస్థితుల ఈ స్వరూపాన్ని భరిస్తూ ఉండాలా? లేదా దీన్ని మార్చడానికి తమ దుష్ ప్రవర్తనాశీలురయిన అధికారుల స్థానే శిష్ట జనులయిన వారిని తీసుకువచ్చే ప్రయత్నం చేయాలా? ఇటువంటి పరిస్థితుల్లో ఇమామ్ గజాలీ ఫత్వా బహుశా ఇదే కాగలదు: (పైన ఉటంకించిన చర్చ ప్రకారం) అధికారిని గౌరవించే అవకాశం ఇక మిగుల లేదు. శక్తినుపయోగించి దౌష్ట్యాన్ని చెరిపి వేయడం ప్రజల విధి అవుతుంది.

## అల్లామా ఇబ్నె హజ్మ్ అభిప్రాయం

ఇమామ్ ఇబ్ను హజ్మ్, అల్లామా అబూ బక్ర్ జస్సాస్ ఈ విషయంలో సుదీర్ఘ మయిన చర్చ జరిపారు. కాని దాన్ని పూర్తిగా అర్థం చేసుకునేందుకు ఒక విషయం ముందుండాలి. వారి చర్చ రెండు విషయాల చర్చల సంచయనం. ఒకటి, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** కొరకు ఇస్లామీయ రాజ్యాధికారికి ఎదురుగా శక్తినుపయోగించడం పట్ల ఆదేశం ఏమిటి? రెండు, ఇస్లామీయ రాజ్యంలో ఏదయినా ఒక వర్గం తిరుగుబాటు చేసినట్లయితే దానికెదురుగా ఎటువంటి వైఖరినవలంబించ వలసి ఉంటుంది?

తొలుత ఇమామ్ ఇబ్ను హజ్మ్ చర్చను క్లుప్తంగా మేము మా మాటల్లో వెల్లడిస్తాము :

> (సమకాలీన రాజ్యాధికారి, తిరుగుబాటుదారుల పైన) **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** విధి అన్న విషయంలో పూర్తి సముదాయానికి ఏకాభిప్రాయం ఉంది. దీనిపట్ల ఏ వ్యక్తికీ భేదాభిప్రాయం లేదు. అయితే అది ఎలా చెయ్యాలి అన్న విషయంలో విభేదముంది. కొందరు ప్రాచీన సున్నత్ననుసరించేవారు, వీరిలో సహచర మాన్యుల ఓ వర్గం, వారి తరువాతి మహనీయులూ ఉన్నారు, వీరి ప్రకారం **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**ని ఆచరించడంలో కేవలం హృదయం ద్వారాను, శక్తి ఉంటే నోటి ద్వారాను ఆచరించడం జరుగుతుంది. దానికి పైన శక్తి ద్వారా, ఆయుధాల ద్వారా ఈ పని ఎన్నటికీ నిర్వర్తించడం జరగదు. వీరి ఈ అభిప్రాయం, పాలనాధికారి న్యాయ బద్ధుడు కానప్పుడు. కాని అతడు న్యాయబద్ధుడు అయినట్లయితే అతనికి విరుద్ధంగా ఎవడయినా పాపాతురుడు, అపరాధి శక్తినుపయోగించినట్లయితే న్యాయబద్ధుడు అయిన అధికారితో కలసి ఆ తిరుగు బాటు దారునితో పోరాడటం జరుగుతుంది.
>
> సున్నత్ననుసరించే మరో వర్గం అభిప్రాయం ప్రకారం, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** కొరకు, మున్కర్ని రూపుమాపే మరో మార్గం లేనప్పుడు, శక్తినుపయోగించడం పూర్తిగా విధియే

అవుతుంది. వారు చెప్పేదేమిటంటే సత్యకాముకులు ఒక సంఘటిత రూపంలో ఉండి, వారు మున్కర్‌ని రూపుమాపగల స్థితిలో ఉంటూ, తమ సఫలతను గురించి నిరాశ కలిగి లేకపోతే- శక్తినుపయోగించి మారూఫ్‌ని ఆదేశించడం, మున్కర్‌ని నిషేధించడం వారి విధి. కాని ఒకవేళ వారు తక్కువ సంఖ్యలో ఉండి, తమ అల్పసంఖ్య కారణం గానూ తమ బలహీనత మూలంగానూ సఫలత పొందగలిగే ఆశ లేకపోయినట్లయితే వారికి, శక్తితో పరిస్థితుల్ని మార్చే కార్యం వదిలే అనుమతి ఉంది. తమ శక్తి కొలది, నోటి ద్వారాను, అంతర్యంలోనూ చెడును చెడుగా ప్రకటించడం, భావించడం వరకు పరిమితమయి ఉండగలరు. ఈ అభిప్రాయం, ప్రవక్త సహచరుల్లో ఓ పెద్ద సంఖ్య, ము'తజిల, ఖవారిజ్, జైదీయ వర్గం వారిది.

తొలి అభిప్రాయాన్ని బలపరిచే వారు కొందరు చెప్పేదేమిటంటే **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** కొరకు శక్తినుపయోగించడం వల్ల నష్టముంది. ఎందుకంటే దీనివల్ల నిషిద్ధ కార్యాలు అనుమతి పొందుతాయి, రక్తపాతం జరుగుతుంది, సంపదల లూటీ జరుగు తుంది. గౌరవ మర్యాదలు మిగులవు, విచ్ఛిన్నత తాండవిస్తుంది, అంతటా అవ్యవస్థ వ్యాపిస్తుంది. అయితే ఇతరులు దీనికి సమాధానంగా ఇలా అంటారు, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధిని నిర్వర్తించే వ్యక్తి అధర్మంగా ఇతరుల సొమ్మును అధీనపరచుకోవడం తగదు, పోరాడదలచనివారితో పోరాడటమూ తగదు, అంతేకాదు అతను ఎటువంటి నిషిద్ధ కార్యమూ చెయ్యతగదు. అతను ఇటువంటి పని ఏది చేసినా స్వయాన అదే ఒక మున్కర్, దాన్నీ నిరోధించవలసి ఉంటుంది. దీనికి భిన్నంగా చెడు చేసే వారిని అవసరమయితే సంహరిం చడం వారు ఎక్కువ మందయినా తక్కువ మందయినా అధర్మం కాదు, అది అప్పుడు నిజానికి విధ్యుక్త ధర్మం. దీనికి భిన్నంగా చెడును ఆచరించేవారు జనుల్ని హతమార్చడం, వారి సంపదల్ని స్వాధీనం చేసుకోవడం, వారి స్త్రీలను అగౌరవపరచడం మున్కర్ అనబడుతుంది.

దాన్ని ఆపడం విధి అవుతుంది. మరో అభిప్రాయం గలవారు తెలిపిన సంశయాలను పరిశీలిస్తే అవి చెడును రూపుమాపేం దుకు, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** మార్గంలో అవాంతరాలవుతా యని అనుకుంటే ఈ సంశయాలు, శత్రువుతో పోరాడే సమయంలోనూ అవే అంశాలు ఎదురవుతాయి. నిజానికి శత్రువులతో పోరును ఏ ముస్లిమ్ వ్యక్తి కూడా విధి కాదని అనలేడు. ఉదాహరణకు, యుద్ధంలో శత్రువులు ముస్లిముల స్త్రీలను, బాలబాలికల్ని బందీలుగా పట్టుకుంటే, వారి సంపదల్ని దోచుకుంటే, వారిని పరాభవపరిస్తే వారితో పోరు సలపరా? ఏ ఒక్క ముస్లిమ్ వ్యక్తి కూడా దీన్ని కాదనడు. ఎటువంటి అభిప్రాయ భేదం లేకుండా ముస్లిములందరి దృష్టిలో వారితో పోరాడటం విధి అయిన విషయమే. కాస్త గమనిస్తే తెలిసిపోతుంది, తిరస్కారులయిన శత్రువులతో పోరు సలపడంలోనూ, దారి తప్పిన ప్రభుత్వ పాలనాధికారులతో పోరాడటంలోనూ ఎటువంటి మౌలిక మయిన వ్యత్యాసం లేదు అన్న విషయం. ఎందుకంటే ఇందులో ప్రతి ఒక్కటీ జిహాద్‌గానే పరిగణించబడుతుంది. దివ్య ఖుర్‌ఆన్, ప్రవక్త సున్నత్ వైపునకు పిలుపుగానే పరిగణించబడుతుంది.

ఏదయినా అత్యాచారం జరిగినప్పుడు అది ఎంత చిన్నదయినా సరే, ఆ విషయంలో పాలకునితో మాటలాడటం అవసరం. అతన్ని వారించడమూ అవసరమే. అతను ఆగిపోయినట్లయితే, సత్యం వైపునకు మరలినట్లయితే, హత్యా పరిహారమో, లేదా శిక్ష విధించడమో అవసరమున్నట్లయితే దానికి సిద్ధపడితే అప్పుడు అతన్ని తొలగించే కారణమేదీ మిగులదు. అతను మునుపు ముస్లిముల నాయకుడయి ఉన్నట్లే ఇప్పుడున్నూ నాయకుడుగానే ఉంటాడు. కాని ఒకవేళ అతను ఆ దైవాదేశాల విధింపునకు సిద్ధమవకపోతే, సత్యం వైపునకు మరలక పోతే అతన్ని తొలగించడం, అతని స్థానంలో మరొకరిని సత్యాన్ని స్థాపించే వ్యక్తిని తీసుకురావడం అవసరం. ఎందుకంటే అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు: సత్కార్యాల్లో, దైవభక్తి కార్యకలాపాల్లో మీరు అందరి

తోనూ సహకరించండి, పాపకార్యాలు, అత్యాచారాల్లో ఎవ్వరితోనూ సహకరించకండి. (అల్ మాయిదా : 2) షరీఅత్ విధించిన ఏ విధినీ వ్యర్థపరచడం సుతరామూ ధర్మసమ్మతం కాదు.

*(అల్ ఫస్ల్ ఫిల్ మిలల్ వల్ అహ్వా వన్నహ్లా : 4/ 170-176)*

## అల్లామా జస్సాస్ అభిప్రాయం

అల్లామా అబూ బక్ర్ జస్సాస్ ఇలా పలికారు :

ప్రాచీనులు, వారి అనుయాయులూ అయిన ధర్మవేత్తలు, ఫిక్హ్‌వేత్తలు-వీరెవరిలోనూ ఏ ఒక్కరూ **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** విధి అవడం పట్ల వ్యతిరేకత తెలుపలేదు. అయితే 'హష్వియ'లోని ఒక వర్గం, అస్హాబె హదీసులోని కొందరు ఎరుకలేని వారు తప్ప. వీరికి కూడా తిరుగుబాటుదారులతో పోరు సలపడం ఆయుధాల ద్వారా **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధిని నిర్వర్తించడం సరయినదేనా అన్న విషయంలోనే భేదాభిప్రాయముంది. **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధి నిర్వర్తన విషయంలో ఆయుధాలు చేపట్టడం గురించి, తిరుగుబాటుదారులతో పోరాడవలసి వస్తే దాన్ని వీరు ఉపద్రవం అని, కల్లోలం అనీ అంటారు. వాస్తవానికి అల్లాహ్ సెలవిచ్చిన ఈ ఆదేశమూ వారు విన్నదే-

'మీరు అత్యాచారం జరిపే వర్గంతో పోరాడండి, కడకు అది అల్లాహ్ ఆదేశం వైపునకు మరలి రావాలి' (అల్ హుజురాత్: 9) ఆయత్‌లోని పదాల అతి స్పష్టమయిన ఆవశ్యకత ప్రకారం తిరుగుబాటు వర్గంతో పోరాడటం విధి అయిన విషయం (ఇలా విశదంగా ఉన్నప్పటికీ) వారు చెప్పేదేమిటంటే, పరిపాలకుడు అన్యాయం, అత్యాచారం, దైవం నిషేధించిన హత్యలకు పాల్పడినా మరే నిషిద్ధ పనులకు ఒడిగట్టినా అతన్ని నిరోధించడం జరగరాదు. కాని పాలకులుకాని ఇతరులు దీనికి పాల్పడితే నోటి ద్వారా లేదా శక్తి ద్వారాను నిరోధించే అధికారం ఉందని అంటారు. కాని ఆ సందర్భంలోనూ ఆయుధాలు చేపట్టే

అనుమతి లేదని అంటారు. వాస్తవానికి ఈ వాదన చేసే వారు సముదాయం ఎడల విరోధుల కన్నా చెరుపు చేస్తున్నారు. ఎందుకంటే వీరు తిరుగుబాటు దారులతో పోరాడటాన్ని, పాలకుని అన్యాయాన్ని దుర్మార్గాన్ని ఆపడాన్నీ నిరోధిస్తున్నారు. ఫలితంగా పాపాతురులు, దేవుని అవిధేయులు, ముస్లి మేతర పాలకులు, ఇస్లామ్ విరోధులు ఆధిక్యత పొందారు. సరిహద్దులు తారుమారయి పోతున్నాయి, అన్యాయం, అధర్మం వ్యాపిస్తోంది. నగరాలు సర్వనాశనమవుతున్నాయి, దైవ తిరస్కారం, ధర్మంలో అతిశయ భావాలు, ధర్మంలో ఇస్లామేతర భావాలు చోటు చేసుకుంటు న్నాయి. దీనంతటికీ మూలకారణం, '**అమ్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**'ని వదలిపెట్టడం, ఇంకా అన్యాయ వర్తనుడయిన పాలకుణ్ణి నిరోధించకపోవడం, ఇవన్నీ దీని పర్యవసానమే. *(అహ్కాముల్ కుర్ఆన్ : 2/ 43)*

ఇమాముల్ హరమైన్ ఇలా అంటున్నారు :

اذا جار والى الوقت وظهر ظلمه و غشمه ولم ينزجرحين زجر عن سوء صنيعــه بالقـول فلاهــل الحل و العقــد التــواطئو على خلعــه و لو بشهــر الاَسلحـة و نصب الحروب

**తత్కాల పాలకుడు దుర్మార్గుడయి అతని దుర్మార్గం, అన్యాయం ప్రస్ఫుటమయి, నోటితో వారించినా అతను తన చేష్టల్ని ఆపకపోతే, ప్రభుత్వంలోని బాధ్యతాయుతులయిన వారు, సమస్యా పరిష్కర్తలు అతని తొలగింపునకు ఏకాభిప్రాయానికి రావలసి ఉంటుంది. దానికి శక్తినుపయోగించవలసి వచ్చినా, ఆయుధాలు చేపట్టి యుద్ధం చేయవలసి వచ్చినా వెనుకాడ రాదు.**

*(షర్హ్ ముస్లిమ్, నవవీ : సం.1, భాగం 2, పు. 23)*

ఇమామ్ నవవీ ఈ అభిప్రాయాన్ని ఉటంకించిన తరువాత ఇలా అన్నారు :

هٰذا الــذى ذكره من خلعــه غريب و مع هٰذا فهو محمـول على مـا

**నాయకుని (పాలకుని) ఈ తొలగింపు మాట, ఇమాముల్ హరమైన్ చెప్పింది కాస్త వింతగా**

**اذا لم يخف منه اثارة مفسدة اعظم منه**

**ఉంది. అయినప్పటికీ దాని ద్వారా ఏర్పడే పరిస్థితుల స్వరూపంలో, ఆ అన్యాయం, ఆ అత్యాచారానికి మించిన ఉపద్రవం ముంచుకు వచ్చే ప్రమాదం లేకపోలేదు.**

*(షర్హ్ ముస్లిమ్, నవవీ : సం.1, భాగం 2, పు. 23)*

ఇమామ్ నవవీ తన ఈ అభిప్రాయానికి ఎటువంటి ఆధారం చూపలేదు. నిజానికి ఇమాముల్ హరమైన్ తన అభిప్రాయంలో ఒక్కరే కారు. మేము ఇతః పూర్వమే చూపినట్లు ఇమామ్ ఇబ్ను హజ్మ్, అల్లామా అబూబక్ర్ జస్సాస్ వంటి గొప్ప పరిశోధకులు సయితం ఈ అభిప్రాయంలో ఆయనతో ఏకీభవిస్తున్నారు. పోతే పాలకుని తొలగింపు చర్య పెద్ద ఉపద్రవ ప్రమాదం లేనటువంటి పరిస్థితుల్లోనే తీసుకోవాలి అన్న దాన్నీ , దాని సామంజస్యతను ఎవరు కాదనగలరు?



# 10. ధర్మ పునరుజ్జీవనం-సముదాయ సంస్కరణ

## జాతుల ఉత్థాన పతనాల నియమం

ప్రపంచంలో ప్రతి వ్యక్తీ ఏ చెడూ లేనివాడు ఉన్న సముదాయం; సదాచారం, అత్యున్నత ధర్మనిష్ఠ గల వ్యక్తులు మాత్రమే ఉన్న సముదాయం ఏదీ ఉండదు. ప్రతి సముదాయంలోనూ మంచివారు, చెడ్డవారు రెండు రకాల మానవులూ ఉంటారు. సమాజంలో **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్** కొరకు సతతం కృషి చేస్తూ ఉండటం సముదాయంలోని సదాచార సంపన్నుల బాధ్యత. చెడు నడత గలవారిని సంస్కరించడం, వారిని సన్మార్గాన తీసుకువెళ్ళడం సద్వర్తన గలవారి కర్తవ్యం. వారు ఈ బాధ్యతా నిర్వహణలో అలసత్వం చూపినట్లయితే చెడుగు సర్వ సామాన్య మవుతుంది. జాతి మొత్తాన్ని నాశనం చేసి తీరుతుంది. ఒక జాతిలో మంచిని, శుభాన్ని వ్యాపింపజేయడానికి చెడును రూపుమాపడానికి కొందరు వ్యక్తులుండాలి. ఈ వ్యక్తులే ఆ సమాజానికి 'ఆయువు పట్టు' లాంటి వారు. వీరు మౌనం వహించినట్లయితే జాతి తన జీవం కోల్పోతుంది. ఓ జాతి ప్రగతి సాధించే కాలం, ఆ జాతి దాని సామూహిక జీవనంలో చెడుగుల్ని శాశ్వతంగా దూరం చేసుకుని, దాని నైతిక శక్తిలో అనుదినం వృద్ధి చేసుకుంటూ పోతున్న కాలం! ఏ సమాజంలో సచ్ఛీలురయిన వారి సంఖ్య దుర్వర్తనులయిన వారి సంఖ్య కన్నా అధికమయి, చెడుగు కేవలం కొన్ని మూలల్లో పరిమితమయిపోతుందో, ఆ సమాజానికి అల్లాహ్ భువిలో నిలకడ కల్పిస్తాడు, దానికి వృద్ధీ వికాసాల అవకాశాలూ కల్పిస్తాడు. కాని చెడ్డవారి సంఖ్య సద్వర్తనుల సంఖ్యపైన ఆధిక్యత పొందినట్లయితే జీవితంలో ఎల్లెడలా చెడుగు వ్యాపించినట్లయితే అల్లాహ్ న్యాయసూత్రం ప్రకారం అది పతనం వైపునకు పోయి ఒక జాతిగా క్రమేణ అంతరించి పోతుంది. ఈ వినాశానికి సమయం పట్టవచ్చు, సామాన్యంగా సమయం పడుతుంది

కూడా. కాని ఒక దుర్వర్తన గల జాతి ఆ వినాశాన్నుండి పూర్తిగా భద్రంగా మాత్రం మిగులదు. ఈ సత్యాన్నే దివ్యకుర్ఆన్ ఈ ఆయత్‌లో వివరించింది :

وَ اتَّقُوْا فِتْنَةً لَّاتُصِيْبَنَّ الَّذِيْنَ ظَلَمُوْا مِنْكُمْ خَاصَّةً (الانفال:٢٥)

**ఆ ఉపద్రవం నుండి తప్పించుకోండి, దాని పీడ కేవలం మీలో అపరాధం చేసినవారి వరకే ప్రత్యేకంగా పరిమితం కాదు (దాని వాతన అందరూ పడతారు).** ***(అల్ అన్‌ఫాల్ : 25)***

దైవ సందేశహరులు(స)ని హజ్రత్ జైనబ్ బిన్తు జహష్ (ర) అడిగారు, 'మేము కూడా నశిస్తామా, మాలోనూ సదాచారులున్నారే?' అని. దానికి ఆయన, 'అవును, చెడుగు మరీ పెరిగిపోయినప్పుడు...' అని బదులిచ్చారు.★

మూలగ్రంథాల ఈ వచనాలు భావం రీత్యా అతి స్పష్టంగా ఉన్నాయి. ఒక జాతిపైన పరమ ప్రభువు యాతన అవతరిస్తే దాని వాతన చెడ్డవారితోపాటు సజ్జనులు, సదాచారులు సయితం పడితీరుతారు. అల్లాహ్ ఏర్పరచిన ఈ నియమం, దాని వివరాలు దివ్యకుర్ఆన్, హదీసుల్లోనూ వచ్చాయి. ఇక్కడ వాటి వివరాలు కొన్నింటిని ఉటంకిస్తున్నాము.

## సంస్కర్తలు యాతనను తప్పించుకుంటారు

కొందరు తమ స్థానాన సదాచారులయి ఉంటారు. కాని ఇతరుల్లో సదాచారాన్ని వ్యాపింపజేయరు. వారు స్వయంగా చెడు నుండి తప్పించుకుంటారు, కాని సమాజంలోని చెడును భరిస్తూ సహిస్తూ ఉంటారు. దీనికి భిన్నంగా కొందరు సద్వర్తనులలోని మంచితనం, ప్రపంచంలో మంచి అన్నది సమసిపోతూ చెడు అన్నది వృద్ధి చెందుతూ ఉండటాన్ని చూడనివ్వదు. వారు మంచిని ఆచరిస్తారు, దాన్ని ఇతరుల్లో వ్యాపింపనూ చేస్తారు. చెడుకు దూరంగానూ ఉంటారు, ఇతరుల్ని దానికి దూరంగా ఉంచడానికి ప్రయత్నమూ చేస్తుంటారు.

కొందరు పండితుల ప్రకారం, దైవం పక్షాన సర్వ సామాన్య యాతన వచ్చినప్పుడు దుర్వర్తనులతోపాటు ఈ రెండు విధాల రుజువర్తనులు సయితమూ దానికి లోనవు తారు, కాని ఈ అభిప్రాయం సరయినది కాదు. వాస్తవం ఏమిటంటే సామాన్య

★ *బుఖారీ- కితాబుల్ ఫితన్, బాబు వైలుల్లిల్ అరబ్ మిన్ షర్రి కదిక్ తరబ్; ముస్లిమ్- కితాబుల్ ఫితన్ వ అష్రాత్ అస్సాఅ.*

ఉపద్రవం వచ్చినప్పుడు దుర్వర్తనులతోపాటు కేవలం మొదటి కోవకు చెందిన సద్వర్తనులే దానికి లోనవుతారు. రెండవ కోవకు చెందినవారు రక్షించుకో బడతారు. ఖుర్‌ఆన్ దాన్ని విశదీకరిస్తూ ఇలా చెప్పింది, అవిధేయులయిన జాతులపై అల్లాహ్ శిక్ష అవతరించినప్పుడు అల్లాహ్ తన సందేశహరుల్ని, విశ్వసించినవారినీ కాపాడుకున్నాడు :

ثُمَّ نُنَجِّى رُسُلَنَا وَالَّذِيْنَ اٰمَنُوْا كَذٰلِكَ حَقًّا عَلَيْنَا نُنْجِ الْمُؤْمِنِيْنَ (یونس: ۱۰۳)

**అయితే (మా శిక్షాయాతన అవతరించినప్పుడు) మేము మా ప్రవక్తల్ని, విశ్వాసం గలవారినీ రక్షించుకుంటాము. మా పద్ధతి ఇదే. విశ్వసించిన వారిని రక్షించుకోవడం మాపై ఉన్న బాధ్యత.** *(యూనుస్: 103)*

దైవ సందేశహరులు సంస్కరణకు, మార్గనిర్దేశనకు పంపబడతారు. వారి సర్వోత్తమ సామర్థ్యం ఇందులోనే వెచ్చింపబడుతుంది. వారి జాతి ప్రజలు ఏ అక్రమానికి, ఏ దౌర్జన్యానికి, ఏ ఉపద్రవానికి మరే కల్లోలానికి లోనయి ఉంటారో దానికి వ్యతిరేకంగా వారు శక్తినంతా ఉపయోగించి నిరంతరాయంగా కృషి సలుపుతారు. అందువల్ల వారి జాతి ప్రజలు ఏ అత్యాచార పర్యవసానానికి గురవుతారో దాన్నుండి కూడా వారిని భద్రంగా పెడతాడు పరమప్రభువు. ప్రపంచానికి సన్మార్గం చూపెట్టేవారు, ఎట్టి పరిస్థితిలోనూ దేవుని శిక్షా ఉపద్రవానికి దూరంగా, భద్రంగా ఉంటారు అనడానికి ఇది ఆధారం. హదీసుల్లో ఒక విషయం అతిస్పష్టంగా తెలుపడం జరిగింది, చెడ్డవారితో పాటు మంచివారు కూడా దైవశిక్ష వాతన పడేది, మంచి వారు **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధి నిర్వహణను వదిలివేసినప్పుడే, పరిస్థితుల్ని సంస్కరించే కృషి వదలివేసిన సందర్భంలోనే.

ప్రవక్త(శ్రీ (స) ఇలా సెలవిచ్చారు:

ما من قوم يعمل فيهم بالمعاصى ثم يقدرون على ان يغيّروا ثم لم يغيّروا الّا يوشک ان يعمّهم الله منه بعقاب

**ఒక జాతిలో దైవం పట్ల అవిదేయత జరుగుతూ ఉండగా, దాన్ని మార్చగలవారు అందులో ఉన్నప్పటికీ దాన్ని మార్చే ఏ ప్రయత్నమూ జరగక పోయినట్లయితే అతిత్వరగా పరమ ప్రభువు**

వారిపైన తన శిక్షాయాతనను పంపించి తీరుతాడు.

*(అబూ దావూద్, కితాబుల్ మలాహిమ్, బాబుల్ అమ్ర్ వన్నహీ; వ తిర్మిజీ వ న్నసాయీ బి మానాహు)*

మరో ఉల్లేఖనంలో ఇలా వుంది:

ان الله عز وجل لاَ يعذّب العامّة بعمل الخاصة حتّى يَروا المنكر بين ظهرانيهم و هم قادرون علىٰ ان ينكروا فلا ينكروه فاذا فعلو ذلك عذّب الله الخاصّة والعامّة

**ప్రత్యేకమయిన జనుల దుర్వర్తన వల్ల సామాన్య జనులను అల్లాహ్ నిశ్చయంగా శిక్షించడు. అయితే వారు తమ మధ్య చెడును చూసీ దాన్ని నిరోధించగల శక్తి ఉన్నా నిరోధించకపోయినట్ల యితే అది వేరే విషయం, వారి వైఖరి ఇలా మారిపోయినట్లయితే పరమ ప్రభువు ప్రత్యేక జనులు, సామాన్యులు అందరిపైనా తన శిక్షను అవతరింపజేస్తాడు.** *(ముస్నద్ అహ్మద్ : 5/213)*

ఈ హదీసుల ద్వారా తెలిసేదేమిటంటే దేవుని శిక్ష ఒక జాతిలోని చెడుగులో మునిగి పోయిన వారిపైన మూడుతుంది లేదా ఆ చెడుగును చూస్తూ దాన్ని రూపుమాపే శక్తి ఉన్నా దాన్ని రూపుమాపే ప్రయత్నం చెయ్యని వారిపైనా మూడుతుంది. దీన్నిబట్టి దానంతట అదే తేలే విషయం ఏమిటంటే భ్రష్టు పట్టిన సమాజంలో ఏ వ్యక్తులయితే చెడుగును మార్చడానికి తమ విధి నిర్వర్తిస్తున్నారో వారు అల్లాహ్ శిక్షా యాతన నుండి భద్రంగా ఉంటారు. హదీసు వేత్తలయిన ఇబ్ను అబీహమ్జా, అల్లామా కుర్తుబీ అభిప్రాయం కూడా ఇదే. *(ఫత్హుల్ బారీ : 13/ 48)*

## అస్హాబుస్సబ్త్ (శనివారం వారు) ద్వారా నిర్ధారణ

పైన పేర్కొన్న అభిప్రాయం నిర్ధారణ అస్హాబుస్సబ్త్ వారి సంఘటన ద్వారా కూడా జరుగుతోంది. అల్లాహ్ బనీ ఇస్రాయీల్ కొరకు సబ్త్ అనగా శనివారం నాడు పవిత్ర దినంగా నిర్ణయించాడు. ఆ దినాన్ని దైవారాధన కొరకు ప్రత్యేకించుకోవాలని, మరే ప్రాపంచిక కార్యం చెయ్యరాదని వారికి ఆదేశమయింది. కాని వారిలోని ఒక జనావాసం వారు, సముద్రపు ఒడ్డున ఉన్నవారు, ఈ ఆదేశాన్ని ఉల్లంఘించారు. శనివారం రోజు చేపలు పట్టేవారు. కుర్ఆన్ ప్రకారం, వారి ఈ వైఖరిని జనావాసంలోని ఒక వర్గం వారు, వారికి హితవు గరిపి, వారిని నివారించే కృషి చేశారు; మరోవర్గం వారు ఆ సంస్కర్తలనుద్దేశించి:

لِمَ تَعِظُوْنَ قَوْمَا ۙاللّٰهُ مُهْلِكُهُمْ اَوْ مُعَذِّ بُهُمْ عَذَابًا شَدِيْدًا (الاعراف: ١٦٤)

**'అల్లాహ్ హతమార్చబోతున్న, లేదా కఠినంగా శిక్షించబోతున్న జనులకు మీరు బోధించడం దేనికీ?'** *(అల్ ఆరాఫ్: 164)*

అని ప్రశ్నించినప్పుడు ఆ బోధించే వారి సమాధానం ఇది, తాము ఇలా చేస్తున్నది :

مَعْذِرَةً اِلٰى رَبِّكُمْ وَلَعَلَّهُمْ يَتَّقُوْنَ۝

**'మేము ఇదంతా మీ ప్రభువు సమక్షంలో మా సంజాయిషీగానూ, ఈ జనులు దేవుని అవిధేయతకు దూరంగా ఉంటారన్న ఆశతోనూ చేస్తున్నాము'** *(అల్ ఆరాఫ్ : 165)*

అన్నది. ఈ విధంగా ఆ జనావాసం మూడు వర్గాలుగా చీలిపోయింది. ఒక వర్గం అల్లాహ్ ఆదేశాలను అతి స్పష్టంగా అతిక్రమించింది, సబ్త్ పరిశుద్ధతను కాల రాసింది. రెండవ వర్గం దానికి బోధ గరిపి వారించింది. మూడవ వర్గం, అల్లాహ్ అవిధేయత చెయ్యలేదు కానీ, విచ్చలవిడిగా దేవుని ఆజ్ఞోల్లంఘన చేస్తున్న వర్గాన్ని వారించే ప్రయత్నమూ చెయ్యలేదు. కుర్ఆన్ ఈ మూడు వర్గాలను పేర్కొన్న తరువాత ఇలా అంటోంది:

فَلَمَّا نَسُوْا مَا ذُكِّرُوْا بِـهٖ اَنْجَيْنَا الَّذِيْنَ يَنْهَوْنَ عَنِ السُّوْءِ وَ اَخَذْنَا الَّذِيْنَ ظَلَمُوْا بِعَذَابٍ بَئِيْسٍ بِمَا كَانُوْا يَفْسُقُوْنَ فَلَمَّا عَتَوْا عَنْ مَّا نُهُوْا عَنْـهُ قُلْنَـا لَهُمْ كُوْنُوْا قِـرَدَةً خَاسِئِيْنَ ۝ (الاعراف: ١٦٦)

**కడకు వారికి గుర్తుచేసిన బోధనలన్నింటినీ వారు పూర్తిగా విస్మరించివేయగా, చెడు నుంచి వారించే వారిని మటుకు మేము కాపాడుకున్నాము; మిగతా దుర్వర్తనులయిన వారిని, వారి అక్రమాల కారణంగా ఘోరమయిన యాతనలో పట్టు కున్నాము. ఆ తరువాత, వారు పూర్తిగా నిషేధించిన దానినే తలబిరుసుతనంతో చేస్తూ ఉన్నందు వల్ల నీచులయి పరాభవం పాలయి కోతులుగా మారిపొండి, అని వారిని మేము శపించాము.** *(అల్ ఆరాఫ్ :165, 166)*

ఈ ఆయత్‌లలో కుర్ఆన్ విశదంగా రెండు విషయాలు వక్కాణించింది. ఒకటి, ఏ వర్గమయితే దైవాదేశాలను ఉల్లంఘించిందో అది ఆయన శిక్షకు లోనయింది.

రెండు, మరెవరయితే వారిని ఈ అవిధేయత నుంచి వారించే ప్రయత్నం చేశారో వారు ఈ శిక్ష నుండి సురక్షితంగా ఉన్నారు. ఇది స్పష్టంగా తెలిపేదేమిటంటే, అల్లాహ్ తరఫున ఏ జాతిపైనయినా శిక్ష దాపురిస్తే ఆ జాతిలో **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్** విధిని నిర్వర్తించేవారు పూర్తిగా సురక్షితంగా ఉంటారు.

పై సంఘటనలో కుర్ఆన్, ఆ మూడవ వర్గం అంతిమ పరిణామం గురించి విశదంగా ప్రస్తావించలేదు. ఆ వర్గం, సబ్త్ పవిత్రతనూ కాలరాయలేదు, ఆ అపరాధానికి పాల్పడేవారిని వారించనూ లేదు. కొందరు పండితులు, ఈ వర్గం కూడా యాతన నుండి ముక్తి పొందినవారిలో ఉండిందని అంటారు. మరికొందరేమో దేవుని శిక్ష వారినీ చుట్టుముట్టిందని అంటారు. పైన పేర్కొన్న హదీసుల ప్రకారమయితే ఈ రెండవ అభిప్రాయమే బలపడుతుంది. ఎందుకంటే వాటిలో స్పష్టంగా ఉంది, ఒక జాతిలో **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్** నిర్వర్తించే శక్తి గల వ్యక్తులు ఆ విధిని వదిలివేసినట్లయితే కేవలం ఆ జాతి మాత్రమే నాశనమవడం కాక దానితో పాటు స్వయంగా వారూ నాశనమయిపోతారు. అల్లామా షౌకానీ ఇలా అంటున్నారు:

**... فان كان من يتاهل للامر بالمعروف والنهى عن المنكر معرضاً عن ذلك غير قائم بحجة الله ولاَ مبلغ لها الىٰ عباده فهو شريكهم فى جميع مااقترفوه من معاصى الله سبحانه مستحق للعقوبة المعجلة و المؤجلة قبلهم، كما صحّ فى قصة من تعدى السبت من اتباع موسىٰ عليه السلام فان الله تعالىٰ ضرب من ترك الامر بالمعروف و النهى عن المنكر بسخط عذابه و**

**... ఎవరయినా అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్ నిర్వర్తించే యోగ్యత కలిగి వుండి దానికి విముఖుడయితే, (సందేశం అందజేసి) అల్లాహ్ వాదనను స్థాపించకపోతే, దాన్ని అల్లాహ్ దాసులయిన మానవులకు చేరవేయకపోతే, దేవుని అవిధేయులయిన మానవులు ఏ ఏ పాపాలలో లీనమయి ఉంటారో వాటన్నింటిలో అతనూ భాగ స్వామిగా పరిగణించబడతాడు. ఆ పాపాతురు లకు అల్లాహ్ పక్షాన ఏ ప్రాపంచిక, పారలౌకిక శిక్ష లభిస్తుందో దానికి అతనూ పాత్రుడవు తాడు. ఇది హజ్రత్ మూసా (అ) జాతికి చెందినవారి విషయంలో రుజువయిన విష యమే. వారు సబ్త్ వ్యవహారంలో అక్రమానికి పాల్పడ్డారు. అప్పుడు అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్ విధిని వదలివేసిన వారిపైనా అల్లాహ్ తన శిక్షను అవతరింపజేశాడు. వారి**

مسخهم قردة و خنازير مع انهم لم يفعلوا مافعله المعتدون من الذنب بل سكتوا عـــن ابلاغ حجته و القيام بما امر هم بـه من الامر بالمعروف و النهى عن المنكر، والحاصل انه لا فرق بين من فعل المعصية و بين من رضى بها و لم يفعلها و بين من لم يرض بها لكن ترك النهى عنها مع عدم المسقط لذلك عنهم

రూపాలనూ మార్చివేసి కోతుల్లా పందుల్లా చేసివేశాడు. అక్రమానికి పాల్పడిన వారు ఒడిగట్టిన పాపానికి వారు పాల్పడక పోయినా ఇలా చేశాడు. వారి తప్పు కేవలం, అల్లాహ్ వాదనను వారి వద్దకు చేరవేయక పోవడం, అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్ ఆదేశాన్ని నిర్వర్తించక మానివేయడం మాత్రమే. మొత్తానికి, పాపం చేసినవారు, పాపం చేయకపోయినా దాన్ని ఇష్టపడేవారు, ఇష్టపడక పోయినా నహీ అనిల్ ముస్కర్ విధిని, అకారణంగా నిర్వర్తించకపోయేవారు- అందరూ సమానులే.

*(మజ్మూఅతుర్రసాయిలుల్ మునీరియ, 2వ భాగం, రిసాలతుల్ ఊలా (అదవాఉల్ ఆజిల్ ఫీ దఫఉల్ ఉద్వా అస్సాయిల్, పుట. 2,3)*

## చెడ్డవారి సంస్కరణ మంచివారి విధి

దివ్యకుర్ఆన్ విభిన్న సందర్భాలలో సత్యాసత్యాల సంఘర్షణా గాథలు వివరించింది. దీన్నిబట్టి ఒక జాతిలో సత్యసందేశం ప్రారంభమయినప్పుడు ఆ జాతి రెండు వర్గాలుగా చీలిపోతుంది. ఒకవైపున స్వార్థపరులయినవారుంటారు, వారు అడుగడుగునా దాన్ని వ్యతిరేకిస్తూ ఉంటారు. మరోవైపున చిత్తశుద్ధి గలవారుంటారు, వారు ముందుకు వచ్చి దాన్ని గుండెలకు హత్తుకుంటారు. అది వారి మనోమస్తిష్కాల్లో పూర్తిగా స్థానమేర్పరచుకుంటుంది. వారు చేసే ప్రతి ఆచరణ ద్వారా అది వ్యక్తమవుతూ వుంటుంది. వారు పూర్తి విశ్వసనీయతతో దాన్ని సేవిస్తారు. దానికొరకు సకల విధాల కష్టాలను భరిస్తారు. కడకు వారి జీవన్మరణాలు సయితం దాని కొరకే, కేవలం దానికొరకే అంకితమయిపోతాయి. కాని ఈ స్థితి ఎంతో కాలం కొనసాగదు, క్రమేణ ఆచరణా యోగ్యులయిన మానవుల స్థానే చరిత్ర హీనులయినవారు వచ్చేస్తారు. వారి జీవితం కాపట్యంతో నిండి ఉంటుంది. వారు అల్లాహ్ పేరు ఎత్తి మాటలాడినా నిజానికి

అల్లాహ్‌కు బహుదూరమయి ఉంటారు. దివ్యకుర్‌ఆన్ కొందరు ప్రవక్తల ప్రస్తావన తరువాత ఓ చోట ఇలా అంటుంది:

فَخَلَفَ مِنْ بَعْدِهِمْ خَلْفٌ اَضَاعُوا الصَّلٰوةَ وَ اتَّبَعُوا الشَّهَوَاتِ(مریم:۵۹)

**ఆ తరువాత, వీరి స్థానంలో పిదప వచ్చిన వారు అయోగ్యులయినవారు, వారు నమాజ్ కోల్పోయారు, మనోవాంఛలను అనుసరిం చారు.** *(మర్యమ్: **59**)*

తమ పూర్వీకుల స్థానంలో వచ్చిన ఈ అతిహీనమయిన వారు సత్య సందేశానికి పరాభవ కారణమవుతారు. వారి ఉనికి ఇస్లామీయ సముదాయానికి బాహాటంగా వచ్చే శత్రువులకన్నా ప్రమాదకరమయినదిగా పరిణమించవచ్చు. అనేక పర్యాయాలు అలా జరిగింది కూడా. దానికి చరిత్రే సాక్షి! ఇటువంటి వారి సంస్కరణకు ప్రయత్నించడం, వారి దుష్ప్రభావాన్ని వ్యాపించకుండా ఆపడం, దైవాన్ని వాస్తవంగా నమ్మేవారి బాధ్యత. ఎవరిలోనయినా ఇటువంటి సంస్కరణ పట్ల ఆవేదన అంటూ లేకపోతే, అతను ఈ పరిస్థితుల్ని మార్చడానికి వ్యాకులపడకపోతే అతని విశ్వాసం ప్రమాదంలో ఉందని అనుకోవలసి ఉంటుంది. ప్రవక్త మహనీయులు (స) ఇలా అన్నారు :

مامن نبی بعثه الله تعالیٰ فی امة قبلی الاکان له من امته حواریون و اصحاب یاخذون بسنته و یقتدون بامره، ثم انها تخلف من بعدهم خلوف یقولون ما لا یفعلون و یفعلون ما لایؤمرون، فمن جاهدهم بیده فهو مومن و من جاهدهم بلسانه فهو مومن و من جاهدهم بقلبه فهو مومن و

**నాకు పూర్వం ఏ ప్రవక్తను అల్లాహ్ ప్రభవింపజేసినా అతని సముదాయంలో అతని సహాయకులు, సహచరులూ ఉండేవారు. వారు ప్రవక్త చూపిన విధానాన్ని అమలుపరిచేవారు, అతని ఆదేశాలను అనుసరించేవారు, ఆపైన వారి తరువాత వారి స్థానంలో మా చెడ్డ వారసులు పుట్టారు, వారు స్వయంగా ఆచరించని మాటలు పలికేవారు, వారికి ఆదేశించని పనులు చేసేవారు. అలాంటప్పుడు వారితో ఎవరయితే తన స్వహస్తాలతో పోరాడాడో అతను విశ్వాసి, మరెవరయితే నోటితో పోరా డాడో అతనూ విశ్వాసియే, మరెవడయితే తన హృదయాన పోరాడాడో అతను కూడా విశ్వాసియే. కాని ఆ తరువాత (అంటే అదీ చేయనివాడు)**

అవగింజంత విశ్వాసం కూడా తనలో లేనివాడు. ليس وراء ذلك من الايمان حبة خردل
(ముస్లిమ్, కితాబుల్ ఈమాన్, బాబు బయాన్ కౌనన్నహీ అనిల్ మున్కర్ మినల్ ఈమాన్...)

## ఇతరుల సంస్కరణ స్వీయ సంస్కరణకు మూలం

చెడిపోయిన వాతావరణంలో ఎంత ఉత్తముడయిన మనిషి అయినా సన్మార్గం నుండి వీడిపోయే ప్రమాదముంటుంది. దాన్నుండి ముక్తి పొందాలంటే ఒకటే మార్గం, మనిషి బలాన్నంతా వినియోగించి, ఆ వాతావరణంతో నిరంతరాయంగా పోరాడుతూ ఉండాలి. చెడుకు విరుద్ధంగా మంచికి పిలుపునిచ్చే వానిగా మారిపోవాలి. ఎక్కడెక్కడ చెడుగు కానవస్తుందో దాని సంస్కరణకు పరుగెత్తాలి. అందులో అతను అలసత్వం చూపినట్లయితే వాతావరణంలోని చెడు ప్రభావాలు స్వయంగా అతనిపైన పడటం తథ్యం. అతను చెడుల నుండి తప్పించుకోవడం సాధ్యమవదు. అనేక సార్లు, తన మాటను పట్టించుకోవడం జరగటం లేదని గమనించి, మాటకు ప్రభావం కానరావడం లేదని చూసి మనిషి, సంస్కరణా ప్రయత్నం మానివేస్తాడు. వాస్తవంగా అలా వదలడం వల్ల తనకే వ్యక్తిగతంగా నష్టం అని గ్రహించలేకపోతాడు. మనిషి చెడులకు ప్రతిగా ఓడిపోయి సంస్కరణా కృషిని వదలివేసినప్పుడు సహజంగానే అతనిలో చెడులకు ప్రతిగా ఉండవలసిన ద్వేషభావమూ మిగులదు. పిదప క్రమేణ ఆ చెడుల్ని అతను మచ్చిక చేసుకుంటాడు, కడకు ఆ చెడుల పట్ల ఒకప్పుడు తీవ్రమయిన ఏవగింపు గల వ్యక్తి స్వయంగానే వాటికి లోనయిపోతాడు.

## బనీ ఇస్రాయీల్ సజ్జనులు దుర్జనులయి పోయారు

దైవ సందేశహరులు(స) సెలవిచ్చిన దాని ప్రకారం, బనీ ఇస్రాయీల్‌లో చెడుగులు వ్యాపించసాగినప్పుడు ప్రారంభంలో సజ్జనులు వాటిని వారించేవారు. కాని తరువాత తమ మాట చెల్లటం లేదని వారు గమనించినప్పుడు వారు మౌనం వహించసాగారు. ఆపైన క్రమేణ ఆ దుర్జనులతోనే వారు రేబవళ్ళు గడపసాగారు. ఫలితంగా చెడుగు పట్ల ఒక విశ్వాసికి ఉండవలసిన ఏహ్యాభావం, అసలు అదే అతని మూల సంపద వంటిది, క్రమంగా అదీ వారి హృదయాల నుంచి తొలగి అంతమయి పోయింది. ఆ తరువాత వారిలో చెడును చెడుగా పేర్కొనే, దాన్ని వారించే వ్యక్తులే లేకపోయారు. పరిస్థితి ఇలా మారిపోయినప్పుడు దేవుని కటాక్ష వీక్షణం కూడా వారి

నుండి మరలిపోయింది. వారు ఆయన అభిశాపానికి పాత్రులయిపోయారు. అబూ దావూద్ ఉల్లేఖనంలో ఇలా ఉంది :

قال رسول الله صلّى الله عليه وسلم: ما دخل النقص علىٰ بنى اسرائيل كان الرجل يلقى الرجل فيقول يا هٰذا اتق الله ودع ما تصنع فانه لاَ يحل لك ثم يلقاه من الغد فلا يمنعه ذٰلك ان يكون اكيله و شريبه و قعيده، فلما فعلوا ذٰلك ضرب الله قلوب بعضهم على بعض ثم قال لُعِنَ الَّذِيْنَ كَفَرُوْا مِنْ بَنِىْ اِسْرَائِيْلَ عَلىٰ لِسَانِ دَاوٗدَ وَ عِيْسَى ابْنِ مَرْيَمَ

దైవ సందేశహరులు (స) ఇలా సెలవిచ్చారు: బనీ ఇస్రాయీల్‌లో లోపం ఇలా ప్రారంభమయింది, ఒక వ్యక్తి మరోవ్యక్తిని (అపరాధానికి పాల్పడినవాడిని) కలుసుకున్నప్పుడు అతనికి నచ్చజెప్పుతాడు, మిత్రమా, దైవానికి భయపడు, నీవు చేస్తున్న తప్పుడు పనిని వదలిపెట్టు, ఇది నీకు ధర్మసమ్మతం కాదు. (కాని ఈ ఉద్బోధ అతనిపైన ప్రభావం చూపదు) ఇక ఆ బోధకుడు రెండవ రోజు అతన్ని కలుసుకున్నప్పుడు ఆ అపరాధిలోని చెడుగు, ఆ వ్యక్తిని అతనితో కలసి తిరగడానికీ, తినడానికీ, త్రాగడానికీ అడ్డురాదు. పరిస్థితి ఇలా మారినప్పుడు అల్లాహ్ అందరి అంతర్యాలు ఒకేవిధమయినవిగా మార్చివేశాడు. ఇలా పలికి ఆయన(స) కుర్‌ఆన్ ఆయత్ పఠించారు : బనీ ఇస్రాయీల్‌లో ఎవరయితే తిరస్కారానికి ఒడిగట్టారో వారికి దావూద్, మర్యమ్ కుమారుడు ఈసా నోట అభిశపించ చడం జరిగింది. *(అల్ మాయిదా : 78)*

*(అబూదావూద్, కితాబుల్ మలాహిమ్, బాబు అల్ అమ్ర్ వన్నహీ; వతిర్మిజీ బి మానాహు)*

## బనీ ఇస్రాయీల్ అధిక్షేపణ

కుర్‌ఆన్, బనీ ఇస్రాయీల్ ధార్మిక పండితుల్ని, నాయకుల్ని తీవ్రంగా అధిక్షేపించింది. ఎందుకంటే, సముదాయాన్ని సంస్కరించే ఉన్నత స్థానాన్ని అల్లాహ్ వారికి ప్రసాదించగా వారు తమ బాధ్యతల పట్ల ఏమరుపాటును వహించారు. సామాన్య

ప్రజలు వారి ఎదుటే పాపభూయిష్టమయిన జీవితం గడుపుతూ ఉండేవారు, పరస్పరం అన్యాయం, అక్రమం చేసుకునేవారు. ధర్మాధర్మాల విచక్షణ పట్ల పట్టింపు వదిలేశారు. కాని ఈ ధర్మవేత్తలు ఈ పరిస్థితుల్ని మార్చే ప్రయత్నం ఏమాత్రం చేసేవారు కాదు.

وَ تَرٰی كَثِیْرًا مِّنْهُمْ یُسَارِعُوْنَ فِی الْاِثْمِ وَ الْعُدْوَانِ وَ اَكْلِهِمُ السُّحْتَ لَبِئْسَ مَا كَانُوْا یَعْمَلُوْنَ ۝ لَوْلَا یَنْهٰهُمُ الرَّبّٰنِیُّوْنَ وَ الْاَحْبَارُ عَنْ قَوْلِهِمُ الْاِثْمَ وَ اَكْلِهِمُ السُّحْتَ لَبِئْسَ مَا كَانُوْا یَصْنَعُوْنَ ۝ (المائدة: ٦٢-٦٣)

**నీవు గమనిస్తూ ఉంటావు, వీరిలోని చాలా మంది పాపపు కార్యాల్లోనూ అత్యాచారాల్లోనూ చురుకుగా పరుగెడుతూ కనిపిస్తారు, అధర్మ మయిన సొత్తును తింటారు. వీరు చేసే ఈ చేష్టలు ఎంతో నీచమయినవి. వీరి పండితులు, వీరి ధర్మ వేత్తలు వీరిని పాపపు మాటలు పలకకుండా, అధర్మమయిన సొత్తును తినకుండా వారించరెందుకు? నిశ్చయంగా వీరు రూపొందించుకుంటున్న జీవిత కార్యకలా పాల చిట్టా ఎంతో నీచమయినది.**

*(అల్ మాయిదా : 62, 63)*

ఈ ఆయత్‌ల విషయంలో ఇమామ్ రాజీ (రహ్మ) ఇలా అంటున్నారు:

**ان الله تعالىٰ استبعد من اهل الكتاب انهم ما نهوا سفلتهم و عوامهم عن المعاصى وذلك يدل علىٰ ان تارك النهى عن المنكر بمنزلة مرتكبه لانه تعالىٰ ذم الفريقين فى هٰذا الاٰية علىٰ لفظ واحد**

**గ్రంథవహుల పండితులు తమ క్రింది వారికి, సామాన్యులకు పాపపు కార్యాల నుండి వారించకపోవడం, పరమ ప్రభువు అల్లాహ్ (వారి స్థాయికి) ఏమాత్రం తగనిదిగా ఎంచాడు. దీన్నిబట్టి చెడు నుండి ఆపకపోయేవాడు కూడా చెడును చేసే వాని స్థాయికి చెందినవాడేనని తెలుస్తోంది. ఎందుకంటే అల్లాహ్ ఈ ఆయత్‌లో ఇరువర్గాలను ఒకే విధమయిన పదాలలో ఖండించాడు.**

*(మఫాతీహుల్ గైబ్, తఫ్సీర్ కబీర్, సం. 6, భాగం 12, పు. 34)*

ఇంతేకాదు, ఇమామ్ రాజీ తదితర వ్యాఖ్యాతలు వ్రాసిన దాని ప్రకారం, ఖుర్‌ఆన్, మున్కర్‌కి పాల్పడిన వారిని గురించి కూడా, మున్కర్‌ని వారించని వారి

పట్ల ప్రయోగించినంత కఠినమయిన పదాన్ని ప్రయోగించలేదు. మొదటి వర్గానికయితే అది కేవలం 'యామలూన్' (చేసే పని) అనే అన్నది; రెండవ వర్గానికి 'యస్నఊన్' (రూపొందించుకుంటున్న) అని అంది.

ఈ ఆయత్‌లలో దివ్యకుర్ఆన్, బనీ ఇస్రాయీల్ పండితుల్ని గురిచేసిన విమర్శనలో, ముస్లిమ్ సముదాయానికి, ముఖ్యంగా దాని విజ్ఞులయిన వారికి ఎంతో గుణపాఠం గరిపే విషయాలున్నాయి. వీటిలో వారికి తెలుపడం జరిగింది, వారు కూడా తమ బాధ్యతల పట్ల ఏమరుపాటు వహించి, సముదాయం సంస్కరణా కార్యాన్ని వదిలిపెట్టినట్లయితే, అల్లాహ్ ఆగ్రహానికీ, ఆయన బెదరింపు, ఈ ఖండనలకు గురికావలసి వస్తుంది. అల్లాహ్‌కు ఎవరి పట్లనూ ఎటువంటి వ్యక్తిగత సంబంధం లేదు, వారి బలహీనతల్ని ఉపేక్షించి వారిని ప్రేమించడానికి, అలాగే ఎవరిపట్లనూ ఎటువంటి వ్యక్తిగత వైరంలేదు, వారిలో మంచి అన్నది ఉన్నా దాన్ని ఉపేక్షించి వారిని ద్వేషించడానికి. ఈ కారణంగానే సత్యకాముకులయిన ధర్మవేత్తలు సదా ఈ ఆయత్‌ని తమ ఎడల హెచ్చరికగానే భావించారు. ఇబ్ను జరీర్ ఇలా సెలవిచ్చారు:

كان العلماء يقولون ما فى القرآن ايۃ اشدّ توبيخاً للعلماء من هٰذه الآيه ولاَ أخوف عليهم منها

**కుర్ఆన్‌లోని ఏ ఆయత్ అయినా ధర్మవేత్తల ఎడల దీనికన్నా అధికంగా బెదరింపు కాగలది, దీనికన్నా అధికంగా భయంకరమయినది మరేదీ లేదు అని ధర్మవేత్తలు చెప్పేవారు.**

ఈ ఆయత్ గురించి ఇదేమాట హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్, జహ్హాక్, అతా తాబియీ కూడా పలికారు. *(జామిఉల్ బయాన్ ఫీ తఫ్సీరిల్ కుర్ఆన్ : 6/170)*

దైవ సందేశహరులు (స) ఒక సందర్భంలో బనీ ఇస్రాయీల్ ఒక జాతిగా చెరుపునకు గురయిన వైనాన్ని ప్రస్తావిస్తూ తన సముదాయానికి ఇలా హితవు గరిపారు:

كلا و الله لتامرنّ بالمعروف و لتنهونّ عن المنكر و لتاخـذنّ على يد الظالم و لتاطرنـه على الحق اطرا

**ముమ్మాటికీ కాదు, దైవం సాక్షి, మీరు తప్పనిసరిగా మారూఫ్‌ని ఆదేశించండి, తప్పనిసరిగా మున్కర్‌ని వారించండి, దుర్మార్గుని చెయ్యి తప్పనిసరిగా పట్టి ఆపండి, అతన్ని తప్పనిసరిగా సత్యం వైపునకు మరల్చండి.**

*(అబూ దావూద్, కితాబుల్ మలాహిమ్, బాబు అమ్ర్ వన్నహీ)*

## ముస్లిమ్ సముదాయం ప్రారంభ కాలం- ఆదర్శ కాలం

ఈ సముదాయం కొరకు దీని ప్రారంభకాలం అన్ని విధాలా ఓ ఉన్నత ఆదర్శం, ఓ ఉత్తమ ఉదాహరణ. ఎందుకంటే ఆ కాలం, దైవధర్మ సేవ, దాని ఫలితాలు, రెండు విధాలా ఆ సముదాయానికి గర్వపడదగ్గ కాలం. ఆ కాలంలో ఎల్లెడలా దైవభక్తి, సదాచారం నెలకొని ఉండేది. సత్యం, ధర్మం ఆధిక్యత పొంది, మిథ్య అణగిమణిగి ఉండేది. మంచి ఏలుబడిలో ఉండేది, చెడు తలఒగ్గి ఉండేది. చెడుస్థానే మంచి, దౌష్ట్యం స్థానే శుభం పరిపాలనలో ఉండేది. దైవ సందేశహరులు (సల్లల్లాహు అలైహి వసల్లమ్) ధర్మ సందేశ ప్రచార కార్యం ఎంత ఉన్నత స్థాయిలో నిర్వర్తించారో, అలాగే ముస్లిమ్ సముదాయాన్ని ఏవిధంగా సుశిక్షితులుగా తీర్చిదిద్దారో అది కూడా ఆదర్శప్రాయమయినదే. అంతకన్నా ఉత్తమ రీతిలో ఏ వర్గానికయినా శిక్షణ గరపడం అన్నది ఊహించడమూ సాధ్యపడదు. ఆ శుభకాలంలో పరిశుద్ధ ప్రభావాలు, ఆయన(స) తరువాత కూడా సుదీర్ఘ కాలం వరకు దర్శనమిచ్చాయి. ఆ తరువాత క్రమేపి తగ్గుతూపోయాయి. మరోవిధంగా చెప్పాలంటే, దాని శుభశ్రేయాల కాలం దాటిన తరువాత అది చెరుపునకు సాగిందన్నమాట. ప్రవక్త మహనీయులు(స) తన దైవదౌత్య దూరదృష్టి ఆధారంగా ముందుగానే భవిష్యవాణి చేసి ఉన్నారు. ఆయన ఇలా సెలవిచ్చారు :

**خیر کم قرنی ثم الـذین یلونهـم ثم الـذین یلونهم، قال عمـران فلا ادری قـال رسول اللّٰه صلّی اللّٰه علیـه وسلم بعـد قرنـه مرتین او ثلاثـا، ثم یکـون بعـدهم قوم یشهـدون و لاَ یستشهـدون و یخونون و لاَ یؤتمنون و**

**"మీ అత్యుత్తమ కాలం, నేనున్న కాలం. పిదప, ఆ తరువాత వచ్చేవారి కాలం. ఆ తరువాత, ఆ తరువాత వచ్చేవారి కాలం". ఈ హదీసును ఉటంకించిన హజ్రత్ ఇమ్రాన్, ప్రవక్తశ్రీ (స) తన కాలం తరువాత రెండు కాలాలను ప్రస్తావించారో లేదా మూడు కాలాలను ప్రస్తావించారో తనకు సరిగ్గా గుర్తులేదు అన్నారు. ఇంకా ఆయన(స) ఇలా అన్నారు, ఈ కాలాల తరువాత వచ్చే జనులు ముందుకు ఎగబడి సాక్ష్యం పలకడానికి వస్తారు. కాని సాక్ష్యానికి పిలువబడరు. వారు నమ్మకద్రోహం చేస్తారు. అందువల్ల ఎవ్వరూ వారి వద్ద ఏదీ అప్పగింతగా**

ینذرون و لاَ یوفون و یظھرفیھم السمن

పెట్టరు. వారు మొక్కుబడులు మొక్కుకుంటారు కాని వాటిని నెరవేర్చరు. వారిలో 'బలుపు' (Obesity) (సుఖ విలాసాలు) వ్యాపిస్తుంది. *(బుఖారీ, బాబు, ఫజాయిల్ అస్‌హాబున్నబీ(స), ముస్లిమ్, కితాబుల్ ఫజాయిల్, బాబు ఫజ్ల్ అస్‌హాబ్, సుమ్మల్లజీన యలూన హుమ్... నుండి వల్లఫ్‌జుల్ ముస్లిమ్ వరకు)*

ఇంతకు, సముదాయంలోని తొలి జనుల ఈ ప్రశంస అకారణంగా జరగలేదు. వారు ప్రశంసకు అర్హులవడానికి కారణం, వారు ధర్మమార్గంలో ఘనమయిన త్యాగాలు చేశారు. సముదాయం సంస్కరణ పట్ల, దాని శ్రేయోభిలాష, హితైష్ణత పట్ల ఎన్నడూ ఏమరుపాటు వహించలేదు. ఒకవేళ ఈ సద్గుణాలు తరువాతి కాలంలోనూ ఎప్పుడు అగుపించినా నిస్సంకోచంగా ఆ కాలం కూడా ప్రశంసనీయంగానే రూపొందగలదు. అల్లామా కుర్తుబీ ఇలా అన్నారు :

ان قرنه انما فضل لاَنھم کانوا غرباء فی ایمانھم لکثرۃ الکفار و صبرھم علی اذاھم و تمسکھم بدینھم وان اواخرھٰذہ الاُمة اذا اقاموا الدین وتمسکوا به و صبروا علیٰ طاعة ربھم فی حین ظھور الشر و الفسق و الھرج و المعاصی و الکبائر کانوا عند ذٰلک ایضًا غرباء و زکت

ఆయన(స) కాలపు జనులకు గొప్పదనం ఇవ్వ దానికి కారణం వారు తమ విశ్వాసం రీత్యా సమాజంలో అపరిచయస్థులుగా ఉండేవారు. తిరస్కారులు అధికంగా ఉండేవారు. వారు తిరస్కారుల బాధలకు తట్టుకుని ఓర్చుకున్నారు, తమ ధర్మం పైన నిలకడ కనబరిచారు, ఈ సముదాయంలో చివరి జనులు సయితం ఇప్పుడు, చెడుగు, పాపం, ధిక్కారం, ఉపద్రవం వంటి పాతకాలు, ఘోరమయిన అపరాధాలు ముమ్మరం అయి పోయిన కాలంలోనూ ధర్మాన్ని నిలబెట్టి నట్లయితే దాన్ని పటిష్టంగా పట్టుకుని సుస్థిరంగా నిలిచినట్లయితే, అల్లాహ్ దాస్యంపైన నిలకడ చూపినట్లయితే వీరున్నూ తమ వాతావరణంలో అపరిచయస్థులుగా రూపొందుతారు, వీరికి పూర్వపు వారి ఆచరణలుఉన్నతమయినవిగా,

**పరిశుద్ధమయినవిగా మారిపోయినట్లే వీరి ఆచరణలు సయితం ఉన్నతమయినవిగా, పరిశుద్ధమయినవిగా మారిపోతాయి.**

اعمالهم فی ذٰلک الوقت کما زکت اعمال اوائلهم

*(అల్ జామిఉల్ అహ్కాముల్ కుర్ఆన్, సం. 2, భాగం 4, పు. 111)*

## ధర్మం అపరిచితమయినది తొలి కాలంలో, కడపటి కాలంలోనూ

ప్రవక్త మహనీయులు(స) చెప్పిన దాని ప్రకారం, ధర్మం ఏవిధంగా దాని ప్రారంభంలో అపరిచితమయినదిగా ఉండేదో అదేవిధంగా తరువాతి కాలంలోనూ అపరిచితమయినదిగా మారుతుంది. అటువంటి పరిస్థితుల్లో ధర్మంపైన నిలకడ చూపినవారు, దాని కారణంగా తమ వాతావరణంలో అపరిచయస్థులుగా మారిపోయే వారు శుభప్రదమయినవారు:

**ఇస్లామ్ ప్రారంభం అపరిచిత స్థితిలో జరి గింది. తిరిగి అది అదే అపరిచితావస్థకు ప్రారంభం లానే మరలిపోతుంది, కాగా అపరిచయస్థులకు శుభవార్త!**

بدأ الاِسلام غريبا و سيعود کمـا بدأ غريبًا فطوبا للغرباء

*(ముస్లిమ్, కితాబుల్ ఈమాన్, బాబు, బయాను ఇన్నల్ ఇస్లామ్ బదఅ గరీబన్...)*

## ధర్మం అపరిచితావస్థ ...

తరువాతి కాలాలలో ధర్మం అపరిచితమవడమంటే భావం, ప్రవక్త ప్రభవన కాలంలో ఏవిధంగానయితే అజ్ఞానం ప్రబలి ఉండేదో, తిరిగి అజ్ఞానం ప్రబలిపోతుంది. ఎల్లెడలా మిథ్యా ఏలుబడి సాగుతూ ఉంటుంది. బుద్ధీజ్ఞానాలను తప్పుడు భావాలు, ఆలోచనలు ఆక్రమించుకుంటాయి, సరయిన ఆలోచనలు గలవారు, దాన్ని అందజేసే వారు తగ్గిపోతారు. జనులు వారిని ఇష్టపడరు. దట్టమయిన జనావాసాలు దైవప్రస్తావనలు, ఆయన సంస్మరణలు లేకుండాపోతాయి. దైవధర్మాన్ని అమలుపరిచేవారు భూతలాన మరీ కొద్దిమందే మిగులుతారు. పెద్దపెద్ద జనావాసాల్లో ధర్మమార్గదర్శకత్వం కోరేవారు తగ్గుముఖం పడతారు. మానవులు ధర్మం పట్ల ఏమరుపాటుకు, అలక్ష్యానికి గురవుతారు. కాగా, ప్రవక్త మహనీయుల్ని అడగటం జరిగింది, మీరు ఏ అపరిచయస్థులకు శుభవార్తనిస్తున్నారో వారెవరు అని. అప్పుడాయన ఇలా పలికారు:

**اناس صالحون فی اناس سوء کثیر من یعصیهم اکثر ممن یطیعهم**

**కొందరు సదాచార సంపన్నులయినవారు, చాలా మంది దుష్టులయిన వారి మధ్యన, వారిని అనుసరించేవారికన్నా వారికి అవిధేయులయిన వారే అధికంగా ఉంటారు.**

*(ముస్నద్ అహ్మద్ : 2/ 370)*

అంటే వారే కొందరు సజ్జనులు, దేవుని దాసులు, అంధకారంలో దివ్వెలు వెలిగించేవారు. వారి ద్వారానే ప్రపంచంలో సంస్కరణా కార్యం నిర్వర్తించబడుతుంది. వీరు మిథ్య బలోపేతమవడం పట్ల ఆందోళన చెందరు, దాని స్థానే సత్యాన్ని శక్తిమంతం చేసే కృషిలో నిమగ్నులవుతారు. మీరు వారిని దైవప్రవక్తల వారసులన్నా తప్పులేదు. ఎందుకంటే వారు చేసే పని సరిగ్గా ప్రవక్తలు చేసే పని వంటిదే. దారి తప్పిన మానవులకు ప్రవక్తల ద్వారా మార్గబోధన ప్రాప్తమయినట్లే వారి ద్వారాను మార్గబోధన ప్రాప్తమవు తుంది. ఈ కారణంగానే కొన్ని హదీసుల్లో 'గురబా' (ధర్మమార్గంలో అపరిచితులయిపోయినవారు) అన్న పదానికి వివరణగా ఇలా చెప్పడం జరిగింది.

**الذین یصلحون اذا افسد الناس**

**జనం చెరపు చేసివేసిన తరువాత సంస్కరణా కార్యం నిర్వహించేవారు :** ***(ముస్నద్ అహ్మద్: 5/25)***

ప్రవక్త మహనీయులు (స) ఇలా వక్కాణించారు: ఈ సంస్కర్తలు తమ పరిసరాల్లో అపరిచితులుగా ఉంటారు. జనులకు వారి సిద్ధాంతాల్లో ఎటువంటి ఆకర్షణ కనిపించదు. వారి మాటలు ప్రపంచ ప్రజలకు వింతయినవిగా తోస్తాయి. వారి ఆచరణలు, తీరుతెన్నులు కొత్తవిగా కనిపిస్తాయి. వారి దారి ఒంటరి దారిగానే రూపొందుతుంది. ఎవడూ వారికి తోడూ నీడగా సహాయకునిగా రాడు. అయినప్పటికీ వారు జీవితపు చివరి ఘడియల వరకు తమ పయనం కొనసాగిస్తూనే ఉంటారు, ఇదే వారి అసలు సాఫల్యం, ఘనమయిన సాఫల్యం.

అల్లామా ఇబ్ను అసీర్ పై హదీసు వివరణలో ఇలా నుడివారు :

**انه ( ای اسلام ) کان فی اول امره کا لغریب الوحید الذی لاَ اهل له عنده لقلة المسلمین**

**ఇస్లామ్ ప్రారంభంలో ముస్లిముల అల్పసంఖ్య మూలంగా, ఓ ఒంటరి అపరిచితునిలా, తనతోపాటు తన ఇంటివారలూ లేని దానిగా, ఉండేది. అది తిరిగి అపరిచితమయినదిగా,**

యومئذ و سیعود غریبا کما کان ای یقلّ المسلمون فی اٰخر الزمان فیصیرون کا لغــرباء فطوبیٰ للغــربــاء ای الجنــة لِاُولٰئک المسلمین الذین کانوا فی اول الاسلام و یکونون فی اٰخره وانما خصّهم بها لصبرهم علی اذی الکفار اولاً و آخرًا و لزومهم دین الاسلام

ప్రారంభంలానే అయిపోతుంది. అంటే చివరి కాలంలో ముస్లిములు అల్పసంఖ్యలోకి వచ్చేస్తారు. ఈవిధంగా (అధికసంఖ్య మధ్యన) అపరిచితులుగా రూపొందుతారు. 'కాగా, ఆ అపరిచితులకు శుభవార్త' అంటే ఇస్లామ్ ప్రారంభ కాలంలో ఉన్న ముస్లిములకు, దాని చివరి కాలంలో ఉండేవారికీ స్వర్గం ప్రాప్త మవడం ఖాయమన్నమాట. వారికి ప్రత్యేకంగా స్వర్గశుభవార్తనివ్వడానికి కారణం ఏమిటంటే, వారు ప్రారంభకాలంలోనూ, అంతిమ కాలం లోనూ సత్య తిరస్కారుల పీడనల పట్ల సహనం వహించారు. ఇస్లామ్ ధర్మాన్ని స్థిరంగా అవలం బిస్తూ ఉండేవారు.

*(అన్నిహాయ ఫీగరీబిల్ హదీస్ : 3/ 52, మూలపదం గరబ)*

ధర్మానికి చెందిన ఈ అపరిచిత ప్రయాణీకులకు, సాధారణంగా సత్యకాముకు డయిన ప్రతి వ్యక్తికీ ఎదురయ్యే కష్టాలన్నీ ఎదురవుతాయి. వారిని బాధపెట్టడం జరుగుతుంది, వారిపైన ఎత్తిపొడుపుల వర్షమూ కురుస్తుంది, వారి సౌలభ్యాలూ సుఖాలూ లాక్కోబడతాయి. వారి ఎడల పువ్వులు సయితం ముళ్ళల్లా మారిపోతూ ఉంటాయి. సహ రక్తపు బంధువులు సయితం ప్రాణ శత్రువులుగా రూపొందుతారు. వారు తమ స్వదేశంలోనే అపరిచయస్థులుగా మారిపోతారు. వారు పీడనావస్థలో ఇల్లూ వాకిలీ వదిలిపోవలసి రావడమూ జరగవచ్చు. కాగా ఓ హదీసులో 'గురబా' (అపరిచితులు) అన్న పదానికి వివరణ ఈ పదాలలోనూ వచ్చింది :

النّزاع من القبائل

**'తెగల నుండి వెళ్ళిపోయేవారు'**

***(ముస్నద్ అహ్మద్ : 1/ 658, ఇబ్నుమాజా, కితాబుల్ ఫితన్, బాబు బదఉల్ఇస్లామ గరీబన్)***

హదీసువేత్తలు దీనిభావం ముహాజిరీన్ (వలసపోయేవారు) అని చెప్పారు. ఈ ఒక్క పదం వల్ల అపరిచయావస్థ, పీడనావస్థ రూపచిత్రణ సంపూర్ణంగా ముందుకు వచ్చేస్తుంది. దీన్నిబట్టి ఊహించుకోవచ్చు అది ఎంత కఠినమయిన మార్గమో,

సత్యపథగాములు ప్రారంభంలో గతించినవారు సాగినదీ, ఆపైన అంతిమ దిశలో తరువాతి వారు సాగనున్నదీను!

## అపరిచితావస్థ విశ్వసించేవారి మధ్యన...

ధర్మం అపరిచితావస్థకు లోనవడం అన్నదానికి ఒక రూపం, స్వయాన ధర్మావలంబీకులు ధర్మాన్ని అవలంబించకుండా పోవడం. మిథ్య జనింపజేసే వెల్లువలో దైవ తిరస్కారులు కొట్టుకుపోయేలా వీరున్నూ కొట్టుకుపోవడం. ఉపద్రవ పరీక్షల్లో ఒక విశ్వాసికి స్థిరత్వం ప్రసాదించే విశ్వాస ప్రధానమయినశక్తి వారిలో ఏమాత్రం మిగులదు, ధర్మం వెలుగులో తమ సమస్యల్ని గురించి యోచించే ఆలోచనాపరులు, జ్ఞాన సంపన్నులయినవారు వారిలో తగ్గుముఖం పడతారు. ఏ చర్యనయినా తీసుకునే ముందు ధార్మిక దృక్కోణం తెలుసుకుని నడచుకునే సదాచారులయిన ప్రముఖులూ వారిలో క్షీణించిపోవడం మొదలవుతుంది. మరో మాటలో చెప్పాలంటే ధర్మం, ధర్మం అని చెప్పేవారు అధికమయినా నిజధర్మ పథగాములు, నిజధర్మ సిద్ధాంతపరులు కొందరే ఉంటారు. ఇటువంటి పరిస్థితుల్లో స్వయంగా ధర్మావలంబీకుల్లోనే నిజమయిన ధర్మ సేవకులు, దాని నిజమయిన విశ్వసనీయులు అపరిచితులయిపోతారు. కాని దైవం, దైవప్రవక్తల దృష్టిలో ఈ అపరిచితావస్థయే చాలా శుభప్రదమయింది. ప్రవక్త మహనీయుల (స) సూక్తులలో ఈ అపరిచితావస్థ ప్రస్తావన కూడా ఉంది. ఆయన్ని (స) కొందరు అడిగారు, గురబా (అపరిచితులు) అంటే ఎవరు? అని. ఆయన(స) దానికి ఇలా సమాధానం పలికారు :

الذین یزیدون اذانقص الناس

**వారు (ఆలోచన ఆచరణల రీత్యా) బలోపేతులయి ఉంటారు, కాని జనం (ఈ కోణంలో చూస్తే) తక్కువగా ఉంటారు.**

*(రవాహు అహ్మద్ (మదారిజుస్సాలికీన్: 3/ 122)*

భావమేమిటంటే అపరిచితులు ఎటువంటి వారంటే భయభక్తులు, ధర్మనిష్ఠలో ముందంజగా ఉంటారు. అదే సమయాన ఇతర జనులు ఈ విషయాల రీత్యా వెనుకబడి ఉంటారు.

ఆ పైన ఆయన(స) ఇలా కూడా సెలవిచ్చారు; వారు స్వయంగా సంస్కారవంతులవడమేకాక సముదాయం సంస్కరణ విధినీ నిర్వర్తిస్తూ ఉంటారు:

الذين يصلحون مافسد الناس من سنتي

**జనులు నా సంప్రదాయాల్లో ఏ చెడుగుల నయితే సృష్టించి ఉంటారో వాటినీ వారు సంస్కరిస్తూ ఉంటారు.**

*(తిర్మిజీ, కితాబుల్ ఈమాన్, బాబు, మాజాఅ ఇన్నల్ ఇస్లామ బదఅ గరీబన్ వ సయఊదు గరీబన్)*

ఇదే ఉల్లేఖనం ఈ పదాలలోనూ మరోచోటా ఉంది :

الذين يحيون سنتي و يعلّمونها الناس

**ఈ జనులు, నా సంప్రదాయాలను పునరుజ్జీవింపజేస్తారు, జనులకు వాటిని బోధిస్తారు కూడా.** (మదారిజుస్సాలికీన్ : 3/ 112)

కొందరు హదీసు వేత్తలు హదీసును ఈ కోణంలోనే విశదీకరించారు. ఇమామ్ ఔజాయీ ఇలా సెలవిచ్చారు :

اما انه ما يذهب اهل الإسلام و لكن يذهب اهل السنة حتى ما يبقٰى فى البلد منهم الاّ رجل واحد

**నిస్సంకోచంగా ఇస్లామ్ అనుయాయులు అంతమయిపోరు, నిజానికి ప్రవక్త సంప్రదాయాన్ని అనుసరించేవారు మిగులరు. కడకు ఓ పట్టణం మొత్తాన ప్రవక్త సంప్రదాయాన్ని అనుసరించేవాడు ఒక్కడే మిగిలి ఉంటాడు.**

*(కషఫుల్ కర్బ ఫీ వస్ఫ్ హాల్ అహ్లుల్ గుర్బ, ఇబ్ను రజబ్ హన్బలీ, పు.10)*

ఇమామ్ ఇబ్ను కయ్యిమ్, 'బదఅల్ ఇస్లామ గరీబన్' అన్న హదీసు విశదీకరణలో తన కాలపు పరిస్థితిని వివరించారు. సముదాయంలో చెరుపు, సున్నత్ విధానాల పట్ల వైముఖ్యం అన్నది సర్వసామాన్యమయిపోయింది. అన్నివైపులా బిద్అత్‌లు, షరీఅత్‌కు విరుద్ధమయిన పోకడలు కానవస్తున్నాయి, సమాజంలోనూ భ్రష్టులయిన వర్గాలు పెత్తనం చెలాయిస్తున్నాయి. వీరికి భిన్నంగా దైవ సందేశహరుల విధానాన్ని అనుసరించేవారు అపరిచితులయిపోయారు. ఆయన ఇంకా ఇలా అన్నారు:

"ఇస్లామ్ అనుయాయులు సామాన్య జనుల్లో అపరిచితులయ్యారు; నిజ విశ్వాసులు ఇస్లామ్ అనుయాయులయిన వారిలో అపరిచితులయ్యారు; విజ్ఞులయినవారు విశ్వాసులయినవారిలో అపరిచితు

లయ్యారు; సున్నత్, మనోకాంక్షలు బిద్అత్‌ల మధ్య విచక్షణ చూడగలిగేవారు విశ్వాసులలో అపరిచితులయ్యారు, సున్నత్‌ని అవలంబించేవారు బిద్అత్‌ను పాటించేవారిలో అపరిచితులయ్యారు, సున్నత్ వైపునకు పిలుపునిచ్చేవారు, విరోధుల బాధలకు సహనం వహించే వారయితే వీరందరికంటే అధికంగా అపరిచితులయ్యారు. కాని వాస్తవానికి వీరే దైవభక్తులు. నిజానికి వీరంటే ఎటువంటి అపరిచితావస్థ లేదు. వీరి అపరిచితావస్థ ఏదన్నా ఉంటే అది కేవలం అధిక సంఖ్య గలవారి మధ్యలోనే- వారిని గురించి అల్లాహ్ సెలవిచ్చి ఉన్నాడు- భువిలోని చాలామందిని నీవు అనుసరించావంటే వారు నిన్ను దైవమార్గం నుండి మరలించివేస్తారు. వీరు అధికసంఖ్యలో ఉన్నప్పటికీ వీరు అల్లాహ్, ఆయన సందేశహరుడు, ఆయన ధర్మం పట్ల పూర్తిగా అపరిచితులు. వీరి అపరిచితావస్థ చాలా భయానకమయింది- వీరు ఎంతో ఖ్యాతి గడించినవారు, ప్రసిద్ధమయినవారూ, వీరిని గురించి జనులు ఎంతో భక్తిప్రపత్తులతో సంజ్ఞ చేస్తూ ప్రస్తావించుకుంటూ ఉన్నప్పటికీ!"

కొన్ని పంక్తుల తరువాత ఇంకా ఇలా అన్నారు :

"ఒక అపరిచితావస్థ ఏమో దైవభక్తులది, దైవ సందేశహరుల సంప్రదాయాల అనుయాయులది, అది సామాన్య జనులకు వారి పట్ల ఉండేది. ఈ అపరిచితావస్థ ఏ మానవులకు సంభవిస్తుందో వారిని ప్రవక్త మహనీయులు ప్రశంసించారు. ... ఈ అపరిచితావస్థ (లోకమంతా వ్యాపించనవసరముండదు) ఓ చోట ఏర్పడి మరోచోట ఏర్పడకనూ పోవచ్చు. ఒక సమయాన ఏర్పడి మరో సమయాన ఏర్పడకనూపోవచ్చు. ఒక జాతిలో ఏర్పడి మరో జాతిలో ఏర్పడకపోవచ్చు. ఏది ఏమయినప్పటికీ ఈ అపరిచితులు దైవభక్తులు. ఎందుకంటే వీరు అల్లాహ్ తప్ప మరెవరి అండనా శరణు జొచ్చలేదు. మరి దైవసందేశహరులు తప్ప మరెవరితోనూ తమ సంబంధాన్ని ఏర్పరచుకోలేదు, ఇంకా ప్రవక్త్రశ్రీ (స) బోధనలు తప్ప మరెవరి బోధనల వైపునకు ప్రపంచానికి పిలువనూ లేదు."

ఇదే చర్చను కొనసాగిస్తూ ఇంకా ఇలా అన్నారు :

"మహనీయ ముహమ్మద్(స), ఆయన సహచరమాన్యులు(రజి) స్థయిర్యం కనబరచిన ఇస్లామ్ దాని ప్రారంభ కాలం కన్నా నేడు అధికంగా అపరిచితమయినదిగా ఉంది. నిజం ఏమిటంటే దాని చిహ్నాలు, దాని బాహ్య ఆచార వ్యవహారాలు, సుప్రసిద్ధంగానూ సుపరిచితంగానూ ఉన్నాయి. అయినా యదార్థమయిన ఇస్లామ్ మరీ అనామకంగా, దాన్ని ఆచరించే వారు మరీ అపరిచితులుగానే ఉన్నారు. మీరే ఊహించుకోండి, తమకు వేర్వేరుగా అనుయాయులున్న, రాజ్యబలం, హెూదాలు, అధికారం కూడా ఉన్న డెబ్బయి రెండు (72)★ ముఠాల మధ్య ఒక స్వల్పమయిన వర్గం ఏవిధంగా అపరిచితా వస్థకు లోనయి ఉండదు? వీరి కార్యకలాపాలన్నీ ప్రవక్తశ్రీ(స) బోధనల వ్యతిరేకతా ఆధారభూతమయినవే. కారణం, ప్రవక్త(స) బోధనలు వారి మనోకాంక్షలకు విరుద్ధమయినవి, వారి రుచులకు, ధర్మం పట్ల వారి అనుమానాలు, కుశంకలకు విరుద్ధమయినవి. ఆ అనుమానాలు, ఆ కుశంకలే వారి జ్ఞానానికీ ప్రతిభకూ చివరి మెట్లు. కాబట్టి ప్రవక్త(స) అనుయాయిగా ఆయన చూపెట్టిన దారిలో అల్లాహ్ వైపున పయనించే విశ్వాసి- తమ ఆశలకు, కోర్కెలకు దాసులయి వాటినే అనుసరిస్తూ, వారిలో ప్రతి ఒక్కడూ తన అభిప్రాయం పట్ల గర్వం అనుభవించేవారి మధ్య- ఎందుకు అపరిచితుడు కాడు? అపరిచితుడు కాకపోతే మరేమవుతాడు?

ఇదే సందర్భంలో ఇంకా ఇలా అన్నారు :

అల్లాహ్ ఏ విశ్వాసికి ధర్మజ్ఞానం, తన సందేశహరుని సంప్రదాయం పట్ల, తన గ్రంథజ్ఞానం పట్ల అవగాహన ప్రసాదించాడో, అతనికి వీటితో పాటు జనం ఏ మనోభిలాషలు, ధర్మంలో ఏ కొత్త పోకడలు, ఏ

---

★ *72. ముఠాలన్నది ఒక హదీసు పట్ల సంకేతం. అందులో ప్రవక్తశ్రీ(స) ఇలా సెలవిచ్చారు, "బనీఇస్రాయీల్ 72 ముఠాలుగా చీలిపోయింది. నా సముదాయం డెబ్బయి మూడుగా చీలిపోతుంది. వీరంతా నరకానికి పోయేవారే, కేవలం ఒక్క వర్గం మినహా; అది నా దారిన, నా సహచరుల దారిన నడిచేది". (తిర్మిజీ)*

మార్గవిహీనతలకు లోనయి ఉన్నారో దాన్నీ చూపించాడో, ఇంకా వారు దైవ సందేశహరులు(స) ఆయన సహచరులు అనుసరించిన రుజుమార్గం నుంచి ఎలా తప్పిపోయారో అదీ తెలిపాడో. అతను ఆ సన్మార్గాన్ని అనుసరించదలిస్తే అజ్ఞానులు, ధర్మంలో కొత్త పోకడలు తీసిన వారు, చేసే ఖండనల్ని, వారు చేసే ఎత్తిపొడుపులు, వెటకారాలను, వారి ఏవగింపుల్ని, వారి తప్పులెన్నడాన్ని, అన్నింటినీ సహనంతో ఓర్చుకోవలసి ఉంటుంది. వారు జనుల్లో అతని పట్ల విద్వేషం రెచ్చగొడతారు, అతని పట్ల భయం గొలుపుతారు, తన నాయకుడు (సల్లల్లాహు అలైహి వ సల్లమ్) పట్ల తిరస్కారుల ప్రవర్తన ఏవిధంగా ఉండేదో సరిగ్గా అదేవిధంగా వారు అతని ఎడల వ్యవహరిస్తారు. అతను వారికి రుజుమార్గం వైపునకు పిలుపునిచ్చి నట్లయితే, వారి వైఖరిని విమర్శించినట్లయితే వారి మధ్య ప్రళయమే నెలకొన్నట్లు వ్యవహరిస్తారు, అతని పట్ల అన్ని విధాల కుతంత్రాలు పన్నుతారు. అతని కొరకు వంచనాజాలం పరచిపెడతారు. అతనిపైకి సైన్యాలు తీసుకుని దౌడు తీస్తారు, అతను తన ధర్మం కారణంగా వారి మధ్యన అపరిచితునిగా రూపొందుతాడు. ఎందుకంటే వారి ధర్మం రూపుమాసి ఉంటుంది. అతను సున్నత్ అనుసరణ కారణంగా అపరిచితుడయిపోతాడు. ఎందుకంటే వారు కొత్త పోకడలను హత్తుకుని ఉంటారు. అతను తన సరయిన విశ్వాసం కారణంగా అపరిచితుడయి పోతాడు, ఎందుకంటే వారి నమ్మకాలు తప్పయినవి, మిథ్యా విశ్వాసాలయి ఉంటాయి. అతను తన నమాజులలోనూ అపరిచితు డయిపోతాడు, ఎందుకంటే వారి నమాజులు చెల్లని నమాజులయి ఉంటాయి. అతను తన విధానాలలోనూ అపరిచితుడయి ఉంటాడు, ఎందుకంటే వారు తప్పుడు దారుల్లో నడుస్తూ ఉంటారు. అతను తన బుద్ధిరీత్యాను అపరిచితుడయి ఉంటాడు, ఎందుకంటే అతనేమో దైవ సందేశహరుని వైపునకు చెందిన వాడయి వుండగా వారు తమ అబద్ధపు నాయకులకు చెందినవారయి ఉంటారు. అతను తన సామాజిక వ్యవహారంలో అపరిచితుడయి ఉంటాడు, ఎందుకంటే అతను, వారి అభిలాషలకు వ్యతిరేకంగా వారి పట్ల వ్యవహరిస్తాడు.

ఒక్కమాటలో, అతను తన ఇహపర వ్యవహారాలన్నింటిలోనూ పూర్తిగా ఒక్కగానొక్కడు, అపరిచితు డయి, తనకు ఏ సహాయకుడు, తోడూ పొందడు. అతను అజ్ఞానుల మధ్య జ్ఞాని, బిద్అతీల మధ్య సున్నత్ అనుయాయి, మనోవాంఛలు, బిద్అత్‌ల వైపునకు పిలిచేవారి మధ్య దైవం, దైవప్రవక్త వైపునకు పిలిచేవాడయి ఉంటాడు. అతను మారూఫ్, మున్కర్‌గాను, మున్కర్ మారూఫ్ గాను మారిపోయిన వారి మధ్య **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధిని నిర్వర్తించే వాడయి ఉంటాడు.

*(మదారి జుస్సా లికీన్: 3/ 112- 117)*

దీన్నిబట్టి స్పష్టంగా తెల్లమయ్యేదేమిటంటే, ధర్మం అపరిచితావస్థకు లోనయ్యే ఇదీ ఒక కోణం అన్నమాట. ధర్మం దాన్ని నమ్మే వారి మధ్యనే అపరిచితావస్థకు లోనవుతుంది. ప్రవక్త మహనీయులు(స) తన సముదాయానికి చూపిన దారి నుండి అది తొలిగిపోతుంది. ఇటువంటి పరిస్థితుల్లో ఎవరయితే ఆయన(స) సంప్రదాయం (సున్నత్)పైన స్థిరంగా ఉంటూ దాన్ని పునరుజ్జీవింపజేసే కృషిలో నిమగ్నులయి ఉంటారో నిశ్చయంగా వారు ఎంతో అదృష్టవంతులు. అయితే ఇక్కడ ఓ మాట మరువకూడదు. సున్నత్ లేదా సంప్రదాయం అంటే ఆయన(స) జీవితంలోని ఏదో ఒక ప్రత్యేక కోణం కాదు, ఆయన (స) అనుసరించిన సంపూర్ణ జీవన విధానం అన్న మాట. మరో మాటలో చెప్పాలంటే ఆయన ఏ విశ్వాసాల, ఆచరణల వ్యవస్థ వైపునకు ప్రపంచానికి పిలుపునిచ్చారో ఆ సంపూర్ణ వ్యవస్థకు 'సున్నత్' లేదా సంప్రదాయం అన్న పదం వర్తిస్తుంది, అన్వయిస్తుంది. మనిషి నిజభావంలో ప్రవక్త సంప్రదాయానికి, సున్నత్‌కి అనుయాయి కావడం అంటే అతను ఈ సంపూర్ణ వ్యవస్థను అనుసరించి నప్పుడే కాగలడు. ఇందులో నమ్మకాలూ ఉన్నాయి, ఆచరణలూ చేరి ఉన్నాయి. ఆయన(స) బోధనల పట్ల విశ్వాసం కలిగి ఉండటం అంటే అది సందేహాలు, సంశయాలు ఏమాత్రం లేకుండా ఉండాలి. వాటి పట్ల ఆచరణ అంటే వాటిలో ఎక్కడా మనోకాంక్షల అభిలాషల మిశ్రమం ఏమాత్రం జరగరాదు. ఇబ్ను రజబ్ హన్బలీ ఇలా అంటున్నారు :

اما السنة الكاملة فهى الطريقة السالمة من الشبهات و الشهوات

**పరిపూర్ణ సున్నత్ (ప్రవక్త సంప్రదాయం) అన్నది ఓ ప్రత్యేకమయిన త్రోవకు పేరు. అది (విశ్వాసాల రీత్యా) సందేహాలకు, (ఆచరణల**

كما قال الحسن و يونس بن عبيد وسفيان و الفضيل وغير هم

రీత్యా) అభిలాషల జోక్యానికీ దూరంగా సురక్షితంగా ఉండాలి, ఈ విధంగా ఉండా లనే హసన్ బస్రీ, యూనుస్ బిన్ ఉబైద్, సుఫ్యాన్ సౌరీ, ఫుజైల్ బిన్ అయాజ్ (రహ్మాహు ముల్లాహ్) ప్రభృతులు అన్నారు.

*(కషఫుల్ కరబ ఫీ వస్ఫి హాల్ అహ్లుల్ గురబా : పు.12)*

## ఉపద్రవ పరీక్ష కాలంలో సున్నత్ అనుసరణ

ధర్మం అపరిచితావస్థ కాలాన్ని హదీసుల్లో ఉపద్రవ పరీక్ష (ఫితన్) కాలంగా పేర్కొనడం జరిగింది. ఆ కాలంలో చెలరేగే ఉపద్రవాలు బలోపేతమయినవి. కొన్ని సందర్భాలలో చాలా సాహసవంతులయినవారు, ఎంతో చిత్తశుద్ధితో వ్యవహరించేవారు సయితం వాటి నుంచి పూర్తిగా సురక్షితమయి ఉండలేకపోతారు. అవి గాలి దుమా రాల్లా తుఫానుల్లా మొదలవుతాయి, విశ్వాసాలు, ఆచరణల కట్టడాన్ని కుదిపివేస్తాయి. ఈ సముదాయంలో అనేక పర్యాయాలు పరీక్షా ఉపద్రవ కాలాలు తారసిల్లాయి. దీని ధర్మం, విశ్వాసాలను పరీక్షిస్తూ వచ్చాయి. నేడు కూడా అదొక పరీక్ష ఉపద్రవ కాలంలో ఉంది. ఇందులో దైవ నిరాకరణ, ధర్మనిరాకరణలు దాని సిద్ధాంతాలను ఆలోచనా విధానాలను, నైతిక వ్యవస్థను, ఆరాధనా విధానాన్నీ సంస్కృతీ సభ్యతల్ని, సామాజిక, నాగరిక, రాజకీయ వ్యవస్థల్ని పరీక్షకు గురిచేసి పెట్టింది. ఈ పరీక్షలో నెగ్గే విధానం మునుపయినా నేడయినా ఒక్కటే; ప్రవక్త మహనీయులు(స), ఆయన సహచరుల (రజి) పాదచిహ్నాలున్న మార్గాన సుస్థిరంగా ముందుకు సాగడం. ఓసారి ఆయన(స) ఓ ప్రసంగంలో ఇలా అన్నారు :

من يعش منكم بعدى فسيرى اختلافا كثيرا فعليكم بسنتى و سنة الخلفاء الراشدين المهديين تمسكو بها و عضوا عليها بالنواجذ واياكم ومحدثات الأمور فان كل محدثة بدعة

మీలో ఎవరయితే నా తరువాత సజీవంగా ఉంటారో వారు ఎంతో భిన్నత్వాన్ని గమని స్తారు. అప్పుడు మీరు నా సంప్రదాయాన్ని (సున్నత్‌ని), సన్మార్గగాములయిన ఖలీఫాల సున్నత్‌ని అనుసరించడం తప్పనిసరిగా నిర్ణయించుకోవాలి. దాని మీద సుస్థిరంగా, పటిష్టంగా నిలువాలి, పళ్లతో గట్టిగా పట్టు కోవాలి; ధర్మంలో కల్పించబడే కొత్త విధానాలకు దూరంగా మెలగాలి, ఎందు

وكل بدعة ضلالة

**కంటే (ధర్మంలో) కొత్త విషయం ఏదయినా బిద్అత్ అవుతుంది; ప్రతి బిద్అత్ కూడా మార్గవిహీనతే!**

*(దీన్ని ఉల్లేఖించినవారు : అహ్మద్, అబూ దావూద్, తిర్మిజీ, ఇబ్నుమాజా) మిష్కాతుల్ మసాబీహ్, కితాబుల్ ఈమాన్, బాబు ఫిల్ ఈ'తిసామ్ బిల్ కితాబ్ వ స్సున్నహ్)*

ప్రవక్త మహనీయులు(స) ఫిత్నా కాలం (ఉపద్రవ పరీక్షకాలం)లో బిద్అత్ నుండి దూరంగా ఉంటూ సున్నత్ని స్థిరంగా అనుసరిస్తూ దాన్ని పునరుజ్జీవింప జేయడం గొప్ప మహత్పూర్వకమయిందని చాటారు. ఇక్కడ కేవలం రెండు ఉల్లేఖ నాలను ఉటంకిస్తున్నాము. ఇవి వాటి విషయం రీత్యా చాలా విశదంగా ఉన్నాయి:

من أحيى سنة من سنتى قد اميتت بعدى فان له من الأجر مثل اجر من عمل بها من الناس لاَ ينقص من اجور الناس شيئا

**ఎవరయితే నా సంప్రదాయాలలో, నా తరు వాత అంతమయి పోయిన ఏదయినా సంప్రదాయాన్ని పునరుజ్జీవింపజేస్తాడో అతనికి దాన్ని ఆచరించిన వారందరి పుణ్యఫలానికి సమానమయిన పుణ్యఫలం ప్రాప్తమవుతుంది. వారి పుణ్యఫలంలో ఏ మాత్రం తగ్గుదల చెయ్యడమూ జరగదు.**

*(ఇబ్నుమాజా, ఉపోద్ఘాతం; తిర్మిజీ, కితాబుల్ ఇల్మ్)*

المتمسك بسنتى عند فساد امتى له اجر شهيد

**నా సముదాయంలో చెడు దారి చేసుకున్నప్పుడు నా సున్నత్ని (సంప్రదాయాన్ని) పట్టుకుని అనుసరించిన వానికి ఒక అమరగతి పొందిన వానికి సమానమయిన పుణ్యఫలం ప్రాప్తమవు తుంది.** (అల్ తబరానీ)

ఇదే ఉల్లేఖనం ఈ పదాలలోనూ వచ్చింది:

من تمسک بسنتى عند فساد امتى فله اجر مائة شهيد

**నా సముదాయంలో చెడు దారి చేసుకున్నప్పుడు నా సంప్రదాయాన్ని పట్టుకుని స్థిరంగా అనుస**

రించిన వానికి వంద షహీదుల పుణ్యఫలం ప్రాప్తమవుతుంది.

*(బైహకీ, అత్ తర్గీబ్ వత్ తర్హీబ్ : 1/ 41)*

ఈ ఉల్లేఖనాల ద్వారా సున్నత్ (ప్రవక్త సంప్రదాయం) అనుసరణ పట్ల గల ప్రాముఖ్యత వ్యక్తమవడంతోపాటు హదీసుల్లో బిద్అత్‌ని అతి తీవ్రంగా ఖండించడానికి కారణమేమిటో, దాన్ని మార్గవిహీనత అనీ, దారి తప్పడమనీ ఎందుకు పేర్కొనడం జరిగిందో కూడా ద్యోతకమవుతుంది. బిద్అత్ అన్నది వాస్తవానికి ధర్మంలో ప్రక్షిప్తం, దాన్ని చెరిపి వేయడంతో సమానం. అందువల్ల జీవితంలోని ఏ విభాగంలో బిద్అత్ దారి చేసుకుంటుందో అక్కడ సున్నత్ సమసిపోతుంది. అంటే అసలు ధర్మం అంతమయిపోతుందన్నమాట!

గజీఫ్ బిన్ హారిస్ సుమాలీ ఇలా అంటున్నారు :

**ان النبی صلی الله علیه وسلم قال ما احدث قوم بدعة الارفع مثلها من السنة فتمسک بسنة خیر من احداث بدعة**

**ప్రవక్త(స) నుడివిన ప్రకారం, ఒక జాతి ఏద యినా బిద్అత్‌ని సృష్టిస్తే అటువంటి సున్నత్ (ఆ జాతి నుండి) లాక్కోబడుతుంది. అందువల్ల సున్నత్‌ని సుస్థిరంగా పట్టుకుని (ఆచరించడం) బిద్అత్‌ని కల్పించుకోవడం కన్నా ఎంతో మంచిది.** *(ముస్నద్ అహ్మద్ : 4/ 76)*

అబ్దుల్లాహ్ బిన్ దైలమీ★ ఇలా అన్నారు :

**بلغنی ان اول ذهاب الدین ترک السنة یذهب الدین سنة کما یذهب الحبل قوة قوة**

**దైవప్రవక్త(స) ద్వారా నాకు ఈ విషయం అందింది, ధర్మం సమసిపోవడం అన్నది సున్నత్‌ని వదలడంతో మొదలవుతుంది. సున్నత్ ఒక్కొక్కటే సమసిపోతూ ఉంటే ధర్మం అంత మవడం జరుగుతుంది - ఏవిధంగా నయితే పేనిన త్రాడు, ఒక్కొక్క పెన విడిపోతూ ఉంటే ఛిన్నాభిన్నమయిపోతుందో అలాగే-**

*(దారిమీ, ఉపోద్ఘాతం, బాబు ఇత్తిబా ఉస్సున్నహ్)*

★ *ఈయన తాబియీ (ప్రవక్త సహచరుల అనుచరులు), కొందరు ఈయన్ని ప్రవక్త సహచరుల్లో ఒకరుగా గణించారు.* (తహ్జీబుత్‌తహ్జీబ్ : 5/ 358)

ఈ కారణంగానే ఓ ఉల్లేఖనంలో ఇలా చెప్పడం జరిగింది :

**ఏ వ్యక్తి అయితే బిద్అత్ని అమితంగా గౌర వించాడో అతను ఇస్లామ్ను కూలదోయడంలో సహాయపడ్డాడు.**

**من وقّرصاحب بدعة فقد اعان على هدم الاسلام**

*(బైహకీ, ఫీ షూ'బుల్ ఈమాన్; మిష్కాతుల్ మసాబీహ్, కితాబుల్ ఈమాన్, బాబు ఫి ఈ'తిసామ్ బిల్ కితాబ్ వ స్సున్నహ్)*

'సున్నత్' (ప్రవక్త సంప్రదాయం) మార్గం ఏవిధంగానయితే ధర్మం ప్రారంభమయినప్పుడు అపరిచితావస్థలో ఉండేదో నేడు కూడా అపరిచితంగానే ఉంది. కాని అంతిమ గమ్యం ప్రాప్తమయేది కేవలం ప్రతి బిద్అత్ని తుడిచిపెట్టి సున్నత్ మార్గాన ముందుకు సాగే దృఢత్వం గల వారికే. ఇమామ్ జుహ్రీ (రహ్మ) ఇలా అన్నారు :

**గతించిన మా ఉలమా ఇలా అనేవారు, సున్నత్ని పటిష్ఠంగా పట్టుకుని ఉండటంలోనే మోక్షముంది.**

**كان من مضى من علمائنا يقولون الاعتصام بالسنة نجاة**

*(దారిమీ, ఉపోద్ఘాతం, బాబు ఇత్తిబాఉ స్సున్నహ్)*

## ఉపద్రవ పరీక్షను ఎదురొడ్డటం

సున్నత్ అనుసరణ అంటే ఏమిటీ? పరమ ప్రభువు పంపిన ఏ ధర్మాన్ని ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లమ్) మానవులకు అందజేశారో, మనిషి ఎట్టి పరిస్థితిలోనూ దాని మీద నిలకడ చూపాలి. దాని వైపునకు ప్రపంచాన్ని పిలువడానికి, దాన్ని నెలకొల్పడానికీ, దాని ఆధిక్యతకూ సాధ్యమయినంత కృషి జరపాలి. ఆ ధర్మానికి ఎదురుగా ఏ ఉపద్రవాలు, మిథ్యా ఉద్యమాలు వెలుస్తూ ఉంటాయో వాటినన్నింటినీ పూర్తి బలాన్నుపయోగించి ఎదుర్కోవాలి. ఈ విస్తృత సంఘర్షణ, కృషియే **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**, దాని ఆవశ్యకతల పరిపూర్తి. ఈ కృషి ముస్లిమ్ సముదాయంలో సదా జరుగుతూ వచ్చింది. దైవ సందేశహరులు(స) భవిష్యవాణి కూడా పలికారు, సముదాయంలో, చివరి కాలంలోనూ **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధిని నిర్వర్తించేటటువంటి జనులు ఉంటారు, ధర్మానికి వ్యతిరేకంగా ఉద్భవించే ఉపద్రవాలను ఎదుర్కొంటారు అని.

سيكون فى اٰخر هٰـذه الاُمة قوم لهم مثل اجـر اولهم يامـرون بالمعروف و ينهون عن المنكر و يقاتلون الفتن

**ఈ సముదాయం చివరి దశలోనూ ప్రాచీనుల వంటి ప్రతిఫలం పొందే వారుంటారు. వారు మారూఫ్‌ను ఆదేశిస్తారు, మున్కర్‌ని వారిస్తారు. ఉపద్రవాలను ఎదుర్కొంటారు.**

*బైహకీ, (మిష్కాతుల్ మసాబీహ్, కితాబుల్ ఫితన్, బాబు, సవాబ్ హాజిహిల్ ఉమ్మహ్)*

ఇదే మాటను ఆయన(స) ఈ పదాలలోనూ పలికారు :

ان من امتى قومـا يعطـون مثل اجور اولهم ينكرون المنكر

**నా సముదాయంలో కొందరు తరువాతి వారికి, వారి పూర్వపు వారి మాదిరి ప్రతిఫలం ఇవ్వ బడుతుంది, ఎందుకంటే వారు చెడులు చూసి వాటిని ఖండిస్తారు.** *(ముస్నద్ అహ్మద్ : 5/7)*

## సముదాయంలో ధర్మ రక్షకులు

మహనీయ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లమ్) ద్వారా ప్రపంచానికి చివరిసారిగా పరమ ప్రభువు సమ్మతి పొందిన ధర్మం ప్రాప్తమయింది. ఈ ధర్మాన్ని దైవం ప్రళయ ఘడియ వరకు భద్రంగా కాపాడదలిచాడు. అందువల్లనే ఆయన అన్ని కాలాల్లోనూ దీని రక్షకుల్ని సృజిస్తూ వచ్చాడు. మున్ముందు కూడా సృజిస్తూ ఉంటాడు. ప్రవక్తశ్రీ(స) ఇలా నుడివారు, ఈ ధర్మావలంబీకులలో అనేక ధార్మిక, నైతిక రుగ్మతలు చోటు చేసుకుంటాయి. తప్పుడు వ్యవహారాలలో వారు వెనుకటి సముదాయాల అడుగుజాడలలోనే నడుస్తారు. అయినప్పటికీ వారిలో ఒక వర్గం తప్పక ఉంటుంది. అది ధర్మాన్ని దాని నిజరూపంలో మనగలగనిస్తుంది. ధర్మం పైన దాడులు జరుగుతాయి- దాన్ని నమ్మేవారి తరఫునా, దాన్ని తిరస్కరించేవారి తరఫున కూడా. ఆ వర్గం వారిని ఎదుర్కొంటుంది. ధర్మాన్ని చెరిపివేసే ఏ ప్రయత్నాలు జరిగినా వాటిని అది వమ్ము చేసివేస్తుంది. అది ఏది పలికినా నిజమే పలుకుతుంది. అది మిథ్యా వాదులకు ప్రతిగా సత్యాన్నే వ్యక్తం చేస్తూ ఉంటుంది. ఈ మార్గాన అది ఎన్నడూ ధైర్యాన్ని కోల్పోదు, మరెవరూ దాన్ని భయపెట్టి లోబరుచుకోలేరు. అది ధర్మం కొరకు ప్రతి రంగంలోనూ పోరాడుతుంది. ఎటువంటి త్యాగానికయినా వెరువదు. ఈ వర్గానికి మద్దత్తుగా నిలువని వారే పరాభవం పాలవుతారు. వీరిని ఎదిరించిన వారే విఫలురవుతారు.

لاَ تزال طائفة من امتى قائمة بامر الله لاَ يضرّهم من خذلهم او خالفهم حتى يأتى امرالله و هم ظاهرون على الناس

నా సముదాయంలో సదా ఒక వర్గం ఉంటుంది. అది దైవధర్మం బాధ్యతల్ని తానయి స్వీకరిస్తుంది. దీన్ని వదిలేసినవాడు, లేదా దీన్ని వ్యతిరేకించినవాడు దీనికి ఎటువంటి హాని చేకూర్చలేడు. కడకు ప్రళయం వచ్చేస్తుంది. అప్పుడు ఆ వర్గమే జనులపైన ఆధిక్యత వహి స్తుంది. (ముస్లిమ్, కితాబుల్ ఇమారహ్)

ఇమామ్ బుఖారీ(ర) ప్రకారం ఈ హదీసులో ఏ వర్గం ప్రస్తావన ఉందో అది ధర్మవేత్తల వర్గం. (బుఖారీ-కితాబుల్ ఏతెసామ్) ఇమామ్ నవవీ(ర) ఈ హదీసును ఇంకా విస్తృత అర్థం ఇచ్చి ఇలా అన్నారు :

يحتمل ان هٰذه الطائفة مفرقة بين انواع المومنين منهم شجعان مقاتلون ومنهم فقهاء و منهم محدثون و منهم زهّاد و اٰمرون بالمعروف و الناهون عن المنكر و منهم اهل انواع اخرى من الخير و الّا يلزم ان يكونوا مجتمعين بل قد يكون متفرقين فى اقطار الاٰرض

ఈ వర్గం వారు విశ్వసించినవారి విభిన్న వర్గా లలో విభక్తమవడం సాధ్యమే. వారిలో దైవ మార్గంలో పోరు సలిపే వీరులుంటారు, ధర్మ శాస్త్రవేత్తలు (ఫుకహా) ఉంటారు, హదీసువేత్తలు (ముహద్దిసులు) ఉంటారు, ఆరాధనల్లో మునిగి ఉండేవారు (జాహిద్‌లు) ఉంటారు, మారూఫ్‌ని ఆదేశించేవారు, మున్కర్‌ని నిరోధించేవారు కూడా ఉంటారు. వీరేకాక ఇంకా ఇతర సత్కా ర్యాలాచరించేవారూ ఉంటారు. ఈ హదీసు ద్వారా వారంతా ఒకే ఒక ప్రాంతంలో ఏకత్రమయి ఉండటం కూడా తప్పనిసరి కాదు. వారంతా భువిలో విభిన్న ప్రాంతాల్లో వసిస్తూ ఉండటం కూడా సాధ్యమే.

*(షర్‌హ్ ముస్లిమ్, నవవీ : సం.1, భాగం 2, పు.143)*

మరో హదీసులో దైవ సందేశహరులు (సల్లల్లాహు అలైహి వ సల్లమ్) ఇలా నుడివారు :

يحمل هٰذا العلم من كل خلف عدوله ينفون عنه تحريف

ప్రతి తరం తరువాత వచ్చే న్యాయవంతులయిన వారు ఈ ధర్మజ్ఞానం కలిగినవారయి ఉంటారు.

الغالين و انتحال المبطلين و تاويل الجاهلين

**వారు, హద్దులు మీరేవారి ప్రక్షిప్తాలను, మిథ్యా వాదుల తప్పుడు వాదనల్ని, అజ్ఞానుల మూఢా ధారాలను ధర్మం నుండి దూరంగా తొలగిస్తూ ఉంటారు.**

*(రవాహుల్ బైహాకీ (మిష్కాతుల్ మసాబీహ్, కితాబుల్ ఇల్మ్)*

ఇదే కార్యాన్ని ప్రవక్తశ్రీ(స) 'సముదాయం పునరుజ్జీవనం' అని కూడా పేర్కొన్నారు. ఆయన(స) ఇలా సెలవిచ్చారు :

اِنَّ الله يبعث لهٰذه الاُمـة علىٰ رأس كل مـأة سنة من يجـدد لهـا دينها

**పరమ ప్రభువు ప్రతి శతాబ్ది చివరన ఈ సముదాయం మేలు కొరకు దీని ధర్మాన్ని పునరుజ్జీవింపజేసే వ్యక్తుల్ని నిశ్చయంగా ప్రభవింప జేస్తూ ఉంటాడు.** ***(అబూదావూద్, కితాబుల్ మలాహిమ్; ముస్తద్రక్ హాకిమ్ : 4/ 522)***

సముదాయంలో ప్రభవించే ఈ పునరుద్ధరణకర్తలు ఒక వైపున దైవధర్మాన్ని దాని నిజస్వరూపంలో మనగలిగేలా చేశారు, మరోవైపున ఈ సముదాయాన్ని మొత్తం మీద అది రుజుమార్గం తప్పకుండా కాపాడారు.

చరిత్ర మనకు తెలిపేదాన్ని బట్టి ముహమ్మద్(స)కు పూర్వం ప్రపంచంలో వచ్చిన ప్రవక్తలలో కొందరి బోధనలు పూర్తిగా సమసిపోయాయి, మరి కొందరి బోధనల్లో స్వయంగా వారి అనుయాయులే చేసిన ప్రక్షిప్తాల కారణంగా అవి సత్యా సత్యాల సమ్మేళనంగా మారిపోయాయి. కాని మహనీయ ముహమ్మద్(స) ప్రపంచానికి అందజేసిన ధర్మం నేటికీ దాని నిజస్వరూపంలో పూర్తిగా భద్రంగా ఉంది. దాన్ని అన్వయింపు చేసేవారు కూడా అన్నిచోట్లా ఉన్నారు. ఈ ధర్మానికి ప్రతిగా ఎన్నడు ఎటువంటి కలత తలెత్తినా దాన్ని అణచివేయడానికి యోధులు తగినట్టుగా ముందుకు వచ్చారు. వారు దాన్ని అంతమొందించడానికి కృషి జరిపారు. **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్**కు సంబంధించిన ఈ భావన ఈ ధర్మావలంబీకులలో ఎప్పుడయినా కాస్త తగ్గుముఖం పట్టిందేమో కాని పూర్తిగా సమసిపోవడం అన్నది ఎన్నడూ జరగలేదు. అందువల్లనే ఈ ధర్మాన్ని రూపుమాపడానికి లేదా చెరిపివేయడానికి చేసిన ఏ ప్రయత్నమయినా ఎన్నడూ ఫలవంతం కాలేకపోయింది. నిస్వార్థ ధర్మసేవకులు, నిజమయిన ధర్మాన్వయకర్తలు ఎటువంటి ప్రక్షిప్తాన్నయినా ఎటువంటి అబద్ధపు

వాదననయినా, ఎటువంటి తప్పుడు భావార్థాన్నయినా ఎదిరించారు, ధర్మాన్ని పరిరక్షించడానికి ఎంతటి త్యాగానికయినా వెరువలేదు. పోతే వాస్తవమేమిటంటే, ఈ ధర్మం పైన లోనుంచి, బయటి నుంచి అనేక దాడులు అతి తీవ్రమయినవి జరిగాయి. వాటి మూలంగా, ఇది ఎప్పుడో అంతమయిపోవలసింది లేదా దీని రూపుమాసిపోవలసింది- దీన్ని గుర్తుపట్టడం కూడా నేడు కష్టసాధ్యమయిపోయేది.

సరిగ్గా ఇదే స్థితి ఈ సముదాయానిదీను. ఇందులో ఎప్పుడు ఏ చెరుపు చోటు చేసుకున్నా ఇందులోని సంస్కరణా శక్తులు పైకి లేచి వస్తాయి. ఆ చెరుపును దూరం చేసి వేస్తాయి. కాగా గత పద్నాలుగు శతాబ్దుల కాలంలో ఎన్నడున్నూ ఈ సముదాయం పూర్తిగా రుజుమార్గాన్ని తప్పి పూర్తిగా మార్గవిహీనతను, మార్గభ్రష్టతను అంగీకరించిన దాఖలాలు లేవు. ప్రవక్త మహనీయులు(స) భవిష్యవాణిని చెప్పి ఉన్నారు.

ان امتی لاَ تجتمع علی ضلالة

**నిశ్చయంగా నా సముదాయం మార్గవిహీనతను ఏకగ్రీవంగా సమ్మతించదు.**

*(తిర్మిజీ, అబ్వాబుల్ ఫితన్; ఇబ్నుమాజా, అబ్వాబుల్ ఫితన్)*

ఈ భవిష్యవాణి ఇప్పటివరకూ సత్యమని రుజువవుతూ వచ్చింది. ఇంకా మున్ముందు కూడా ఇలాగే ధ్రువపడుతూ ఉంటుందనే నమ్మకముంది.

## సముదాయ సంస్కరణ, పునరుజ్జీవనం- సముదాయం బాధ్యతే!

ఈ సముదాయంలో పునరుద్ధారకులు సదా పుడుతూ వచ్చారన్న విషయంలో ఎటువంటి సందేహం లేదు. అత్యంత సున్నితమయిన పరిస్థితుల్లోనూ వారు ధర్మపరిరక్షణ, సముదాయం సంస్కరణల కష్టతర బాధ్యతను నెరవేర్చారు. ఈ యదార్థాన్ని అంగీకరించిన తరువాత ఒక ప్రశ్నను పరిశీలించవలసి వుంటుంది. సముదాయాన్ని చెరుపు నుండి కాపాడటం, అందులో **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్** కర్తవ్యాన్ని నిర్వర్తించడం ప్రతి వ్యక్తి బాధ్యతనా లేదా ఏదయినా ప్రత్యేక వర్గం చెయ్యవలసిన విధియా? దివ్యకుర్ఆన్ ఈ ప్రశ్నకు ఈ విధంగా సమాధానం ఇచ్చింది.

وَ الْمُؤْمِنُوْنَ وَ الْمُؤْمِنٰتُ بَعْضُهُمْ اَوْلِيَاءُ بَعْضٍ يَاْمُرُوْنَ بِالْمَعْرُوْفِ وَ يَنْهَوْنَ عَنِ الْمُنْكَرِ وَ يُقِيْمُوْنَ الصَّلوٰةَ

**"విశ్వసించిన పురుషులు, విశ్వసించిన స్త్రీలు- వీరంతా ఒకరికొకరు తోడ్పడే సహచరులు. మంచిని ఆదేశిస్తారు, చెడును వారిస్తారు; నమాజ్‌ని స్థాపిస్తారు, జకాత్‌నిస్తారు; అల్లాహ్‌కు,**

وَ يُؤتُوْنَ الزَّكٰوةَ وَ يُطِيْعُوْنَ اللّٰهَ وَ رَسُوْلَهٗ اُولٰٓئِكَ سَيَرْحَمُهُمُ اللّٰهُ اِنَّ اللّٰهَ عَزِيْزٌ حَكِيْمٌ○ (التوبة)

**ఆయన సందేశహరునికి విధేయత పాటిస్తారు. అల్లాహ్ కారుణ్యం తప్పనిసరిగా అవతరించేది వీరిపైనే; నిస్సందేహంగా అల్లాహ్ సర్వాధికుడు, బుద్ధికుశలుడు, వివేచనాధురంధరుడు.**

*(అత్ తౌబా : 71)*

దీన్నిబట్టి తెలిసేదేమిటంటే **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** నిర్వర్తన, సముదాయం సంస్కరణ ఏదో ప్రత్యేక వర్గం, లేదా సంఘం బాధ్యతకాదు. ఇది పూర్తి సముదాయం చెయ్యవలసిన కార్యం. ఖుర్ఆన్ విశ్వసించినవారిని, పరస్పరం మారూఫ్‌ని ఆదేశించుకునే వారిగాను, మున్కర్‌ని నిరోధించుకునేవారిగాను చూడదలచింది. ఎందుకంటే ఇదే వారి అసలయిన మరీ సరయిన స్థితి. ఈ లక్షణం వారిలోని ఏ వ్యక్తిలోనయినా లేకపోయినట్లయితే అతను ముస్లిమ్ సముదాయంలో అయోగ్యుడయిన వ్యక్తి అన్నమాట. ఇమామ్ గజాలీ (రహ్మ) ఇలా అంటున్నారు :

**فقد نعت المؤمنين بانهم يامرون بالمعروف و ينهون عن المنكر فالذى هجر الامر بالمعروف و النهى عن المنكر خارج عن هؤلاء المومنين المنعوتين فى هٰذه الاية**

**ఈ ఆయత్‌లో పరమ ప్రభువు అల్లాహ్ విశ్వసించిన వారి ఈ లక్షణాన్ని వివరించాడు: వారు మారూఫ్‌ని ఆదేశిస్తారని, మున్కర్ నుండి వారిస్తారని సెలవిచ్చాడు. కాగా ఏ వ్యక్తి అయితే అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌ని విడిచిపెడతాడో అతను ఈ ఆయత్‌లో ప్రస్తావించిన విశ్వాసుల జాబితా నుండి తొలగిపోతాడు.**

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 334)*

అల్లామా అబ్దుల్ కాదిర్ ఔదహ్ షహీద్ (రహ్మ) ఇలా అన్నారు :

**ان جمهرة الفقهاء توجب الامر بالمعروف والنهى عن المنكر على كافة افراد الامة لاعلى فئة معينة منها**

**చాలామంది ఫిక్‌హ్‌వేత్తలు అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ అన్నదాన్ని సముదాయంలోని ఏదో ప్రత్యేక వర్గంపైన కాక వ్యక్తులందరిపైనా విధి అని నిర్ణయించారు.**

*(అత్ తష్రీఉల్ జనాయిల్ ఇస్లామీ : 1/ 495)*

## తవాసీ బిల్ హక్క్

సముదాయంలోపల **అమ్ర్ బిల్ మారూఫ్** వ **నహీ అనిల్ మున్కర్** కార్యాన్ని నిర్వర్తించడాన్ని వాస్తవానికి సముదాయం సంస్కరణ అనవలసి ఉంటుంది. దీన్ని కుర్ఆన్ 'తవాసీ బిల్ హక్క్, తవాసీ బిస్సబ్ర్' అన్న పరిభాషలో కూడా వ్యక్తం చేసింది. విశ్వాసం, సదాచరణల తరువాత దీన్నే జాతుల, సముదాయాల సాఫల్యతకు మార్గంగా పేర్కొన్నది. దైవగ్రంథంలో ఇలా ఉంది :

وَ الْعَصْرِ اِنَّ الْاِنْسَانَ لَفِیْ خُسْرٍ اِلَّا الَّذِیْنَ اٰمَنُوْا وَ عَمِلُوا الصّٰلِحٰتِ وَ تَوَاصَوْا بِالْحَقِّ وَتَوَاصَوْا بِالصَّبْرِ (العصر:١-٣)

**కాలం సాక్షి, వాస్తవానికి మానవుడు భారీ నష్టంలో ఉన్నాడు, అయితే- విశ్వసించిన వారికి, సత్కార్యాలు చేసేవారికి, పరస్పరం సత్యాన్నీ, ధర్మాన్నీ బోధించుకునేవారికీ, సహనాన్నీ ఉపదేశించుకునేవారికి- ఉంది వినాయింపు.**

*(అల్ అస్ర్ : 1-3)*

'హక్క్' (సత్యం) అనే పదంలో సమస్త ధర్మం ఇమిడి ఉంది. 'సబ్ర్' (సహనం) అనే పదం, దాని భావంలో ధర్మంపైన సుస్థిరంగా ఉండటం అన్న భావం చేరి ఉంది. 'తవాసీ బిల్ హక్క్, తవాసీబిస్సబ్ర్' (పరస్పరం సత్యాన్నీ సహనాన్నీ బోధించుకోవడం) అంటే ధర్మంపైన అమలు జరపడం, దానిపైన నిలకడ చూపడం వీటి పట్ల పరస్పరం ఉపదేశించుకోవడం అన్నమాట. ముస్లిమ్ సముదాయం సంస్కరణ జరగడానికీ అది ధర్మంపైన సుస్థిరంగా నిలువగలగటానికీ అందులో సదా, పరస్పరం సత్యం పట్లను సుస్థిరత పట్లనూ ఉపదేశం జరుగుతూ ఉండాలి. అప్పుడే అందులో చెడుగు అన్నది అసలే పుట్టకుండా ఉంటుంది. ఒకవేళ అది పుట్టినా పెరగడం, వ్యాప్తి చెందడం అన్నది జరగకుండా ఉంటుంది. సముదాయంలో సత్యం పట్లను, సుస్థిరత పట్లను ఈ పరస్పర బోధనా భావం సజీవంగా ఉన్నంత కాలం దాని సంస్కరణా మార్గం తెరచే ఉంటుంది. అందులో ఎంత పెద్ద తప్పు జరిగినా అది సరిదిద్దుకోగలుగుతుంది. కాని ఒకవేళ ఈ భావన మరుగున పడిపోతే అందులో పొడసూపిన చెడుగు క్రమేణా ప్రవర్థమానమయి సంస్కరణా మార్గాలు కుంచించుకుపోతాయి. కడకు ఈ విషయమే దాని సర్వ నాశనానికి దారితీస్తుంది.

ఇస్లామ్ దాని సమాజంలో సృష్టించే వాతావరణంలోన నిత్యం 'శుభం' అన్నది ప్రవర్థమానమవుతూ ఉండాలని, చెడుగు అన్నది పెరిగే అవకాశాలు లేనిదయి

ఉండాలని అది కోరుకుంటుంది. మనిషి మంచి వైపునకు ముందడుగు వేసే సంకల్పం చేసుకుంటే అడుగడుగునా అతని వెనకాల సమాజం మొత్తం వెన్నుదన్నుగా ఉందన్న నమ్మకం అతనికి కలగాలి. దీనికి భిన్నంగా అతను చెడు దారిన అడుగు వేయదలిస్తే వాతావరణంలో అపరిచితుడయిపోవాలి, అతనికి తోడిచ్చేవాడెవడూ కానరాకుండా ఉండాలి. మారూఫ్‌ను అమలు పరచడం అతనికి సులభమయి, మున్కర్‌కు పాల్పడటం కష్టతరమయిపోవాలి. ఇస్లామ్ బోధన ఏమిటంటే సత్కార్యం, భయభక్తుల కార్యం విషయంలోనయితే పరస్పరం సహకరించుకోవాలి, కాని ఎక్కడయితే పాపపు పని, అత్యాచారం జరుగుతుందో అక్కడ పరస్పరం సహకరిం చుకోరాదు.

**وَتَعَاوَنُوا عَلَى الْبِرِّ وَالتَّقْوٰى وَلَا تَعَاوَنُوا عَلَى الْإِثْمِ وَالْعُدْوَانِ**
(المائدۃ:۲)

**సత్కార్యాల్లో, దైవభక్తి కార్యకలాపాల్లో మీరు అందరికీ సహకరించండి. పాపకార్యాలు, అత్యాచారాలలో ఎవ్వరికీ సహకరించకండి.**
*(అల్ మాయిదా : 2)*

ఈ సముదాయం రుజుమార్గాన నిలకడగా ఉండాలంటే కుర్‌ఆన్, హదీసుల ప్రకారం అది దాని వ్యక్తులను కఠినంగా విమర్శిస్తూ ఉండాలి. సదాచారం విస్తృత మయ్యే అవకాశాలు, మౌలిక కారణాలు కల్పిస్తూ ఉండాలి. చెడును రూపుమాపడానికి చిట్టచివరి మేరకు శక్తిని వినియోగించాలి. సముదాయంలో మంచి పట్ల ప్రేమ, చెడు పట్ల వెగటు ఏ మేరకు ఉండాలంటే, ఒక్క వ్యక్తి కూడా చెడు నడతకు పాల్పడే సాహసం చేసినట్లయితే పది మంది ఎగబడి అతన్ని ఆపివేసి సన్మార్గాన తీసుకురావాలి. ఒక మనిషిని సత్కార్యంలో సహాయపడటమే సరయిన సహకారం కాదు, అతన్ని చెడు దారిన ముందుకు సాగకుండా ఆపడం కూడా సహకారమే. అందువల్లనే ప్రవక్త(స) ఇలా అన్నారు :

**انصر اخاک ظالماً او مظلومًا قال یا رسول اللّٰہ ھٰذا ننصرہ مظلوماً فکیف ننصرہ ظالما قال تاخذ فوق یدیہ**

**మీ సోదరునికి సహాయపడండి, అతను పీడించేవాడయినా, పీడితుడయినా. ఉల్లేఖనకర్త అడిగాడు, దైవప్రవక్తా, అతను పీడితుడయితే నిశ్చయంగా మేము అతనికి సహాయపడ తాము, అతను పీడించేవాడయితే అతనికి సహాయపడటం ఎలా? ఆయన ఇలా చెప్పారు:**

**'అతని చెయ్యి పట్టి (అత్యాచారం చెయ్య కుండా) ఆపండి.'**

*(బుఖారీ : అబ్వాబుల్ మజాలిమ్ వల్ కిసాస్)*

## ఉపదేశం

సముదాయం మధ్యన **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** కార్య క్రమాన్ని నిర్వహించడాన్ని కుర్‌ఆన్ హదీసుల్లో 'నసీహత్' లేదా ఉద్బోధగా కూడా అభివర్ణించడం జరిగింది. ఈ పదంలో విస్తృత అర్థాలు ఇమిడి ఉన్నాయి. కాగా నిఘంటువు ప్రకారం, దీని అర్థం, మోసగించకపోవడం, చిత్తశుద్ధితో మసలుకోవడం, పరిశుద్ధపరచడం, చక్కదిద్దడం, సరిదిద్దడం అన్న అర్థాలూ వర్తిస్తాయి. ఈ అర్థాల ద్వారా దీని విస్తృతిని అంచనా వేయడం కష్టమేమీ కాదు. అల్లామా ఇబ్ను అసీర్ ఇలా అంటారు: 'నసీహత్' అన్న దాని భావం ఏదో ఒక్క పదంతో నెరవేరజాలదు. అయితే దాన్ని ఒక వాక్యంలో ఇలా చెప్పవచ్చు. ఏ వ్యక్తికి 'నసీహత్' (ఉద్బోధ) చేయబడు తున్నదో అతని మేలు కోరడం★ ఈ శ్రేయోభిలాషలో ఈమాన్ పట్ల పిలుపు, నైతిక సంస్కరణ, ఆలోచన, ఆచరణల సంస్కరణ, సుశిక్షణ అన్నీ చేరి ఉన్నాయి.

శ్రేయోభిలాష, సంస్కరణకు సంబంధించిన ఈ భావన ఇస్లామ్, దాని అను యాయులందరిలో చూడగోరుతుంది. తద్వారా సమాజంలోని వ్యక్తులు ఒండొకరి మేలు కోరేవారుగా, పరస్పర సంస్కరణాభిలాషులుగా రూపొందాలన్నది దాని ఆశ. ఒకవైపున పాలకులు పాలితుల సంస్కరణకు ప్రయత్నం చేస్తూ ఉండగా మరోవైపున పాలితులు పాలకుల లోటుపాట్లను ఎత్తిచూపుతూ ఉండాలి. శ్రీమంతులు నిరుపేదల బలహీన తల్ని దూరం చేస్తూ ఉన్నట్లే బీదవాడు ధనవంతుల చెడుగుల్ని దూరం చేయాలి. జ్ఞానవంతులు సామాన్యుల్ని అజ్ఞానం నుండి కాపాడితే సామాన్యులు సయితం పండితుల పొరపాట్ల పట్ల హెచ్చరిస్తూ ఉండాలి. ఈ విధంగా సముదాయం మొత్తాన ఉద్బోధ, శ్రేయోభిలాష వాతావరణం నెలకొని సముదాయంలో దానంతట అదే సంస్కరణ జరుగుతూ ఉండాలి. ఎందుకంటే ఈ సముదాయంలో ఏ చెడుగు తలెత్తినా దాని సంస్కరణా భారం మరెవరిపైనా లేదు. మరే వర్గంపైనా లేదు. నిజానికి దీని సంస్కరణ స్వయంగా ఈ సముదాయమే చేసుకోవలసి ఉంది. ఇందులోని ప్రతి

★ *అన్ నిహాయతు ఫీ గరీబిల్ హదీసు వల్ అసర్ : 5/ 62, 63)*

వ్యక్తి మరో వ్యక్తి శ్రేయోభిలాషి, శుభాన్ని కోరేవాడే. ప్రతి వ్యక్తి ఏవిధంగానయితే తన స్వీయ సంస్కరణ, శిక్షణలను గురించి చింతాగ్రస్తుడవుతాడో అదేవిధంగా సముదాయంలోని సోదరుల ఎడల వారి సంస్కరణ ఎడల కూడా యత్నాలు చేయవలసి ఉంటుంది. హజ్రత్ తమీమ్ దారీ ఇలా అన్నారు :

ان النّبی صلّی اللّٰہ علیہ و سلّم قال: الدین النّصیحة، قلنا لمن؟ قال للّٰہ و لکتابہ و لرسولہ و لِائمة المسلمین و عامتهم

**ప్రవక్త(శ్రీ (స) ఇలా సెలవిచ్చారు, ధర్మం చిత్తశుద్ధికి, శ్రేయోభిలాషకు మారుపేరు. మేము అడిగాము, శ్రేయోభిలాష, చిత్తశుద్ధి ఎవరి పట్ల? అని. దానికి ఆయన(స) ఇలా బదు లిచ్చారు: దైవం పట్ల, ఆయన గ్రంథం పట్ల, ఆయన సందేశహరుని(స) పట్ల, ముస్లిముల నాయకుల (పాలకుల)పట్ల, సామాన్య ముస్లిమ్ ప్రజల పట్ల.**

*(ముస్లిమ్ : కితాబుల్ ఈమాన్, బాబు బయాన్ ఇన్నద్దీన అన్నసీహ)*

ధర్మాన్ని స్వీకరించడం మూలాన మనిషిలో ఉత్పన్నమయ్యే పవిత్ర భావనల్ని ఈ హదీసులో ఉత్తమ రీతిలో వివరించడం జరిగింది. హదీసులో ఏ శ్రేయోభిలాష, చిత్తశుద్ధిని గురించి ప్రస్తావించడం జరిగిందో దానికి రెండు కోణాలున్నాయి. ఒకటి మనిషి విశ్వాసం, అతని స్వీయ సంస్కరణ, సుశిక్షణలకు సంబంధించింది. రెండవది, సందేశ ప్రచారం, సంస్కరణ, శిక్షణలకు సంబంధించింది. ఈ రెండవ కార్యం ఒక ముస్లిమ్ వ్యక్తి స్వయంగా సముదాయం లోపలను, దానికి వెలుపలను నిర్వర్తించవలసి ఉంటుంది. ఈ విధంగా ఈ హదీసు ధర్మం, దాని సకల ఆవశ్యకతల్ని ఓ ప్రత్యేక రీతిలో మనముందుంచుతోంది. ఈ కారణంగానే హదీసువేత్తలు దీనికి చాలా ప్రాముఖ్యాన్నిచ్చారు. ఇమామ్ నవవీ తనకు పూర్వపు ధర్మవేత్తల విశదీకరణల్ని దృష్టిలో ఉంచుకుని ఈ హదీసును గురించి వ్రాసిన దాన్ని సంక్షిప్తీకరించి ఇక్కడ పొందు పరుస్తున్నాము :

"పరమ ప్రభువు అల్లాహ్ పట్ల 'నసీహత్' లేక శ్రేయోభిలాషకు భావం ఏమిటంటే, ఆయన్ని విశ్వసించాలి, ఆయనతోపాటు మరెవరినీ సహవర్తులుగా ఎంచరాదు, ఆయన గుణగణాలలో ప్రక్షిప్తాలు చెయ్యరాదు, వాటిని యథాతథంగా స్వీకరించాలి. ఆయన్ని సకల సద్గుణ పరిపూర్ణుడుగా, అన్ని లోటుపాట్లకు అతీతుడుగా నమ్మాలి. ప్రతి వ్యవహారంలో

ఆయన విధేయతనే పాటించాలి. ఆయన పట్ల అవిధేయతకు దూరంగా మెలగాలి. ఒకరి పట్ల ప్రేమ కలిగి ఉండటమయినా ఆయన కొరకే కలిగి వుండాలి, ద్వేషం కలిగి ఉన్నా ఆయన కొరకే కలిగివుండాలి. ఆయనకు మిత్రుడయిన వానిని మిత్రునిగాను, ఆయనకు శత్రు వయిన వానిని శత్రువుగాను పరిగణించాలి. ఆయన్ని కాదని తిరుగు బాటు చేసిన వానితో అవసరమయితే పోరు సలపాలి. ఆయన వరప్రసా దాలను నిండుహృదయంతో అంగీకరించాలి, వాటి పట్ల కృతజ్ఞతా భావం కలిగివుండాలి. అల్లాహ్ పట్ల 'నసీహత్' అనే భావంలో పైన తెలిపిన గుణగణాల వైపునకు జనులకు పిలుపునివ్వటం కూడా అంతర్లీనమై ఉంది. వారిని మృదువుగా, ప్రేమగా ఆర్ధ్రంగా ఆ గుణ గణాలను అంగీకరించేలా, వాటిని నమ్మేలా చేయాలి."

'దైవగ్రంథం పట్ల నసీహత్, శ్రేయోభిలాష అంటే, అది దైవం చేత అవతరింపజేయబడిన గ్రంథంగా విశ్వసించాలి. అది ప్రతి మానవ రచనకు, వచనానికీ పూర్తిగా భిన్నమయినదని, ప్రత్యేకమయినదనీ నమ్మాలి. అది ఎటువంటి వచనమంటే, అటువంటి వచనం పలకడా నికి ఏ వ్యక్తీ శక్తి కలిగిలేడని నమ్మాలి. దైవగ్రంథం పట్ల శ్రేయోభిలాషలో ఇదీ చేరి ఉంది: దాన్ని గౌరవించాలి, దాని పట్ల మర్యాద చూపాలి, భయభక్తులతో ఆదరణతో దాని పారాయణం చేయాలి, దాని ఆదేశాల పట్ల అవగాహన కలిగి ఉండాలి, దాని జ్ఞానం కలిగి వుండాలి, ఉప మానాలను అవగతం చేసుకోవాలి, దాని ఉపదేశాల ద్వారా బోధన పొందాలి. దాని వైచిత్రి పట్ల లోతయిన చింతన చేయాలి. దాని ముహ్కా మాత్ (స్పష్టమయిన, సుస్థిర భావార్థం గల ఆయత్‌ల) పట్ల అమలు జరపాలి, దీని ముతషాబిహాత్ (భావాన్వయంలో స్పష్టత లేకపోయిన సంశయాత్మకమయిన ఆయత్‌ల)ను ఎదురు ప్రశ్నించకుండా స్వీకరిం చాలి. ఈ గ్రంథంలోని ఆదేశాలను, ప్రమాణాలను పరిశోధించి రూఢీ పరచుకోవాలి. దీనిపట్ల శ్రేయోభిలాష ఏమిటంటే దీని విద్యలను విస్తృత పరచాలి, దాని వైపునకు ప్రపంచాన్ని అధ్యయనం చేసేందుకు పిలుపు నివ్వాలి.

"దైవ సందేశహరుని (సల్లల్లాహు అలైహి వ సల్లమ్) పట్ల శ్రేయోభిలాష

ఏమిటంటే ఆయన దైవదౌత్యం పట్ల సాక్ష్యం పలకాలి. ఆయన బోధనల్ని విశ్వసించాలి. ఆయన ఆదేశాల పట్ల విధేయత పాటించాలి, ఆయన జీవితంలోనూ ఆయన పరమ పదించిన తరువాతను ఆయనకు తోడుగా ఉండటం, ఆయనకు మద్దతునివ్వడం, ఆయనకు శత్రువయినవానితో శత్రుత్వం, ఆయనకు మిత్రుడయినవానితో మైత్రీ, ఆయన పట్ల గౌరవాదరణలు, ఆయన హక్కుల పట్ల గౌరవ మర్యాదలు, ఆయన సంప్రదాయాల పునరుజ్జీవనం, ఆయన సందేశ ప్రచార విస్తరణ, ఆయన అందజేసిన షరీఅత్‌ని ప్రచారం చెయ్యడం, దానిపైన వచ్చే నిందారోపణల్ని దూరం చేయడం, అందులోని విద్యల్ని వ్యాపింపజేయడం, అందులో గల అర్థాలను యోచించడం, యోచింప జేయడం, జాగ్రత్తగా దాన్ని నేర్చుకోవడం, నలుగురికీ నేర్పడం, దానిపట్ల సరయిన అవగాహన లేకుండానే నోరు విప్పడాన్ని మానుకోవడం, షరీఅత్ పట్ల జ్ఞానమున్న వారిని మర్యాదగా గౌరవంగా చూడటం. అలాగే, ఆయన(స) పట్ల శ్రేయోభిలాష ఏమిటంటే, ఆయన నైతిక విధానాలు మనలోనూ పెంపొందించుకోవడం, ఆయన నేర్పిన మర్యాదలు అలవరచుకోవడం, ఆయన సహచరులు, ఆయన ఇంటి వారలు, కుటుంబీకులు (అహ్లల్ బైత్) పట్ల ప్రేమ కలిగి ఉండటం; బిద్‌అత్‌ని పాటించే వ్యక్తులతో దూరంగా మెలగడం.

ముస్లిముల నాయకుల పట్ల నసీహత్, శ్రేయోభిలాష ఏమిటంటే, సత్యం విషయంలో వారితో సహకరించడం, వారి విధేయత పాటించడం, సాధారణంగా మృదువుగాను, అవసరం ఏర్పడితే కఠినంగానూ వారికి సద్బోధ చేయడం, వారికి బూటకపు ప్రశంసలు చేయకపోవడం, వారు ఏమరుపాటు వహించే విషయాల పట్ల వారిని జాగృతపరచడం, ముస్లిములను గురించి ఏ విషయాలయితే వారి వరకు చేరడం లేదో వాటిని వారివరకు చేరవేయడం, ఎటువంటి సామంజస్యత లేకుండా వారికెదురుగా తిరుగుబాటు చేయకపోవడం, జనుల్ని వారి విధేయతకు పురికొల్పడం. 'ఖితాబీ' (ఓ ధర్మవేత్త) ప్రకారం ముస్లిముల నాయకులంటే ఉద్దేశ్యం, ధర్మవేత్తలు కూడా కావచ్చు. వీరిపట్ల శ్రేయోభిలాష అంటే వారి ఎడల మంచి అభిప్రాయం కలిగి ఉండాలి. షరీఅత్ ఆదేశాల విషయంలో వారిని అనుసరించాలి అని భావం.

సాధారణ ముస్లిముల పట్ల శ్రేయోభిలాష అంటే భావం, ఏ విషయాల లోనయితే ఇహపరాల మేళ్ళున్నాయో వాటి వైపునకు మార్గనిర్దేశన చెయ్యడం. వారి కష్టాలను దూరం చెయ్యడం. వారు ధర్మం, ప్రపంచం రెంటికీ చెందిన ఏ విషయాలనయితే ఎరుగరో వాటి పట్ల అవగాహన కలిగించడం. వారి లోటుపాట్లను దాచివేయడం, తమకు ఇష్టమయిన దాన్నే వారికీ ఇష్టపడటం, తమకు నచ్చని దాన్ని వారి కొరకూ ఇష్టపడ కుండా జాగ్రత్త పడటం. వారి ధన, మాన, ప్రాణాల రక్షణ చేయడం; వారిలో ఉన్నత నైతికత ఉత్పన్నం చేసే కృషి జరపడం. వారిని అల్లాహ్ విధేయత కొరకు పురికొల్పడం.'

*(షర్హ్ ముస్లిమ్: సం.1, భాగం 2, పు.33-35)*

ప్రవక్త మహనీయులు(స) ముస్లిముల ఎడల శ్రేయోభిలాషకు ఎంతగా ప్రాముఖ్యాన్నిచ్చారంటే కొన్ని సందర్భాలలో ఆయన తన సహచరుల (సహాబా)తో ప్రత్యేక ప్రమాణాలు చేయించుకున్నారు. హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లా (రజి) ఇలా అంటున్నారు :

بايعت النبی صلی الله علیه وسلم علی النصح لكل مسلم

**నేను ప్రవక్త(స)తో ప్రతి ముస్లిమ్ వ్యక్తి ఎడల శ్రేయోభిలాష కలిగి వుంటానని ప్రమాణం చేశాను.** ***(ముస్లిమ్ : కితాబుల్ ఈమాన్)***

దీన్నిబట్టి అంచనా వేయవచ్చు సముదాయం సంస్కరణ, ముస్లిముల ఎడల శ్రేయోభిలాష కలిగి వుండే విధి ఎంత అసాధారణంగా ప్రముఖమయినదో. ఈ కార్యంలో ప్రత్యేకమయిన నియమాలు, పరిమితులు, మర్యాదలున్నాయి. ఈ సందర్భంలో ఒనరులు, సాధనాల ప్రశ్న కూడా ఉత్పన్నమవుతుంది. అంటే సము దాయం సంస్కరణకు ఏ సాధనాలు ప్రయోగించాలి, వేటిని ప్రయోగించే అనుమతి లేదు? ఈ ప్రశ్నల పట్ల మున్ముందు సవివరంగా చర్చ జరపవలసి ఉంటుంది. నిజానికి ఈ చర్చ సముదాయం సంస్కరణకు సంబంధించినదే అయినప్పటికీ దీని వెలుగులో **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**కు సంబంధించిన విస్తృత కార్యం పట్ల నియమాలు, పరిధులు, మర్యాదలు, సాధనాలు, ఒనరుల విషయం కూడా ప్రస్ఫుటమయి ముందుకు వస్తుందని ఆశిస్తున్నాము.



# 10. నిబంధనలు, సాధనాలు, పరిమితులు, మర్యాదలు

## నిబంధనలు

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కార్యాన్ని నిర్వర్తించడం ఓ ప్రత్యేక సమయం, ప్రత్యేక వాతావరణం, ప్రత్యేక కాలంలోనే జరగడం తప్పనిసరికాదు. దాని విశిష్టత ఏమిటంటే దానిపట్ల ఎన్నడూ ఏమరుపాటు వహించలేము. ఇమామ్ గజాలీ ఇలా అన్నారు :

عموم الأمر بالمعروف والنهى عن المنكر تقتضى الوجوب بكل حال

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్(కు సంబంధించిన ఆయత్‌లు, హదీసులు) సామాన్య లక్షణాన్ని బట్టి అది సర్వావస్థల్లోనూ విధి అయినదే అని తెలుస్తోంది.**

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 348)*

దీనితోపాటు అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ నిర్వర్తనకు కొన్ని నిబంధనలున్నాయని కూడా ఫిక్‌హ్ వేత్తలు వ్రాసిపెట్టారు. ఆ నిబంధనల్లోనూ ఫుకహాకు కొన్నింటిపట్ల ఏకాభిప్రాయముండగా కొన్నింటి పట్ల భిన్నాభిప్రాయముంది. ఇమామ్ గజాలీ ఇటువంటి అయిదు నిబంధనలు పేర్కొన్నారు.

1) ఈమాన్ (విశ్వాసం) 2) అదాలత్ (ధర్మనిష్ఠ) 3) ప్రభుసత్తా లేదా దాని అనుమతి★ 4) తక్‌లీఫ్ (మనిషి అర్హుడయి ఉండటం) 5) కుద్రత్ (సామర్థ్యం కలిగి ఉండటం).★★

---

★ ఇమామ్ గజాలీ ప్రభుత లేదా ప్రభుసత్తాను నిబంధనగా పేర్కొనలేదు. సమకాలీన అధికారి అనుమతిని ప్రస్తావించారు. ప్రభుత్వాధికారి అనుమతితో అమ్ర్ బిల్

మనం వీటిలో నుంచి ఈమాన్ (విశ్వాసం), అదాలత్ (ధర్మనిష్ట), ప్రభుసత్తా లేదా దాని అనుమతిని సిహత్ (సరయినదనడానికి) నిబంధనలుగాను, తక్‌లీఫ్ (షరీఅత్ రీత్యా అర్హుడవడం), కుద్రత్ (సామర్థ్యం కలిగి వుండటం)ని విధి అవడానికి నిబంధనలని పేర్కొనవచ్చు. ఎందుకంటే మొదటి మూడు లేకపోయినట్లయితే **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** అన్నది సరయినది కాదని తెలుస్తోంది. అలాగే తరువాతి రెండు నిబంధనల వల్ల అమ్ర్ బిల్ మారూఫ్... ఎటువంటి పరిస్థితుల్లో

---

*మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ సరయినప్పుడు స్వయాన ప్రభుత్వం దీన్ని చేపట్టడమూ సరయినది కావడంలో సందేహమేముంటుంది. అయినా కొందరు దీనికి ప్రభుత్వం ఉండటం కూడా నిబంధనగానే పేర్కొన్నారు. వివరణ మున్ముందు వస్తుంది.*

★★ *ఇహ్యాఉ ఉలూముద్దీన్. సం.2, పు. 274-284, ఈ నిబంధనలు ఇమామ్ గజాలీ 'ఇహ్తిసాబ్' లేదా విమర్శనకు సంబంధించినవిగా చెప్పారు. మరి స్వయాన విమర్శన విషయంలో ఇలా అన్నారు:*

**విమర్శన అన్నది అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ ఉన్నటువంటి కార్యం. (పు.274)**

**هی عبارة شاملة للامر بالمعروف والنهی عن المنکر (ص ۲۷۴)**

*ఈ విషయంలో అల్లామా మావర్దీ ఇలా అన్నారు :*

**విమర్శన అంటే బాహాటంగా ఒక మారూఫ్‌ని వదిలేసిన సందర్భంలో దాన్ని ఆదేశించడం; అలాగే బాహాటంగా ఒక మున్కర్‌కు ఒడిగడుతున్నప్పుడు దాన్ని నిరోధించడం.**

*(అల్ అహ్కాముస్సుల్తానియ్య. పు. 231)*

**الحسبة هی امر بالمعروف اذا اظهر ترکه و نهی عن المنکر اذا اظهر فعله (الاحکام السلطانیة (ص ۲۳۱)**

*ఇహ్తిసాబ్ లేదా విమర్శనలో మారూఫ్‌ని ఆదేశించడం, మున్కర్‌ని నిరోధించడం ఉందన్నమాటలో సందేహం లేదు. కాని అది కేవలం 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్' కాదు. అది కేవలం అందులో ఒక విభాగం మాత్రమే.*

విధి అవుతుందో, మరెటువంటి పరిస్థితుల్లో అది విధికాదో ద్యోతకమవుతుంది. ఈ నిబంధనలన్నింటిపైన ముమ్ముందు చర్చిద్దాం. అప్పుడే అవి ఎంతవరకు సరయినవో, లేదా అవి బలహీనమయినవో తేలుతుంది. తొలుత సిహత్ (సరయినదనడానికి) నిబంధనల్ని పరిశీలిద్దాము.

---

ఎందుకంటే 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'అన్నది 'ఇహ్తిసాబ్' లేదా విమర్శన కన్నా అధికమయిన విస్తృతార్థం గల పరిభాష. ఇహ్తిసాబ్ అన్నది సముదాయంలో అంతర్గత సంస్కరణకు సంబంధించిన విషయం. అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ అన్న దానిలో సముదాయంలో సంస్కరణతో పాటు సందేశ ప్రచారం, జిహాద్, రాజకీయాలు కూడా చేరి ఉన్నాయి. అందువల్ల ఇహ్తిసాబ్‌కు సంబంధించిన నియమాలు మూలతః అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌కు సంబంధించిన విస్తృత కార్యానికి నిబంధనలు కావు, కేవలం సముదాయ సంస్కరణకు సంబంధించినంతవరకు వర్తించే నిబంధనలు. అయితే ఇహ్తిసాబ్ (విమర్శన) అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌లోని అంతర్ భాగమే గనక, దాని వివరాలు అటుంచి, ఇహ్తిసాబ్‌కు తగిన నిబంధనలు అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ విస్తృత కార్యానికీ కొంతవరకు నిబంధనలు కాగలుగుతాయి.

# సరయినదనడానికి నిబంధనలు

## ఈమాన్ (విశ్వాసం)

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కొరకు తొలి నిబంధన లేదా నియమం ఈమాన్ (విశ్వాసం). మూ'మిన్ (విశ్వాసి) మాత్రమే మారూఫ్‌ని ఆదేశించే మున్కర్‌ని నిరోధించే కార్యాన్ని నిర్వర్తించగలడు. ఈ నిబంధనకు కారణంగా ఇమామ్ గజాలీ ఇలా అంటున్నారు :

هٰذا نصرةٌ للدين فكيف يكون من اهله من هو جاحد لأصل الدين

**'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్' అన్నది ధర్మానికి సహాయపడటం. అసలు ధర్మాన్నే నిరాకరించినవాడు, దానికి విధేయుడు కానివాడు, ఈ కార్యానికి ఏవిధంగా అర్హుడవుతాడు?** *(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 339)*

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్** మున్కర్ అన్నది ధర్మానికి సహాయపడే, దాన్ని సమర్థించే కార్యం కాబట్టి సహజంగానే దీనికి తగినవారు కూడా ధర్మాన్ని నమ్మేవారే. ఈ కార్యభారం కూడా వారిపైనే విధితమవుతుంది. పోతే ఈ ధర్మాన్ని అసలు విశ్వసించనివారయితే ఈ కార్యానికి తగినవారు కారు, వారిపైన దీని బాధ్యత మోపడం జరగలేదు. అల్లామా అబ్దుల్ కాదిర్ ఔదహ్ షహీద్, ముస్లిమేతరులకు **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** బాధ్యత నుండి వినాయింపునివ్వడం ఇస్లామ్‌లో సహిష్ణుతాభావానికి నిదర్శనం అని అంటారు, ఎందుకంటే ఆయన ప్రకారం:

> "**మారూఫ్** వ మున్కర్ అన్నది షరీఅత్ మొత్తాన్ని ఆవరించి ఉన్న విషయం. ఒకవేళ ఒక ముస్లిమేతరునిపైన **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్** మున్కర్‌ని విధిగా నిర్ణయించినట్లయితే అతను సయితం ఓ ముస్లిమ్ వ్యక్తికి ఉన్న విశ్వాసాలే కలిగి వుండటం అనివార్యమవు

తుంది, ఓ ముస్లిమ్ చెప్పే లేదా చెప్పగలిగే మాటే చెప్పవలసి ఉంటుంది. ఇలాంటి అనివార్య స్థితి 'ఇక్రాహ ఫిద్దీన్' (ధర్మంలో బలాత్కారం)గా పరిగణించబడుతుంది, దానికి ఇస్లామ్‌లో ఎట్టి పరిస్థితిలోనూ అనుమతి లేదు. వాస్తవానికి ఈ నిబంధన ద్వారా ఇస్లామీయ రాజ్యంలోని ముస్లిమేతరులకు ఏ విశ్వాసమయినా కలిగి ఉండేందుకు, ఏ నమ్మకాన్నయినా నమ్మి మరే నమ్మకాన్నయినా తిరస్కరించేందుకు సంపూర్ణ స్వేచ్ఛనివ్వడం జరిగింది. వారిపైన ఎటువంటి బలాత్కారం లేదు". *(అత్ తష్రీయిల్ జనాయిల్ ఇస్లామీ : 1/497)*

## అదాలత్ (ధర్మనిష్ఠ)

కొందరి ప్రకారం, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** కార్యాన్ని చేపట్టడానికి మనిషి స్వయంగానూ మారూఫ్‌ని అమలుపరిచే, మున్కర్‌కు దూరంగా ఉండేవాడయి ఉండాలన్నది తప్పనిసరి. ఎవరయితే మారూఫ్‌ని అమలుపరచడో మున్కర్‌కు దూరంగా మసలుకోడో అతనికి **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**ని చేపట్టే హక్కు లేదు. ఎందుకంటే ఇతరులకు సత్కార్యాల పట్ల పిలుపునిచ్చి స్వయంగా సత్కార్యాలకు దూరమయిన జనుల్ని కుర్‌ఆన్ హదీసుల్లో తీవ్రంగా విమర్శించడం, ఖండించడం జరిగింది. పరమోన్నత ప్రభువు ఇలా సెలవిచ్చాడు :

اَتَاْمُرُوْنَ النَّاسَ بِالْبِرِّ وَ تَنْسَوْنَ اَنْفُسَكُمْ (البقرة:٤٤)

**మీరు రుజువర్తనాన్ని అనుసరించమని ఇతరులకయితే ఉపదేశిస్తున్నారు కాని మీ గురించి మీరు మరచిపోతున్నారా?** *(అల్ బకర : 44)*

يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا لِمَ تَقُوْلُوْنَ مَا لَا تَفْعَلُوْنَ كَبُرَ مَقْتًا عِنْدَ اللّٰهِ اَنْ تَقُوْلُوْا مَا لَا تَفْعَلُوْنَ (الصّف)

**విశ్వసించిన జనులారా, మీరు స్వయంగా ఆచరించని విషయాలను ఇతరులకు చెబుతారెందుకు? మీరు స్వయంగా ఆచరించని విషయాన్ని ఇతరులకు చెప్పడం అల్లాహ్‌కు సుతరామూ ఇష్టంలేదు.** *(అస్ సఫ్ - 2,3)*

ఇదేవిధంగా హదీసుల్లో ఆచరణా శూన్యులయిన బోధకుల్ని తీవ్రంగా ఖండించడం జరిగింది. ఇవన్నీ వ్రాతపూర్వకమయిన ఆధారాలు. పోతే, బౌద్ధికంగా చూసినా

ఆచరణా శూన్యుడయిన వ్యక్తి ఇతరుల్ని ఆచరణ కొరకు ఉపదేశించడం, తాను ఆచరించని దాన్ని ఇతరులకు ప్రచారం చెయ్యడం సరయినది కాదు. స్వీయ సంస్కరణ, పరుల సంస్కరణపైన ప్రాధాన్యం కల అంశం. స్వయంగా రుజు మార్గాన నడవడం, ధర్మంపైన నిలకడ చూపడం మౌలిక విషయం. మరి ఇతరులకు దారి చూపడం, ధర్మం పట్ల సుస్థిరతకు ప్రచారం చెయ్యడం దాని ఉప విషయం. అసలు మూలమే లేకపోయినట్లయితే శాఖలు, ఉపశాఖలు ఎలా ఉత్పన్నమవుతాయి, ఎక్కణ్ణుంచి వస్తాయి? మనిషి స్వయంగా సంస్కారవంతుడవడం మూలధనం వంటిది, ఇతరుల సంస్కరణ అన్నది దాని జకాత్ వంటిది. అసలు మూలధనమే లేకపోతే జకాత్ దేనికి చెల్లిస్తారు?

ఇమామ్ గజాలీ దీనికి జవాబుగా ఇలా వ్రాశారు :

**كل ما ذكروه خيالاَت و انما الحق ان للفاسق ان يحتسب و برهانه هوان نقول: هل يشترط فى الاِحتساب ان يكون متعاطيه معصوماً عن المعاصى كلها؟ فان شرط ذلك فهو خرق للاجماع ثم حسم لباب الاِحتساب اذ لا عصمة للصحابة فضلا عمن دونهم**

**ఇలా జనం చెప్పినవన్నీ కేవలం నిరాధారమయిన అభిప్రాయాలు. నిజం ఏమిటంటే, పాపాతురునికి కూడా విమర్శనాధికారం ఉంది. ఆధారం ఏమిటంటే, విమర్శనా విధిని నిర్వర్తించే వ్యక్తి సకల పాపాల నుండి విముక్తుడయిన, ఏ పాపమెరుగని నిరపరాధి కావడం తప్పనిసరియా? ఒకవేళ ఈ నిబంధనను పెట్టినట్లయితే ఇది సముదాయ సమిష్టి అభిప్రాయానికి విరుద్ధమయినది. పైగా ఇలా నిబంధన పెట్టడం విమర్శనా ద్వారాన్ని మూసివేయడమే అవుతుంది. ఎందుకంటే ఇతరుల మాట అటుంచి స్వయంగా సహాబా (ప్రవక్త సహచరులు) కూడా ఏ పాపమెరుగని నిరపరాధులు (మాసూమ్) కారు.**

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 240)*

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కొరకు ఎవరు తక్వా లేదా ధర్మనిష్ఠను, సదాచరణను షరతు (నిబంధన)గా నిర్ణయిస్తారో వారి ఉద్దేశం ప్రతి చిన్న పెద్ద దోషం లేకుండా నిరపరాధిఅయి, పరిశుద్ధుడయి ఉండాలన్నది కాదు. వారి

భావంలో అతనిలో పెద్దపెద్ద సదాచరణలు ఉండాలి, మహాపాపాల నుండి తప్పించుకుని ఉండేవాడయి ఉండాలి అన్నదే. ఇమామ్ గజాలీ ఈ విషయాన్నీ విమర్శిస్తారు. ఆయన వాదన ఏమిటంటే ఒక సారాయి తాగేవాడు జిహాద్‌లో పాల్గొనగలిగినప్పుడు, పాల్గొంటూ ఉన్నప్పుడు, ఒక వ్యభిచారి హత్యను వారించగలిగినప్పుడు ఇటువంటి నిబంధనకు అర్థం లేదని ఆయన అంటారు. ఆయన అనేదేమిటంటే స్వయంగా తాను పాపానికి దూరంగా ఉండటం వేరు, ఇతరుల్ని పాపానికి పాల్పడకుండా నిరోధించడం వేరు, రెంటినీ సమంగా ఎంచడం సరయినది కాదు. పాపం చేసే ఒక వ్యక్తి ఇలా చెప్పగలడు:

**يجب علىّ الاِنتهاء و النهى فمن اين يلزمنى من العصيان باحدهما ان اعصى الله تعالىٰ بالثانى، و اذا كان النهى واجبا علىّ فمن اين يسقط وجوبه باقدامى**

**పాపాలకు పాల్పడకుండా స్వయంగా వాటికి దూరంగా మెలగటం, ఇతరుల్ని నిరోధించడం రెండు కార్యాలూ నాపైన విధి అయినవే. వీటిలో ఒకదాని పట్ల అవిధేయత జరిగినట్లయితే రెండవ వ్యవహారంలోనూ నేను దైవం పట్ల అవిధేయత జరపాలన్నది తప్పనిసరి ఎలా అవుతుంది. మున్కర్ (చెడుగు)ను నిరోధించడం నాపైన తప్పనిసరి అయినప్పుడు, నేను మున్కర్‌కి పాల్పడటం వల్ల, ఆ విధి నాపైనుంచి ఎలా తొలగిపోతుంది.**

***(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/340)***

ఇమామ్ గజాలీ ఈ క్రమంలో సూత్రప్రాయంగా ఇలా చెబుతారు :

**اصلاح الغير لاَ يراد لِاِصلاح النفس، و لاَ اصلاح النفس لاصلاح الغير، فالقول بترتب احدهما على الاٰخرة تحكم**

**ఇతరుల సంస్కరణ తన సంస్కరణ కొరకు కోరబడదు, అలాగే తన సంస్కరణ ఇతరుల సంస్కరణ కొరకు కోరబడదు. అందువల్ల వీటిలో ఒకటి మరొక దానిపైన ఆధారపడి ఉందని చెప్పడం కేవలం నిరాధారమయిన వాదన.** ***(ఇహ్యాఉ ఉలూముద్దీన్: 2/ 340)***

వాస్తవమేమిటంటే అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ ఒక స్థిరమయిన విధి. దీన్ని నిర్వర్తించడానికి, తొలుత ఇతర విధులన్నీ నిర్వర్తించిన తరువాత దీన్ని నిర్వర్తించాలన్న నిర్బంధం ఏదీ లేదు. షరీఅత్‌లోని ప్రతి విధి కూడా కోరేదేమిటంటే

అది నిర్వర్తించే సమయం వచ్చినప్పుడు దాన్ని తప్పనిసరిగా నిర్వర్తించవలసిందే. తదితర విధులు నిర్వర్తించబడుతున్నాయా లేదా అన్న ప్రసక్తి ఇక్కడ తలెత్తదు. ఇదే విషయాన్ని అల్లామా అబూ బక్ర్ జస్సాస్ ఇలా నుడివారు :

**ان ترک الاِنسان لبعض الفروض لا يسقط عنه فروضا غيره، الا ترى ان تركه للصلوٰة لا يسقط عنه فرض الصوم و سائر العبادات، فكذالک من لم يفعل سائر المعروف ولم ينته سائر المناكير فان فرض الاَمر بالمعـروف و النهى عن المنكر غير ساقط عنه**

**మనిషి కొన్ని విధుల్ని వదిలేసినట్లయితే అది అతన్నుండి ఇతర విధుల్ని తొలగించదు. అతను నమాజ్‌ను వదిలేసినట్లయితే దాని కారణంగా రోజా (ఉపవాసవ్రతం) తదితర ఆరాధనలు అతన్నుండి తొలిగిపోవు. అలాగే ఒక వ్యక్తి సకల మారూఫాత్ (సత్కార్యాల)ను అమలు జరపకపోయినా, సమస్త మున్కరాత్ (చెడుగుల)ను వదలకపోయినా దీని కారణంగా అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ విధి అతన్నుండి తొలగిపోదు.**

*(అహ్కాముల్ కుర్ఆన్ : 2/42)*

ఆచరణా శూన్యులయిన మానవులు ఇతరులకు ప్రచారం చెయ్యడం పట్ల మరో కోణంలోనూ పరిశీలించవలసి ఉంటుంది. సాధారణంగా ప్రపంచంలో ఆచరణ రీత్యా పరిపక్వం చెందినవారి మాటలనే జనం వింటారు. స్వీకరిస్తారు. ఎవరి శీల స్వభావాల ద్వారా వారి ఆలోచనల ధ్రువీకరణ జరుగుతుందో వారి మాటలే ప్రజలకు స్వీకారయోగ్యమవుతాయి. దీనికి భిన్నంగా దుర్వర్తనులయిన మనుషుల ప్రచారం సర్వసాధారణంగా వృధా అయిపోతుంది, దాని ప్రభావం ఏమాత్రం పడదు. ఉదాహరణకు ఓ దుర్వర్తనుడయిన వ్యక్తికి ఎప్పుడయినా తాను **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**ని నిర్వర్తించడం నిష్ప్రయోజనమే అవుతుందన్నమాట ధ్రువపడితే, అటువంటి పరిస్థితిలోనూ అతనికి ఈ కార్యం విధిగానే నిలుస్తుందా, దాన్ని అతను నిర్వర్తించకపోతే అతన్ని పట్టుకోవడం జరుగుతుందా? ఇమామ్ గజాలీ దీనికి ఇలా అంటున్నారు:

**من علم ان قولهٗ لاَ يقبل فى الحسبـة لعلم الناس بفسقـه فليس عليه الحسبة بالوعظ اذ لا**

**ఏ వ్యక్తికి తాను విమర్శన చేసినట్లయితే తన దుశ్చరిత కారణంగా తన మాట వినిపించుకోబడదని తెలుస్తుందో అతనికి ఉపదేశం,**

فائدة فی وعظه فالفسق یوثر فی اسقاط فائدة کلامه ثم اذا سقطت فائدة کلامه سقط وجوب الکلام

ప్రబోధనల ద్వారా విమర్శనా బాధ్యత తప్పనిసరి కాదు. ఎందుకంటే అతని బోధన, ఉపదేశాల వల్ల ప్రయోజన ముండదు. కారణం అతని దుర్వర్తనా భూయిష్టమయిన జీవితం అతని మాట ప్రయోజకత్వాన్ని నష్టపరచడానికి ప్రభావవంతమవుతుంది. అతని మాట నిష్ప్రయోజనమయినప్పుడు అతను మాటలాడడం పట్ల గల విధి కూడా తొలిగిపోతుంది.

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్: 2/ 341)*

ఈ విషయం కేవలం నోటి ఉద్బోధ, ఉపదేశం వరకు వర్తిస్తుంది. కాని అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కార్యానికి మరో రూపం కూడా ఉంది, అది మనిషి తన శక్తి ద్వారా మారూఫ్ (మంచి)ని స్థాపించడం, మున్కర్ (చెడు)ను తుడిచి పెట్టడం. దీనికి మనిషి సదాచారుడు, ధర్మనిష్ఠగలవాడు కావాలన్న నిబంధన లేదు. ఎవడయినా దుర్వర్తనుడు, పాపాతురుడు శక్తి గలవాడయినట్లయితే అతను తన శక్తిని అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కార్యం కొరకు వినియోగించదలిస్తే వినియోగించవలసిందే. ఇమామ్ గజాలీ ఇలా అంటారు :

اما الحسبة القهرية فلا یشترط فیها ذلک، فلا حرج علی الفاسق فی اراقة الخمور و کسر الملاهی و غیرها اذ قدر

పోతే, శక్తితోటి జరిపే విమర్శనా క్రియ విషయానికి వస్తే ఇందులో ఈ (తక్వా, సద్వర్తన) నిబంధన లేదు. పాపాతురుడు సారాయి పారవేయడమయినా, వినోద వాయిద్యాలను విరగ్గొట్టడమయినా, తన చేతనయితే చెయ్యగలిగితే, అందులో తప్పు లేదు.

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్: 2/ 341)*

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కార్యనిర్వహణకు ఎవరయితే సదాచారం, ధర్మనిష్ఠ (తక్వా)ని నిబంధనగా నిర్ణయించారో, మునుపు పేర్కొన్నట్లు దివ్యకుర్ఆన్‌లోని రెండు ఆయత్‌లను వారు ఆధారంగా చూపెట్టారు. ఇమామ్ గజాలీ వాటిని గురించి ఇలా అన్నారు :

اما الأيات التى استدلوا بها فهو انكار عليهم من حيث تركهم المعروف لاَ من حيث امر هم و لٰكن امرهم دل على قـوة علمهم وعقاب العالم اشد لاَنه لاَ عذرله مع قوة علمه

ఏ ఆయత్‌లను వారు ఆధారంగా పేర్కొన్నారో వాటిలో ఆచరణా శూన్యులయిన మనుషుల పట్ల వారి విమర్శనా కోణం, వారు మారూఫ్‌ను అమలు పరచకుండా దాన్ని వదిలివేశారన్నదే, కాని వారు అమ్ర్ బిల్ మారూఫ్ విధిని నిర్వర్తించారని కాదు. వారు మారూఫ్‌ని ఆదేశించడాన్ని బట్టి, వారికి 'జ్ఞాన' శక్తి ఉందన్న ఆధారం ధ్రువపడుతోంది. (అయినప్పటికీ వారు ఆచరణాలోపంలో పడిపోయారంటే) జ్ఞానం ఉన్న వ్యక్తికి విధితమయ్యే శిక్ష మరింత కఠినమయినదన్నది వాస్తవం. జ్ఞానశక్తి కారణంగా వారికి ఇక మరే సాకూ మిగులదు.

*(ఉహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 242)*

ఈ సందర్భంలో హజ్రత్ సయీద్ బిన్ జుబైర్ ఎంతో యదార్థబద్ధమయిన, సహజసిద్ధమయిన మాట పలికారు. ఆయన ఇలా అన్నారు :

لوكان المرء لاَ يامر بالمعروف و لاَ ينهى عن المنكر حتى لاَ يكون فيـه شيئ ما امـر احد بمعروف ولاَ نهى عن منكر

ఒకవేళ అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కొరకు మనిషిలో ఎటువంటి లోపం ఉండరాదన్నది నిబంధన అయినట్లయితే ఏ వ్యక్తి కూడా మారూఫ్‌ని ఆదేశించలేడు. మరి మున్కర్‌ని ఆపనూ లేడు.

ఇమామ్ మాలిక్ ఈ మాట విని ఇలా అన్నారు :

صـدق، من ذا الـذى ليس فيـه شىء

(సయీద్ బిన్ జుబైర్ రహ్మ) నిజం పలికారు. ఎటువంటి లోపమూ లేని వ్యక్తి ఎవడున్నాడనీ?

*(తఫ్సీర్ ఇబ్ను కసీర్: 1/ 204)*

ఇది ఈ విషయంలో సూత్రప్రాయమయిన చట్టబద్ధమయిన విషయం. కాని మనిషి మాటల్లోనూ చేతల్లోనూ సమానుకూలత ఉండటం తప్పనిసరి అన్న విషయంలోనూ, దాని ప్రాముఖ్యత పట్లనూ ఎవరికీ భేదాభిప్రాయం లేదు. హాఫిజ్ ఇబ్ను కసీర్ ఇలా అన్నారు:

ذهب بعضهم الى ان مر تكب المعاصى لاَ ينهى غيره، وهٰذا ضعيف ... و الصحيح أن العالم يأمر بالمعروف وإن لم يفعله، وينهى عن المنكر وان ارتكب ... لكنه و الحالة هٰذه مذموم على تركه الطاعة و فعله المعصية لعلمه بها و مخالفته على بصيرة فانه ليس من يعلم كمن لاَ يعلم

కొందరు, పాపాలకు లోనయి ఉన్నవాడు ఇతరుల్ని పాపాల నుంచి ఆపలేడు అని అంటారు. కాని ఈ అభిప్రాయం బలహీన మయింది... నిజమేమిటంటే జ్ఞానమున్న వ్యక్తి మారూఫ్‌ని ఆదేశిస్తాడు, అతను దాన్ని అమలు జరపకపోయినప్పటికీ; అలాగే మున్కర్‌ని వారి స్తాడు కూడా, దానికి అతను స్వయాన పాల్పడే వాడయినా సరే. కాని అతని ఈ స్థితి నిశ్చి యంగా ఖండనీయం, ఎందుకంటే అతను తెలిసీ మంచిని అనుసరించడం లేదు, చెడు గుకు పాల్పడుతున్నాడు; జ్ఞానముండి వ్యతిరేక వైఖరినవలంబించాడు. ఎందుకంటే తెలిసిన వ్యక్తి తెలియని వ్యక్తి లాంటివాడు కాడు కదా!

*(తఫ్సీర్ ఇబ్నుకసీర్ : 1/ 204, 205)*

ఇతరులకు ధర్మప్రచారం చెయ్యడం, తన ఆచరణ ద్వారా దానికి విరుద్ధంగా నడుచుకోవడం ధర్మం ఎడల విచ్చలవిడిగా పరిహాసమే. దీనివల్ల ధర్మగౌరవం దెబ్బ తింటుంది. దాని మహత్తు గాయపడుతుంది. ఆచరణ శూన్యత విశ్వాస బలహీనతకు ఆధారం మాత్రమే కాదు, దానివల్ల పలికేవాని మాటలోనూ ఎటువంటి విలువ మిగు లదు. కుర్‌ఆన్ కోరేదేమిటంటే మీరేదయితే చెబుతారో దాన్ని స్వయంగా మీరున్నూ ఆచరించండి, ద్వంద్వ స్వభావం, ద్వంద్వ వైఖరిని అవలంబించకండి; మాటలయితే దైవదూతల వలె అమాయకత్వం ఉట్టిపడేలా ఉంటే శీల స్వభావాలేమో పిశాచాలు కూడా రక్షణ కోరే విధంగా రూపొందించకండి. హజ్రత్ షుఅయ్‌బ్ (అలైహిస్సలామ్) అల్లాహ్ సందేశహరులు. దేవుని ధర్మం మానవులకు చేరవేస్తూ ఉండేవారు. కాని మాటలు, చేతల ప్రాముఖ్యతను ప్రకటిస్తారు- ఏ దౌష్ట్యాల నుండి మిమ్మల్ని వారిస్తు న్నానో స్వయంగా వాటిలో లీనమయి లేను- మీరు ఆచరణా శూన్యుడయిన బోధకు డని చూపోవు వహించి వదలి వేయడానికి!

وَ مَا اُرِيْدُ اَنْ اُخَالِفَكُمْ اِلٰى مَا اَنْهَاكُمْ عَنْهُ اِنْ اُرِيْدُ اِلَّا الْاِصْلَاحَ

మరి నేను మిమ్మల్ని ఏ పనుల నుండి వారిస్తు న్నానో వాటికి స్వయంగా నేనే పాల్పడాలని ఎన్నటికీ కోరుకోవడంలేదు. నేనయితే నాకు

مَااسۡتَطَعۡتُ (ھود:٨٨) సాధ్యమయిన మేర సంస్కరించాలనే కోరు కుంటున్నాను. *(హూద్: 88)*

ప్రవక్త మహనీయులు(స) ఆచరణ శూన్యులయిన బోధకుని గురించి, అతణ్ని ప్రళయదినాన నరకంలో పడవేయటం జరుగుతుందని అన్నారు; అతను అందులోనే తిరుగుతూ ఉంటాడు. అతన్ని చూసి నరకవాసులు అడుగుతారు;

**اَلَسۡتَ کُنۡتَ تَاۡمُرُ بِالۡمَعۡرُوۡفِ وَ تَنۡھٰی عَنِ الۡمُنۡکَرِ**

**నీవు మారూఫ్‌ని ఆదేశించేవాడివికావా, మున్కర్‌ని వారించేవాడివీ కావా? (మరి ఇక్కడ కానవస్తున్నావేమిటీ?)**

దానికి అతను సమాధానమిస్తాడు:

**اِنِّی کُنۡتُ اٰمُرُ بِالۡمَعۡرُوۡفِ وَلَا اَفۡعَلُہٗ وَانۡھٰی عَنِ المنکر وَ افعلہ**

**నిజమే, నిస్సందేహంగా నేను మారూఫ్‌ని ఆదేశించేవాడినే, కాని దాన్ని నేనే ఆచరించే వాడిని కాను. ఇంకా మున్కర్‌ని వారించే వాడినే కాని స్వయంగా నేనే దానికి పాల్పడే వాడిని.**

*(బుఖారీ, కితాబుల్ ఫితన్, బాబు అల్ ఫిత్న అతుల్లతీ తమవ్వుజు క మౌజిల్ బహ్ర్)*

## ప్రభు సత్తా లేదా దాని అనుమతి

కొందరి అభిప్రాయంలో **అమ్ర్ బిల్ మారూఫ్** వ **నహీ అనిల్** మున్కర్ సామాన్య జనులు చేసే కార్యం కాదు. దీన్ని ఆ కాలపు అధికార సత్తా నిర్వర్తించగలదు లేదా ప్రభుత్వం అనుమతి పొందినవారు నిర్వర్తించగలరు.

మొదట మనం ఓ ప్రశ్నను పరిశీలిద్దాము, **అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్** మున్కర్ కేవలం అధికారుల విధియా లేదా సామాన్య జనులు కూడా బాధ్యులా?

**అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్** మున్కర్ అన్న దానిలో కొన్ని సందర్భాలలో బలప్రయోగం కూడా అవసరమవుతుందన్న విషయంలో సందేహం లేదు. అయితే దీనివల్ల సామాన్య జనులకు దీని పట్ల ఎటువంటి బాధ్యత లేదని అనుకోవడం సరయినది కాదు. ఇంకా మనిషి వద్ద అధికార సత్తా, ప్రభుత ఉంటేనే దీన్ని నిర్వర్తించడం జరుగుతుందని అనుకోవడమూ సరయినది కాదు. ఇది కొన్ని స్పష్టమయిన

హదీసులకు వ్యతిరేకమయిన భావన. ఆ హదీసుల్లో దుర్మార్గులు, దౌర్జన్యపరులయిన పాలకులను ఎదిరించి సత్యం, న్యాయాలను వెల్లడించడాన్ని ప్రశంసించడం జరిగింది. ఇక్కడ అటువంటి రెండు హదీసుల్ని ప్రస్తుతపరుస్తున్నాము:

افضل الجهاد كلمة عدلٍ عند سلطان جائر

**అన్నింటికన్నా మహత్పూర్వకమయిన జిహాద్, దౌర్జన్యపరుడయిన పాలకుని సమక్షంలో న్యాయవచనం పలకడం.** *(అబూదావూద్, కితాబుల్ మలాహిమ్, బాబు అల్ అమ్ర్ వన్నహీ)*

మరో హదీసులో పదాలు :

سيّد الشهداء حمزة بن عبد المطلب و رجل قام الىٰ امام جائر فامره و نهاه فقتله

**అమరగతులకు నాయకుడు మహనీయ హమ్జా బిన్ అబ్దుల్ ముత్తలిబ్. ఇంకా ఏ వ్యక్తి అయితే దుర్మార్గుడయిన నాయకుని సమక్షంలో నిలబడి అతనికి మంచిని ఆదేశిస్తాడో, చెడును వారిస్తాడో, ఫలితంగా అతన్ని ఆ నాయకుడు సంహరిస్తాడో ఆ వ్యక్తి కూడా షహీద్ అమరగతి నొందిన వాడవుతాడు.**

*(తిర్మిజీ, హాకిమ్, (అత్తర్గీబ్ వ త్తర్హీబ్: 3/ 158)*

ఇమామ్ నవవీ (రహ్మ) ఇలా నుడివారు :

قال العلماء و لاَ يختص الاُمر بالمعروف و النهى عن المنكر باصحاب الولاَيات بل ذلك ثابت لآحاد المسلمين، قال امام الحرمين: و الدليل عليه اجماع المسلمين فان غير الولاَة فى الصدر الاُول والعصر الذى يليه كانوا يامرون الولاَة بالمعروف و ينهونهم عن المنكر، مع تقرير المسلمين اياهم وترك توبيخهم

**ఉలమా (ధర్మవేత్తల) ప్రకారం, అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కార్యం అధికారులకు ప్రత్యేకం కాదు. ఈ ఆదేశం సామాన్య ముస్లిములకూ వర్తిస్తుందన్నది నిర్ధారిత విషయం. ఇమాముల్ హర్మైన్ ప్రకారం, ముస్లిమ్ ధర్మవేత్తల ఇజ్మా (ఏకాభిప్రాయమే) దీనికి నిదర్శనం. ఎందుకంటే ప్రారంభ కాలంలోనూ దాని సమీప కాలంలోనూ, అధికారులు కానివారు కూడా అధికారులకు మారూఫ్ పట్ల ఆదేశమిచ్చేవారు, మున్కర్‌ని గురించే వారించేవారు. వారి ఈ ఆచరణ పట్ల సాధారణ**

على التشاغل بالأمر بالمعروف و النهى عن المنكر من غير ولاية

**ముస్లిములు మౌనం వహించేవారు, దీన్ని గురించి ఎవ్వరూ వారితో పరుషంగా కఠినంగా మాటలాడలేదు. వారు ఎటువంటి అధికారం, హోదా లేకుండానే అధికారుల్ని మారూఫ్ ఎడల ఆదేశించేవారు, ముస్కర్ ఎడల వారించే వారు.** *(షర్హ్ ముస్లిమ్: సం. 1, భాగం 2, పు. 21)*

హజ్జ్ సూరాలో కుర్ఆన్, విశ్వాసుల ఓ లక్షణాన్ని వివరించింది- 'వారికి మేము భువిలో అధికారం కట్టబెట్టినట్లయితే వారు నమాజ్‌ని స్థాపిస్తారు, జకాత్ చెల్లిస్తారు, ప్రసిద్ధ సదాచారాలను (మారూఫ్‌ను) ఆదేశిస్తారు, దురాచారాలను (ముస్కర్‌ను) అరికడతారు; (ఆయత్: 41). **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్** ముస్లిమ్ పాలకుల ప్రత్యేక లక్షణం కాదనడానికి, ఇది ప్రతి ముస్లిమ్ వ్యక్తి విధి అనడానికి, దీన్ని నిర్వర్తించకుండా ఎవ్వరూ అతన్ని ఆపలేడనడానికీ ఇది స్పష్టమయిన ఆధారం. హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (రహ్మా) హజ్జ్ సూరాలోని ఈ ఆయత్‌ని గురించి ఇలా అంటారు :

الا انها ليست على الوالى وحده و لكنها على الوالى والمولىٰ عليه

**వినండి, ఇది కేవలం పాలకునికి మాత్రమే కాదు, పాలకునికీ, పాలితునికీ ఉభయులకూ వర్తిస్తుంది.** (తఫ్సీర్ ఇబ్ను కసీర్: 5/ 448)

ఇక మరో కోణంలో దీన్ని పరిశీలిద్దాము. **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్** ముస్కర్ తత్వాల పాలకుని ఆనతితోనే నిర్వర్తించవీలుందా? లేదా దీనికి అనుమతి అవసరం లేదా?

ఎవరయితే **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్** కొరకు పాలకుని అనుజ్ఞ అవసరమని అంటారో వారి దృష్టిలో వాస్తవానికి ఈ పనిని సంఘటితంగా నిర్వర్తించడం ప్రముఖంగా ఉంది. వారనేదేమంటే ప్రతి వ్యక్తికి ఈ పని చేసే అనుమతి ఇచ్చి వేసినట్లయితే ఇందులో ఓ క్రమపద్ధతి అంటూ, సువ్యవస్థ అంటూ ఉండదు, అంతేకాక కొన్ని సందర్భాలలో పని చెడిపోయే ప్రమాదమూ ఉంది. అయితే ఇమామ్ గజాలీ (రహ్మా) ఈ నిబంధనకు వ్యతిరేకి అయినప్పటికీ దానికి మద్దతుగా ఇలా అంటారు:

ربما ينتدب لها من ليس اهلا لها لقصور معرفته او قصور ديانته فيؤدى ذٰلك الى وجوه من الخلل

కొన్ని సందర్భాలలో ఈ విధిని, జ్ఞానం, విశ్వసనీయత, ధర్మనిష్ఠలో లోపం కారణంగా ఈ బాధ్యతకు అర్హుడు కానివాడు నిర్వర్తించడానికి పూనుకుంటాడు. ఇది ఎన్నో చెడుగులకు మూలమవుతుంది. *(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/348)*

అల్లామా అబ్దుల్ కాదిర్ ఔదహ్ షహీద్ (రహ్మ) ఇలా అంటున్నారు :

و الّذين يشترطون اذن الاِمام يقصدون من هذا الشرط تنظيم الاَمر بالمعروف والنهى عن المنكر

ఎవరయితే ఈ కార్యం కొరకు పాలకుల అనుమతిని నిబంధనగా పేర్కొంటారో వారసలు అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కార్యానికి ఓ సంస్థ, సంఘటిత వ్యవస్థను కోరుతున్నారు. *(అత్ తష్రీఉల్ జినాయిల్ ఇస్లామీ :1/501)*

ఖుర్ఆన్, హదీసుల్లో అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌కు సంబంధించిన నిర్దేశాలన్నీ సర్వసాధారణమయినవి, అందరికీ వర్తించేవి. అందువల్ల ధర్మవేత్తలు ఈ నిబంధనను అనవసరమని నిర్ణయించారు, ఈ నిబంధనను అంగీకరించలేదు. ఇమామ్ గజాలీ ఇలా అంటున్నారు :

هٰذا الاِشتراط فاسد، فان الاٰيات والاَخبار التى أوردنا ها تدلّ على ان كل من رأى منكرًا فسكت عليه عصى، اذ يجب نهيه اينما راه و كيف ما راه على العموم، فالتخصيص بشرط التفويض

ఈ నిబంధన తప్పయినది. ఎందుకంటే ఈ విషయంలో మేము ఉటంకించిన ఆయత్‌లు, హదీసులు పూర్తిగా సామాన్యమయినవి, సామాన్యంగానే రూఢపరిచేదేమంటే ఏ వ్యక్తి ఓ మున్కర్ (చెడుగు)ను చూసి మౌనం వహిస్తాడో అతను దేవుని పట్ల అవిధేయతకు పాల్పడ్డాడు. ఎందుకంటే ఎక్కడయినా, ఏ స్థితిలో నయినా మున్కర్‌ని చూసినట్లయితే దాన్ని ఆపాలి, నిరోధించాలి. ఈ సామాన్య ఆదేశంలో, ఇటువంటి నిబంధన పెట్టి ప్రత్యేకతను సృజించడం, పాలకుని తరఫున ఈ బాధ్యత అప్పగించబడినప్పుడే నహీ అనిల్ మున్కర్

من الامـــام تحكم لاَ اصل لـه

(చెడుగును నిరోధించడం) తప్పనిసరి అనడం, నిరాధారమయిన వాదన, దీనికి ఎటువంటి మూలమే లేదు.

(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 342)

ఇదే చర్చలో ఇతఃపూర్వమే కొన్ని హదీసులు ఉటంకించబడ్డాయి. వాటిలో అధికారుల దౌర్జన్యాలకు ప్రతిగా గళం విప్పడం పట్ల ప్రశంసించడం జరిగింది. ఇమామ్ గజాలీ వాటిని ఉటంకిస్తూ ఇలా అంటున్నారు :

فـاذا جـاز الحـكم على الامـام علىٰ مراغمتـه فكيف يحتـاج الىٰ اذنـہ

స్వయాన పాలకునికి విరుద్ధంగా అతని ఎదుట సత్యాన్ని వెల్లడించడం ధర్మసమ్మతమయితే ఇతరత్రా, పాలకుని అనుమతి దానికి ఎలా అవసరమవుతుంది?

**(ఇహ్యాఉ ఉలూముద్దీన్: 2/ 343)**

ఈ సందర్భంలో ఇంకా ఇలా అంటున్నారాయన:

استمرار عادات السلف على الحسبـة على الولاة قاطع باجماعهم على الاُستغنـاء عن التفويض، بل كل من امـر بمعروف فان كان الوالى راضيا به فـذاک، و ان كان ساخطا لـهٗ فسخطه له منكر يجب الاُنكار عليه، فكيف يحتاج الىٰ اذنہ

పూర్వీకులయిన ధర్మవేత్తల నిరంతర వైఖరి ఏమిటంటే వారు పాలకులకు ప్రతిగా విమర్శనా విధానాన్ని అవలంబించేవారు. ఈ విధానం ఈ సందర్భంలో కచ్చితమయిన ఆధారం. ఈ కార్యనిర్వహణకు పాలకుల పక్షాన నియామకం ఎంత మాత్రం అవసరం లేదు. ఏ వ్యక్తి అయినాసరే మారూఫ్‌ని ఆదేశిస్తే పాలకులు దాని పట్ల ప్రసన్నులయితే సరి, ఒకవేళ వారు అసంతుష్టి ప్రకటిస్తే, నిజానికి, మారూఫ్ పట్ల అతని అసంతుష్టి స్వయంగానే ఒక మున్కర్‌గా పరిగణించవలసి ఉంటుంది. దాన్ని విమర్శించడం అవసరం. అలాంటప్పుడు ఈ పనికి అనుమతి ఎలా అవసరమవుతుంది?

(ఇహ్యాఉ ఉలూముద్దీన్: 2/ 343)

అల్లామా సఅదుద్దీన్ తఫ్తాజానీ ఇలా వ్రాశారు :

**كان المسلمون فى الصدر الاَول و بعده يأمرون الولاَة بالمعروف و ينهونهم عن المنكر من غير نكير من احد و لاَ توقيف على اذن، فعلم انه لاَ يختص بالولاَة بل يجوز لِاٰحاد الرعية بالقول والفعل**

**తొలి రోజుల్లోనూ ఆ తరువాతి కాలంలోనూ ముస్లిములు పాలకులకు మారూఫ్‌ని ఆదేశించేవారు, మున్కర్ పట్ల నిరోధించేవారు. వారి ఈ ఆచరణ పట్ల ఎవ్వరూ వారిని తప్పు పట్టలేదు, మరెవ్వరూ దానికి పాలకుల అనుమతి అవసరమని భావించలేదు. దీన్నిబట్టి, ఇది కేవలం అధికారులకే పరిమితమయిన కార్యం కాదు, సాధారణ ప్రజలు కూడా తమ మాటలు, చేతల ద్వారా ఈ విధిని నిర్వర్తించవచ్చుని, దానికి అనుమతి ఉందని తెలుస్తోంది.**

*(షర్‌హుల్ మకాసిద్: 2/ 180)*

యదార్థం ఏమిటంటే అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ అన్నది ముస్లిమ్ పాలకుల ప్రత్యేక బాధ్యతా కాదు, దాని నిర్వర్తనకు వారి అనుమతి కూడా అవసరం లేదు. వాస్తవానికి ఇది ప్రతి ముస్లిమ్ వ్యక్తి నిర్వర్తించవలసిన ధార్మిక విధి. వారు ఎప్పుడు దీన్ని నిర్వహించడానికి సన్నద్ధులయి ఉన్నా అప్పుడే దాన్ని నిర్వహించ వలసి ఉంటుంది. మరి అలాగే అతను నిర్వర్తిస్తాడు కూడా.

# విధి అయ్యే షరతులు

## అర్హత

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ విధి అవడానికి మొదటి షరతు లేదా నిబంధన మనిషి షరీఅత్ ప్రకారం అర్హుడయి ఉండాలి. ఎందుకంటే అర్హుడు కానివానికి ఏ ఆదేశమూ విధ్యుక్తము కాదు. అతను సకల షరీఅత్ బాధ్యతల నుండి వినాయింపు కలిగి ఉంటాడు. అంటే, ప్రాజ్ఞతకు చేరని వాడు మారూఫ్‌ని ఆదేశిస్తే లేదా మున్కర్‌ని నిరోధిస్తే అది అతనికి ధర్మవిరుద్ధమయిన పని అని భావం కాదు. దీని భావం కేవలం అతను ఈ పనిని వదలివేస్తే పాపం చేసినవాడు కాదు.★ అన్నదే. కాని అతను దాన్ని నిర్వర్తించినట్లయితే తప్పనిసరిగా పుణ్యఫలానికి అర్హుడవుతాడు. ఇమామ్ గజాలీ ఈ నిబంధనను గురించి ఇలా అంటున్నారు :

انه شرط الوجوب، فاما امكان الفعل و جوازه فلا يستدعى الاَ العقل، حتى ان الصبى المراهق للبلوغ المميز و ان لم يكن مكلفا فله انكار المنكر وله ان يريق الخمر و يكسر الملاهى، و اذا فعل ذٰلك نال به ثواباً و لم يكن لِاَحد منعه

**ఇది కేవలం విధి అయ్యేందుకు షరతు లేదా నిబంధన మాత్రమే. పోతే, దీన్ని ఆచరించే అవకాశం, ఔచిత్యాలను చూస్తే ఇవి కేవలం బుద్ధిని తప్ప మరి దేన్నీ కోరవు. ఎంతవరకంటే, ఒక బాలుడు ప్రాజ్ఞతకు చేరువలో ఉన్నవాడు, విచక్షణా జ్ఞానమున్నవాడు, అతను షరీఅత్ రీత్యా సామర్థ్యం, బాధ్యత లేనివాడయినప్పటికీ అతనికి, సారాయిని పారబోయడానికి, కాల యాపనకు కారణమయ్యే పనిముట్లను (వాయి**

---

★ ఈ విషయాన్ని, అంటే ఇస్లామీయ రాజ్యంలో ఒక ముస్లిమ్ వ్యక్తికి, అతను ప్రాజ్ఞతకు చేరినవాడయినా కాకపోయినా, శక్తితో మున్కర్‌ను రూపుమాపే అధికారం ఉందా లేదా అన్న విషయాన్ని మేము మున్ముందు చర్చించగలము.

నال به ثواباً و لم يكن لِاَحد منعه من حيث انـه ليس بمكلّف فـان هٰـذهٖ قربة و هو من اهلها

ద్యాలను) విరగ్గొట్టడానికి అనుమతి ఉంది. అతను దాన్ని ఆచరిస్తే దాని పుణ్యఫలమూ ప్రాప్తమవుతుంది. అతను దానికి బాధ్యుడు, సమర్థుడు కాడన్న కారణాన అతన్ని ఆపడానికి ఎవరికీ హక్కు లేదు. ఎందుకంటే ఈ కార్యం అతనికి దైవంతో సామీప్యానికి మార్గం, నిశ్చయంగా అతను దీనికి అర్హుడే. *(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : **2/ 339**)*

## శక్తి లేదా సామర్థ్యం (కుద్రత్)

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్ విధి అవడానికి రెండవ షరతు సామర్థ్యం (కుద్రత్). ఏ వ్యక్తి అయితే **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్** చేయగల సామర్థ్యం కలిగి ఉంటాడో అతనికే మారూఫ్‌ను ఆదేశించడం, ముస్కర్‌ని నిరోధించడం విధి అవుతుంది. ఎవరిలోనయినా దీనికి సామర్థ్యం లేకపోయినట్లయితే అతనికి అది విధి కూడా కాదు. దైవ సందేశహరులు (స) ఇలా సెలవిచ్చారు :

**من رای منکم منکرا فلیغیره بیده، فان لم یستطع فبلسانه، فان لم یستطع فبقلبه، وذلک أضعف الإیمان**

**మీలో ఎవరయినా ముస్కర్‌ని చూసినట్లయితే దాన్ని తన చేత్తో తప్పక (మంచిగా) మార్చి వేయాలి. అతను దాని సామర్థ్యం కలిగిఉండకపోతే నోటితో దాన్ని మార్చే యత్నం చేయాలి. దీనికీ స్థోమత లేకపోతే తన అంతర్యంలో దాని పట్ల మార్పును కోరాలి. ఇది ఈమాన్ (విశ్వాసం)లో అధమ స్థాయి.**

*(ముస్లిమ్, కితాబుల్ ఈమాన్, బాబు: బయాన్ కూనన్నహీ అనిల్ ముస్కరి మినల్ ఈమాన్...; తిర్మిజీ, అబ్వాబుల్ ఫితన్, బాబు మా జాఅ ఫీ తగయ్యురుల్ ముస్కర్ బిల్ యది అవ్ బిల్ లిసాని అవ్ బిల్ కల్బి)*

మనిషికి చెడును బలాన్నుపయోగించి మార్చే విధి, అతనికి సామర్థ్యం లేదా శక్తి ఉన్నటువంటి సందర్భంలోనే తప్పనిసరి అవుతుంది. లేకపోతే చెడుకు విరుద్ధంగా తన గళం విప్పడమే అతనికి విధితమవుతుంది. ఆ శక్తి కూడా అతనిలో లేకపోయినట్ల

యితే అతని బాధ్యత కేవలం తన మనసులో దాన్ని ఏవగించుకోవడం వరకే ఉండిపోతుంది. దాన్ని తన అంతర్యంలో చెడుగా భావించుకోవాలి. ఇమామ్ అబూ బక్ర్ జస్సాన్ ఇలా అంటున్నారు :

اخبر النبی صلی اللّٰه علیه و سلم ان انکار المنکر علی هذه الوجوه الثلاثة علی حسب الامکان و دل علی انه اذا لم یستطع تغیره بیده فعلیه تغییره بلسانه ثم اذا لم یمکنه ذلک فلیس علیه اکثر من انکاره بقلبه

**ప్రవక్త మహనీయులు ఈ విధంగా తెలిపారు, చెడు (మున్కర్) పట్ల విరోధం తెలుపడం పేర్కొన్న మూడు విధాలుగా సాధ్యమవుతుంది. వీటిలో అతను దేని శక్తి కలిగివుంటాడో దాన్ని ఆచరిస్తాడు. ఇందులో ఆయన(స) ఇలా తెలిపారు, మున్కర్ పట్ల విరోధం తెలిపే వ్యక్తి మున్కర్‌ని తన చేత్తో (బలంతో) ఆపలేకపోతే అతను దాన్ని నోటితో ఆపే (లేదా మార్చే) యత్నం చేయడం తప్పనిసరి. ఒకవేళ అదీ అతనికి సాధ్యం కాకపోతే అతని బాధ్యత, తన హృదయంలో దాని పట్ల విరోధ భావం కలిగి ఉండటం.** *(అహ్కాముల్ కుర్ఆన్ : 2/ 38)*

## సామర్థ్య లోపం - విధాలు

ఇక శక్తిహీనత లేదా సామర్థ్యం లేకపోవడం ఎన్ని విధాలుగా సాధ్యమవుతుందని, ఈ విభిన్న విధాలలో ఆదేశాలు ఎలా రూపొందుతాయని మనం చూడవలసి వుంటుంది.

## కర్మేంద్రియ లోపం

శక్తిహీనతకు మొదటి రూపాన్ని ఫికహ్ వేత్తలు (ఫుకహా) 'ఇజ్జ్ హిస్సీ' లేదా 'కర్మేంద్రియ లోపం' అని పేర్కొన్నారు. మనిషి ఒకవేళ శారీరకంగా బలహీనుడయి, వివశుడయి, మారూఫ్‌ను స్థాపించలేని, మున్కర్‌ను రూపుమాపలేని స్థితిలో ఉన్నట్లయితే అతనిపైన అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ బాధ్యత విధ్యుక్తమవదు. ఇమామ్ గజాలీ (రహ్మ) ఇలా అంటున్నారు :

و لا یخفی ان العاجز لیس علیه حسبة الا بقلبه

**అశక్తుడయిన వ్యక్తి పైన కేవలం మనసులో విమర్శనా బాధ్యత విధ్యుక్తమవుతుంది అన్న విషయం రహస్యమేమీ కాదు.**

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 246)*

## జ్ఞాన లోపం

సామర్థ్య లోపానికి ఓ రూపం జ్ఞానలోపం. ఏ వ్యక్తికయితే మారూఫ్ ఏదో మున్కర్ ఏదో తెలియదో అతనికి **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** బాధ్యత విధితమవదు. అల్లామా అబ్దుల్ కాదిర్ ఔదహ్ షహీద్ ఇలా అన్నారు :

و یلحق بالعجز الحسی العجز العلمی

**కర్మేంద్రియ లోపంలోనే జ్ఞానలోపం కూడా చేరి ఉంది.** *(అత్ తష్రీ అల్ జనాయిల్ ఇస్లామీ : 1/ 498)*

మారూఫ్ వ మున్కర్ పరిధులు చాలా విస్తృతమయినవి. ఇందులో ప్రతి ముస్లిమ్ తప్పనిసరిగా తెలుసుకోవలసిన ధార్మిక బోధనలూ చేరి ఉన్నాయి. ఇంకా అర్థం చేసుకునేందుకు అన్వయ జ్ఞానం, సూక్ష్మదృష్టి అవసరమయిన ధార్మిక ఆదేశాలూ ఉన్నాయి. ఏ వ్యక్తి ఏ మేరకు మారూఫ్, మున్కర్లని గురించి తెలుసుకుని ఉంటాడో ఆ మేరకే వాటిని ఆదేశించడమో లేదా వారించడమో అతనిపైన విధ్యుక్తమయి ఉంటుంది. ఒకవేళ అతను తన పరిధులను దాటి మున్ముందుకేగి ప్రచారం చెయ్యడమో, విమర్శన చెయ్యడమో జరిగితే ధార్మిక సేవాభావం ఏమయినప్పటికీ ధర్మానికి నష్టం కలిగించడమూ సాధ్యమే. అందువల్ల ధర్మవేత్తలు విశదీకరించారు, ఏ విషయాల్లోనయితే మారూఫ్ లేదా మున్కర్ స్పష్టమయి ఉందో వాటి విషయం లోనే సామాన్య జనులు ఆదేశించడమయినా వారించడమయినా చేయాలి. ధర్మాదేశాల్లో అన్వయ దృష్టి అవసరమయిన విషయాలలో చర్చించడం ధర్మవేత్తలకు వదలి పెట్టాలి. ఇమాముల్ హరమైన్ ఈ విషయంలో ఇలా అంటున్నారు :

ان الحکم الشرعی اذا استویٰ فی ادراکه الخاص والعام ففیه للعالم وغیرالعالم الاَمر بالمعروف والنهی عن المنکر، واذا اختص مدرکه بالاِجتهاد فلیس للعوام فیه امر و نهی بل الاَمر فیه موکول الیٰ اهل الاِجتهاد

**షరీఅత్‌కు చెందిన ఏ ఆదేశాన్నయితే ప్రత్యేక వ్యక్తులు, సాధారణ వ్యక్తులు అందరూ తెలుసు కునే ఉంటారో, దాన్నయితే ధర్మవేత్తయినా లేదా ధర్మవేత్త కాని వ్యక్తి అయినా ఉభయులూ అమ్ర్ బిల్ మారూఫ్ నహీ అనిల్ మున్కర్ చెయ్య గలరు. కాని ఏ ఆదేశమయితే అన్వయ జ్ఞానం అవసరమయినదయి ఉంటుందో సాధారణ జనులకు దాని విషయంలో ఆదేశమిచ్చేందుకు లేదా వారించేందుకు అధికారం లేదు. ఇటు వంటి వ్యవహారం అన్వయ జ్ఞానం గలవారికీ**

అప్పగించబడాలి. (వారు తమ అన్వయ జ్ఞానం రీత్యా ఈ విషయంలో చర్య తీసుకుంటారు)

*(షర్హుల్ మకాసిద్: 2/ 281)*

ఇదే విషయాన్ని ఇమామ్ నవవీ ఈ పదాలలో స్పష్టపరిచారు :

انما يامر و ينهى من كان عالما بما يامر به و ينهى عنه و ذٰلک يختلف باختلاف الشيء، فان كان من الواجبات الظاهرة و المُحرمات المشهورة كالصلوٰة و الصيام و الزنا و الخمر و نحوها، فكل المسلمين علماء بها و ان كان من دقائق الاَفعال و الاٗقوال و مما يتعلق بالاِجتهاد لم يكن للعَوام مدخل فيه ولاَ لهم انكاره بل ذٰلک للعلماء

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కార్యాన్ని, తాను ఆదేశించేదేమిటో, లేదా తాను వారించేది దేన్నో తెలిసిన వ్యక్తియే నిర్వర్తించ గలడు. ఇంకా ఈ విషయాలు ఎంత భిన్న మయి ఉంటాయో అంతే భిన్నంగా వీటి ఆదేశ మయినా లేదా వారించడమయినా ఉంటుంది. విషయం స్పష్టమయిన విధులకు లేదా ప్రసిద్ధ నిషేధాలకు సంబంధించినదయితే ముస్లిము లందరికీ అవి తెలిసినవే. ఉదాహరణకు, నమాజ్, రోజా, వ్యభిచారం, సారాయి మొద లయినవి. ఇవి ముస్లిములందరికీ తెలిసినవే. కాని ఆ విషయం ఆచరణలకు సంబంధించిన సూక్ష్మమయిన అంశాలకు చెందినదయితే అది అన్వయ జ్ఞానానికి సంబంధించిన విషయం. సాధారణ జనులు అందులో జోక్యం చేసు కోవడం సరయినది కాదు, వారికి ఆ హక్కు ఉండదు, వారు దాన్ని పట్టించుకోకూడదు, అది ధర్మవేత్తల బాధ్యత.

*(షర్హ్ ముస్లిమ్ : సం. 1; భాగం 2, పు. 21)*

ఇమామ్ గజాలీ దీన్ని ఇలా విశదీకరించారు :

العامی ینبغی له ان لَا یحتسب الاّ فی الجلیّات المعلومة

సాధారణ వ్యక్తి కేవలం చాలా స్పష్టంగా విశ దంగా ఉన్న విషయాలను, అందరికీ తెలిసిన అంశాలను మటుకే విమర్శనకు తీసుకోవాలి.

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 348)*

## హాని కలిగే భయం

శక్తి లేదా సామర్థ్య హీనతకు మరో రూపం ఏమిటంటే, అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ విధిని నిర్వర్తించడంలో మనిషి తనకు ఏదయినా అపాయం ఉందని గ్రహించడం. ఇటువంటి పరిస్థితుల్లో ఈ విధి అతన్నుండి తొలిగిపోతుంది. ఇమామ్ గజాలీ ఇలా అంటారు :

لاَ يقف سقوط الوجوب على العجز الحسى بل يلتحق به ما يخاف عليه مكروهـا ينـاله فذٰلک فی معنى العجز

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ అన్న దాని విధి కేవలం 'కర్మేంద్రియ లోపం' వల్లనే తొలిగిపోదు, ఇంకా దీనితోపాటు మనిషికి ఏదయినా కష్టం కలిగే ప్రమాదం ఉన్నా అది తొలిగిపోతుంది. ఈ ప్రమాదం కూడా ఆ లోపంలో చేరిపోతుంది. ఇది కూడా ఒక విధమయిన అశక్తతగానే పరిగణించబడుతుంది.**

ముహద్దిస్ ఇబ్ను బతాల్ ఇలా అంటున్నారు :

و النصيحـة لاَزمة علىٰ قـدر الطاقة اذا علم الناصح انه يقبل نصحه و يطاع امره و امن على نفسه المكروه، فان خشى اذى فهو فی سعة

**ప్రబోధన, శ్రేయోభిలాష అన్నది శక్తిమేరకే తప్పనిసరి. అదీ, బోధకునికి, తన బోధన స్వీకరించబడుతుందనీ, తన ఆదేశాన్ని అమలు పరచడం జరుగుతుందనీ తెలిసి ఉండాలి, దానితోపాటు అతనికి, తనకు ఎటువంటి హాని కలిగే ప్రమాదమూ ఉండరాదు. అటువంటి ప్రమాదమున్నట్లయితే అతను బోధన చేయాలా వద్దా అని ఆలోచించే అవకాశముంటుంది.**

*(షర్హ్ ముస్లిమ్ (నవవీ), సం. 1; భాగం 2, పు. 35)*

## హాని కలిగే భిన్న కోణాలు

ఇమామ్ గజాలీ తన గ్రంథం, ఇహ్యాఉ ఉలూముద్దీన్‌లో హాని కలిగే విభిన్న కోణాలను సవివరంగా చర్చించారు. ఇక్కడ ఆయన చర్చకు సంక్షిప్త రూపాన్ని మా మాటల్లో ముందుంచుతున్నాము:

"మానవుడు తనకూ తన మిత్రులూ, బంధువులకూ నాలుగు విషయాలను కోరుకుంటాడు. జ్ఞానం, ఆరోగ్యం, సంపద, సంపన్నత, హోదా పదోన్నతి. అదేవిధంగా వీటి విషయంలో అతను రెండు విషయాలు ఇష్టపడడు; ఒకటి, వీటిలో ఏదయితే ప్రాప్తమవుతుందో అది అంతమయిపోవడం. రెండు, మరేదయితే భావిలో దొరక నుందో అది దొరక్కుండా పోవడం."

ఇలా తెలిపిన తరువాత ఆయన ఇలా అంటున్నారు :

**فرجع المكروه الى قسمين: احدهما خوف امتناع المنتظر و هٰذا لاَ ينبغى ان يكون مرخصًا فى ترک الاَمر بالمعروف و النهى عن المنكر**

**కాగా 'మక్రూహ్' (ఇష్టం కానివి, మనసుకు నచ్చనివి) అయిన విషయాలు రెండు రకాలు అని తేలింది. వాటిలో ఒకటి, దేని రాక గురించి ఎదురుచూడటం జరుగుతున్నదో అది ఆగిపోయే ప్రమాదం ఏర్పడటం. కాని దాని కారణంగా అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌ని మానుకునే అనుమతి ఇవ్వడం జరగరాదు.** (ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 349)

ఉదాహరణకు ఒక శిష్యుడు తన గురువును విమర్శించకపోవడం, కారణం అతను తన పట్ల అయిష్టత కలిగి సరిగ్గా బోధించడన్నది. లేదా ఒక రోగి తన డాక్టరును విమర్శకు గురిచెయ్యకపోవడం, కారణం అతను తనకు చికిత్స చెయ్యడన్నది; అలా ఏ ఆరోగ్యం తనకు ప్రాప్తిస్తుందని తాను ఆశిస్తున్నాడో అది ప్రాప్తించకపోతుంది. లేదా మనిషి తన సమకాలీన అధికారిని లేదా తనకు మేలు చేసిన వానిని విమర్శించక మౌనం వహించడం. కారణం అతను తనకు చేస్తున్న ఆర్థిక సహాయాన్ని నిలిపివేస్తా డన్నది. అదే విధంగా మనిషికి ఏదయినా మంచి హోదా లేదా పదోన్నతి లభించనున్న దన్న ఆశ ఉన్నప్పుడు అతను తత్సంబంధిత వ్యక్తిని విమర్శించకపోవడం, అలా చేస్తే ఆ స్థాయి తనకు లభించకపోతుందన్న భయం. ఈ ఉదాహరణలిచ్చిన తరువాత ఇమామ్ గారు ఇలా సెలవిస్తున్నారు:

**هٰذا كله لاَ يسقط وجوب الحسبة، لاَن هٰـذهٖ زيادات امتنعت، و تسميـة امتناع حصول الزيادات**

**ఈ విషయాలన్నీ విమర్శనా విధిని పరిసమాప్తం చేయవు. ఎందుకంటే ఇవన్నీ అసలుకు అదనంగా అందకపోయిన అధికమయిన వస్తువులు. అదనపు వస్తువులు అందకపోవ**

ضرراً مجاز، و انما الضرر الحقیقی فوات حاصل، ولاَ یستثنیٰ من هٰذا شئی الاّ ما تدعو الیه الحاجة و یکون فی فواته محذور یزید علیٰ محذور السکوت علیٰ المنکر

**దాన్ని హానిగా పరిగణించడం అదనమయినదే. వాస్తవమయిన హాని అన్నది అందిన వస్తువు చేజారిపోయినప్పుడే సంభవిస్తుంది. ఈ సూత్రం నుండి ఏ పరిస్థితి కూడా మినహా యింపు పొందజాలదు. అయితే ఏదయినా ఆవశ్యకత ఏర్పడి, అందేది అందకపోతే, దాని వల్ల మున్కర్ (చెడుగు) పట్ల మౌనం వహిస్తే కలిగే ప్రమాదంకన్నా అధిక ప్రమాదం కలిగే భయం ఉన్న పక్షంలో ఆ మినహాయింపు వర్తిస్తుంది.**

ఈ మినహాయింపును సయితం పై ఉదాహరణల ద్వారానే ఇమామ్ గారు విశదీకరించారు; ఆయన ఇలా సెలవిచ్చారు:

"ఉదాహరణకు ఒక వ్యక్తి ధార్మిక విషయాల ప్రాథమిక జ్ఞానం మటుకే కలిగి ఉన్నాడు. అతని పరిధిలో ఒకే ఒక ధర్మవేత్త ఉన్నాడు, ఆయన ద్వారానే అతను ధార్మిక జ్ఞానం పొందగలడు. అటువంటి వ్యక్తి ఆ ధర్మవేత్తను ఏదయినా మున్కర్‌ని ఆచరిస్తూ ఉండగా చూస్తాడు. ఆ వ్యక్తి ఆ ధర్మవేత్తను విమర్శిస్తే ఆ ధర్మవేత్త అతనికి ధార్మిక విద్య గరపడం మానివేస్తాడని అతనికి బాగా గట్టి నమ్మకం కలుగుతుంది. అతను మరో వ్యక్తి ద్వారాను ఆ విద్యను గ్రహించలేడు. అతను ధార్మిక విద్యనభ్యసించడమూ అవసరమే, మరోవైపున ఆ మున్కర్‌ని అడ్డుకోవడమూ అవసరమే. ఇటువంటి పరిస్థితిలో విమర్శనా విధిని నిర్వర్తించవలసిన వ్యక్తి ఆ చెడుగు (మున్కర్) స్థాయి, జ్ఞానం ఆవశ్యకత రెంటినీ ముందుంచుకుని స్వయంగా నిర్ణయం గైకొనగలడు- తాను ఏ మార్గాన్ని అనుసరించవలసి ఉంటుందో అని. మున్కర్ చాలా బలమయినదయి, దాని పట్ల విమర్శనను ధార్మిక జ్ఞాన సముపార్జన పైన ప్రాధాన్యతనివ్వవలసిందని గ్రహిస్తే దానికి ప్రాధాన్యతనిస్తాడు. లేకపోతే ధార్మిక విద్యకు ప్రాధాన్యతనిస్తాడు, మున్కర్ పట్ల మౌనం వహిస్తాడు. లేదా ఒక వ్యక్తి వ్యాధిగ్రస్తుడయి ఉన్నాడనుకోండి. ఆ వ్యాధిలో చికిత్స పట్ల ఆలస్యం చేసినట్లయితే ఆరోగ్యం ఇంకా చెడే ప్రమాదముంది. ఇంకా ప్రాణభయం కూడా ఉంది. అటువంటి సందర్భంలో ప్రాప్తమయిన వైద్యుడు ఏదో మున్కర్‌కు లోనయి ఉన్నాడు. అతన్ని దానికి గాను విమర్శిస్తే అతను చికిత్సకు సన్నద్ధుడు కాడన్న నమ్మకముంది. ఇటువంటి పరిస్థితుల్లో

వ్యాధిగ్రస్తునికి, అతన్ని విమర్శించకుండా వదలిపెట్టే హక్కు ఉంది. లేదా మరో ఉదాహరణ: ఒక వ్యక్తి చాలా బలహీనుడు, స్వయంగా సంపాదించనూ లేడు, ఎవరినీ అడిగి జీవిక గడించనూ లేడు. అతనిలో దైవం పట్ల భారం మోపే నమ్మకమూ అధికంగా లేదు. అతని ఖర్చులు భరించే ఓ వ్యక్తిని అతని చెడు నడత పట్ల విమర్శిస్తే అతను ఖర్చు భరించడం మానివేస్తాడన్న గట్టి నమ్మకముంది. అప్పుడు అతను హరామ్ అయినా తింటాడు లేదా ప్రాణాలైనా కోల్పోతాడు. ఇటువంటి పరిస్థితిలో ఆ వ్యక్తికి అతని చెడు వైఖరి పట్ల మౌనం వహించే అనుమతి ఉంది. ఇదేవిధంగా ఒక గూండా వ్యక్తి ఒకరి వెంట పడి ఉన్నాడనుకోండి. అతన్నుండి ముక్తిని పొందడానికి ఒకే మార్గ ముంది. బాగా పలుకుబడి ఉన్న వ్యక్తి ద్వారా అధికారులకు అతనిపై ఫిర్యాదు చేయాలి. కాని ఆ పలుకుబడి గల వ్యక్తి ఏదయినా మున్కర్‌కు లోనయి ఉన్నాడను కోండి, ఉదాహరణకు అతను పట్టును ఉపయోగిస్తున్నాడనుకోండి, ఆ ఉపయోగాన్ని విమర్శిస్తే అధికారులకు ఆ ఫిర్యాదు చేరజాలదు. మరి ఆ గూండా ప్రాణాలు తీస్తాడు. ఇటువంటి పరిస్థితిలో ఆ పరపతి గల వ్యక్తిని విమర్శించకుండా వదలిపెట్టే అనుమతి ఆ వ్యక్తికి ఉంది, అతను తన ప్రాణాలు కాపాడుకునే ప్రయత్నం చేసుకోవాలి".

ఈ ఉదాహరణల తరువాత ఇమామ్ గజాలీ ఇలా అంటున్నారు:

**فهذه الأمور كلها اذا ظهرت و قويت لم يبعد استثناؤها، و لكن الاَمر فيهـا منوط باجتهـاد المُحتسب حتى يستفتى فيها قلبـه، و يزن احد المَحذورين بالاُخر، و يرجع بنظر الدين لاَ بموجب الهوى و الطبع، فان رجع بموجب الدين سمى سكوته مداراة، وان رجع بموجب الهوى**

కాగా ఈ విషయాలన్నీ చాలా స్పష్టంగా, బలంగా ఉన్న పక్షంలో వీటి వినాయింపు సాధ్యమే. కాని ఇందులో వ్యవహారం విమర్శన చేసేవాని అన్వయశక్తి మీద ఆధారభూతమయి ఉంటుంది. అతను తన ఆంతర్యంతో దీని ఫత్వా (నిర్ణయాన్ని) గ్రహించాలి. రెండు నష్టా లను పరస్పరం బేరీజు వేసుకోవాలి. ఏ కోణానికయినా ధార్మిక దృక్కోణంతోనే ప్రాధాన్యతనివ్వాలి. దానికి బదులు, తన హృదయ వాంఛ లేదా నైజం కోరే పద్ధతికి ప్రాధాన్యతనివ్వరాదు. అతను ధార్మిక దృక్కోణంతో మౌనానికి ప్రాధాన్యతనిచ్చినట్ల యితే దాన్ని ఆదర సత్కారాలనడం జరుగు

سمی سکوته مداهنة. وهٰذا امر باطن لاَ یطلع علیه الاّ بنظر دقیق، و لٰکن الناقد بصیر، فحق علی کل متدین فیه ان یراقب قلبه و یعلم ان اللّٰه تعالیٰ مطلع علی باعثه و صارفه أنه الدین او الهوی، و ستجد کل نفس ما عملت من سوء اوخیر محضرا عند اللّٰه و لو فی فلتة خاطر او لفتة ناظر من غیر ظلم وجور فما اللّٰه بظلّام للعبید

తుంది. తన మనోకాంక్షల రీత్యా ప్రాధాన్యత నిచ్చినట్లయితే ఇది లొంగిపోవడంగా పరిగణిం చడం జరుగుతుంది. ఇదంతా ఆంతర్యానికి చెందిన వ్యవహారం. దీన్ని అతనే స్వయంగా లోతుగా గ్రహించగలుతాడు. కాని అన్నింటినీ పరిశీ లించి తెలుసుకోగల స్వామి (దైవం) అతి క్షుణ్ణంగా తెలుసుకుంటాడు. కాగా ప్రతి ధార్మిక వ్యక్తి తన ఆంతర్యాన్ని పరిశీలించు కోవాలి. అతను ఓ విషయాన్ని తెలుసుకోవాలి, అతను తాను తీసుకునే చర్యకు మూలం, మున్కర్‌ను కాదనే కారణం ధర్మమో, మనో కాంక్షయో పరమ ప్రభువు అల్లాహ్‌కు బాగా తెలుసని గ్రహించాలి. మనిషి ఏది చేసినా, అది మంచిదయినా చెడు అయినా, దాని ప్రతిఫలం ఎటువంటి అన్యాయం అక్రమం లేకుండా దైవం వద్ద తప్పక పొందగలడని, అతని హృదయంలో ఉత్పన్నమయ్యే అడ్డంకి అయినా, మరెవరి చూపు దాన్నుండి తప్పి పోయినా అల్లాహ్ మటుకు తన దాసులకు అన్యాయం చేయదని తెలుసుకోవాలి.

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్: 2/ 350)*

ఆ తరువాత ఇమామ్ గారు 'హాని'లోని రెండవ రకాన్ని గురించి చర్చించారు. ఆయన ఇలా అన్నారు:

اما القسم الثانی وهو فوات الحاصل فهو مکروه ومعتبر فی جواز السکوت فی الاُمور الاَربعة الاّ العلم۔

రెండవ రకం పొంది ఉన్న వస్తువు చేజారి పోవడం లేదా అంతమయిపోవడం. ఇది అందరికీ అయిష్టమయిన విషయమే. మరి ఇది పైన పేర్కొన్న నాలుగు విషయాలలోనూ దీన్ని పరిగణనలోకి తీసుకోవచ్చు. ఒక జ్ఞానంలో తప్ప. *(ఇహ్యాఉ ఉలూముద్దీన్: 2/ 350)*

ఈ నియమంలో జ్ఞానం వినాయింపు పొందడానికి కారణం ఏ వ్యక్తి కూడా ఒక వ్యక్తి నుంచి అతను పొందిన జ్ఞానాన్ని దోచుకోలేడు. మనిషి జ్ఞానానికి ఏదయినా ముప్పు మూడే భయముంటే అది కేవలం అతని అలసత్వం అజాగ్రత్తల వల్లనే కాని ఇతరులెవరికీ ఈ విషయంలో అతనికి నష్టం కలిగించే శక్తి లేదు. అందువల్ల జ్ఞానం విషయంలో మరెవరయినా దాన్ని మట్టుపెడతారన్న ప్రశ్నే తలెత్తదు. అయితే మనిషి ఆరోగ్యాన్ని ఎవరయినా చెడగొట్టగలరు. అంతేకాదు ఎవరయినా అతన్ని చంపి వెయ్యగలరు కూడా. ఒకవేళ విమర్శన సందర్భంలో ఇటువంటి ప్రమాదం ఉన్నట్లయితే విమర్శనా విధి తొలిగిపోతుంది. అయితే అది అభిలషణీయం అన్న విషయం మటుకు ఇంకా మిగిలే ఉంటుంది. అలాగే విమర్శన వల్ల మనిషి సంపదకు నష్టం వాటిల్లే ప్రమాదం ఉన్నా అతను విమర్శనా విధిని నిర్వర్తించకుండా మౌనం వహించే అనుమతి ఉంది. అయితే ఈ సందర్భంలోనూ అతను ప్రపంచాన్ని త్యాగం చేసి ధర్మసేవ చేయడమే అతనికి అభిలషణీయం. ఈ విషయంలో ఇమామ్ గజాలీ ఓ సూత్రప్రాయమయిన అంశం చెబుతారు:

**و لكل واحـد من الضرب و النهب حد فى القلة لاَ يكترث به كالحبة فى المال و اللطمة الخفيفة المَها فى الضرب، وحد فى الكثرة يتعين اعتباره ووسط يقع فى محل اشتباه، واجتهاد، و على المتدين ان يجتهد فى ذٰلک و يرجّح جانب الدين ما امكن**

**దెబ్బలాటలోనూ, లూటీలోనూ ఒకటేమిటంటే కనిష్టపు హద్దు ఒకటుంటుంది. దాన్ని లెక్కలోకి తీసుకోవడం జరగదు. ఉదాహరణకు సొమ్ములో ఓ గింజంత తరుగు కలగటం, లేదా ఒక లెంపకాయ తగలటం, దాని బాధ అతి స్వల్పం. అలాగే గరిష్టపు హద్దు ఒకటి ఉంటుంది. దాన్ని పరిగణనలోకి తీసుకోవడం తప్పనిసరి అవుతుంది. మరొకటి మధ్యస్థ స్థితి, అది అనుమానాస్పదం. అందులో అన్వయ జ్ఞానం అవసరమవుతుంది. ధార్మిక వ్యక్తి తప్పనిసరిగా ఇందులో అన్వయజ్ఞానాన్ని వినియోగించాలి. వీలయినంత మేర ధార్మిక కోణానికి ప్రాధాన్యతనివ్వాలి.**

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్: 2/ 250, 251)*

హెూదా పదోన్నతి విషయంలో రెండు విషయాలను గుర్తుంచుకోవాలి. ఒకటి విమర్శన వల్ల మనిషి మర్యాదే మంటగలిసే ప్రమాదముంటే అతనికి ఈ విధిని నిర్వర్తించడం మానివేసే అనుమతి తప్పనిసరిగా ఉంది. ఉదాహరణకు, అతని ముఖానికి మసిపూసి ఊరేగిస్తారని తెలిస్తే. కాని ఒకవేళ విమర్శన వల్ల కేవలం అతని ఉన్నత హెూదాకు ప్రమాదం మూడుతుందన్న భయముంటే మటుకు దానికి ప్రాముఖ్యత లేదు. ఉదాహరణకు ఒక వ్యక్తి కారులోనే ఇంటి నుండి బయటికి వెడలే అలవాటు ఉన్నవాడు, ఇక **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** కారణంగా అతను కారు లేకుండా, కాలినడకన బయలుదేరవలసి వస్తే అదేమంత పెద్ద కష్టం కాదు. దీని కారణంగా **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధి అతన్నుండి తొలగిపోదు. ఇటువంటి పరిస్థితిలో మున్కర్ పట్ల తప్పనిసరిగా విమర్శన చెయ్యవలసి ఉంటుంది. ఈ వివరాలన్నీ తెలిపిన తరువాత ఇమామ్ గజాలీ ఇలా అంటున్నారు :

**قد دلّت العمومات على تأكّد وجوب الحسبة وعظم الخطر فى السكوت عنها، فلا يقابله الاّ ما عظم فى الدين خطره، والمال والنفس والمرؤة قد ظهر فى الشرع خطرها، فاما مزايا الجاه والحشمة ودرجات التجمل و طلب ثنـاء الخلق فكل ذلك لاَخطرله**

**కుర్ఆన్ హదీసుల పదజాలం తెలిపే దాన్నిబట్టి విమర్శన విధి అవడం అన్నది తాకీదుగా చెప్పబడింది. దాని పట్ల మౌనం వహించటం వల్ల పెద్ద ప్రమాదముంది. కాగా దాన్ని ఎదిరించే విషయంవల్ల కలిగే నష్టం కూడా ధర్మం దృష్టిలో ఘనమయినదే కాగలగాలి. ఇక ధనం, ప్రాణం, మర్యాదల విషయానికి వస్తే దాని స్థానం షరీఅత్‌లో స్పష్టంగానే ఉంది. పోతే హెూదా, సంపదల మహత్తు, అలంకరణలు వాటి స్థాయి, ఇంకా ప్రజల చేత పొగడ్తలను కోరడం ఇత్యాది వాటి విషయానికి వస్తే వీటన్నింటి ప్రాముఖ్యం ఏమాత్రం లేదు.**

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 351)*

## అధిక్షేపణ హాని కాదు

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ నిర్వర్తన ఫలితంగా ఇతరుల విమర్శలు, అయిష్టత, అధిక్షేపణలు పొందడం హానిలో చేరిన విషయాలు కావు.

అందువల్ల వీటన్నింటికీ అతీతంగా విశ్వాసి ఈ విధిని నిర్వర్తించవలసి వుంటుంది. పరమప్రభువు అల్లాహ్‌ను ప్రేమించేవారు, మరెవరినయితే ఆయనా ప్రేమిస్తాడో, వారిని గురించి కుర్‌ఆన్ ఇలా తెలుపుతుంది:

يُجَاهِدُوْنَ فِى سَبِيْلِ اللّٰهِ وَلَا يَخَافُوْنَ لَوْمَةَ لَائِمٍ (المائدة:٥٤)

**వారు దైవమార్గంలో నిరంతర కృషి సలుపుతారు. అధిక్షేపించేవారి అధిక్షేపణకు భయపడరు.** *(అల్ మాయిదా : 54)*

హాఫిజ్ ఇబ్ను కసీర్ దీని వ్యాఖ్యానంలో ఇలా సెలవిచ్చారు :

**ای لاَ یردهم عما هم فیه من طاعـة الله و اقامة الحـدود و قتال اعدائه والاَمر بالمعروف والنهى عن المنكر لاَ يردهم عن ذلک راد ولاَ يصدّهم عنه صاد ولايحيک فيهم لوم لائم و لاَ عذل عاذل**

**అంటే వారి స్థితి ఏమిటంటే వారు, దేవుని విధేయత పాటిస్తారు, ఆయన నిర్ణయించిన హద్దులను స్థాపిస్తారు. ఆయనకు శత్రువు లయిన వారితో పోరాడుతారు. మారూఫ్‌ని ఆదేశిస్తారు, మున్కర్‌ని నిరోధిస్తారు; ఈ స్థితిలో నుంచి వారిని ఏ మరల్చేవాడూ మరల్చలేడు మరే ఆపేవాడూ ఆపలేడు, మరే అధిక్షేపకుని అధిక్షేపణ కూడా వారిపైన ప్రభావం చూపజాలదు, ఇంకా ఏ ఆగ్రహం చెందేవాని ఆగ్రహమూ వారిపైన ప్రభావం చూపజాలదు.**
*(తఫ్సీర్ ఇబ్ను కసీర్ : 3/ 162)*

హజ్రత్ ఉబాద బిన్ సామిత్ (రజి) ఉల్లేఖనం :

**بايعنا رسول الله صلى الله عليه و سلم...على ان نقول بالحق اينما كنا لاَ نخاف فى الله لومة لائم**

**మేము దైవ సందేశహరుల (స) చెంత బైఅత్ చేశాము.. మేము ఎక్కడున్నాసరే సత్యమే పలుకుతామని, అల్లాహ్ విషయంలో ఏ అధిక్షేపకుని అధిక్షేపానికీ భయపడమని.**
*(బుఖారీ, కితాబుల్ అహ్కామ్; ముస్లిమ్, కితాబుల్ ఇమారహ్)*

ఈ ఉల్లేఖనానికి బలం చేకూర్చే మరో హదీసు కూడా ఉంది. హజ్రత్ అబూజర్ (ర) ఇలా అన్నారు :

اوصانی خلیلیﷺ بخصال من الخیر، أوصانی ان لاَ اخاف فی اللّٰہ لو مۃ لاَئم و اوصانی ان اقول الحق وان کان مرًّا

నాకు ప్రియులయిన వారు (స) నాకు కొన్ని శుభ విషయాలను బోధించారు. అల్లాహ్ విషయంలో మాటలాడుతున్నప్పుడు ఏ అధిక్షేపించేవాని అధిక్షేపానికీ భయపడరాదని తాకీదు చేశారు. ఇంకా సత్యవాక్కునే పలకాలని, అది చేదు మాటయినా సరే అని కూడా తాకీదు చేశారు.

*(ఇబ్ను హిబ్బాన్ ఫీ సహీహ-అత్ తర్గీబ్ వత్ తర్హీబ్: 3/ 163)*

అల్లామా కుర్తుబీ ఇలా వ్రాశారు :

اجمع المسلمون فی ما ذکر ابن عبدالبر ان المنکر واجب تغییرہ علی کل من قدر علیہ و انہ اذا لم یلحقہ بتغییرہ الاّ اللوم الذی لاَ یتعدی الیٰ الاَذی فان ذلک لاَ ینبغی ان یمنعہ من تغییرہ

ఇబ్ను అబ్దుల్ బర్ర్ ప్రకారం ముస్లిములు (ధర్మవేత్తలు) ఈ విషయంలో ఏకాభిప్రాయానికి వచ్చారు, మున్కర్‌ని మార్చడం, ఆ మేరకు శక్తి గల ప్రతి వ్యక్తికి విధ్యుక్తమయి వుంది. అయితే మున్కర్‌ని మార్చే కార్యంలో అతనికి కేవలం అధిక్షేపం ఎదురయి, బాధ, కష్టం కలిగే ప్రమాదం ఉండరాదు. కేవలం అధిక్షేపం అతన్ని మున్కర్‌ని మార్చే కార్యంలో అవరోధం కారాదు.

*(జామిఉల్ అహ్కాముల్ కుర్ఆన్, సం.2, భాగం 4, పు.32)*

ఇమామ్ గజాలీ ఇలా అన్నారు :

ولو ترکت الحسبۃ بلوم لاَئم او باغتیاب فاسق او شتمہ او تعنیفہ او سقوط المنزلۃ عن قلبہ او قلب امثالہ لم یکن للحسبۃ وجوب اصلاً اذ لاَ تنفکّ الحسبۃ عنہ

ఒక అధిక్షేపకుని అధిక్షేపం, ఒక పాపాతురుని పరోక్షనింద, లేదా నిందలు, తూలనాడులు, దూషణలు, లేదా వారి అంతర్యాల నుంచి తన స్థానం దిగజారడం- వీటన్నింటి మూలంగా విమర్శనను వదలి వేసినట్లయితే, విమర్శన అన్నది అసలు ఎన్నటికీ విధిఅవదు. ఎందుకంటే విమర్శన అన్నదానితో (ఇటువంటివి తప్పని సరిగా ఉండనే ఉంటాయి) ఇవి ఎన్నటికీ వేరు కావు. *(ఇహ్యాఉ ఉలూముద్దీన్ 2: 351)*

## ఇతరులకు హాని కలిగే ప్రమాదం

ఇప్పటివరకు మనం చర్చించినవి, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధిని నిర్వర్తించే వ్యక్తికి స్వయంగా వాటిల్లగలిగే హానిని గురించిన విషయాలు. మరో సాధ్యమయ్యే విషయమేమిటంటే, ఈ విధిని నిర్వర్తించే వ్యక్తికి అయితే ఎటువంటి నష్టం వాటిల్లకపోవచ్చు కాని ఇతని మూలంగా ఇతని బంధుమిత్రులు అప్తులకు, సన్నిహితులకు ఏదయినా నష్టం కలిగే ప్రమాదం ఏర్పడవచ్చు. ఇమామ్ గజాలీ (రహ్మ) ప్రకారం ఈ ప్రమాదం ప్రాణానికీ, లేదా ధనానికీ అయినట్లయితే ఆ వ్యక్తి విమర్శనను మానుకోవాలి. ఎందుకంటే ఏ విధంగానయితే ఏదయినా మున్కర్ పట్ల మౌనం వహించడం నిషిద్ధమో అదేవిధంగా ఒక ముస్లిమ్ వ్యక్తికి కష్టం కలిగించడం కూడా నిషిద్ధమే. కాని ఒకవేళ దానివల్ల వారి ధన ప్రాణాలకు ప్రమాదం లేకపోతే, కేవలం దుర్భాష, దూషణ వరకే ఉన్నట్లయితే ఆ మున్కర్ ఏ స్థాయిదో, దూషణ, దుర్భాషవల్ల కలిగే కష్టం ఏమేరకు ఉంటుందో పరిశీలించడం జరుగుతుంది. ఆపైన దాని ప్రకారమే నిర్ణయం గైకొనడం జరుగుతుంది. *(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 351)*

## సామర్థ్య హీనత, హానీ నిర్ణయం

ఈ వివరాల వల్ల తెల్లమయినదేమిటంటే **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధి అవడం అన్న అంశం, మనిషి దాన్ని నిర్వర్తించడానికి అశక్తుడయినప్పుడు లేదా అతనికి ఏదయినా హాని కలిగే ప్రమాదం ఉన్న స్థితిలో మిగిలి ఉండదు. అయితే ఇప్పుడు ఒక ప్రశ్న ఉత్పన్నమవుతుంది. ఆ అశక్తత, సామర్థ్య హీనత లేదా హాని అన్న నిర్ణయం దేని ఆధారంగా చేయబడాలి అన్నదే ఆ ప్రశ్న. దానికి కేవలం బలీయమయిన అంచనా మాత్రమే చాలా లేదా నిర్దుష్టమయిన, విశ్వసనీయమయిన జ్ఞానం అవసరమా? ఇమామ్ గజాలీ హాని భయాన్ని గురించి మాటలాడుతూ ఈ ప్రశ్నను సయితం చర్చించారు :

**ان غلب على الظن انه يصاب لم يجب، وان غلب انه لاَ يصاب وجب، و مجرد التجويز لاَ يسقط الوجوب فان ذٰلک ممکن فی**

**ఎవరికయినా బలమయిన ఊహ, అంచనా కలిగి, విమర్శన వల్ల కష్టం కలిగించబడు తుందని అనిపిస్తే అతను విమర్శన చెయ్యనవసరం లేదు. లేదా అతని బలమయిన అంచనా ప్రకారం కష్టం కలిగించబడదనిపిస్తే విమర్శన తప్పనిసరి అవుతుంది. కేవలం అభిప్రాయం**

كل حسبة

విధిని తొలగించదు. ఎందుకంటే అది ఎంతో కొంత ప్రతి విమర్శనలో ఉండనే ఉంటుంది.

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్:2/ 348)*

ఇదే చర్చలో మరోచోట ఇలా అంటున్నారు : విమర్శన విధి అవడం తొలిగిపోవాలంటే మనిషికి దానివల్ల కలిగే హాని ఏమిటో దాని 'జ్ఞానం' కలగాలి. ఆపైన ఆ'జ్ఞానం' అంటే ఏమిటో దాని వివరణ ఈ పదాలలో చేశారు :

عنى بالعلم الظن الذى يجوز مثله ترك استعمال الماء و العدول الى التيمم، فاذا انتهى الى هٰذا الحد لم يبعد ان يرخّص فى الترك الحسبة

జ్ఞానం అంటే నా దృష్టిలో ఊహ, అంచనా. ఉదాహరణకు ఎటువంటి ఊహ, అంచనా అంటే దాని ఆధారంగా నీళ్ళు వదలి తయమ్ముమ్ చెయ్యడం ధర్మసమ్మతమయ్యే ఊహ, అంచనాలన్నమాట. ఆ మేరకు అంచనా చేరిపోయినప్పుడు విమర్శనను వదలిపెట్టే అనుమతినివ్వడం తప్పుకాదు.

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 350)*

## సంకల్ప నిరతి - మార్గం

హాని, హాని లేకపోవడం ఇత్యాది విషయాలకు సంబంధించిన అనేక సాధ్యమయిన స్థితులు పైన చర్చలో వచ్చాయి. ఇంకా, వాస్తవంగా హాని కలిగే భయం ఉన్నట్లయితే **అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్** మున్కర్ విధి అవడం తొలిగిపోతుందన్న విషయమూ నిరూపితమయిపోయింది. పోతే, ఒకవేళ ఎవరయినా ఏ విధమయిన భయానికీ, ప్రమాదానికీ వెరువకుండా **అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్** మున్కర్ విధిని నిర్వర్తించినట్లయితే అతను ఏదయినా తప్పుకు పాల్పడినట్లు అర్థం కాదు. ఇది అతనికి ధర్మబద్ధమే కాదు, ఇది అతనికి అభిలషణీయం కూడా. ధన ప్రాణాల భయం చేత **అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్** మున్కర్ని వదలిపెట్టడం కేవలం ఒక అనుమతి మటుకే. అది బలహీనమయిన ఈమాన్ గల వారి కొరకు ఇవ్వబడినది. సంకల్ప నిరతి, మహత్తు గల మార్గం ఏమిటంటే మనిషి తన సర్వస్వం ధారపోయడం, కాని దైవధర్మాన్ని స్థాపించడానికి, సత్యాన్ని సత్యంగానూ, మిథ్యను మిథ్యగాను ప్రకటించడానికి వెరువకుండా నిలబడాలి. ఇదే మాటను ఒక హదీసులో తెలుపడం జరిగింది.

దాన్ని హజ్రత్ ఉమర్(రజి) ప్రవక్త మహనీయుల(స) నుండి ఉల్లేఖించారు. ఆయన(స) ఇలా సెలవిచ్చారు :

انـه تصيب امتى فى اخـر الزمـان مـن سلطانهم شـدائد لا ينجو منـه الا رجـل عرف ديـن الله فجاهـد عليـه بلسانـه ويـده و قلبه، فذلک الـذى سبقت لـه السوابـق و رجـل عرف ديـن اللـه فصدق به ورجل عرف دين اللـه فسکت عليـه، فـان راى من يعمل الخير احبـه عليه و ان راى مـن يعمـل بـاطل ابغضـه عليـه فذلک الـذى ينجـو على ابطانـه کلـه

నిశ్చయంగా చివరికాలంలో నా సముదాయంలో, వారి పాలకుల పక్షాన కాఠిన్యాలు ఎదురవుతాయి. వీటి నుండి విముక్తి పొందే వ్యక్తి అతనే - ఎవరయితే దైవధర్మాన్ని సరిగ్గా గ్రహించగలిగాడో, దానికొరకు తన నోటితో తన చేత్తో (శక్తితో) తన అంతర్యంతో నిరంతర కృషి సలిపాడో అతనే. అవును, ఈ వ్యక్తి కొరకే దైవకారుణ్యం, ఇహపరాల శుభం ముందుకు వచ్చి స్వాగతిస్తాయి. ఆ తరువాత స్థాయి, దైవ ధర్మాన్ని గుర్తించి దాన్ని తన అంతర్యంతోనూ నోటితోనూ ధ్రువపరచినవానిది. ఆ తరువాతి స్థాయి దైవధర్మాన్ని గుర్తించి దాని విషయంలో మౌనం వహించినవానిది. ఇతను ఎవరినయినా సత్క్రియ ఆచరిస్తూ చూస్తే దాని కారణంగా అతన్ని ప్రేమిస్తాడు, మరెవరయినా దుశ్చర్య చేస్తూ కనబడితే దాని కారణంగా అతన్ని ఏవగించుకుంటాడు. ఇతను కూడా మోక్షం పొందగలడు. ఎందుకంటే ఇతను మంచి పట్ల ప్రేమను, చెడు పట్ల విరోధాన్ని తన అంతర్యంలో దాచిపెట్టుకున్నాడు.

*(రవాహు బైహకీ- మిష్కాతుల్ మసాబీహ్)*

సత్య ప్రకటనకు ధనప్రాణాలను పణంగా పెట్టడం సులువయిన విషయం కాదు. దీనికి ధర్మం పట్ల అనన్యమయిన ప్రేమ అనురక్తి, అనుపమమయిన సంకల్ప నిరతి, సాహసం అవసరం. కాని మహా సంకల్ప నిరతులు, అత్యంత గొప్ప చిత్తశుద్ధి గల వారి స్థానమే పరమ ప్రభువు సన్నిధానంలో అందరికన్నా అత్యున్నతంగా ఉంటుందన్నదీ యదార్థమే. ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవిచ్చారు:

الاَ لاَ يمنعنّ رجلا مهابة الناس ان يتكلم بالحق اذا علمه الا ان افضل الجهـاد كلمـة حق عنـد سلطان جائـر

బాగా వినండి, సత్యం ఎరిగిన ఏ వ్యక్తికీ జనుల భయం, సత్యవాక్కు పలకకుండా ఆపరాదు. అవును, బాగా వినండి, అన్నింటికన్నా అధిక మయిన పుణ్యఫలం దుర్మార్గుడయిన పాలకుని సమక్షంలో సత్యవాక్కు పలికే జిహాద్ ద్వారానే ప్రాప్తిస్తుంది.

(ముస్నద్ అహ్మద్: 3/ 396, తిర్మిజీ, కితాబుల్ ఫితన్)

ఈ హదీసులోని ఈ వచనం లోగడ కూడా వచ్చింది- దుర్మార్గుడయిన పాలకుని సమక్షంలో సత్యవాక్కు పలకడం అన్నింటికన్నా పెద్ద జిహాద్ అని. దీని భావం ఏమిటంటే సత్య ప్రకటనకు మనిషి ఎంత పెద్ద ప్రమాదాన్ని కొనితెచ్చుకుంటాడో అంతే గొప్ప పుణ్యఫలానికి అతను అర్హుడవుతాడన్నమాట.

దుర్జనుడయిన పాలకుని ఎదుట సత్యప్రకటనను ఎందుకు గొప్ప జిహాద్‌గా నిర్ణయించడం జరిగింది? దీని కారణాన్ని అల్లామా ఖితాబీ ఈ పదాలలో వివరించారు:

انما صار ذٰلک افضل الجهاد، لاَن مـن جاهـد العـدو وكان مـترددًا بين رجـاء و خـوف لاَ يـدرى هـل يَغْلِب او يُغْلَب، و صاحب السلطان مقهور فى يـده فهـو اذا قـال الحق و امـره بالمعروف فقـد تعرض للتلف و اهـدف نفسه للهلاک فصـار

ఇది అన్నింటినీ మించిన మహత్తు గల జిహాద్ అవడానికి కారణం ఏమిటంటే, శత్రువుతో పోరాడే వ్యక్తి ఆశ నిరాశల మధ్య ఊగిస లాటలో ఉంటాడు. అతనికి తెలీదు తాను విజయం పొందుతాడో పరాజితుడవుతాడో. (ఈ విధంగా అందులో అతను ప్రాణాలు కోల్పోయే ప్రమాదం ఉన్నంత మేరకే అతను ఆ ప్రమాదాన్ని తప్పుకునే అవకాశమూ ఉంది) దీనికి భిన్నంగా పాలకునిపైన విమర్శ చేసిన వ్యక్తి పాలకుని చేతుల్లో అశక్తుడయి చిక్కు కుంటాడు. అతను పాలకుని సమక్షంలో సత్య ప్రకటన చేసినప్పుడు, లేదా అతనికి మారూఫ్‌ని ఆదేశించినప్పుడు, అతను తెలిసీ తన వినాశం కొనిదెచ్చుకున్నాడన్నమాట, తన్ను తాను

ذلک من افضل انواع الجهاد من اجل غلبة الخوف

**అంతానికి గురిచేసుకుంటాడు. ఈ విధంగా అధిక భయం కారణంగా ఈ జిహాద్ అన్నింటికన్నా శ్రేష్ఠమయినదిగా పరిగణించబడింది.**

*(మఆలిముస్సునన్ : 4/ 350)*

ఈ సముదాయానికి చివరిసారిగా అల్లాహ్ **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** బాధ్యతను అప్పగించాడు. ఇది తన సంస్కరణ తాను చేసుకోవలసి ఉంది కూడా. ఇది సత్యప్రకటనకు, నిర్భయతకు మహోత్కృష్టమయిన చారిత్రక నిదర్శనాలున్న సముదాయం. ఇందులో ఈమాన్ బలహీనత కారణంగా 'మున్కర్'ని భరించిన దృష్టాంతాలూ, మారూఫ్‌ని ప్రకటించని దృష్టాంతాలు కానవస్తాయి. అదే సమయాన బలోపేతమయిన సంకల్ప నిరతి గలవారు, సాహసోపేత యోధులు మిథ్యను రొమ్ము విరుచుకుని ఎదురొడ్డి నిలిచినవారూ, కరవాలాల నీడలోనే సత్యానికి సాక్ష్యం పలికినవారి దృష్టాంతాలు కూడా ఏమాత్రం తక్కువగా లేవు. ఈ విషయమే ఈ సముదాయం సజీవంగా ఉందనడానికి ఇంత వరకూ సాక్ష్యంగా నిలిచింది. ఏ కాలంలోనయినా ఈ సముదాయం పూర్తిగా సత్యం కొరకు త్యాగం చేయడానికి, సత్యానికి నిర్భయంగా వెన్నుదన్నుగా నిలువడానికి ఎటువంటి అంతర్ప్రేరణ లేకుండా, ఎటువంటి మానసిక భావనలే లేకుండా పూర్తిగా లుప్తమయిపోయినట్లయితే ఆ కాలం దీని అత్యంత హీనమయిన పతనావస్థకు, అవనతావస్థకు మారుపేరు కాగల కాలమన్నమాట. అలాంటి పరిస్థితుల్లో అది దైవకారుణ్యానికి దూరమయిపోతుంది. ఇక దాన్ని సర్వనాశనం నుండి ఏ శక్తీ కాపాడజాలదు. ఇదేమాట ప్రవక్తశ్రీ (స) సెలవిచ్చిన ఈ సూక్తిలో తెలుపబడింది :

اذا رأيت امّتی تهاب ان تقول للظّالم يا ظالم فقد تودع منهم

**నా సముదాయం, దౌర్జన్యపరుణ్ణి దౌర్జన్య పరుడని అనడానికి వెరసినట్లయితే మీరే అర్థం చేసుకోండి. దాన్ని దాని మానాన వదలి పెట్టడం జరిగిందని. (ఇక అందులో పాపపు కార్యాలు పెరుగుతూ ఉంటాయి, అది దైవ శిక్షకు లోనవుతూ ఉంటుంది).**

*(రవాహుల్ హాకిమ్- అత్తర్గీబ్ వత్తర్హీబ్ : 4/ 163)*

ధన ప్రాణాల ప్రేమ సర్వసాధారణంగా **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** మార్గాన అన్నింటికన్నా పెద్ద అవరోధం. ప్రాణం అందరికీ ప్రియమయినదే, ధనం అంటే ఎవరికి ముద్దు కాదు? మనిషి ఒకటి ఆలోచించి భయపడతాడు. మిథ్యను మిథ్య అని, అసత్యాన్ని అసత్యమని అన్నట్లయితే, మరీ ముఖ్యంగా దాన్ని ఆశ్రయించినవాడు అధికారం, సత్తా గలవాడయితే, ప్రాణభయం కలగదూ? అన్యాయం, అక్రమం, దౌర్జన్యం, దుర్మార్గాలకు వ్యతిరేకంగా గళం విప్పినట్లయితే- అదీ సర్వత్రా అదే రాజ్యమేలుతూ ఉంటే ప్రాణాలపైన ఆశ వదులుకోవలసిందే! శారీరకంగా మరణం తప్పించుకున్నా ఆర్థికంగా చావు దెబ్బ తప్పదేమో, ఆర్థిక దెబ్బ కొన్ని సందర్భాలలో శారీరక మృత్యువు కన్నా కఠోరమయింది. అయితే ఈ భయం, భీతావహం విశ్వాసి ఘనతకు తగనిది, అది విశ్వాస బలహీనతకు నిదర్శనం. జీవితమూ జీవన సాధనాలూ దేవుని హస్తగతమయిన అంశాలు, అవి మానవుని చేతిలోనూ లేవు. సత్య ప్రకటన విషయంలో భయపడటం చాటేదేమిటంటే మనిషి తన జీవితాన్ని, తన జీవికనూ మానవులకు చెందినవని భావిస్తున్నాడన్న మాట. లేదా కనీసం అతనికి అల్లాహ్ పట్ల పూర్తిగా నమ్మకం లేదు, ఆయన పైన భారం మోపవలసిన రీతిలో భారం మోపే దృఢత్వమూ అతనిలో లేదన్నమాట. అందువల్లనే దైవ సందేశహరులు(స) ఆదేశించారు, ధనప్రాణాల ప్రమాదాలకు వెరువకుండా మారూఫ్‌ని ఆదేశించాలని, మున్కర్‌ని వారించాలనీను. నిజానికి ఇదే విశ్వాసిలో గల విశ్వాసం - ఈమాన్- కోరే కనీస ఆవశ్యకత :

**يٰآيها الناس مروا بالمعروف وانهو عن المنكر قبل ان تدعوا الله فلا يستجيب لكم و قبل ان تستغفروه ولاَ يغفر لكم، ان الاَمر بالمعروف والنهى عن المنكر لاَ يدفع رزقا ولاَ يقرب اجلا**

**జనులారా, మారూఫ్‌ను ఆదేశించండి, మున్కర్‌ని నిరోధించండి- మీరు దైవానికి మొరపెట్టుకున్నా ఆయన మీ మొరకు బదులు పలకడం మానుకోక మునుపే, మీరు ఆయన్ని క్షమాభిక్ష అర్థించినా ఆయన మిమ్మల్ని క్షమించడం మానివేయక మునుపే! నిశ్చయంగా అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ వల్ల మీ ఉపాధీ మీకు దూరం కాదు, మీ మృత్యువూ మీకు దగ్గర కాదు.**

*(రవాహుల్ అస్బహానీ, అత్ తర్గీబ్ వ త్తర్హీబ్: 3/ 261) (ఇదే భావంలో హ(జత్ అలీ(ర) ప్రసంగం ఒకటుంది; చూడండి, తఫ్సీర్ ఇబ్ను కసీర్ :2/ 74)*

## మరో చెడుగు ఏదయినా జనించే ప్రమాదం

శక్తీ సామర్థ్యాలున్నా **అమ్ర్ బిల్ మారూఫ్** వ **నహీ అనిల్** మున్కర్ని ఆచరించే ముందు దాని పర్యవసానాలను గురించి సయితం మనిషి పరిశీలించాలి. ఒక మంచిని స్థాపించబోయి మరో మంచిని అంతమొందించే ప్రమాదం ఏర్పడుతుందేమో గమనించాలి. ఓ చిన్న చెడుగును నిర్మూలించబోయి మరో పెద్ద చెడుగును పుట్టించడానికి కారణమవుతామేమో చూడాలి. అల్లామా ఇజ్జుద్దీన్ అబ్దుల్ మలిక్ ఇలా అంటున్నారు: నహీ అనిల్ మున్కర్ అన్నది కొన్ని షరతులకు లోబడి విధి అవుతుంది. వాటిలో ఒక షరతు ఆయన మాటల్లోనే చెప్పాలంటే-

**ان يغلب علٰى ظنه انه ان نهاه لاَ يلحقــه مضرة ولاَ يزيــد المنهى عنــه ايضـًا فى منكراتــه متعنّتا لاِنكار**

**ఈ విధిని నిర్వర్తించేవానికి ఓ నమ్మకం అత్యధికంగా ఉండాలి. అతను ఆ చెడుగును ఆచరించేవాణ్ణి దాన్ని మానిపించినట్లయితే అతనికి ఎటువంటి హాని కలగదు, లేదా ఎవరినయితే తాను వారిస్తున్నాడో అతను తన విమర్శన వల్ల తన చెడుగుల్లో కావాలని మరింతగా ముందుకు సాగడు కదా?!** *(మబారికుల్ అజ్హార్-- షర్హ్ మషారికుల్ అన్వార్ : 1/50)*

**అమ్ర్ బిల్ మారూఫ్** వ **నహీ అనిల్** మున్కర్కు సంబంధించిన ఏదయినా దుష్ట ప్రతిక్రియ రెండు విధాలుగా సంభవించడం సాధ్యమవుతుంది. ఒకటి, ఈ విధిని నిర్వర్తించే వ్యక్తికి ఏదయినా నష్టం వాటిల్లడం. రెండు, అతను స్వయంగా భద్రంగా ఉన్నా మరేదయినా చెడుగు కలగటం. ఉదాహరణకు మరెవరయినా నిరపరాధి అయిన వ్యక్తి, సంబంధం లేని వ్యక్తి హతుడయి పోవడం, లేదా చెడుగు చేసే వ్యక్తి మొండిగా తన చెడుగుపైన పట్టు పట్టి వ్యవహరించడం. ఇక ప్రతిక్రియ రెండవ విధమయినదయితే దాని విషయంలో ధర్మవేత్తలు నిర్ద్వంద్వంగా ఇటువంటి సందర్భంలో **అమ్ర్ బిల్ మారూఫ్** వ **నహీ అనిల్** మున్కర్ని నిర్వర్తించరాదని ఏకాభిప్రాయం కలిగి ఉన్నారు. మొదటి

కోవకు చెందిన ప్రతిక్రియను గురించి ఇప్పుడిప్పుడే సవివరంగా చర్చ జరిపాము. అయితే ప్రస్తుత చర్చననుసరించి ఇక్కడ ఓ ప్రత్యేక కోణాన్ని సూచించడం సముచితమని తలుస్తున్నాము. అల్లామా సఅదుద్దీన్ తఫ్తాజానీ ఇలా వ్రాస్తున్నారు :

منها (ای من شرائط الأمر بالمعروف و النهی عن المنکر) انتفاء مضرة و مفسدة اکثر من ذلک المنکر او مثله، وهذا فی حق الوجوب دون الجواز، حتی قالوا یجوزوان ظنّ انه یقتل ولاَ ینکی نکایة بضرب ونحوه لکن یرخص له السکوت

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ నిర్వహణలోని నిబంధనల్లోని ఒక నిబంధన ఏమిటంటే ఏ మున్కర్‌ని నిర్మూలించడానికి యత్నం చెయ్యడం జరుగుతున్నదో దానివల్ల దానికన్నా పెద్దదీ లేదా అటువంటిదే హాని లేదా కలత జనించరాదు. అయితే ఈ విషయం వాజిబ్ లేదా విధి అయిన దాని విషయంలోనే వర్తిస్తుంది. కేవలం అనుమతించిన దాని విషయంలో ఇది చెల్లదు. దీన్ని గురించి ధర్మ వేత్తలు ఎంతవరకు పలికారంటే, ఎవరికయినా తాను హత్యగావించబడినా చెడుగు చేసేవానికి సాధారణ హాని కూడా కలిగించలేనని, మామూలు దెబ్బ కూడా తీయలేనని అనుకున్నా, అతను ఆ విధిని నిర్వర్తించడం ధర్మ సమ్మతమే అని అంటారు. అయితే వారి ప్రకారం ఇటువంటి పరిస్థితుల్లో అతను మౌనం వహించడం కూడా అనుమతించబడిన అంశమే. (ఎందుకంటే 'విధి' నిర్వర్తన కేవలం 'ధర్మసమ్మతమయిన అంశమే' కాని, 'విధి' కాదు– అను) *(షర్హ్ అల్ మకాసిద్: 2/180)*

ఈ వాదనను ఇంత సర్వసాధారణంగా పలకడం సరయినది కాదు అన్నది ఇమామ్ గజాలీ అభిప్రాయం. ధర్మం కొరకు ప్రాణాలర్పించడం 'షహాదత్' అనడంలో సందేహం లేదు. మరి షహాదత్ అన్నది ఒక విశ్వాసికి అన్నింటికన్నా గొప్ప సంపద అన్నదీ సందేహరహితమయినదే. కాని తాను తన ప్రాణాలర్పించి ధర్మానికి ఏదయినా

ప్రయోజనం చేకూర్చగలుగుతున్నాడా? అని కూడా విశ్వాసి గమనించవలసి ఉంటుంది. నిష్ప్రయోజనంగా కేవలం ప్రాణం అర్పించడం బుద్ధికుశలతా కాదు, పుణ్యప్రదమూ కాదు. ఆయన ఇలా అంటున్నారు:

ان يعلم انه يصاب بمكروه و لكن يبطل المنكر بفعله كما يقدر على ان يرمى زجاجة الفاسق بحجر فيكسرها، و يريق الخمر، او يضرب العود الذى فى يده ضربة مختطفة فيكسره فى الحال، و يتعطل عليه هٰذا المنكر و لٰكن يعلم انه يرجع اليه فيضرب رأسه، فهذا ليس بواجب و ليس بحرام بل هو مستحب

**విమర్శన చేసేవాడు, తనకు బాధ కలుగుతుందని, అయినా తన చర్య వల్ల మున్కర్‌ని మట్టుపెట్టగలనని గ్రహించిన సందర్భంలో- ఉదాహరణకు పాపాతురుని చేతిలో మధువు నిండిన పాత్రను పగులగొట్టడమో లేదా దాన్ని పారవేయడమో చేయగలడు లేదా అతని చేతిలోని సంగీత వాయిద్యాన్ని విరగొట్టగలడు, దాన్ని అతనికి పనికిరాకుండా చేయగలడు, దీనితో పాటు అతనికి ఆ పాపాతురుని ప్రతి క్రియ కూడా తెలుసు, అతడు తిరగబడతాడని తన మాడు బద్దలు గొడతాడని కూడా విమర్శకునికి తెలుసు - ఇటువంటి సందర్భంలో విమర్శన అతనికి విధి కూడా కాదు, హరామ్, నిషిద్ధమూ కాదు. అది కేవలం అభిలషణీయం, ముస్తహబ్ అనబడుతుంది.**

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 347)*

ఇంకా ముందుకు వెళ్ళి ఇమామ్ గజాలీ ఈ విషయంలో మరింతగా చర్చించారు. ఆయన చర్చ సారాంశాన్ని మేము మా పదాలలో పెడుతున్నాము :

"విమర్శన చేసేవానికి తనకు కొట్టడం, తనపై దెబ్బతీయడం జరుగుతుందని లేదా తనను పరిమార్చివేయడం కూడా జరగవచ్చని తెలిసినా తనను ప్రమాదానికి గురిచేసుకుని అతను ఈ విధిని నిర్వర్తించగలడు. ఇది అతని కొరకు ధర్మసమ్మతమే కాదు, అభిలషణీయం కూడా. కాని షరతు ఏమిటంటే, ఆ విమర్శన వల్ల ఏదయినా ప్రయోజనం ఒనగూడాలి. ఉదాహరణకు ఏదయినా మున్కర్, చెడుగు రూపుమాపబడాలి, లేదా మున్కర్‌కు పాల్పడేవాని పరపతికి భంగం కలగాలి,

లేదా కనీసం విశ్వసించేవారికి బలం చేకూరాలి. కాని ఒకవేళ పరిస్థితి ఏమిటంటే ఒక వ్యక్తి మధువు సేవించే సన్నాహాలు చేస్తున్నాడు, అతని చేతిలో కరవాలమూ ఉంది, పరిస్థితులు స్పష్టంగా చెప్పేదాన్ని బట్టి అతన్ని విమర్శించినట్లయితే అతను విమర్శించేవాణ్ణి హతమార్చ డమేకాక, సారాయి త్రాగటం మానడు సరికదా, పూర్తిగా త్రాగుతాడు. అటువంటి పరిస్థితిలో, మా దృష్టిలో విమర్శన అన్నది సరయినది కాదు. అది కేవలం చావును కొనిదెచ్చుకోవడమే కాదు, దాని ప్రయోజ నమూ లేదు. వాస్తవమేమిటంటే ధర్మప్రయోజనం కలగాలి, మనిషి త్యాగం చేసి దాన్ని కాపాడాలి. పోతే ఎటువంటి ప్రయోజనాన్నీ సాధించ కుండా తన్నుతాను సంహారానికి గురి చేసుకోవడం అన్నది ఎంత మాత్రం ధర్మసమ్మతం కాజాలదు. అది నిషిద్ధమే కాగలగాలి. ఏ వ్యక్తి కయినా మున్కర్‌ని తిరస్కరించడం అన్నది వాంఛనీయం కాగలగా లంటే, అతను దాన్ని నిర్మూలించడానికి సమర్థుడయిన సందర్భంలోనే. లేదా తద్వారా మరేదయినా ధార్మిక ప్రయోజనం సాధ్యమవ్వాలి. అదీ ఓ షరతు లేదా నిబంధనతో- కలిగే బాధ కేవలం విమర్శన చేసే వ్యక్తి వరకు పరిమితమయి ఉండాలి. కాని ఒకవేళ విమర్శన చేసేవానికి ముందే తెలిసి ఉన్నట్లయితే- ఆ మున్కర్‌ని ఆచరించే వ్యక్తి తనతో పాటు తన స్నేహితుడు, బంధువు, మిత్రుడు, మరెవరికయినా కీడు కలిగించగలడని ఎరిగి ఉన్నట్లయితే- అతను విమర్శన చెయ్యడం అధర్మమే కాదు, హరామ్, నిషిద్ధం అవుతుంది. ఎందుకంటే కుద్‌రత్ లేదా శక్తి కలిగి ఉండటం అన్నది, సామర్థ్యం కలిగి వుండటం అని, మనిషి ఒక మున్కర్‌ని రూపుమాపితే మరో మున్కర్ రూపుదాల్చడాన్ని కుద్‌రత్ అనరు. ఇంకా ముందుకు వెళ్ళి మేము మరో విషయాన్ని చెబుతున్నాము, విమర్శన చేసేవాడు, తాను ఏ మున్కర్‌ని విమర్శిస్తు న్నాడో అదయితే సమసిపోతుంది, ఫలితంగా మరో వ్యక్తి మరో మున్కర్‌కు పాల్పడుతాడు అని తెలుసుకుంటే, స్పష్టంగా తెలిసే విషయమేమిటంటే అతను విమర్శనను మానుకోవాలి. ఎందుకంటే ఓ ప్రత్యేక వ్యక్తి మున్కర్‌ని మానుకోవడం ఉద్దేశం కాదు, అసలు

ఉద్దేశ్యం ముస్కర్ అన్నదే- అది ఏ రూపంలోనయినా సరే- రూపొంద రాదన్నది... మనిషి ఏ ముస్కర్‌ని రూపుమాపాలని కోరుతున్నాడో, దాని ఫలితంగా రూపొందనున్న మరో ముస్కర్ ఏదో, ఈ రెంటి స్థాయి, స్థితిగతులు వ్యత్యాసాలను బేరీజు వేసి తగిన చర్య తీసుకోవడం ఏమంత కష్టం కాదు. ఉదాహరణకు ఒక వ్యక్తి ఎవరిదో ఒక మేకను జిబ్హ్ చేసి భుజించగోరుతున్నాడు. దీనికి విమర్శన చేసే వ్యక్తికి, ఈ చెడుగును ఆపే ప్రయత్నం చేస్తే ఫలితంగా అతను మనిషిని జిబ్హ్‌చేసి తింటాడని తెలిసే పక్షంలో అతను ఆ సమయాన విమర్శనా విధిని నిర్వర్తించడం అత్యంత అసమంజసమయిన, బుద్ధి హీన మయిన పని అవుతుంది. దీనికి భిన్నంగా ఒక వ్యక్తి మనిషిని సంహరిం చబోతున్నట్లు లేదా మనిషి అవయవాన్ని కోయబోతున్నట్లు తెలిస్తే అప్పుడు విమర్శన చేసేవానికి, తన విమర్శనకు ఫలితంగా అతను మనిషిని వదలి అతని సొమ్మును కాజేస్తాడని తెలిస్తే నిస్సందేహంగా ఆ సమయాన విమర్శనకు అవకాశం, ధర్మ సమ్మతమయిన అవకాశం ప్రాప్తమవుతుంది. ఇటువంటి వ్యవహారాలన్నింటిలో విమర్శన చేసేవాడు అనువర్తన జ్ఞానం ద్వారా ప్రయోజనం పొందవలసి ఉంటుంది. ఇటువంటి విషయాలన్నింటిలో ఒకే నిర్దిష్టమయిన సూత్రం, నిబంధన రూపొందించడం సాధ్యం కాదు."

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 347- 348)*

ఇమామ్ ఇబ్ను కయ్యిమ్ ఈ విషయాన్ని చాలా ఉత్తమంగా విశ్లేషించారు. దీని విభిన్న కోణాల పైన అతి సున్నితంగా, సుందరంగా చర్చించారు. ప్రవక్త మహ నీయులు (స) సముదాయంపైన ముస్కర్‌ని నిరాకరించడాన్ని విధిగా ఎందుకు నిర్ణయించారో చెబుతూ ఇలా అన్నారు: అల్లాహ్, అల్లాహ్ సందేశహరులకు ప్రీతిపాత్రమయినది అసలు 'మారూఫ్', అది ప్రాప్తమవాలంటే ముస్కర్‌ని తిరస్కరించ వలసిందే కాని ఒకవేళ ఏదయినా ఓ ముస్కర్‌ని విమర్శించడం లేదా తిరస్కరించడం చేత, అల్లాహ్‌కు ఆయన ప్రవక్తకు అంతకన్నా ఇష్టం కాని, ఆగ్రహ కారణమయిన మరేదయినా ముస్కర్ వాటిల్లడం అనివార్యమయినట్లయితే ఆ ముస్కర్ తిరస్కారం పట్ల అనుమతి లేదు. ఆ తరువాత ఇలా వ్రాశారు :

انكار المنكر اربع درجات: الأولى ان يزول و يخلفه ضده، الثانية: ان يقلّ وان لم يزل بجملته، الثالثة: ان يخلفه ماهو مثله، الرابعة: ان يخلفه ما هو شر منه، فالدرجتان الاّ وليان مشروعتان و الثالثة موضع اجتهاد والرابعة محرمة.

మున్కర్‌ని తిరస్కరించడం అన్నది నాలుగు విధాలుగా సాధ్యం. మొదటి విధానం, మున్కర్ సమసిపోయి దాని స్థానంలో మారూఫ్ నెలకొనాలి. రెండవ విధానం, మున్కర్ పూర్తిగా సమసిపోకపోయినా అది తగ్గిపోవడం. మూడవ విధానం, ఏ మున్కర్‌ని నిరాకరించడం జరుగుతోందో అదయితే సమసిపోతుంది, కాని దాని స్థానంలోనే అదే స్థాయి గల మరో మున్కర్ వచ్చి చేరుకోవడం. నాల్గవ విధానం, ఆ మున్కర్ సమసిపోయిన తరువాత అంతకన్నా నికృష్టమయిన మున్కర్ చోటు చేసుకోవడం. మొదటి రెండు విధానాలు షరీఅత్ బద్ధమయినవే. మూడవ విధానం పట్ల 'ఇజ్తిహాద్' (అన్వయ కృషి) సల్పవలసి ఉంటుంది. నాల్గవ విధానం హరామ్, నిషిద్ధం.

ఆ తరువాత ఇమామ్ మహనీయులు దీన్ని మరింతగా వివరించారు : "ఒకవేళ పాపాతురులు, ధర్మభ్రష్టులు జూదమాడుతూ ఉండగా మరేమయినా చెడు కార్యకలాపాల్లో నిమగ్నులయి ఉండగా లేదా ఆటపాటల్లో మునిగి ఉండగా కేవలం వారిని ఆపివేయడం వివేకం అనిపించుకోదు. బుద్ధికుశలత అనిపించుకోదు. కాని మీరు వారిని ఆ కార్యాలకు దూరం చేసి మరేదయినా మంచి పనిలో నిమగ్నం చేసినట్లయితే, అది అల్లాహ్, అల్లాహ్ సందేశహరులకు ఇష్టమయినదయితే- ఉదాహరణకు విల్లంబులు గురిపెట్టడం, గుర్రపుస్వారీ వగైరా- అలాంటప్పుడు వారిని విమర్శించడం, వారి చేష్టల పట్ల నిరాకరణ చూపడం సరయినదే కాగలదు. ఎందుకంటే వారు మీ విమర్శన వల్ల దాన్ని మానుకున్నా ఆ తరువాత ఖాళీగా ఉంటూ అంతకన్నా హీనమయిన మున్కర్లకు చెడుగులకు లోనయ్యే ఆస్కారముంటుంది, ప్రస్తుత నిమగ్నత వారిని ఇంతవరకు ఆ హీనమయిన

మున్కర్ల నుండి ఆపిఉంచింది. అదేవిధంగా ఎవరయినా అశ్లీల, నగ్నమయిన పుస్తకాలు అధ్యయనం చేస్తూ ఉండగా, అతన్ని వాటి నుంచి మాన్పించినట్లయితే అతను ధర్మభ్రష్టత, మార్గవిహీనత నిండిన పుస్తకాల పఠనంలో నిమగ్నుడవుతాడని మీరు భయపడుతున్న ట్లయితే అతన్ని తప్పు పట్టకండి. ఆ అశ్లీల పుస్తకాల వల్ల కేవలం అతని నైతికత మటుకే చెడుతుంది. కాని ధర్మభ్రష్టత నిండిన పుస్తకాల వల్ల అతని విశ్వాసం, ధర్మం కూడా చెడిపోయే ప్రమాదముంది. షైఖుల్ ఇస్లామ్ ఇబ్ను తైమియ్యా ఒకసారి ఇలా తెలిపారు: మంగోలీయుల కాలంలో ఒకసారి నేనూ, నా సహచరులు చూశాము, కొందరు మంగో లీయులు (తాతారీయులు) సారాయి తాగుతున్నారు. ఇది చూసి నా సహచరులు వారిని వారించారు. నేను నా సహచరుల్ని వారించాను. నేను మా వారికి చెప్పాను, సారాయి అల్లాహ్ సంస్మరణ నుండి, నమాజ్ నుండి ఆపుతుందని అల్లాహ్ దాన్ని నిషేధించాడు. కాని వీరి విషయంలో సారాయి మంచిగానే వ్యవహరిస్తోంది. అది వారిని జనుల్ని చంపకుండా పిల్లల్ని ఖైదులో పెట్టకుండా, ధనం లూటీ చెయ్యకుండా ఆపుతోంది. అందువల్ల వారిని వారి మానాన వదలిపెట్టండి, సారాయి త్రాగనివ్వండి." *(ఈలాముల్ మువక్కియీన్ : 3/ 12,13)*

## నిష్ప్రయోజకత పట్ల నమ్మకం

ఒక్కోసారి **'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్'** ఫలితంగా మనిషికి హాని కలిగే లేదా మరేదయినా మున్కర్ ఉత్పన్నమయ్యే ప్రమాదమయితే ఏర్పడదు కాని దానివల్ల ఎటువంటి ప్రయోజనమూ కానరాదు. ఇటువంటి పరిస్థితిలో కొందరి అభిప్రాయంలో **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధి, అత్యవసరం కూడా.[1] ఇమామ్ నవవీ ఈ విషయంలో సెలవిచ్చేదేమిటంటే, మారూఫ్‌ని ఆదేశిం చడం, మున్కర్‌ని నిరోధించడం మానవుని బాధ్యత, ఇతరులు దాన్ని స్వీకరిస్తున్నారా లేదా అన్నది అతని బాధ్యత కాదు. కాగా ఆయన ఇలా వ్రాస్తున్నారు:

---

*1. అత్తష్రీ అల్ జనాయి అల్ ఇస్లామీ : 1/498*

قال العلماء ولاَ يسقط عن المكلف الاَمر بالمعروف و النهى عن المنكر لكونه لاَ يفيد فى ظنه، بل يجب عليه فعله، فان الذكرى تنفع المومنين، و قد قدمنا ان الذى عليه الاَمر و النهى لاَ القبول كما قال الله عز و جل مَا عَلَى الرَّسُوْلِ اِلّاَ البَلاَغُ

ధర్మవేత్తల ప్రకారం, సామర్థ్యమున్న వ్యక్తి అభిప్రాయంలో అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ నిష్ప్రయోజనమయినా అది అతని విధి అవడం మాత్రం తొలగిపోదు; అతను దాన్ని నిష్ప్రయోజనమని భావించినప్పటికీ దాన్ని అమలుపరచడం తప్పనిసరి. ఎందుకంటే బోధపరచడం అన్నది ఎట్టి పరిస్థితిలోనూ విశ్వాసులకు ప్రయోజనకరమయినదే. మేము (లోగడ కూడా) చెప్పే ఉన్నాము, మనిషి విధి, కేవలం మంచిని ఆదేశించడం, చెడుని నివారించడం మాత్రమే. ఇతరులు దాన్ని స్వీకరిస్తా రన్నది అతని బాధ్యతలోని విషయం కాదు. స్వయంగా పరమ ప్రభువు అల్లాహ్ సెలవిచ్చాడు: ధర్మాన్ని అందజేయడం మాత్రమే దైవ సందేశహరుని బాధ్యత *(దాన్ని ఒప్పించడం, ఆచరింపజేయడం కాదు).*

*(షర్హ్ ముస్లిమ్ : సం. 1, భాగం 2, పు. 20)*

ఇమామ్ నవవీ ప్రకారం తెలిసేదేమిటంటే, నమ్మకంగా నిష్ప్రయోజనమే అయినా ధర్మవేత్తల అభిప్రాయంలో '**అమ్ర్ బిల్ మారూఫ్** వ **నహీ అనిల్ మున్కర్**' అన్నది విధి అయినదే. కాని ఈ వాదన సరయినది కాదు. ఎందుకంటే సర్వసాధారణంగా ధర్మవేత్తలు వ్రాసిన దాని ప్రకారం **అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ అనిల్ మున్కర్ ఫలితంగా ఏదయినా తప్పుడు ప్రతిస్పందన, లేదా హాని కలిగే ప్రమాదం లేకపోయినప్పటికీ దానివల్ల ప్రయోజనం కలిగే నమ్మకం ఉన్నప్పుడే అది విధి అవుతుంది. అది నిష్ప్ర యోజనం లేదా వట్టిదే అని భావించినట్లయితే ఇంకా అది విధి అవడం కూడా మిగులదు. కాగా అల్లామా ఇజ్జుద్దీన్ అబ్దుల్ మలిక్, నహీ అనిల్ మున్కర్ విధి అవడం పట్ల వివరించిన షరతులలో ఇదీ ఒకటి:

ان يغلب على ظنه ان نهيه مؤثر لاَ عبث

**అతనికి దాన్ని వారించడం ప్రభావవంతమవుతుంది, వట్టి పోదు అన్న గట్టి నమ్మకం కుదరాలి.** *(మబారిక్ అల్ అజ్హార్ ఫీ షర్హ్ మషారిక్ అల్ అన్వార్ : 1/50)*

ఇమామ్ గజాలీ ప్రకారం, మనిషి **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్** మున్కర్ వల్ల ఎటువంటి ప్రయోజనం లేదని గ్రహించినట్లయితే అది అతనికి విధి కాదు. అయితే దాని వాంఛనీయత అతనిపైన ఇంకా మిగిలే ఉంటుంది. ఎందుకంటే ఏ వ్యక్తి వైఖరి పట్ల అతను విమర్శన జరుపుతాడో, అతను తన వైఖరిని మానుకున్నా మానుకోకపోయినా, దీనివల్ల సమయానికి సరయిన సందర్భంలో ధర్మం వ్యక్తమవడం అన్నది మటుకు తప్పక జరుగుతుంది, ఇతరులకూ షరీఅత్ ఆదేశమేమిటో కూడా తెలిసివస్తుంది. ఈ విషయంలో ఇమామ్ గజాలీ ప్రయోగించిన పదాలు ఇవి:

**ان يعلم انه لاَ يفيد انكاره لكنه لاَ يخاف مكروها فلا تجب عليه الحسبة لعدم فائدتها، و لٰكن تستحب لإظهار شعائر الاِسلام و تذكير الناس بأمر الدين-**

**విమర్శన జరిపేవాడు, తన విమర్శన వల్ల ప్రయోజనం లేదని తెలుసుకున్నప్పుడు, తనకు ఏ హానీ కలిగే ప్రమాదమూ లేదని గ్రహించి నప్పటికీ అతను విమర్శన చెయ్యడం తప్పనిసరి కాదు, ఎందుకంటే దానివల్ల ఎటువంటి ప్రయోజనమూ లేదు. అయితే ఇస్లామీయ చిహ్నాల ప్రకటనకు, జనుల మధ్య ధార్మిక విషయాల సంస్మరణకు ఈ విమర్శన అభిలష ణీయం, వాంఛనీయం.**

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్: 2/ 347)*

ఏ ప్రత్యేక వ్యవహారంలో **అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్** మున్కర్ విధిని నిర్వర్తించడం జరుగుతుందో అందులో ప్రయోజనం కలగకపోయినా, ధార్మిక ప్రాముఖ్యం గల విషయాలను ప్రస్ఫుటపరిచే, జనుల్ని ప్రబోధపరిచే అవకాశం దొరుకు తుంది. కాబట్టి, ఈ కారణం వల్లను ఇమామ్ గజాలీ, ఆయనతో ఏకాభిప్రాయం గల పండితుల దృష్టిలో అది అభిలషణీయమయిన పనియే. కాని కొందరు దీన్ని ఇదే వాదన ఆధారంగా విధిగా కూడా నిర్ణయిస్తారు. వారనేదేమిటంటే, ధార్మిక విషయాల ప్రకటన, ప్రస్ఫుటీకరణ కూడా **అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్** మున్కర్ ఉద్దేశ్యా ల్లోని ఓ ముఖ్యమయిన అంశమే గనక, ఈ అంశమూ ప్రాప్తమవుతున్నప్పుడు దీన్ని నిష్ప్రయోజక ప్రయత్నమనడానికి వీల్లేదు. దీనికి సమాధానంగా అల్లామా సఅదుద్దీన్ తఫ్తాజానీ మరో వాదన ముందుంచుతారు, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** వల్ల ధర్మం గౌరవ మర్యాదలు పెరుగుతాయన్నది వాస్తవమేకాని కొన్ని

సందర్భాలలో దీనివల్ల ధర్మానికి హాని కూడా కలగవచ్చు. అందువల్ల అన్నివేళలా దీన్ని విధియే అనడం సబబు కాదు. కాగా అల్లామా గారు అది విధి అవడానికి షరతుల విషయంలో ఇలా వ్రాశారు :

منها تجويز التاثير بـان لاَ يعلم عدم التاثير قطعًا لئلا يكون عبثًا و اشتغالاً بمـا لاَ يعنى، فان قيل يجب وان لم يوثر اعزازًا للدين قلنا ربما تكون اذلاَلاً

**ఇది విధి అవడానికి ఒక షరతేమో, అది ప్రభావవంతమయ్యే అవకాశముండాలి, ఎంతగా అంటే దాన్ని ఆచరించేవానికి, అది నిష్ప్రయోజనం కాదు అన్న విషయంలో గట్టి నమ్మకం కుదరాలి, అలా అది నిష్ఫలకార్య నిమగ్నత కాదన్న నమ్మకం కలగాలి. అది ప్రభావవంతం కాకపోయినప్పటికీ ధర్మగౌరవం అందులో ఇమిడి ఉందని, అందువల్ల అది అవసరమని ఎవరయినా అన్నట్లయితే అనేక సందర్భాలలో అలా చెయ్యడం ధర్మానికి అవమానకరమని మా సమాధానం.**

*(షరహుల్ మకాసిద్: 2/ 180)*

## ప్రయోజనం కలిగే ఓ అవకాశం

'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్' ప్రయోజనకరమా నిష్ప్రయోజనమా అన్న ప్రస్తావన వచ్చినప్పుడు దాని అర్థం, మారూఫ్‌ని ఆదేశించినప్పుడు అది ఉనికిలోకి వచ్చిందా లేదా అన్నది. లేదా ముస్కర్‌ని వారించినప్పుడు అది సమసి పోయిందా లేదా అన్నది. అయితే దాన్ని మరో కోణంలోనూ పరిశీలించవలసి ఉంటుంది. ఒక ముస్లిమ్ వ్యక్తి **అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్ ముస్కర్** వల్ల వెంటనే దాని ప్రభావం స్వీకరించినా స్వీకరించకపోయినా దానిపట్ల అచేతనంగానే ఎంతోకొంత ప్రభావితుడవుతాడు. తరువాత ఇదే ప్రభావం అతను ముస్కర్‌ను త్యజించేలా మారూఫ్‌ని ఆచరించేలా కారణభూతం కావచ్చు. ఎందుకంటే మారూఫ్‌ని త్యజించడం ముస్కర్‌కు పాల్పడటం అన్నది స్వయంగా అతని దృష్టిలోనూ పుణ్యప్రదమయిన కార్యం కాదు. అతను దాన్ని తన ఆలోచనలకు, తన విశ్వాసానికి విరుద్ధమయినది, తప్పయినదిగానే భావిస్తాడు. ఏ కారణం చేతనయినా అతను సంస్కరణను స్వీకరించలేకపోతున్నాడంటే అది అతని గంభీరమయిన నిర్ణయం వల్ల జరగలేదు. అది

కేవలం తాత్కాలికమయిన, ఉద్రేకపూర్వకమయిన ప్రతిక్రియ మాత్రమే కాగలదు. అందువల్ల ఆ ప్రతిక్రియ బలహీనపడినప్పుడు అతను తన వైఖరి పట్ల పునఃపరిశీలన జరపడం కూడా సాధ్యమే. మరి అతని జీవితం బాగుపడటమూ సాధ్యమే. ఈ కోణంలో, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్** ప్రయోజనం వెంటనే బయల్పడకపోయినా దాని ప్రయోజకత్వాన్ని ప్రాముఖ్యాన్ని కాదనలేము. ఇమామ్ ముహమ్మద్ ఈ విషయాన్ని ఈ కోణంలోనే పరిశీలించారు. ఈ పరిశీలనలో ముస్లిమ్ సముదాయం మానసిక స్థితిని పూర్తిగా దృష్టిలో పెట్టుకోవడం జరిగింది. ఆయన ఇలా అన్నారు :

**وفی الاَمر بالمعروف و النهی عن المنكر يسعه الاَقدام وان كان يعلم ان القوم يقتلونه وانه لاَ يتفرق جمعهم بسببه لاَن القوم هناک مسلمون معتقدون لما يامرهم به فلا بد من ان فعله ينكئ فی قلوبهم و ان كانوا لاَ يظهرون ذٰلک**

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ విషయంలో ఎట్టి పరిస్థితిలోనూ చర్య తీసుకునే అవకాశముంది. దాని కారణంగా జనం తనను హతమారుస్తారని, అయితే స్వయంగా తన మూలంగా వారి సంఘీభావంలో విచ్ఛిన్నత ఏర్పడదని అతనికి తెలిసినప్పటికీ అతను దాన్ని అమలుపరచగలడు. ఎందుకంటే జనులు ముస్లిములు, అతను వారికి ఏ విషయాలను ఆదేశిస్తున్నాడో వాటి పట్ల వారికి గట్టి విశ్వాస ముంది. అందువల్ల వాటి పట్ల అమలుపర చడం తప్పనిసరిగా వారి హృదయాలను ప్రభావపరుస్తుంది, వారు దాన్ని వ్యక్తం చేయకపోయినాసరే.**

*(షర్‌హుస్సియర్ అల్ కబీర్: 3/ 239, 240)*

వాస్తవమేమిటంటే ముస్లిముల మధ్య '**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**' పట్ల రెండు విధాల ప్రతిక్రియలు సాధ్యమే. ఒక ప్రతిక్రియ అయితే వెంటనే వ్యక్తమయ్యే అవకాశముంది. రెండవ ప్రతిక్రియ వ్యక్తమయ్యేందుకు కొంతకాలం పట్టవచ్చు. వెంటనే వ్యక్తమయ్యే ప్రతిక్రియ, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** నిర్వర్తించబడే పరిస్థితుల ఫలితంగా ఉత్పన్నం అవుతుంది. ఆ పరిస్థితుల్లో వ్యక్తులయినా సమాజాలయినా సర్వసాధారణంగా సత్కార్యాలకు దూరంగా ఉండి చెడుల వైపు వారు మొగ్గు చూపుతుంటారు. వారు మున్కర్‌ను వదలి మారూఫ్‌ను

స్వీకరించేందుకు సన్నద్ధంగా ఉండరు. నిజానికి కొన్ని సందర్భాలలో వారు మున్కర్‌కు ప్రతికూలంగా, మారూఫ్‌కు అనుకూలంగా ఒక్క మాటనూ వినడానికి సిద్ధంగా ఉండరు. ఇటువంటి పరిస్థితుల్లో మారూఫ్ నెలకొని మున్కర్ సమసిపోయే అవకాశ మున్న చోట, ఈ విధిని నిర్వర్తించే వ్యక్తి తన ప్రాణాలు సయితం అర్పించే ప్రమాదమూ ఉంటుంది. అయినప్పటికీ మారూఫ్ నెలకొనదూ మున్కర్ సమసిపోదు కూడా. రెండవ ప్రతిక్రియ ఇటువంటి పరిస్థితులు అంతమయిన తరువాత మొదలవుతుంది. అప్పుడు ఆ వ్యక్తికయినా, ఆ సమాజానికయినా గంభీరంగా ఆలోచించే అవకాశాలు మెండుగా ప్రాప్తమవుతాయి. వారికి మారూఫ్ సందేశాన్ని అందజేసి ఉంటారు, లేదా మున్కర్ పట్ల నిషేధాన్ని తెలిపి ఉంటారు.

ఇటువంటి ప్రతిక్రియ సాధారణంగా ఒక ముస్లిమ్ వ్యక్తికయినా ఒక ముస్లిమ్ సమాజానికయినా చాలా సంస్కారవంతంగా, ప్రయోజనకరంగా పరిణమించగలదు. ఒక పాపాతురుడయిన ముస్లిమ్ ధార్మిక ప్రచారకుని తల నరికివేసినా ఆ ముస్లిమ్ వ్యక్తి అంతర్యంలో ఓ అనుభూతి కెలుకుతూ ఉంటుంది. తాను ఒక శ్రేయోభిలాషి, సద్బోధకుని పట్ల శత్రువుతో వ్యవహరించే తీరులో వ్యవహరించానని అంతరాత్మ ఘోష పెడుతూనే ఉంటుంది. ఇదే అనుభూతి, ఇదే భావన అతన్ని ధర్మం వైపునకు మొగ్గుదలకు మూలమయ్యే అవకాశమూ లేకపోలేదు. అతను స్వయంగా ధర్మం వైపునకు మరలకపోయినా ప్రచారం, సంస్కరణల ఈ ప్రయత్నాల వల్ల చాలా మంది ప్రయోజనం పొందే అవకాశాలు అధికంగా ఉన్నాయి. పాప కార్యాలలో ఆ వ్యక్తులు ఆ పాపాతురునికి తోడుగా ఉన్నవారే అయినప్పటికీ వారిలోనూ సత్య స్వీకారయోగ్యత ఉంటుంది. ముస్లిముల చరిత్రలో, ఏ కాలంలోనయినా మరే ప్రాంతంలోనయినా **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధి నిర్వహణ జరగగా పూర్తి జాతికి జాతియే దాని పవిత్ర ఫలాలకు దూరమయిన సంఘటన ఎన్నడూ సంభవించలేదు. అందువల్ల ఏ ప్రత్యేక సమయాన లేదా ఏ ప్రత్యేక పరిస్థితుల్లోనో దాని ప్రయోజనం కానరాకపోతే భావిలోనూ దాని ప్రయోజకత్వాన్ని నిరాకరించడానికి వీల్లేదు. ఎందుకంటే నేడు **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** ప్రయత్నాలు ఫలించే అవకాశం లేకపోతే, తరువాత ఎప్పుడయినా అవి ఫలవంతం అయ్యే అవకాశం లేదని అర్థం కాదు. నిజానికి నేడు నిష్ఫలమవుతున్నట్లు అగుపిస్తున్న ప్రయత్నాలు సుదీర్ఘకాలం తరువాత ఫలవంతం కావడం సాధ్యం కావచ్చు. అయితే ఒకటి మాత్రం వాస్తవం.

బాహ్యంలో సఫలత పొందే అవకాశాలు లేని పరిస్థితుల్లో **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధిని నిర్వర్తించడం ప్రతి వ్యక్తికి సాధ్యమయ్యే పని కాదు. వాతావరణం ఎంతగానో ప్రతికూలమయి పోయి, జనులు దైవధర్మంపైన సుస్థిరంగా నిలకడ చూప డమే దుర్భరమయిపోతున్న స్థితిలో వారు తమ ధర్మం, విశ్వాసాలను కాపాడుకోవడమే మహా గొప్ప విషయం. ఇటువంటి వారిపైన **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** భారం మోపడం సరయినది కాదు. కాని ప్రముఖులు కూడా ఇంతకన్నా ముందుకు సాగకపోవడమయితే ఇది వారి శక్తిసామర్థ్యాల పట్ల కడు అన్యాయంగానే పరిగణించవలసి ఉంటుంది.

## తత్సమయాన ప్రయోజనం లేకపోతే...

పై పంక్తుల్లో పేర్కొన్న భావాలకు మద్దతు తెలిపే హదీసులున్నాయి. రెండు విధాల హదీసులు మన ముందుకు వస్తాయి. ఒక విధమయిన హదీసుల్లో పరిస్థితులు క్షీణించి వీలుకాని సందర్భంలో మనిషికి అనుమతి ఉంది. అతను ఎక్కడయినా మారుమూలల్లో కూర్చుండిపోవచ్చు. **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** మానుకోవచ్చు. మరోవైపున మరో విధమయిన హదీసులున్నాయి. వాటిలో, సమాజంలో దౌష్ట్యం పేరుకుపోతే దానికి గాభరాపడి దూరంగా పారిపోకుండా, సమాజంలోనే ఉంటూ దాని సంస్కరణకు తమ విధి నిర్వహణ చేసేవారిని శ్లాఘించడం జరిగింది. ఆ విధంగా ఎవరిలో సత్యస్వీకార యోగముంటుందో ఈ వేళ కాకపోయినా రేపయినా వారి జీవితాలు మారిపోతే వారు సన్మార్గాన వచ్చేస్తారు. ప్రస్తుతం మూడు హదీసులు ప్రస్తుత పరుస్తున్నాము; వాటిలో, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** వల్ల ప్రయోజనం అసలే లేదని అనిపించినప్పుడు ఆ విధి తొలగిపోతుందన్న విషయం విశదపరచడం జరిగింది.

**(۱) ائتمروا بالمعروف و تناهوا عن المنكر حتى اذا رايت شحاً مطاعا وهوى متبعًا ودنيا موثرة و اعجـاب كل ذى راى برايه**

**1.** **మీరు పరస్పరం మారూఫ్‌ను ఆదేశించు కోండి, మున్కర్‌ని వారించుకోండి. కాని, పిసినారితనాన్ని అనుసరించడం జరుగుతుం డగా, మనోకాంక్షల అనుకరణ జరుగుతుం డగా, పరలోకంపైన ప్రపంచానికి ప్రాధాన్యత ప్రాప్త మవుతుండగా, స్వేచ్ఛాభిప్రాయం గల ప్రతి వ్యక్తి తన అభిప్రాయంలో మత్తుగొని**

فعليك بخاصة نفسك ودع العوام

ఉండగా (షరీఅత్‌లో దానికున్న చోటేమిటో చూడకుండా) మీరు గమనించినట్లయితే మీరు కేవలం మీ వైయక్తిక విషయాన్ని గురించి చింతించండి, ప్రజల్ని వదలిపెట్టండి.

(తిర్మిజి, కితాబుత్తఫ్‌సీర్ (సూరా మాయిద); అబూ దావూద్, కితాబుల్ మలాహిమ్, బాబు అమ్ర్ వ న్నహీ)

కొన్ని ఉల్లేఖనాలలో ఈ పదాలను సయితం అదనంగా చేర్చడం జరిగింది: **و رأيت امرًا لا يدان لك به**★, అంటే పరిస్థితులు చెడిపోయి వాటికి ప్రతిగా నీలో శక్తి లేదని నీవు గమనిస్తే నీవు **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** వదలి పెట్టగలవు అని భావం.

(٢) يوشك ان ياتى زمان يغربل الناس فيه غربلة، تبقى حثالة من الناس قد مرجت عهودهم و اماناتهم واختلفوا فكانوا هكذا، و شبك بين اصابعه، فقالوا كيف بنا يا رسول الله؟ فقال تاخذون ماتعرفون وتذرون ما تنكرون و تقبلون علىٰ امر

**2.** ఓ కాలం త్వరలో రానున్నది; అప్పుడు మనుష్యుల్ని జల్లెడ పట్టడం జరుగుతుంది. కేవలం నీచులయినవారు, నికృష్టులయినవారు మిగిలిపోతారు. వారి ప్రమాణాలు, వాగ్దానాలు మారిపోతాయి. అప్పగింతల్లో మోసాలు జరుగుతాయి. వారిలో మంచివారు, చెడ్డవారు కలగాపులగమయిపోతారు, అంటూ ఆయన తన చేతుల వ్రేళ్ళను కలిపి చూపించారు. (అంటే వారి మధ్య వ్యత్యాసం చూపడం కష్ట సాధ్యమయిపోతుందన్నమాట) సహచరులు (ర) విన్నవించుకున్నారు, అటువంటి పరిస్థితుల్లో మేము ఎలా వ్యవహరించాలి? ఆయన ఇలా సెలవిచ్చారు; మీరు దేన్ని మారూఫ్‌గా భావిస్తారో దాన్ని గట్టిగా పట్టుకుని ఉండండి, దేన్ని మున్కర్‌గా భావిస్తారో దాన్ని త్యజించండి, మీలో ప్రముఖులయినవారి

★ ఇబ్నుమాజ; అబ్వాబుల్ ఫితన్, బాబు అల్ అమ్ర్ బిల్ మారూఫ్ వన్నహీ అనిల్ మున్కర్

خاصتكم و تـذرون امـر عامتكم

వైఖరిని అనుసరించండి, సామాన్యుల వ్యవహారాల నుండి దృష్టి మరల్చుకోండి.

*(అబూదావూద్, కితాబుల్ మలాహిమ్, బాబు అల్ అమ్ర్ వన్నహీ; ఇబ్ను మాజ- అబ్వాబు అల్ ఫితన్, ముస్నద్ అహ్మద్: 2/ 441)*

(٣) عن انس بن مالك قال قيل يا رسول الله متى ندع الائتمار بالمعروف و النهى عن المنكر؟ قال اذا ظهر فيكم ما ظهر فى بنى اسرائيل، اذا كانت الفاحشة فى كباركم و الملك فى صغاركم و العلم فى رذالكم

**3.** అనస్ బిన్ మాలిక్ (ర) ఉల్లేఖనం, ప్రవక్త మహనీయుల్ని అడగటం జరిగింది, ఎటువంటి పరిస్థితుల్లో మేము ఒకరికొకరు మారూఫ్‌ని ఆదేశించడం, మున్కర్‌ని నిరోధించడం మానుకోవాలి? అని. ఆయన సమాధానంగా పలికారు, మీలోనూ బనీ ఇస్రాయీల్‌లో పొడసూపిన చెడుగులు పొడసూప మొదలెట్టినప్పుడు. అంటే వ్యభిచారం, అశ్లీలం మీ పెద్దల్లోనూ, పరిపాలన రాచరికం మీ పిన్నల్లోను, జ్ఞానం మీ పాపాతురులు, ధర్మభ్రష్టుల్లోనూ ప్రబలిపోయినప్పుడు.

*(ముస్నద్ అహ్మద్ : 4/35; ఇబ్ను మాజ, అబ్వాబు అల్ ఫితన్, బాబు అల్ అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్)*

ఈ హదీసులు వాటి భావం దృష్ట్యా అతి స్పష్టంగా ఉన్నాయి. కాని మనం ఒక యదార్థాన్ని మరువరాదు. వీటిలో తెలిపినటువంటి పరిస్థితులు ఎక్కడ ఉత్పన్నమయినా అక్కడ **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్** మున్కర్ విధిని నిర్వర్తించక పోవడం కేవలం అనుమతించబడిందే కాని దాన్ని వదలివేయడం 'విధి'కాని, 'అభిలషణీయం' కాని కాదు. అందువల్ల తొలి హదీసు విషయంలో అల్లామా అబూ బక్ర్ జస్సాస్ (రహ్మ) ఇలా అన్నారు :

يعنى و الله اعلم اذا لم يقبلوا ذٰلك و اتبعوا أهواء هم واٰراء هم فانت فى سعة من تركهم

**అంటే, వారు సత్యాన్ని స్వీకరించకుండా మనోకాంక్షల వెంటపడి నడచుకోవడం మొదలెడితే వారిని వదలిపెట్టడానికి మీకు అనుమతి ఉంది.** *(అహ్కాముల్ కుర్‌ఆన్ : 2/41)*

రెండవ హదీసును గురించి అబూ దావూద్ గ్రంథానికి భారతీయ టీకా కారులు మౌలానా ముహమ్మద్ అష్రఫ్ అజీమాబాదీ ఇలా అన్నారు:

هٰذا رخصة فى ترک الامر بالمعروف و النهى عن المنكر اذا كثر الاَشرار وضعف الاَخيار

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌ని వదలిపెట్టడానికి ఇది అనుమతి, చెడ్డవారి సంఖ్య పెరిగిపోయినప్పుడు మంచివారు బలహీనపడిపోయినప్పుడు.**

*(ఔనుల్ మాబూద్: 4/ 217)*

మూడవ ఉల్లేఖనానికి సమానార్థకమయిన మరో ఉల్లేఖనం ఉటంకించిన తరువాత అల్లామా సఅదుద్దీన్ తఫ్తాజానీ ఇలా వ్రాశారు :

الحديث فلا يدل الاَ على نفى الوجوب عند فوات الشرط بلزوم المفسدة وانتفاء الفائدة

**హదీసు కేవలం ఒక మాటను నిర్ధారిస్తోంది. దాని షరతు (నిబంధన ఆధారంగా) లేనప్పుడు అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ విధి (వాజిబ్)గా మిగులదు. అంటే దానివల్ల ఏ ప్రయోజనము లేకుండా చెడుగే తప్పని సరిగా బయల్పడే ప్రమాదమున్నప్పుడన్నమాట.**

*(షర్హ్ అల్ మకాసిద్: 3/ 180)*

పరిస్థితులు అంతగా క్షీణించి చెడుగుకు లోనయి, మనిషి ఏ మూలనో పడి ఉండి తప్ప తన ధర్మాన్ని, విశ్వాసాన్ని కాపాడుకోలేడు అన్నంతగా దుర్భరమయిపోతే అతను సమాజం నుండి సంబంధాలు తెంచుకుని దూరంగా జీవించేందుకు అనుమతి కూడా ఉందన్నమాట. ఎందుకంటే విశ్వాసాన్ని కాపాడుకోవడం అన్నింటికన్నా ప్రముఖ మయిన విషయం. దాని కొరకు ప్రపంచంలోని ప్రతి వస్తువునూ వదలటం సాధ్యమే. కాని మరే లక్ష్యంతోనయినా విశ్వాసాన్ని మటుకు వదలకూడదు. అటువంటి సందర్భంలోనే **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధి తొలగిపోతుంది. కాని ఏ వ్యక్తులయితే జాతుల సంస్కరణకు ప్రభవిస్తారో వారు కేవలం విధుల నిర్వహణ వాటి పరిపూర్ణతకే తృప్తి చెందరు. వారు వాటికన్నా అధికంగా ముందుకు సాగి తమ పనులు నిర్వర్తిస్తారు. వారు తమను గురించి మాత్రమే ఆలోచించరు, ఇతరుల్నీ రక్షించాలని కోరుకుంటారు. వారికి మారుమూలల నివాసం, ఏకాంత జీవితం గడిపే అనుమతి అయితే ఉంటుంది. కాని వారు దాన్ని స్వీకరించరు. ఎందుకంటే వారున్నూ కల్లోలాన్నీ కలతలను చూసి గాభరా పడి కార్యరంగాన్ని వదలిపెడితే ప్రపంచంలో

మారూఫ్ అన్నది ఎన్నటికీ నెలకొనదు, మున్కర్ అన్నదానికెదురుగా ఏ గళమూ పెగలదు, కల్లోలిత కాలంలో మనిషి తన ధర్మసంరక్షణ కొరకు సమాజం నుంచి బంధాలు తెంచుకునిపోతే అతనికి అది సరయినదే, అందులో సందేహం లేదు. అతని ఆంతర్యంలో ఇంకా విశ్వాసం పట్ల ప్రేమ ఉందనటానికి అది తార్కాణం. కాని హదీసుల్లో అంతకన్నా సమున్నత మయిన స్థానం మరొకటి సూచించబడింది. అది దైవమార్గంలో సతత సమరం. తద్వారా మిథ్య సమసిపోవాలి, సత్యం సజీవ మవ్వాలి. ఈ విధమయిన హదీసులు కూడా మూడు ఇక్కడ ఉటంకించబడు తున్నాయి. మొదటి హదీసు ఇది-

١- من خير معاش الناس رجل ممسک عنان فرسه فی سبيل الله يطير علىٰ متنه كلما سمع هيعة او فزعة طار عليه يبتغى القتل والموت مظانه، او رجل فی غنيمة فی رأس شعفة من هٰذه الشعف او بطن واد من هٰذه الاَودية يقيم الصلٰوة و يوتی الزكوٰة و يعبد ربه حتی ياتيه اليقين، ليس من الناس الاّ فی خير

**1) జనుల్లో ఉత్తమ జీవన పరిస్థితి ఏమిటంటే మనిషి అల్లాహ్ మార్గంలో తన గుర్రం పగ్గాలు పట్టుకుని దాన్నెక్కి సిద్ధంగా ఉన్నాడు; శత్రువు రాక సమయాన జనుల శబ్దం విన్నా లేదా వారిలో భయం, ఆందోళనలు కనిపెట్టినా దాన్నెక్కి సిద్ధమవుతాడు, ఆ ప్రత్యేక సందర్భంలో (అంటే రణరంగంలో) మృత్యువు, హత్యలను వెదుకుతాడు. లేదా మరో వ్యక్తి, ఇతను తన మేకలు కొన్నింటిని తోడుగా తీసుకొని కొండకోనల్లోనో లేదా ఏదో ఒక లోయలోనో వెళ్ళి నివాసమేర్పరచుకున్నాడు. అక్కడ అతను నమాజ్‌ను స్థాపించాడు, జకాత్‌ని చెల్లిస్తాడు, తన ప్రభువు ఆరాధనలు చేస్తాడు. ఆ స్థితిలోనే అతనికి మృత్యువు ఆవహిస్తుంది. జనంతో అతనికి సంబంధాలు కేవలం మంచి వరకే ఉన్నాయి.**

*(ముస్లిమ్ : కితాబుల్ ఇమారహ్, బాబు ఫజ్లుల్ జిహాద్ వర్రుబాత్; ఇబ్నుమాజ: అబ్వాబుల్ ఫితన్, బాబు అల్ ఉజ్‌లత్)*

ఈ హదీసు వల్ల అపార్థానికి లోనుకారాదు. ఇందులో దైవమార్గంలో సతత సమరయోధునికీ కొండకోనలలో మారుమూల నివాసముండే వానికీ ఒకే స్థానమివ్వ బడిందన్న అపోహ కలగరాదు. ఇది న్యాయవిరుద్ధమయిన విషయం. అల్లాహ్, ఆయన

సందేశహరుని వల్ల అలా సంభవం కాదు. కాగా ఇదే విషయమున్న మరో హదీసులో, అది కాస్త చిన్నదే అయినా, దీన్ని విశదీకరించడం జరిగింది. ఉన్నత స్థానమయితే దైవమార్గంలో పోరుకే ఉంది. ఆ తరువాతనే విశ్వాస రక్షణకు ప్రపంచ త్యాగం, మారుమూల నివాసం-

عن ابی سعید الخــدری قال قیل یا رسول اللّٰه ای الناس افضل؟ فقال رسول اللّٰه صلی اللّٰه علیه وسلم: مومن یجاهـد فی سبیل اللّٰه بنفسه و ماله قالوا ثم من؟ قال: مومن فی شعب من الشعاب یتقی اللّٰه ویدع الناس من شره

**హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ(రజి) ఉల్లేఖనం: ఆయన ప్రకారం, దైవ సందేశహరుల్ని అడగటం జరిగింది, ఏ వ్యక్తి అందరిలోకెల్లా ఘనత గలవాడు? అని. ఆయన ఇలా సెలవిచ్చారు, దైవమార్గంలో తన ధన ప్రాణాలతో పోరుసలిపే విశ్వాసి. ఆ తరువాత ఎవరి స్థానం అని జనులు అడిగారు. ఆయన చెప్పారు, కొండ కోనల్లో ఒకదానిలో నివసిస్తూ దైవానికి భయపడుతూ జనుల్ని తన చెడుగుకు దూరంగా ఉంచే విశ్వాసి.**

*(బుఖారీ, కితాబుల్ జిహాద్; బాబు అఫ్జులున్నాస్... ముస్లిమ్: కితాబుల్ ఇమారహ్; అబూ దావూద్, తిర్మిజీ, నసాయి: అబ్వాబుల్ జిహాద్, ఇబ్నుమాజ: అబ్వాబుల్ ఫితన్)*

మరో హదీసు

المومن القوی خیر و احبّ الی اللّٰه من المومن الضعیف، وفی کل خیر

**బలం గల విశ్వాసి మరీ మంచివాడు, దైవం దృష్టిలో మరింతగా ప్రియమయినవాడు, బలహీనుడయిన విశ్వాసికి ప్రతిగా! అయితే ప్రతి ఒక్కరిలోనూ ఏదో ఒక మేలు తప్పక ఉంటుంది.**

*(ముస్లిమ్ : కితాబుల్ కద్ర్, బాబు అల్ ఈమాన్ బిల్ కద్ర్)*

ఈ హదీస్ వివరణలో ఇమామ్ నవవీ ఇలా అన్నారు :

المراد بالقوة هنا عزیمة النفس و القریحة فی امور الاٰخرة، فیکون

**బలం అంటే ఉద్దేశ్యం ఇక్కడ పరలోక విషయాల్లో సంకల్ప బలం, దృఢ నైజం అన్నది. ఎవరిలో ఈ లక్షణం ఉంటుందో అతను**

صاحب هذا الوصف اكثر اقداماً على العدو فی الجهاد و اسرع خروجا الیه و ذهابًا فی طلبه و اشد عزیمة فی الاَمر بالمعروف و النهی عن المنكر و اصبر علی الاذیٰ فی كل ذلك واحتمال المشاق فی ذات الله تعالیٰ و الراغب فی الصلوٰة و الصوم و الاَذكار و سائر العبادات و انشط طلبا لها ومحافظة علیها ونحوذلك، واما قوله صلی الله علیه وسلم و فی كلٍّ خیر فمعناه فی كلٍّ من القوی و الضعیف خیر لاِشتراكهما فی الایمان مع ما یاتی به الضعیف من العبادات

జిహాద్‌లో ఇతోధికంగా ముందడుగు వేస్తాడు. జిహాద్ వైపున పురోగమించడానికి ఆ అవకాశానికి ఎదురుచూస్తూ చురుగ్గా ఉంటాడు. మారూఫ్‌ను ఆదేశించడానికి, ముున్కర్‌ని ఆపడానికి ఈ వ్యవహారాలన్నింటిలో కలిగే కష్టాలను సహనంతో భరించడానికి, దైవ మార్గంలో శ్రమను ఓర్చుకోవడానికి ఇతోధికంగా దృఢమయిన సంకల్పం గలవానిగా ఉంటాడు. అదేవిధంగా అతను నమాజ్, రోజా, స్మరణలు, సకల ఆరాధనల వైపున ఇతోధికంగా మొగ్గుదల కలిగి ఉంటాడు. ఆహ్లాదకరమయిన హృదయంతో వాటిని నిర్వర్తిస్తాడు. వాటిని రక్షించుకుంటాడు. ఇంకా అలా మెలుగుతాడు. పోతే, ప్రవక్త(స) ప్రతి ఒక్కరిలోనూ మేలున్నది అని చెప్పడంలో గల భావమేమిటంటే, బలమయిన విశ్వాసి, బలహీనుడయిన విశ్వాసి ఉభయుల్లోనూ మేలన్నది తప్పక ఉంటుంది. ఉభయుల్లోనూ సమిష్టి విషయం విశ్వాసం. దానితోపాటు బలహీనుడు సయితం ఆరాధనలు ఎలాగూ ఆచరిస్తాడు. (అతను ఇతర కార్యాలాచరించ లేకపోయినప్పటికీ).

*(షర్హ్ ముస్లిమ్; సం.8, భాగం 16, పు.175, 176)*

ఈ క్రమంలో మూడవ హదీసు :

المومن الذی یخالط الناس و یصبر علٰی اذاهم، اعظم اجـرًا

ఏ విశ్వాసి అయితే జనుల్ని కలుసుకుంటూ ఉంటాడో వారు కల్పించిన కష్టాలకు గాను సహనం వహిస్తాడో అతనికి లభించే ప్రతిఫలం ఘనమయినది, అది జనుల్ని కలుసుకోని,

من الـذى لاَ يخالطهم ولا يصبر علىٰ اذاهم

వారు పెట్టే కష్టాలకు సహనం వహించని విశ్వాసికి లభించే ప్రతిఫలం కన్నా ఘనమయినది.

*(ముస్నద్ అహ్మద్ : 2/ 135; ఇబ్నుమాజ: అబ్వాబుల్ ఫితన్; తిర్మిజీ: అబ్వాబు సిఫతుల్ కియామ)*

ఈ హదీసు వివరణలో అల్లామా ముహమ్మద్ బిన్ ఇస్మాయీల్ అస్ అస్‌గానీ ఇలా వ్రాస్తున్నారు :

فيه افضلية مـن يخالط الناس مخالطة يامرهـم فيهـا بالمعروف و ينها هم عن المنكر و يحسن معاملتهم فانـه افضل مـن الـذى يعتزلهـم ولاَ يصبر على المخالطة

**ఈ హదీసులో, జనులతో కలివిడిగా ఉండే వ్యక్తి ఘనతను గురించి వివరించడం జరిగింది. ఆ కలివిడితనంలో అతను వారికి మారూఫ్‌ను ఆదేశిస్తాడు, మున్కర్‌ని వారిస్తాడు, వారి ఎడల ఉత్తమ రీతిలో వ్యవహరిస్తాడు. వారికి దూరం దూరంగా ఉంటూ, వారితో కలిసిమెలిసి ఉండటం వల్ల కలిగే కష్టం పట్ల సహనం వహించని వ్యక్తికన్నా అటువంటి వ్యక్తి మహత్తు గల వ్యక్తి అని ఈ హదీసు తెలుపుతుంది.**

*(సుబులుస్సలామ్, షర్‌హ్ బులూగుల్ మరామ్ : 2/ 182)*

ఈ హదీసులు, ఈ వివరణల వల్ల తెలిసేదేమిటంటే సంస్కరణకు సిద్ధంగా లేని ఓ సమాజంలో **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధి కాకపోయినప్పటికీ దాని ప్రాముఖ్యత, ఘనత, గొప్పదనం స్థిరమయినవి. దీనికి కారణమేమిటంటే, సమాజంలో మారూఫ్‌ను నిలుపడానికి, మున్కర్‌ను రూపుమాపడానికి ప్రయత్నాలు కొనసాగుతూ ఉన్నట్లయితే వెంటనే సంస్కరణను స్వీకరించడానికి సన్నద్ధులు కానివారు భావిలో సంస్కరణకు సిద్ధం కావచ్చు. కాని ఒకవేళ **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** ప్రయత్నాలను పూర్తిగానే వదలిపెడితే సంస్కరణ అవకాశాలు పూర్తిగా అంతమయిపోతాయి, క్రమేణ సమాజం యావత్తు సర్వనాశనమయిపోతుంది.

## కేవలం సమర్థత

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** వల్ల నిష్ప్రయోజకత్వపు నమ్మకం ఏర్పడినా లేదా దాని ఫలితంగా ఏదయినా నష్టం వాటిల్లే ప్రమాదమున్నా అది విధి అవడం మిగిలి ఉండదు, తొలిగిపోతుందన్న విషయాన్ని మేము గత పుటల్లో సవివరంగా చర్చించాము. కాని ఈ రెండు పరిస్థితులూ లేకపోయినట్లయితే, అంటే హాని కలిగే భయమూ లేకపోయినా, నిష్ప్రయోజనమయ్యే అభిప్రాయమూ కలగక పోయినా -ఇటువంటి స్థితిని ఇమామ్ గజాలీ (రహ్మ) '**అల్ కుద్రతుముత్లక**' కేవలం 'సమర్థత'గా పేర్కొన్నారు. ఇటువంటి పరిస్థితిలో విశ్వాసి విమర్శనా విధిని తప్పనిసరిగా నిర్వర్తించవలసి ఉంటుంది. కాగా ఇమామ్ గారు ఇలా అంటున్నారు:

ان يعلم انّ المنكر يزول بقوله وفعله ولاَ يقدر له على مكروه فيجب عليه الاِنكار و هٰذه هي القدرة المطلقة

**విమర్శన చేసేవారు, తాను చెప్పడం వల్ల లేదా చర్య తీసుకోవడం వల్ల చెడుగు సమసిపోతుందని, ఫలితంగా తనకు ఎటువంటి హానీ కలగదని తెలుసుకున్నట్లయితే అతను 'నహీ అనిల్ మున్కర్' చెయ్యడం విధి అవుతుంది. ఈ అవస్థ అల్ కుద్రతు ముత్లకగా (కేవలం సమర్థత)గా పరిగణించబడుతుంది.**

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 347)*

## శక్తితోనయినా, నోటితోనయినా, సామర్థ్యం లేకపోవడం....

ఒక విషయం దృష్టిలో ఉండాలి. అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ విధి నిర్వర్తన మనిషి శక్తి ద్వారా చేయదలిచినా నోటిద్వారా చేయదలిచినా ఉభయ పరిస్థితుల్లోనూ సామర్థ్యం లేకపోయే అవకాశం కలగవచ్చు. అందువల్ల ఈ విధి ఈ రెండు అవస్థల్లోనూ తొలిగిపోతుంది.

అల్లామా అబూబక్ర్ జస్సాస్ ఇలా అంటారు :

و هي علىٰ منازل: اوّلهـا تغييره باليـد اِذَا اَمْكَنَ فَاِنْ لَّمْ يُمْـكِنْ وكان في نفيه خائفا علىٰ نفسه اذا انكره بيده فعليه انكاره

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్‌లో కొన్ని దశలున్నాయి. వాటిలో మొదటి దశ శక్తి ద్వారా మార్పును తేవడం, అయితే అటువంటి అవకాశం ఉండాలి. కాని అటువంటి అవకాశం లేకపోయినట్లయితే శక్తినుపయో**

بلسانه فان تعـذر ذلک لما وصفنا فعليه انكاره بقلبه

గించి ముస్కర్‌ను రూపుమాపడంలో అతనికి తన ప్రాణభయం ఉన్నట్లయితే నోటితో దాని పట్ల విమర్శన చెయ్యడం అతని బాధ్యత. కాని ఒకవేళ అదే భయం చేత అదీ అతనికి కష్ట మయినట్లయితే తన అంతర్యంలోనయినా దానిపట్ల ఏహ్యాభావం కలిగి ఉండటం అతని బాధ్యత. *(అహ్కాముల్ కుర్‌ఆన్ : 2/ 38)*

కాజీ అయాజ్ దీన్ని ఇంతకన్నా విశదంగా వివరంగా వ్రాశారు :

ان غلب علىٰ ظنه ان تغييره بيده يسبب منكرًا اشدّ من قتله او قتل غيره بسببه كفّ يـده و اقتصر على القول باللسان و الوعظ و التخويف، فان خاف ان يسبب قوله مثل ذلک غير بقلبه وكان فی سعة

చేత్తో (శక్తితో) ముస్కర్‌ను రూపుమాపడం దీనికన్నా పెద్ద ముస్కర్ ఉత్పన్నతకు కారణ భూతమవుతుందన్న నమ్మకం మనిషికి కుదిరి నట్లయితే, ఉదాహరణకు స్వయంగా అతని హత్య లేదా దాని కారణంగా ఇతరుల హత్య జరిగే ప్రమాదమున్నట్లయితే అతను తన చెయ్యిని ఆపుకోవాలి. నోటితో ఉపదేశం, భయం గొల్పడంతో సరిపుచ్చుకోవాలి. అయితే ఒకవేళ తన మాట వల్ల కూడా అటువంటి పరిణామాలే ఉత్పన్నమవుతాయన్న భయము న్నట్లయితే అతను తన హృదయం ద్వారానే ముస్కర్‌ను మార్చే యత్నం చేస్తాడు; అతనికి అటువంటి అవకాశముంటుంది.

*(ఇహ్యాఉ ఉలూముల్ కుర్‌ఆన్ : 2/38)*

అల్లామా మనావీ ముస్కర్‌ను రూపుమాపే ఒక హదీసు విశదీకరణలో ఇలా తెలుపుతున్నారు:

فان لم يستطع الاِنكار بيده بان ظن لحوق ضرربه فبلسانـه اى بالقول كاستغاثة او توبيخ او

ముస్కర్‌ను రూపుమాపేందుకు తన చేతి(శక్తి) నుపయోగించే సామర్థ్యం, అవకాశం లేకపోయి నట్లయితే, ఉదాహరణకు దానివల్ల తనకు హాని కలుగుతుందన్న భావం అతనికి ఉన్నట్లయితే అతను తన నోటితో అంటే మాట ద్వారా

اغلاظ بشرطه، فان لم يستطع ذلک لوجود مانع کخوف فتنة او خوف على نفس او عضو او مال فبقلبه

**మున్కర్‌పైన విమర్శన చేయాలి. ఉదాహరణకు ముస్కర్‌కు వ్యతిరేకంగా సహకరించాలి లేదా బెదరించాలి, లేదా షరతులతోపాటు కఠినంగా వ్యవహరించాలి. ఒకవేళ ఏదయినా ఆటంకం వల్ల దాని శక్తీ లేకపోతే, ఉదాహరణకు దానివల్ల ఏదయినా ఉపద్రవం పెల్లుబుకుతుందని, లేదా ఏదయినా అవయవానికి, శరీరానికీ, సంప దకూ నష్టం కలిగే ప్రమాదమున్నట్లయితే తన హృదయంతో ముస్కర్‌ను నిరసించాలి.**

*(అత్ తైసీర్, షర్హ్ అల్ జామిఅస్సగీర్ : 2/ 418)*

## హృదయంతో 'అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్' అనుమతి

పైన సూచించినట్లు హదీసులో ముస్కర్‌ను రూపుమాపే విధానాలు మూడు పేర్కొనబడ్డాయి. చేత్తో రూపుమాపడం, నోటితో రూపుమాపడం, హృదయంతో రూపు మాపడం. మొదటి రెండు విధానాలను గురించి సవివరంగా చర్చించడం జరిగింది. హృదయంతో రూపుమాపడం అంటే అర్థం, హృదయంలో ముస్కర్‌ను ముస్కర్‌గా భావించడం, దాన్ని ఏవగించుకోవడం. ఈ విధానాన్ని మనిషి అవలంబించడం అంటే తొలి రెండు విధానాలు అతని వశంలో లేనప్పుడన్నమాట. కాని అతను తన చేత్తోనో, నోటితోనో ముస్కర్‌ని రూపుమాపగల శక్తి కలిగి ఉన్నట్లయితే కేవలం మనసులో ముస్కర్‌ని ముస్కర్‌గా భావించి ముస్కర్‌ని రూపుమాపే విధి నిర్వర్తన నుండి చేతులు దులుపుకోలేడు. అల్లామా కుర్తుబీ, ఇబ్ను అబ్దుల్ బర్ర్ ద్వారా ఈ వ్యవహారంలో ముస్లిమ్ ధర్మవేత్తల ఏకాభిప్రాయాన్ని ఉటంకించారు :

اذا انکر بقلبه فقد ادى ما عليه اذالم يستطع عليه سوى ذلک

**ఒక వ్యక్తి ముస్కర్‌ను తన హృదయపూర్వకంగా తిరస్కరించినట్లయితే అతను తన బాధ్యతను నిర్వర్తించినట్లే. అయితే అతను అంతే తప్ప మరో విధానం అవలంబించగల శక్తి కలిగి ఉండరాదు.**

*(అల్ జామిఉ అహ్కాముల్ కుర్ఆన్ : 4/ 42)*

హదీసులో మున్కర్‌ని రూపుమాపేందుకు చూపబడిన దశలను గురించి ముల్లా అలీ కారీ ఇలా సెలవిచ్చారు :

**من يغير المراتب مع القــدرة كان من العاصين، ومن تركها بلا قدرة اويرى مفسدة اكثر من المصلحة و يكون منكرا بقلبه فهو من المومنين**

**ఏ వ్యక్తి అయితే శక్తి కలిగి ఉన్నప్పటికీ వాటి దశల క్రమాన్ని మార్చివేస్తాడో అతను పాపం చేసినవాడవుతాడు. మరెవరయితే శక్తిలేమి వల్లనో లేదా దాని ఫలితంగా సంస్కరణకు మారుగా చెడుగే అధికంగా కానవస్తుందని భావించి ఆ కారణంగా దాన్ని వదలివేస్తాడో, మరి తన హృదయంలో ఆ చెడుగును ఏవగించు కుంటాడో అతను విశ్వాసులలో పరిగణించ బడతాడు.**

*(అల్ ముబీనుల్ ముఈన్ లిషర్‌హిల్ అర్బయీన్- పు. 189)*

ఇంతకన్నా అధిక విశదంగా ఇబ్ను హజర్ హైతమీ అన్నారు :

**يجب تغيير المنكر بكل طريق امكنه، فلا يكفى الوعظ لمن امكنه ازالته بيده، ولاَ كراهة القلب لمن قــدر على النهى باللّسان**

**మున్కర్‌ని రూపుమాపడం విధి అయినదే- మనిషికి వీలయిన ప్రతి విధానాన్ననుసరించి. ఏ వ్యక్తి తన చేత్తో దాన్ని రూపుమాపగలడో అతను కేవలం ఉపదేశం, ప్రబోధనలు చేయడం సరిపోదు.**

*(అల్ ముబీన్ అల్ ముఈన్ లిషర్హ్ అల్ అర్బఈన్ : పు. 220)*

ఒక విశ్వాసి ఇటువంటి పరిస్థితులకు లోనవవచ్చు. వాటిలో అతను ఆచరణాత్మకంగా మున్కర్‌ను అటు రూపుమాపనూ లేడు, దానికి వ్యతిరేకంగా తన నోరునూ తెరువలేడు. కాని మున్కర్ పట్ల ఏవగింపు అయితే ఎట్టి పరిస్థితిలోనూ అతనిలో ఎలాగూ ఉండవలసిందే. మున్కర్‌ను రూపుమాపే అత్యంత హీనమయిన అంతిమ దశ ఇది. దీని తరువాత మరే దశ లేదు. ఎవరి ఆంతర్యంలోనయినా చెడుగు పట్ల ఏవగింపు, విద్వేష భావం కూడా లేకపోతే దాని భావం, అతనిలో విశ్వాసపు వేడిమి కాస్తా చల్లారిపోయిందన్నమాట. ఈ కారణంగానే ఓ హదీసులో ఇలా సెలవీయడం జరిగింది :

**وليس وراء ذلك من الايمان حبة خردل**

**(మనసులోనూ మున్కర్‌ని మార్చాలని, దాని పట్ల ఏవగింపు భావన లేకపోతే) ఆ తరువాత ఇక ఆవగింజంత కూడా విశ్వాసం అతనిలో మిగుల లేదన్నమాట.**

*(ముస్లిమ్; కితాబుల్ ఈమాన్)*

ఒక వ్యక్తి చెడుగును, పాపపు కార్యాన్నీ ఏవగించుకుంటే, మరి ఈ ఏవగింపు లాంఛనప్రాయమయినది కాక వాస్తవమయినదయి ఉంటే, ఆ చెడుగుల్లో నిమగ్నులయి ఉన్నవారికి ఆ వ్యక్తి దూరంగానూ ఉన్నట్లయితే ఆ మనిషి ఆంతర్యంలో ఒకరి వైఖరికి వ్యతిరేకంగా తీవ్ర భావోద్రేకాలుండగా వాటి వ్యక్తీకరణ సంబంధాలలో కానరాకపోవడం అన్నది అసంభవం. అందువల్ల మానసిక ఏవగింపుతోపాటు దుష్ట సహవాసాన్నీ త్యజించడం తప్పనిసరి అవుతుంది. అల్లామా అబూబక్ర్ జస్సాస్ ఇలా వ్రాశారు :

**وسعهٗ السكوت عنهم بعد ان يجانبهم و يظهر هجرانهم**

**(అతను మున్కర్‌ను మార్చగలగటానికి శక్తిహీనుడయినట్లయితే) చెడు నడత గల వారితో దూరంగా మెలగటానికి తన దూరాన్ని వ్యక్తం చేసిన తరువాత మౌనం వహించటానికి అతనికి అవకాశముంది.**

*(అహ్కాముల్ కుర్‌ఆన్ : 2/ 41)*

ఇంతేకాదు, విశ్వాసిలోని విశ్వాసం కోరే ఆవశ్యకత ఏమిటంటే అతను ఏదయినా మున్కర్‌ని రూపుమాపగలగటానికి సమర్థుడు కాకపోయినట్లయితే తన ఈ అశక్తత, వివశత పట్ల సంతృప్తుడయి ఉండిపోరాదు. అతని ఆంతర్యంలో ఓ ఆశ, ఓ కోరిక జనించి పెరుగుతూ ఉండాలి. తనకు శక్తి ప్రాప్తమవ్వాలని, తన చేత మున్కర్ సమసిపోవాలని, ఓ వాంఛ బలపడుతూ ఉండాలి. గత్యంతరంలేని స్థితిలో అశక్తతతో మున్కర్‌ను భరించే మనస్తత్వం అతనిలో పెంపొందరాదు. అతని ఆంతర్యంలో, తనకు ఎప్పుడయినా ఆ చెడుగును రూపుమాపే బలం చేజిక్కుతుందని దాన్ని తాను రూపుమాపి తీరుతానని దృఢ సంకల్పం సదా జాగ్రదావస్థలో ఉండాలి. హృదయంలో రూపుమాపే అవస్థను గురించి అల్లామా మనావీ ఇలా అంటారు :

یکرهه به ویعزم انه لوقدر فعل

మున్కర్‌ను మనఃపూర్వకంగా ఏవగించుకోవాలి, దాన్ని రూపుమాపేందుకు తనకు శక్తి లభిస్తే దాన్ని తాను తప్పక రూపుమాపుతానని సంకల్పించుకోవాలి.

*(అత్ తైసీర్ బిషరహ్ జామిఅస్సగీర్ : 2/418)*

ఇబ్ను హజర్ హైతమీ ఇలా అన్నారు :

یکره ذلک به و یعزم انه لو قدر علیه بقول او فعل أزالـه

మున్కర్‌ని మనసారా ఏవగించుకోవాలి, నోటితోగాని, చేత్తో గాని మున్కర్‌ని రూపుమాపగలందులకు శక్తి లభిస్తే తప్పక రూపుమాపే వాణ్ణే అని దృఢ సంకల్పం చేసుకోవాలి.

*(ఫత్‌హుల్ ముబీన్ లి షర్‌హుల్ అర్బయీన్ : పు. 220)*

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్** మున్కర్‌లోని షరతులను విశ్వాసం గల వ్యక్తి తప్పక తన దృష్టిలో ఉంచుకుంటాడు. కాని ఎట్టి పరిస్థితిలోనూ మారూఫ్ స్థాపన, మున్కర్ ఖండన భావనల నుండి అతని ఆంతర్యం ఖాళీగా ఉండదు. ఈ భావన అతన్ని సదా వ్యాకుల పరుస్తూనే ఉంటుంది.



# సాధనా సంపత్తి

## మున్కర్‌ని రూపుమాపే సాధనాలు

సముదాయంలోపల **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధినిర్వహణ అన్న విషయంలో సాధనా సామగ్రి ప్రశ్న ప్రముఖమయింది. అంటే అల్లాహ్‌ను, దైవ సందేశహరుణ్ణి, పరలోకాన్నీ విశ్వసించే ఓ సమాజంలో మారూఫ్‌ని స్థాపించేందుకు మున్కర్‌ని రూపుమాపేందుకు మనిషి ఎటువంటి సాధనాలను ఎన్నుకోగలడన్నది, ఎటువంటి సాధనాలను అవలంబించడానికి అతనికి అనుమతి లేదు అన్నది ప్రశ్న. ఇమామ్ గజాలీ ఈ ప్రశ్నను అతి వివరంగా చర్చించారు. అయితే ఆయన ఈ సాధనా సామగ్రిని విమర్శనలోని విభిన్న స్థాయిలుగా, దశలుగా పరిగణిస్తారు. ఇంకా అల్లామా అబ్దుల్‌కాదిర్ ఔదహ్ వాటిని మున్కర్‌ని దూరం చేసే లేదా తొలగించే సాధనాలుగా పేర్కొన్నారు.★ ఇక్కడ మేము ఇమామ్ గజాలీ చర్చను క్లుప్తంగా ప్రస్తుతపరుస్తున్నాము. ఆయన ఇలా అంటున్నారు :

## విమర్శనలో ఎనిమిది దశలున్నాయి

**మొదటి దశ :** విమర్శన చేసేవానికి, ఫలానా వ్యక్తి మున్కర్‌కు పాల్పడుతున్నాడని తెలిసి ఉండాలి. కాని దానికి అతను శోధన, వెంటపడి వెదుకులాట చెయ్యడం తగదు. అతనికి స్వయంగానే తెలిసిపోతే దాని విషయంలో చర్య తీసుకోగలడు.

**రెండవ దశ :** కొన్ని సందర్భాలలో మనిషి మున్కర్‌ని మున్కర్‌గా భావించడు. అది మారూఫ్ అనే తలుస్తాడు. తన ఈ ఎరుకలేమి కారణంగానే దానికి పాల్పడతాడు కూడా. అతనికి అది మారూఫ్ కాదు, దైవం దృష్టిలో ఇష్టకరమయినది కాదు, ఆయన ఆగ్రహ కారకమయినదని తెలిస్తే తప్పక దాన్ని వదిలివేస్తారు. ఇటువంటి పరిస్థితిలో

★ అత్ తష్రీఉల్ జనాయిల్ ఇస్లామీ : 1/ 505- 509)

అతనికి దాన్ని గురించి అతని చేష్ట తప్పయినదని, అతను దాన్ని మానుకోవాలని తెలుపడమే సరిపోతుంది.

**మూడవ దశ:** ఒక వ్యక్తి మున్కర్‌ను మున్కర్‌గా భావిస్తూ కూడా దాన్ని ఆచరిస్తూ ఉన్నట్లయితే లేదా మారూఫ్‌ను మారూఫ్‌గా తెలుసుకుని కూడా దాన్ని వ్యతిరేకిస్తున్నట్ల యితే అతనికి దైవం పట్ల భీతి గొలపడం, పరలోకంలో ప్రశ్నించడం పట్ల భయపెట్టడం అవసరం. పూర్వపు సత్పురుషుల సదాచరణలు ఉత్తమ రీతిలో అతని సమక్షంలో పెట్టి బోధపరిచే కృషి చేయాలి, ఆ విధంగా వాటి ప్రభావంవల్ల అతను పాపపు కార్యాన్ని త్యజించేలా చెయ్యాలి.

**నాల్గవ దశ :** ప్రేమతో,అనురాగంతో బోధపరచినా, ఉపదేశించినా ఎవరయినా మున్కర్‌ను విడనాడకపోయినట్లయితే అతన్ని కఠినంగా మందలించి, ఖండించాలి. కాని అందులోనూ తిట్లూ, అపవాదులు, తూలనాడులు లేకుండా జాగ్రత్త పడాలి.

**అయిదవ దశ :** ప్రబోధన, ఉపదేశాలు, కఠిన మందలింపులు పనిచెయ్యకపోతే మున్కర్‌ను శక్తితో అణచివేయాలి. ఉదాహరణకు ఆటపాటల వాయిద్యాలను విరగ్గొ ట్టాలి. లేదా పురుషుడు పట్టువస్త్రాలు ధరించినట్లయితే వాటిని చించిపారవేయాలి. కాని ఇలా అమలుపరచడం ప్రతి మున్కర్ విషయంలోనూ సాధ్యపడదు. ఏ చెడుగులనయితే పైన పేర్కొనడం జరిగిందో వాటినో లేదా అటువంటి వేరే చెడుగు లనో శక్తి ద్వారా రూపుమాపడం సాధ్యమవవచ్చు. కాని ఏ మున్కరుల సంబంధం నోటితోనో హృదయాలతోనో ఉంటుందో లేదా ఏ చెడుగులయితే వాటికి పాల్పడే వాని వ్యక్తిత్వం వరకు పరిమితమయి ఉంటాయో వాటి విషయంలో అమలుపరచడం సాధ్యపడదు.

**ఆరవ దశ:** మున్కర్‌కు పాల్పడేవానిని భయపెట్టడం. కాని ఒక విషయం పాటించవలసి ఉంటుంది. ఏదయినా అమలుపరచడం హరామ్ అయినటువంటి బెదిరింపును అతనికి ఇవ్వరాదు. ఉదాహరణకు, 'మున్కర్‌ను వదలిపెట్టు, లేకపోతే నీ మాడు బద్దలుగొడతాను' అని అనగలము, కాని మున్కర్‌ని మానుకోలేకపోతే నీ ఇల్లు కొల్లగొడతాను, లేదా నీ పిల్లవాణ్ణి చంపివేస్తాను అని అనలేము.

**ఏడవ దశ:** మున్కర్‌కు ఒడిగట్టేవానికి దెబ్బలు కొట్టడం, కాని అతనిపైన ఆయుధాలు ప్రయోగించరాదు. అయితే ఒకవేళ ఆయుధాలు వినియోగించడం తప్ప

మున్కర్‌ను రూపుమాపే మరో మార్గం లేకపోతే ఆయుధాలూ చేపట్టవచ్చు. అవసరం మేరకు వాటిని వినియోగించనూ వచ్చు.

**ఎనిమిదవ దశ :** ఎవరయినా ఒంటరిగా మున్కర్‌ని రూపుమాప శక్తిలేదని భావిస్తే అతను ఇతరుల సహకారం పొందవచ్చు. *(ఇహ్యాఉ ఉలూముద్దీన్: 2/357-361)*

## ఉద్బోధన ద్వారా సంస్కరణ

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**ని అమలుపరిచే ఈ విభిన్న సాధనాలను రెండు శీర్షికల్లో విభజించవచ్చు. ఒకటి బోధనల ద్వారా సంస్కరణ, రెండవది శక్తి ద్వారా సంస్కరణ. ఈ రెండు విధాల సాధనాలపైన కూడా ఈ పేర్కొన్న క్రమంలో అమలుపరచడం జరుగుతుంది. అంటే తొలుత బోధన, ఉపదేశాల ద్వారా, ప్రేమ అనురాగాల ద్వారా సంస్కరణకు ప్రయత్నం జరుగుతుంది. ఈ ప్రయత్నం నిష్ఫలమని తేలితే శక్తి ద్వారా, బలాన్నుపయోగించి సంస్కరణను అమలుపరచడం జరుగుతుంది. మొదటి విధానం, సాధనం నిష్ఫలమవుతుందన్న నమ్మకం కుదరనంతవరకు రెండవ సాధనాన్ని అవలంబించడానికి వీల్లేదు. దివ్య కుర్ఆన్‌లో ఉంది :

وَ اِنْ طَآئِفَتٰنِ مِنَ الْمُؤْمِنِيْنَ اقْتَتَلُوْا فَاَصْلِحُوْا بَيْنَهُمَا فَاِنْۢ بَغَتْ اِحْدٰهُمَا عَلَى الْاُخْرٰى فَقَاتِلُوا الَّتِيْ تَبْغِيْ حَتّٰى تَفِيْٓءَ اِلٰٓى اَمْرِ اللّٰهِ فَاِنْ فَآءَتْ فَاَصْلِحُوْا بَيْنَهُمَا بِالْعَدْلِ وَ اَقْسِطُوْا اِنَّ اللّٰهَ يُحِبُّ الْمُقْسِطِيْنَ۝ (الحجرات:٩)

**విశ్వసించిన వారిలో రెండు వర్గాలు ఒకవేళ ఒండొకరితో ఘర్షించుకున్నట్లయితే వారి మధ్యన సంధి కుదర్చండి. ఆ తరువాత వారిలో ఒక వర్గం మరో వర్గంపైన అత్యాచారం జరిపినట్లయితే అత్యాచారం జరిపే దానితో పోరాడండి, కడకు అది అల్లాహ్ ఆదేశం వైపునకు మరలి రావాలి. ఆపైన అది మరలివస్తే వారి మధ్య న్యాయబద్ధంగా సంధి కుదర్చండి. న్యాయం చెయ్యండి, నిశ్చయంగా అల్లాహ్ న్యాయం చేసేవారిని ఇష్టపడతాడు.**

*(అల్ హుజురాత్ : 9)*

ఈ ఆయత్‌లో ముస్లిముల రెండు వర్గాల మధ్య ఏ కారణం వల్లనయినా తగాదా ఏర్పడినట్లయితే వారి మధ్య న్యాయం రీత్యా సంస్కరణకు ప్రయత్నం జరగాలి. ఏ ప్రత్యర్థి అయినా న్యాయం సమక్షంలో తలవంచడానికి సిద్ధంగా లేకపోతే పీడితునికి

మద్దతుగా పోరాడవలసిందని ఆదేశముంది. అంటే ప్రథమంగా సంస్కరణ యత్నాలు చెయ్యాలని ప్రబోధించడం జరిగిందన్న మాట. ఆ ప్రయత్నాలు విఫలమయినప్పుడు పోరాటానికి ఆదేశమయింది. ఈ కారణంగా ధర్మవేత్తలు, ప్రబోధన ఉపదేశాల వల్ల సంస్కరణ సాధ్యమయ్యే మాటయితే శక్తినుపయోగించడం సరయినది కాదని ఏకాభిప్రాయం కలిగిఉన్నారు. కొందరు ధర్మవేత్తల విశదీకరణలు ఇక్కడ పొందుపరుస్తున్నాము :

అబూబక్ర్ జస్సాస్:

امر الله تعالىٰ بالدعاء الى الحق قبل القتال ثم ان ابت الرجوع قوتلت

**పోరుకు పూర్వం సత్యం వైపునకు పిలుపునిచ్చే ఆదేశమిచ్చాడు అల్లాహ్. ఆ తరువాత ఏ వర్గం సత్యం వైపునకు మరలడానికి తిరస్కరిస్తుందో దానితో పోరు సలపవలసి ఉంటుంది.**

*(అహ్కాముల్ కుర్ఆన్ : 3/ 533)*

జమఖ్షరీ :

يبتدى بالسهل فان لم ينفع ترقى الى الصعب

**సులభమయిన రీతిలో ప్రారంభించాలి. అది నిష్ప్రయోజనమని తేలితే తరువాతి దశగా కష్టతరమయిన విధానాన్ని అవలంబించాలి.**

*(అల్ కష్షాఫ్ అన్ హకాయికిత్తన్జీల్: 1/ 390)*

ఇబ్ను అరబీ మాలికీ

ان الله سبحانه امر بالصلح قبل القتال وعين القتال عندالبغى

**పరమ ప్రభువు అల్లాహ్ యుద్ధానికి పూర్వం సంధి చేసుకునే ఆదేశమిచ్చాడు. ఆ ఒప్పం దాన్ని భంగపరచి తిరుగుబాటు వహించినప్పుడే యుద్ధాన్ని నిర్ధారించాడు.**

*(అహ్కాముల్ కుర్ఆన్ : 4/ 171)*

అబూ అబ్దుల్లా కుర్తుబీ :

فالمنكر اذا امكنت ازالته باللسان للناهى فليفعل وان لم يمكنه الاّ بالعقوبة او القتل

**మున్కర్‌ని రూపుమాపడం అన్నది దాన్ని వారించే వ్యక్తికి నోటి ద్వారా సాధ్యమయ్యే మాటయితే దాన్నే అవలంబించాలి. మరి దాని నివారణ శిక్ష లేదా సంహారం ద్వారానే**

فليفعل فان زال بدون القتل لم يجز القتل

**సాధ్యమవుతుందను కుంటే దాన్నే అవలంబించ వచ్చు. కాని సంహారం కన్నా తక్కువ స్థాయి విధానం ద్వారా చెడు నివారణ శక్యమయినట్ల యితే సంహారం ధర్మసమ్మతం కాజాలదు.**

*(అల్ జామిఉల్ అహ్కామ్ అల్ కుర్ఆన్ : సం. 2, భాగం 4, పు. 32)*

## సామాన్య ప్రజలు శక్తినుపయోగించడం...

ఈ విశదీకరణల వల్ల ఒక విషయం మటుకు స్పష్టమయింది. అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ అన్నది ఆచరణలో పెట్టడానికి శక్తినుపయోగించే ముందు సంస్కరణా ప్రయత్నాలు సాగించాలి. దీని అధికారం ప్రతి ముస్లిమ్ వ్యక్తికి ఉంది. అంతేకాదు, ఇది అతని షరీఅత్ విధితమయిన బాధ్యత. అతను మారూఫ్‌ను ప్రచారం చెయ్యాలి, మున్కర్‌కు వ్యతిరేకంగా గళం విప్పాలి. అయితే శక్తినుపయోగించే విషయంలో ఓ ప్రశ్న తలెత్తుతుంది. శక్తి ఉన్న ప్రతి వ్యక్తికి షరీఅత్ ఈ అధికారం ఇచ్చివేసిందా లేదా ఇది కేవలం ప్రభుత్వాధికారమా? ఈ ప్రశ్నను గురించి ధర్మవేత్తలు సుదీర్ఘ చర్చలు జరిపారు. మేము వారి అభిప్రాయాలను చాలా క్లుప్తంగానే ఇక్కడ పొందుపరుస్తున్నాము :

అల్లామా కుర్తుబీ ఇలా అంటున్నారు :

قال العلماء: الأَمـر بالمعـروف باليــد على الأُمراء و باللسان على العلمــاء و بالقلب على الضعفاء يعنى عوام الناس

**ధర్మవేత్తల ప్రకారం, అమ్ర్ బిల్ మారూఫ్ విధిని శక్తి ద్వారా నిర్వర్తించడం అధికారుల బాధ్యత, నోటితో నిర్వర్తించడం పండితుల బాధ్యత, మనసుతో నిర్వర్తించడం బలహీనులు అంటే సామాన్య ప్రజల బాధ్యత.**

*(అల్ జామి అల్ అహ్కామ్ అల్ కుర్ఆన్ : సం. 2, భా. 4, పు. 32)*

అల్లామా కుర్తుబీ పండితుల అభిప్రాయాన్ని ఉటంకించారు. అందులో సూత్ర ప్రాయమయిన మాటమాత్రముంది. ప్రభుత్వం వద్ద అధికార శక్తి ఉంటుంది కాబట్టి, ఆ శక్తితో మారూఫ్‌ని స్థాపించడం, చెడును నిర్మూలించడం దాని విధి. అదే విధంగా ధర్మజ్ఞానమున్న వారు ప్రచార, సంస్కరణల విధిని నిర్వర్తించగలరు. జనుల్ని మారూఫ్‌ని

అమలుపరిచేందుకు పురికొలుపగలరు, మున్కర్‌లోని చెడుగుల్ని విశదపరచగలరు. పోతే ఈ పని సరయిన రీతిలో నిర్వర్తించలేని వారేమో సదాచరణను ప్రేమించాలి, చెడుగు పట్ల సంతసించక మనసులో అయిష్టత కలిగి ఉండాలి. పైన ఉటంకించిన ధర్మవేత్తల మాటకు, ఎక్కడయినా పాపపు కార్యం జరుగుతూ ఉండగా, అధికారం, ప్రభుత లేని వ్యక్తి పూర్తిగా మౌనం వహించాలని భావం కాదు. దాన్ని అంతమొందించ డానికి తన వంతుగా ఏ ప్రయత్నమూ చెయ్యరాదనీ అర్థం కాదు. ఎందుకంటే ఇస్లామ్ కోరేదాని ప్రకారం, ఏ వ్యక్తి అయినా చెడును చూస్తే దాన్ని మార్దవంగా ప్రేమగా అంతమొందించే ప్రయత్నం చేయాలి, అందులో సఫలత పొందలేకపోతే శక్తి ద్వారానే నిర్మూలించగలిగితే శక్తి ద్వారానే రూపుమాపాలి.

## మున్కర్ వస్తువుని రూపుమాపడానికి శక్తి ప్రయోగం

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విషయంలో బలాన్నుపయోగించే పద్ధతులు రెండు. ఒకటి ఏదైనా మున్కర్ వస్తువును రూపుమాపుకోవడం, దానిగ్గాను శక్తినుపయోగించడం. ఉదాహరణకు, సారాయిని పారబోయడం, ఆటపాటల వాయి ద్యాలు వగైరా విరగ్గొట్టడం. రెండవ పద్ధతి ఏమిటంటే, మున్కర్ వస్తువుకు బదులుగా మున్కర్‌కు పాల్పడే వ్యక్తికి వ్యతిరేకంగా శక్తిని ప్రయోగించాలి. ఉదాహరణకు, ఒక వ్యక్తి వ్యభిచరించబోతున్నాడు, అతన్ని కొట్టి, దెబ్బలు వేసి మానిపించే ప్రయత్నం చేయడం. దానికీ అతను మాట వినకపోతే కడకు చంపే వరకు కూడా పోవచ్చు.

మొదటి పద్ధతిని గురించి ఇమామ్ గజాలీ ఇలా అంటారు :

كسر الملاهى و إراقة الخُمور فانهٗ تعاطى مَا يعرف كونــه حقًا من غير اجتِهـاد فلم يفتَقـر الَى الإمام

**ఆటపాటల వాయిద్యాలు గట్రా విరగ్గొట్టడం, సారాయి పారబోయడం అన్నది ఎటువంటి అన్వయకృషి లేకుండానే అది ధర్మబద్ధమ యినదని తెలుస్తూనే ఉంది. అందువల్ల ఈ పనికి పాలకుని అనుమతి అవసరం ఉండదు.**

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 343)*

కాజీ అయాజ్ ఇలా అంటున్నారు :

حق المغيران يغيره بكل وجــه

**మున్కర్‌ని రూపుమాపే కృషి సలిపేవానికి ఓ అధికారం ఉంది. అతను మున్కర్‌ను ఏవిధంగా నిర్మూలించ సాధ్యమవుతుందో అటువంటి ప్రతి**

امکنـه زوالــه بــهٖ قـولاً کان او فعلاً، فیکسر الاٰت البَاطل و یـریق المسکــر بنفسه او یأمــر من یفعله و ینـزع الغصوب و یردّهـا إلى اصحـابـهٖ بنفســهٖ او بــأمرهٖ اذا أمکنه

విధానాన్ని వినియోగించి నిర్మూలించగలడు, అది నోటి మాట ద్వారానయినా సరే లేదా చేతల ద్వారానయినా సరే; అందువల్ల అతను స్వయంగా మిథ్యా (మున్కర్) పరికరాలను విరగ్గొడతాడు, సారాయి పారబోస్తాడు.లేదా ఆ పని చేయగల మరో వ్యక్తికి ఆదేశిస్తాడు. అదేవిధంగా (ఒక వస్తువు తస్కరించబడి ఉంటే) ఆ తస్కరించబడిన వస్తువును వశ పరచుకుని దాని అసలు యజమానికి అప్పజెబుతాడు - స్వయంగా తానయినా లేదా తన ఆదేశం మేరకు మరో వ్యక్తి అయినా ఆ పని చేస్తాడు. ఇంతకు ఇదంతా అతనికి శక్యమయి ఉండాలి.

*(షర్హ్ ముస్లిమ్ : నవవీ: సం. 1,భాగం 2, పు. 23)*

హాఫిజ్ ఇబ్ను కయ్యిమ్ ఇలా అంటున్నారు :

لاَ ضمان فی کسر أوانی الخمر و شقّ زقاقة

**సారాయి పాత్రలు, దాని ముంతలు పగుల గొట్టడం పట్ల ఎటువంటి జరిమానా లేదు.**

*అత్ తురుకుల్ హుక్మియ్య (ఫిస్సియాస అష్షరీయ : పు. 256)*

ఇమామ్ గజాలీ, కాజీ అయాజ్ షాఫియా పంథాననుసరించేవారు, హాఫిజ్ ఇబ్ను కయ్యిమ్, ఇమామ్ అహ్మద్‌ని అనుసరించేవారు. అందువల్ల ఈ ముగ్గురు మహనీయుల వివరణను షాఫియా, హన్బలీ ఫిక్హ్‌కు అన్వయింపుగా స్వీకరించవచ్చు. కాని హనఫీ ఫుకహా ఈ విషయంలో ముస్లిమేతరుని స్వామ్యంలోనూ ముస్లిముల స్వామ్యంలోనూ ఉన్న సామగ్రిలో వ్యత్యాసాన్ని పాటిస్తారు. వారి ప్రకారం మున్కర్ వస్తువు నిర్మూలించబడినది ముస్లింలకు చెందినదయితే అతనికి దాని జరిమానా చెల్లింపు అనేది జరగదు. అలా నిర్మూలించేవాడు ముస్లిమ్ వ్యక్తి అయినా, తిరస్కారి అయినా. ఎందుకంటే ఒక ముస్లిమ్ వ్యక్తి వద్ద ఏదయినా అధర్మమయిన వస్తువు (మున్కర్ వస్తువు)కు ఎటువంటి విలువా ఉండదు. దీనికి భిన్నంగా నిర్మూలించబడిన

వస్తువు యజమాని ముస్లిమేతరుడయితే అతనికి తప్పకుండా దాని జరిమానా, నష్టపరిహారం చెల్లింపబడుతుంది, దాన్ని నిర్మూలించినవాడు ముస్లిమ్ వ్యక్తి అయినా ముస్లిమేతరుడయినా. ఎందుకంటే దాని యజమాని దృష్ట్యా అతని విలువయిన వస్తువు నిర్మూలించబడింది. అల్లామా కాసానీ ఇలా అంటారు :

**لاَ يجب الضمان باتلاف الخمر والخنزير على المسلم سواء كان المتلف مسلمًا او ذميًا لسقوط تقوم الخمر و الخنزير فى حق المسلم، و لو اتلف مسلم او ذمى على ذمى خمرا او خنزيـرا يضمن عندنا خلافًا للشافعى**

**(ఒక ముస్లిమ్ వ్యక్తికి చెందిన) సారాయి, పందిని ఎవరయినా నాశపరచినట్లయితే అతనికి దాని నష్టపరిహారం లభించదు. పాడు చేసినవాడు ముస్లిమ్ అయినా, ముస్లిమేతరుడయినా. ఎందుకంటే ముస్లిమ్ వ్యక్తి విషయంలో సారాయి, పంది విలువ (వెల) దానంతటఅదే తొలగి పోతుంది. కాని ఒక ముస్లిమ్ వ్యక్తి లేదా ముస్లిమేతరుడు, ఓ ముస్లిమేతరుని సారాయిని లేదా పందిని నాశనపరిస్తే మా దృష్టిలో (హనఫీ దృక్పథం) నష్టపరిహారం చెల్లించవలసి ఉంటుంది. ఇమామ్ షాఫియీకి దీని విషయంలో భేదాభిప్రాయముంది. (ఆయనకు ఈ రెండవ పద్ధతి పక్షంలోనూ నష్టపరిహారం అవసరం లేదని అంటారు)**

*(బిదాయి అల్ సనాయి ఫీ తర్తీబుష్షరాయ్ : 7/167)*

## మున్కర్‌ని ఆచరించేవాని పట్ల శక్తి ప్రయోగం

పై చర్చ మున్కర్ వస్తువుకు ప్రతిగా శక్తినుపయోగించే విషయానికి సంబంధించింది. ఇక మున్కర్‌కు పాల్పడేవానికి ప్రతిగా శక్తినుపయోగించే విషయాన్ని పరిశీలించవలసి ఉంది. ఒక వ్యక్తిని అపరాధం చేస్తూ ఉండగా చూసిన ఒక మనిషి పైన **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్** మున్కర్ బాధ్యత విధితమవుతుంది. దాన్ని వివరిస్తూ అల్లామా షైఖ్ అబ్దుల్ కాదిర్ ఔదహ్ షహీద్ ఇలా వ్రాశారు :

**اذا شوهد الجانى و هو يرتكب الجناية كان لاَى شخص ان يمنعه**

**అపరాధి అపరాధం చేస్తూ ఉండగా కానవచ్చినప్పుడు అతన్ని అపరాధం చెయ్యకుండా శక్తితో**

من القوة عن ارتكاب الجريمة و ان يستعمل القـوة اللازمة لمنعه سواء كانت الجريمة اعتداءً علىٰ حقوق الأفراد كالسرقة او اعتداءً علىٰ حقوق الجماعة كشرب الخمر و الزنا، و هٰذا ما يسمّٰى بحق الدفاع الشرعى العام

**ఆపేందుకు ప్రతి వ్యక్తికీ అధికారముంది. అతన్ని ఆపేందుకు ఏ మేరకు శక్తి అవసరమో దాన్ని అతను ప్రయోగించగలడు. ఆ అపరాధం వ్యక్తుల హక్కులపై దాడి లాంటిదయినా, ఉదాహరణకు దొంగతనం, లేదా సాముదాయిక హక్కులపై దాడిలాంటిదయినా (ఉదాహరణకు మద్యపానం, వ్యభిచారం). ఇది షరీఅత్ పట్ల సాధారణ పరిరక్షణ హక్కుగా పరిగణించబడు తుంది.**

*(అల్ తష్రీ అల్ జనాయి అల్ ఇస్లామీ : 1/86)*

అల్లామా అబూబక్ర్ జస్సాస్ ఈ విషయంలో సాధారణంగా సవివరమయిన చర్చ జరిపారు. మేము ఇక్కడ దాని అవశ్యమయిన భాగాలు కాస్త క్రమాన్ని మార్చి ఉటంకిస్తున్నాము :

"**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్** మున్కర్‌ని నిర్వర్తించే పరిస్థితులు రెండు విధాలయినవి కావచ్చు. ఒకటి, అందులో మున్కర్‌ని మారూఫ్‌గా మార్చడం అన్నది అసలు సాధ్యమే కాకపోవచ్చు; మరొకటి, ఇందులో మున్కర్‌ను మార్చడం, దాన్ని దూరం చెయ్యడం సాధ్యం కావచ్చు. ఇటువంటి పరిస్థితిలో వ్యక్తి బాధ్యత ఏమిటంటే అతను దాన్ని తన శక్తితో (చేత్తో) దూరం చేయాలి. అది అనేక విధాలుగా కావచ్చు. మున్కర్ నివారణ కరవాలం ఎత్తకుండా, మున్కర్‌కు పాల్పడే వానిని సంహరించ కుండా సాధ్యం కాకపోవడం. ఇటువంటి పరిస్థితిలో దాన్ని అమలుపరచడం కూడా తప్పనిసరి అవు తుంది. ఉదాహరణకు, ఒక వ్యక్తి తనను లేదా మరో వ్యక్తిని సంహరించ సంకల్పించాడని గమనించాడు, లేదా తన సొమ్మును దోచుకోజూస్తున్నాడు, లేదా ఏ స్త్రీనయినా మానభంగం జేయజూస్తున్నాడు, లేదా అలాంటిదే ఏదయినా అతి తీవ్రమయిన అఘాయిత్యం చేయబోతున్నాడు, పైగా అతన్ని నోటితో బోధపరిస్తే లేదా ఆయుధం లేకుండా ప్రతిఘటిస్తే అతను మానుకోడు అని కూడా తెలుస్తూనే ఉంది, అలాంట ప్పుడు తప్పనిసరిగా అ దుర్వర్తనుని చంపవలసిందే. ఎందుకంటే ప్రవక్త మహనీయులు (సల్లల్లాహు అలైహి వ సల్లమ్) సెలవిచ్చిన దాని ప్రకారం 'మీలో ఎవరు మున్కర్‌ను చూసినా అతను దాన్ని తన చేత్తో మార్చివేయాలి'. కాబట్టి

మున్కర్‌ని మార్చడానికి మున్కర్‌కు పాల్పడేవాణ్ణి అంతమొందించడం తప్ప మార్గాంతరం లేనప్పుడు దాన్ని అమలు పరచవలసిందే.

"ఇమామ్ ముహమ్మద్ ప్రకారం, ఎవరయినా ఒకరి సొమ్ము దోచుకున్నట్లయితే అతన్ని సంహరించవచ్చు, ఆ సొమ్మును దాని యజమానికి అప్పజెప్పవచ్చు, ఆ హక్కు ఎవరికయినా ఉంటుంది. అలాగే ఇమామ్ అబూ హనీఫా, కన్నం వేసేవాని గురించి, అతన్ని మీరు సంహరించవచ్చు అని అంటారు. దానికన్నా ముందుకుపోయి ఆయన ఇలా కూడా అన్నారు, ఎవరయినా మీ పన్ను విరగ్గొట్టగోరితే మీరు అతని ప్రాణాలు తీయవచ్చు. అయితే మీరు అటువంటి పరిస్థితుల్లో చిక్కుకుని ఉండాలి, అప్పుడు అతనికి ప్రతిగా మీకు తోడ్పడే వారెవరూ ఉండని స్థితిలో మీరుండాలి.

"ఇదే మాటను మేము, జనుల నుండి చట్టవిరుద్ధంగా పన్ను వసూలు చేసేవారి విషయంలోనూ చెబుతాము. అంటే వారు 'ముబాహుద్దమ్' (వారి ప్రాణాలు తీయడం ధర్మసమ్మతమే అయినవారు). ముస్లిములు వారిని సంహరించడం విధి అయినది. వారిలో ఎవరి సంహారానికి ఏ వ్యక్తి సమర్థుడో అతన్ని ఆ వ్యక్తికి సంహరించే అనుమతి ఉంది. దీనిగ్గాను వారికి ముందుగా బోధపరిచే అవసరమూ లేదు. హెచ్చరించే ఆవశ్యకతా లేదు. ఎందుకంటే తాము చేసే పనిని వారు అధర్మమయినదని తెలిసి కూడా చేస్తూనే పోతున్నారు. అందువల్ల వారికి బోధపరచడం నిష్ప్రయోజనం, వారు దాన్ని ఎన్నడూ స్వీకరించరు. అలాగే వారిని హెచ్చరించడమూ అనవసరమే. ఎందు కంటే, వారి మున్కర్‌ను అంతమొందించగోరే వ్యక్తి వారిని ముందే హెచ్చరించి నట్లయితే, తన సంకల్పం గురించి ముందే తెలిపినట్లయితే వారు దాన్ని తప్పించు కుంటారు. ఈ విధంగా ఆ మున్కర్‌ను నిర్మూలించడం అసాధ్యమయిపోతుంది."

ఇంకా పెద్దపెద్ద వినాశకర పాపపు కార్యాలలో మునిగి ఉన్నవారు, విచ్చల విడిగా వాటికి పాల్పడుతున్నవారు- వీరందరి విషయంలోనూ ఇదే ఆదేశం వర్తిస్తుంది. అంటే వీలయినంత వరకు వారిని విమర్శించడం, తప్పుపట్టడం, బలముంటే వారి ఆచరణను ఆపడం విధి అవుతుంది.

పైన మేము చెప్పినదానంతటికీ ఆధారం ఈ కుర్‌ఆన్ ఆయత్:

فَقَاتِلُوا الَّتِي تَبْغِي حَتّٰى تَفِيْٓءَ اِلٰى اَمْرِ اللّٰهِ

**మీరు వారితో పోరాడండి, కడకు అత్యాచారం జరిపే వర్గం అల్లాహ్ ఆదేశం వైపునకు మరలి రావాలి.**

*(అల్ హుజురాత్ : 9)*

'ఇందులో హద్దు మీరిన వర్గం అల్లాహ్ ఆదేశం వైపునకు మరలనంతవరకు, తన తిరుగుబాటుతనం, మున్కర్‌నీ వదలనంతవరకు దానితో పోరాడవలసిందని ఆదేశమిచ్చాడు అల్లాహ్.' *(అహ్కాముల్ కుర్‌ఆన్ : 2/ 37,38)*

## ఒక అపార్థం తొలగింపు

దీనివల్ల తెలిసేదేమిటంటే మున్కర్‌ని మార్చడానికి మనిషి అవసరమేర్పడితే ఒక వ్యక్తి ప్రాణాలనూ తీయగలడు, ఈ విధి నిర్వహణ తన వ్యక్తిగత రక్షణలో జరిగినా, ఇతరుల రక్షణలో జరిగినా లేదా సమాజ రక్షణలో జరిగినా సరే. అయితే ఓ ప్రశ్న. షరీఅత్ మనిషికి తన ధన, మాన, ప్రాణాల రక్షణ అధికారంతోపాటు ఇతరుల ధన మాన ప్రాణాల రక్షణ బాధ్యతనూ అప్పజెప్పింది. ఈ అధికారం రీత్యా అతను తనపైన జరిగే, ఇతరులపైన జరిగే ప్రతి దాడి నుండి రక్షణకు యత్నించగలడు. ఈ రక్షణా అధికారానికి **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**కి మధ్యన ఏదయినా వ్యత్యాసముందా లేదా?

దీనికి సమాధానం, భేదముంది, నిశ్చయంగా ఉంది. తన హక్కు, ఇతరుల హక్కుల రక్షణ కొరకు కృషి చెయ్యడం ఓ పరిమిత కృషియే. కాని **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** పరిధి దానికన్నా ఎంతో విస్తృతమయింది. ఉదాహరణకు, ఒక వ్యక్తి ఎవరినయినా హత్య చెయ్యదలిస్తే, మీరు అతన్ని ఎదిరిస్తే, మీరు, షరీఅత్ మీకు ఇచ్చిన ఇతరుల ప్రాణాలను కాపాడే అధికారాన్ని వినియోగిస్తారు. ఇది ఒక పీడితుని రక్షణ, మున్కర్ నివారణ కూడా. కాని మీరు ఒక ఆత్మహత్య చేసుకునేవాని ఆత్మహత్యను ఆపినట్లయితే అందులో ఒకరి రక్షణ ప్రశ్నే లేదు. కాని ఇది ఒక మున్కర్‌ని రూపుమాపడం. అలాగే ఒక వ్యక్తి ఏ స్త్రీ మానభంగానికయినా పాల్పడినట్లయితే, మరి మీరు అతన్ని ఆపినట్లయితే అది ఒక స్త్రీ పక్షాన రక్షణతోపాటు, ఒక మున్కర్‌ని రూపుమాపడం కూడా అవుతుంది. కాని ఒకవేళ ఒక స్త్రీ మరొక పురుషుడు కలిసి ఇష్టపూర్వకంగా వ్యభిచరించగోరితే, మీరు గనక వారిని వారిస్తే, ఇది స్త్రీ పక్షాన రక్షణ కాజాలదు. ఇది కేవలం మున్కర్‌ని రూపుమాపడం మాత్రమే.★ మొత్తానికి, షరీఅత్‌కు విరుద్ధమయిన ప్రతి పని దాన్ని నిర్మూలించడం సాధ్యమయినదయితే, అది మున్కర్‌ని రూపుమాపడం గానే పరిగణించబడుతుంది. అది రక్షణకు సంబంధించినదయినా కాకపోయినా.

---

★ *వివరాలకు చూడండి, అల్ తష్రీ' అల్ జనాయీ అల్ ఇస్లామీ పు.511, 512)*

## సామాన్య జనులు బలాన్నుపయోగించడం

ఈ వివరణ వల్ల ఒక విషయం స్పష్టమయిపోయింది. శక్తినుపయోగించి మున్కర్‌ని రూపుమాపే హక్కు ప్రతి వ్యక్తికి ఉంది. కాని అది ఎటువంటి షరతు లేనిదే కాదు. దానికి కొన్ని షరతులున్నాయి. ఇక్కడ ఆ షరతుల ప్రస్తావన అవసరం.

## 1. మున్కర్ జరుగుతూ ఉండగా...

మున్కర్‌ని రూపుమాపడానికి సామాన్య ప్రజలు శక్తినుపయోగించగలరు. అయితే అది కేవలం ఆచరణాత్మకంగా ఎవరయినా మున్కర్‌కు పాల్పడుతూ ఉన్నప్పుడు మాత్రమే. ఒకవేళ భావిలో ఎక్కడయినా మున్కర్ జరిగే ప్రమాదమున్నట్లయితే అటువంటి పరిస్థితిలో సామాన్య ప్రజలు శక్తిని ఉపయోగించజాలరు. అలాగే మున్కర్ జరిగి అది ఉనికిలోకి వచ్చిన తరువాత వారు అపరాధిని ప్రబోధనయితే చేయగలరు కాని అతనికి వ్యతిరేకంగా శక్తినుపయోగించలేరు. ఇమామ్ గజాలీ ఇలా అంటున్నారు :

> 'పాపపు కార్యం మూడు స్థితుల్లో ఉంటుంది. ఒకటి, పాపం వాస్తవంగా జరిగిపోయింది. అప్పుడు దానికి శిక్ష విధించడమో హద్ద్ విధించడమో అధికారుల బాధ్యత, సాధారణ ప్రజల బాధ్యత కాదు. రెండవ స్థితి, పాపం ఇంకా ఉంది. దానికి పాల్పడేవ్యక్తి ఇంకా అందులో నిమగ్న మయి ఉన్నాడు. ఇటువంటి పరిస్థితిలో పాపాన్ని వారించడం, నిర్మూ లించడం విధి అయినదే. అయితే అలా వారించడం మూలాన దానికన్నా పెద్దది లేదా అలాంటిదే మరేదయినా పాపపు చేష్ట ఉత్పన్నం కారాదు. దీన్ని రూపుమాపే అధికారం సామాన్య ప్రజలకు ఉంది. మూడవ స్థితి ఏమిటంటే, మున్కర్ జరిగే ప్రమాదముంది; ఉదాహరణకు ఒక వ్యక్తి మద్యపానానికి కూటమిని రూపొందించే ఏర్పాట్లు చేస్తున్నారు. ఇంకా అక్కడ మద్యం రాలేదు. ఇటువంటి పరిస్థితిలో అక్కడ మద్యం వాడకుండా ఏదయినా అవాంతరం ఏర్పడే అవకాశాలు రావచ్చు. ఇటువంటి స్థితిలో ఆ వ్యక్తికి కేవలం ప్రబోధన మటుకే చేయ వీలుంటుంది. బలాన్నుపయోగించే హక్కు ప్రజలకూ లేదు, ప్రభుత్వానికీ లేదు. అయితే ఒకవేళ అతను ప్రసిద్ధి చెందిన,

అలవాటుపడిన అపరాధి అయితే బలాన్నుపయోగించవచ్చు. అతను సాధనాలు సమకూరిన తరువాత అపరాధానికి పాల్పడడానికి సమయమూ అవకాశం కోసం నిరీక్షిస్తున్నట్లయితే అతని పట్ల కఠినతరమయిన విమర్శన ధర్మ సమ్మతమే."

(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 352)

అల్లామా ఇబ్ను నుజైమ్ శిక్షించే విషయాన్ని చర్చిస్తూ ఇలా వ్రాశారు :

**قالوا لكل مسلم اقامته حال مباشرة المعصية و اما بعد الفراغ منها فليس ذٰلك لغير الحاكم**

**ధర్మ శాస్త్రవేత్తల ప్రకారం పాపం జరుగుతున్నప్పుడు మటుకు ముస్లిములకు శిక్షించేహక్కు ఉంటుంది. కాని పాపం జరిగిపోయిన తరువాత అధికారికి తప్ప మరెవరికీ శిక్షించే హక్కు లేదు.**

(అల్‌బహ్రుర్రాయిక్ షర్హ్ కన్జుద్దకాయిక్ 5/ 42)

ఫిక్‌హ్‌లో దీనికి ఇవ్వబడిన వివరం ఇది :

**لو عزره حال كونه مشغولاً بالفاحشة فله ذلك و انه حسن، لاَن ذلك نهى عن المنكر و كل واحد مأمور به، و بعد الفراغ ليس ينهى عن المنكر لاَن النهى عما مضى لاَ يتصور فيتمحض تعزيرًا وذٰلك الى الاِمام**

**పాపపు కార్యంలో పాల్గొనేవానికి ఎవరయినా అతను పాల్పడుతున్నప్పుడు శిక్ష విధిస్తే అది చెల్లుతుంది, అది అభిలషణీయం కూడా. దీన్ని నహీ అనిల్ మున్కర్ అని కూడా అంటాము. దీన్ని ఆచరించడం ప్రతి ఒక్కరి కర్తవ్యం, దాని ఆదేశం ప్రతి ఒక్కరికీ ఉంది. పోతే పాపం చేసివేసిన తరువాత, అప్పుడు మున్కర్‌ను మాన్పించడం జరగదు, ఎందుకంటే ఏ పని అయితే జరిగిపోయిందో దాన్ని వారించే భావన అనేదే ఉండదు. అప్పుడు చేసేది పూర్తిగా శిక్షించడమే, అది కేవలం పాలకునికి చెందినదే.**

*(అల్ బహ్రుర్రాయిక్, షర్హ్ కన్జుద్దకాయిక్ : 5/ 42)*

ఏ వ్యక్తి అయినా మున్కర్‌కు ఒడిగట్టిన మీదట అతనికి వ్యతిరేకంగా శక్తినుపయోగించటం శిక్షార్హమైన నేరం అని ధర్మశాస్త్రవేత్తలు చాలా స్పష్టంగా వ్రాశారు.

للمحتسب ان يعزر المعزران عزره بعد الفراغ منها

**ఎవరయినా పాపం చేసి ముగించిన తరువాత అతన్ని శిక్షించినట్లయితే ఆ మనిషిని శిక్షించ దానికి ప్రభుత్వ పక్షాన విమర్శనకు నియుక్త డయిన వ్యక్తికే అధికారం గలదు.**

*(అల్‌బహ్రుర్రాయిక్ : షర్‌హ కన్జుద్దకాయిక్ : 5/ 42)*

ఒక ఉదాహరణ ద్వారా దీని విశదీకరణ సాధ్యమవుతుంది. ఒక వ్యక్తి మరో వ్యక్తి పైన దాడి జరిపినప్పుడు ఆ మరో వ్యక్తి తన ప్రాణరక్షణకు లేదా మూడవ వ్యక్తి అతని రక్షణ కొరకు దాడి జరిపినవానిని చంపివేసినట్లయితే షరీఅత్ వీరిలో ఎవరినీ పట్టుకోదు. దీన్నిబట్టి, మున్కర్‌ని రూపుమాపడానికి, మున్కర్ జరుగుతున్నప్పుడు, శక్తినుపయోగించడం ధర్మసమ్మతమే అన్నదానికి ఇది ఆధారం. మరో రూపాన్ని ఉదాహరణగా తీసుకుందాము. దాడి జరిపిన వ్యక్తి తొలి దాడి తరువాత వెనక్కి మరలిపోతాడు, మళ్ళీ దాడి జరిపే ఏ సూచనా కానరాదు; ఇటువంటి పరిస్థితిలో ఆ దాడి జరిపిన వ్యక్తిని చంపి వేసినట్లయితే హంతకుని ద్వారా కిసాస్ (హత్యా పరిహారం) గ్రహించబడుతుంది.[0] దీన్నిబట్టి మున్కర్ జరిగిన తరువాత శక్తినుపయోగించడానికి అనుమతి లేదు అనడానికి ఇది తార్కాణం.

## 2. అవసరం మేరకు శక్తి ప్రయోగం

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్‌మున్కర్** కొరకు సామాన్య జనులు అనివార్యమయిన అవసరం మేరకు శక్తినుపయోగించగలరు. అంతకుమించి వారికి అనుమతి లేదు. ఇమామ్ గజాలీ చేత్తో చెడును మాన్పడాన్ని గురించిన మర్యాదల ఈ వివరాలు తెలుపుతారు :

ان يقتصر فى طريق التغيير على القدر المحتاج إليه

**మున్కర్‌ను రూపుమాపే విధానాన్ని ఏ పరిమాణంలో అవసరమో ఆ మేరకే పరిమితంగా ప్రయోగించాలి.** *(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 359)*

ఉదాహరణకు ఒక వ్యక్తి ఒకరి భూమిపైన అక్రమంగా దురాక్రమణ జరిపి కూర్చున్నాడు. అతన్ని చెయ్యి పట్టి అక్కణ్ణుంచి లాగి వెలికి తీసి తొలగించవచ్చు, అలాంటప్పుడు

★ *అల్ బహ్రుర్రాయిక్ (పూర్ణతః) పుట. 302)*

గడ్డం పట్టి లాగడం, కాలు పట్టి లాగటం సరయినదికాదు. *(ఇహ్యాఉ ఉలూముద్దీన్:2/ 359)*

అవసరంకన్నా అధికంగా బలాన్నుపయోగించడమూ అపరాధమే. దాన్ని షరీఅత్ ద్వారా పట్టుకోవడమూ జరుగుతుంది. ఉదాహరణకు, మధువును పారబోయడానికి మధుపాత్రను పగులగొట్టనవసరం లేదు. ఎవరయినా పాత్రను పగులగొట్టినట్లయితే అతను దాని నష్టపరిహారం చెల్లించవలసి ఉంటుంది. కాని ఒకవేళ పాత్రను పగుల గొట్టనిదే పారబోయటం సాధ్యపడకపోతే అలా చేసే అనుమతి అతనికి ఉంటుంది.

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్: 2/ 359, 360)*

అదేవిధంగా ఏ ఇంటనయినా దొంగ చొరబడగా, కేకలు వేస్తే వాడు పారిపోతాడు అని తెలిసినా ఇంటి యజమాని అతణ్ణి చంపి వేసినట్లయితే హత్యా పరిహారం అతనిపైన విధితమవుతుంది. కాని కేకలు వేయడం మూలాన వాడు పారిపోడు అని అతనికి గట్టి నమ్మకమున్నప్పుడు అతను వాణ్ణి చంపగలడు.

*(అల్ బహ్రుర్రాయిక్ (పూర్ణతః) పు. 309)*

ఇమామ్ గజాలీ ఈ సందర్భంలో ఓ సూత్రప్రాయమయిన విషయం చెప్పారు:

**ليس الىٰ اٰحاد الرعية الاّ الدفع و هو إعدام المنكر، فما زاد على قدر الاعدام فهو إمّا عقوبة على جريمة سابقة او زجر عن لاَحق و ذٰلک الى الولاَة لاَ إلى الرعية**

**సాధారణ ప్రజలకు కేవలం మున్కర్‌ను రూపు మాపే అధికారం ఉంది. అంతకన్నా అధిక మయినదేమయినా ఉంటే అది గత అపరాధా నికి శిక్ష అయినా అయి ఉంటుంది. లేదా జరగబోయే అపరాధానికి బెదరింపు, గద్దింపు. దీని అధికారం అధికారులకు ఉంటుంది, ప్రజలకు లేదు.** *(ఇహ్యావు ఉలూముద్దీన్ : 2/ 359)*

## 3. ఉపద్రవ ప్రమాదముండరాదు

శక్తి ద్వారా మారూఫ్‌ని స్థాపించడం, మున్కర్‌ని రూపుమాపడం సరయినదే అని నిర్ధారించడానికి రెండు విషయాలు తప్పనిసరి. ఒకటి వాస్తవంగానే మున్కర్ నిర్మూలించ బడుతుందని, మారూఫ్ నెలకొంటుందని ఆశ ఏర్పడాలి. దీనికి తోడుగా ఎటువంటి ఉపద్రవమయినా (ఫిత్నా) ఉత్పన్నం అవుతుందన్న సంశయమూ ఏర్పడరాదు. సాధారణ పరిస్థితుల్లో మున్కర్‌ని రూపుమాపడానికి శక్తిని కాస్తోకూస్తో ఉపయోగిస్తే ఎటువంటి ఉపద్రవమో, కలతో ఏర్పడే ప్రమాదముండదు. కాని ఈ ఉద్దేశ్యంతో ఆయుధాలు చేపట్టినట్లయితే ఇందులో ఈ ప్రమాదం తప్పక ఉత్పన్నమవుతుంది. ఈ కారణంగానే

ఇమామ్ గజాలీ, మున్కర్‌కి పాల్పడుతున్న వారిని సమయానుకూలంగా అవసరం మేరకు సామాన్య జనమయినా దెబ్బలు కొట్టడానికీ వారికి హక్కుందని అంటారు. కాని, అటువంటి వాని పైన ఆయుధాలు ఎత్తడానికి అనుమతి ఇవ్వాలంటే, ఏదయినా ఉపద్రవ ప్రమాదం లేనప్పుడే సాధ్యమని అంటారు. ఈ చర్చకు ప్రారంభంలోనే ఇమామ్ గజాలీ విమర్శనకు ఎనిమిది దశల్ని పేర్కొన్నట్లు ప్రస్తావించాము. వీటిలో ఏడవ దశ క్రింద ఆయన ఇలా వ్రాస్తున్నారు :

الدرجة السابعة مباشرة الضرب باليد و الرجل وغير ذٰلک مما ليس فيه شهر سلاح، و ذٰلک جائز للأحاد بشرط الضرورة و الاِقتصار علٰى قدر الحاجة فى الدفع، فاذا اندفع المنكر فينبغى ان يكفّ ... فان احتاج الى شهر سلاح و كان يقدر على دفع المنكر بشهر السلاح وبالجرح فله ان يتعاطى ذلک مالم تشرفتنة

విమర్శనకు ఏడవ దశ ఏమిటంటే మున్కర్‌కు ఒడిగట్టే వానికి చేతులతోనూ కాళ్ళతోనూ కొట్టడం లేదా ఆయుధాల ప్రయోగం లేని మరేదయినా శిక్ష వెయ్యడం. ఇలా చెయ్యడం సాధారణ ప్రజలకూ ధర్మసమ్మతమయినదే. అయితే కేవలం అవసరం కలిగినప్పుడే చేయాలి, మున్కర్‌ని రూపుమాపడానికి ఏ మేరకు చర్య తీసుకోవలసి వస్తుందో ఆ మేరకే పరిమితంగా చర్య తీసుకోవాలి. ఆ తరువాత మున్కర్ తొలగిపోయినప్పుడు దాన్ని మానుకోవాలి. ఒకవేళ విమర్శనకు బాధ్యుడయిన వ్యక్తి ఆయుధం ఎత్తడం అవసరమని భావిస్తే, అతను దాన్ని ప్రయోగించి మున్కర్‌కు పాల్పడే వానిని గాయపరచి మున్కర్‌ని తొలగించగల శక్తి కలిగి ఉన్నట్లయితే దాన్ని ప్రయోగించేందుకు అతనికి అనుమతి ఉంటుంది. అయితే దాని వల్ల ఏదయినా ఉపద్రవం, కల్లోలం ఉత్పన్నం కారాదు. *(ఇహ్యాఉ ఉలూముద్దీన్:2/360)*

## మున్కర్‌కు పాల్పడే సమూహానికి ప్రతిగా శక్తినుపయోగించడం

ఇప్పటివరకు మనం చర్చించుకుంది మున్కర్‌కు ఒడిగట్టే వ్యక్తికి ప్రతిగా ఓ ఇస్లామీయ రాజ్యపౌరుడు శక్తినుపయోగించగలడా లేదా అన్న అంశం. ఆ తరువాత ఉత్పన్నమయ్యే ప్రశ్న, ఏదయినా వర్గం మున్కర్‌కు పాల్పడుతున్నట్లయితే, లేదా

ఎవరయినా వ్యక్తి పాల్పడుతున్నట్లయితే,అతన్ని ఏ ఒక్క వ్యక్తి ఎదుర్కోవడం సాధ్యం కాకపోయినప్పుడు, అతను తనతో ఏకాభిప్రాయం గల వారిని పోగుచేసుకుని వారి సహకారంతో అతని మున్కర్‌ని నిర్మూలించే ప్రయత్నం చేయగలడా? ఈ ప్రశ్న ప్రముఖ మయినదీ చిక్కులతో కూడుకున్నదీను. ఎందుకంటే ఇటువంటి సందర్భాలలో ఇటువంటి మున్కర్ సమసిపోయే, మారూఫ్ నెలకొనే ఆస్కారమున్నట్లే అంతే అధికంగా ఉపద్రవాలు, కలతలు, కల్లోలాలు ఉత్పన్నమయ్యే ఘోరమయిన ప్రమాదమూ ఉంది. ఇమామ్ గజాలీ ఇలా అంటున్నారు :

**اما جمع الأعـوان و شهـر الأسلحـة فذٰلك قد يجـرّ الى فتنة عامـة ففيه نظر**

**సహాయం చేసే వారిని ప్రోగు చెయ్యడం, ఆయుధాలను సమకూర్చుకోవడం అనే చర్యలు సాధారణ కలతకు, కల్లోలానికీ దారి తీయ వచ్చు. అందువల్ల ఇది యోచించదగ్గ విషయం.** ***(ఇహ్యాఉ ఉలూముద్దీన్: 2/ 343)***

స్వయాన ఇమామ్ గజాలీ, ఈ సందర్భంలో మరో అభిప్రాయం వెలిబుచ్చారు. ఆయన ప్రకారం, చెడును నిర్మూలించడానికి మనిషికి తన సమర్థకుల్నీ సహాయకుల్నీ ప్రోగు చేసుకునే పోరు సలపవలసిన అవసరం బహుధా చాలా అరుదుగానే కలుగ వచ్చు. కాని ఒకవేళ అవసరం కలిగితే అతను తన సమర్థకులూ సహాయకులతో మున్కర్‌ను నిర్మూలించేందుకు పోరు సలపనూ గలడు. ఇమామ్ గజాలీ విమర్శనకు నియమించిన ఎనిమిది దశలలో ఎనిమిదవ దశ, చిట్టచివరి దశ, 'మనిషి మున్కర్‌ని నిర్మూలించడంలో తాను స్వయంగా శక్తిమంతుడు కాడని భావిస్తే, తన సహాయకుల్నీ సమర్థకుల్నీ ఆయుధాలు ఉపయోగించగలవారినీ సహాయం కోరగలడు. ఇటువంటి పరిస్థితిలో ఎదుటి పాపాతురుడు కూడా తరచుగా తన సహాయకుల్నీ సమర్థకుల్నీ పిలిపించుకుంటాడు. ఫలితం ఇరువర్గాలు మార్కొంటాయి, పోరు సలుపుతాయి. ఇటువంటి పరిస్థితులు ఏర్పడిన పక్షంలో పాలకుని అనుమతి అవసరమా లేదా అన్న విషయంలో భిన్నాభిప్రాయముంది.

కొందరి అభిప్రాయంలో జన సామాన్యం తమంతట తాము దాన్ని చేయ జాలదు. దీనివల్ల కలతలకు తావు లభిస్తుందన్నది వారి అభిప్రాయం. తద్వారా దేశం అల్లకల్లోలం పాలవుతుంది. నాశనమవుతుంది. దీనికి భిన్నంగా కొందరు చెప్పేదేమంటే దీనికి పాలకుల అనుమతి అవసరం లేదు. ఈ విషయమే సబబయినదిగా తోస్తోంది.

ఎందుకంటే, సాధారణ వ్యక్తులకు అమ్ర్ బిల్ మారూఫ్ కొరకు అనుమతి ఉన్నప్పుడు, దాని మొదటి దశ రెండవ దశకు, రెండవ దశ మూడవ దశకు తోడుకుని పోగలిగి నప్పుడు అది తప్పనిసరిగా ఎనిమిదవ దశ వరకు తీసుకుపోగలదు, దెబ్బలాటకూ తావు కల్పించగలదు. దెబ్బలాట జరిగినప్పుడు ఇతరుల సహకారమూ పొందవలసి రావచ్చు. కాగా **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధి నిర్వహణ జరపవలసి ఉన్నప్పుడు, ఆ మార్గాన తటస్థ పడే సహజ ఆవశ్యకతల్ని, అవి ఎంత కఠినమయిన వయినా, వాటిని లెక్కచెయ్యరాదు. దాని చివరి మేర అల్లాహ్ మార్గాన మార్కొనడమే, పాపాలను రూపుమాపడమే. మనం సాధారణ రక్షణభటులకు, సైనికులకు వారంతా కలిసికట్టుగా ఏకమయి తిరస్కారుల విభిన్నవర్గాలను తుదముట్టించేందుకు యుద్ధం చేసే అనుమతినిచ్చినప్పుడు అదేవిధంగా కల్లోల జనకుల నిర్మూలన కూడా సామాన్య జనులకు ధర్మబద్ధమయి ఉండాలి. క్లుప్తంగా, విమర్శనా వ్యవహారం ఇంతదూరం వెళ్ళడమన్నది చాలా అరుదయిన విషయం. అయినా ఊహాజనితమయిన దాన్నీ మార్చ వీలు కాదు'' *(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 361)*

ఇమామ్ గజాలీ (రహ్మ) వెలిబుచ్చిన ఈ అభిప్రాయంతో పూర్తిగా ఏకీభవించడం కష్టం. ఒక రాజ్యంలోని పౌరులు ఒండొకరికి విరుద్ధంగా శక్తిని ఇలా విస్తృత పరిమాణంలో, ఇమామ్ గారు అనుమతించిన రీతిలో ప్రయోగించనారంభిస్తే రాజ్యంలో శాంతిభద్రతలు నెలకొనడం సాధ్యం కాదు. నిజానికి అరాచకం వ్యాపిస్తుంది, అటువంటి అరాచకత్వాన్ని ప్రభుత్వమూ అదుపు చెయ్యడం కానిపనిగా రూపొందవచ్చు. ఇక్కడ మరో ప్రశ్న ఉత్పన్నమవుతుంది. మున్కర్‌ని రూపుమాపడానికి ఓ వ్యక్తి మరో వ్యక్తిని సంహరించడం సరయినదే అయినట్లయితే అదే ఉద్దేశ్యంతో ఓ వర్గం మరో వర్గానికి వ్యతిరేకంగా ఆయుధాలు ఎత్తడానికి ఎందుకు అనుమతి లేదు అన్నది ప్రశ్న.

ఈ ప్రశ్న పరిష్కారానికి, ముందు మనం రెండు విషయాలను గమనించాలి : ఒకటి, ఇప్పుడే విన్నవించుకున్నట్లు, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విషయంలో ఏ వ్యక్తి అయినా మరో వ్యక్తిని సంహరించే చర్య గైకొనాలంటే దానివల్ల ఎటువంటి ఉపద్రవమయినా ఉత్పన్నమయ్యే ప్రమాదం లేని పరిస్థితిలోనే సాధ్యమవు తుంది. ఉపద్రవమేర్పడే ప్రమాదమున్నట్లయితే ఈ 'అనుమతి' అంతమయిపోతుంది, ఆ వ్యక్తి సంహారయత్నం చెయ్యడం అధర్మమయిపోతుంది.

మరో విషయమేమిటంటే సమూహ విషయం వ్యక్తుల విషయం కన్నా వేరయినది. మున్కర్‌ని రూపుమాపడానికి ఒక వ్యక్తి మరో వ్యక్తికి ఎదురుగా బలాన్ని ప్రయోగిస్తే అందులో ఉపద్రవం ఉత్పన్నమయ్యే ప్రమాదం, ఒక సమూహం, మరో సమూహానికి ఎదురుగా ఆయుధాలు ఎత్తే సందర్భంలో ఉత్పన్నమయ్యేంత తీవ్రంగా ఉండదు. నిజానికి మరీ సరయిన విషయం ఏమిటంటే, వ్యక్తుల వ్యవహారంలో ఉపద్రవం, కల్లోలాల ప్రమాదం ఒక స్థాయిదయితే వర్గాలు ముఠాల వ్యవహారంలో అది పెరిగి అధికమయి వంద రెట్లవుతుంది. అందువల్ల సమూహాలు, వర్గాలను అచ్చంగా వ్యక్తుల మాదిరిగానే ఊహించుకోవడం ఎంతమాత్రం సరయినది కాదు.

రెండు, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విషయంలో, వ్యక్తులకు, అవసరమయినప్పుడు, నిస్సందేహంగా ఒకరి ప్రాణాలు తీసే అనుమతి ఉంది. అయితే ఈ అనుమతి అత్యంత అనివార్య పరిస్థితుల్లోనే ఇవ్వబడింది. లేకపోతే సర్వసాధారణ పరిస్థితుల్లో, ధర్మవేత్తలు అతి స్పష్టంగా వ్రాశారు, ఈ వ్యవహారంలో యుద్ధం అవసరం ఏర్పడితే అప్పుడే దాన్ని ప్రభుత్వానికి అప్పగించి వేయాలని. దిగువన ఇద్దరు ముగ్గురు ధర్మవేత్తల విశదీకరణలు ఉటంకిస్తున్నాము.

ఒకవేళ ఏ వ్యక్తి అయినా మున్కర్‌ని రూపుమాపడానికి ఆయుధం చేపట్టినట్లయితే, అతని విషయంలో ఇబ్ను అరబీ మాలికీ, వ్యతిరేకత వెలిబుచ్చారు. అయితే ఆ మున్కర్ లేదా చెడుగు ఆయుధం చేపట్టవలసినటువంటిదయితే అప్పుడు అది అనివార్యమే. మరి అలా ఆయుధం చేపట్టకపోవడం వల్ల మరో పెద్ద మున్కర్ పొడసూపే ప్రమాదమూ ఉన్న పక్షంలోనయితే మరీను. ఉదాహరణకు, ఓ వ్యక్తి మరో వ్యక్తి ప్రాణాలు తీయడానికి ఉపక్రమిస్తున్నప్పుడు, ఆ ప్రాణాన్ని కాపాడటానికి, ఆ దుర్మార్గుణ్ణి ఎదుర్కొనేందుకు ఆయుధం చేపట్టడం. ఇటువంటి ప్రత్యేక పరిస్థితుల్లో తప్ప సాధారణ పరిస్థితుల్లో ఆయనగారి నిర్ణయం లేదా 'ఫత్వా' ఇది:

فان لم يقدر الاّ بمقاتلة وسلاح فليتركه و ذٰلك انما هُوَ اِلى السلطان لأن شهر السلاح بين الناس قد يكون مخرجا الى الفتنة و ايلا

**ఒక వ్యక్తి చెడును రూపుమాపడానికి యుద్ధం తప్ప మార్గాంతరం లేదని తలంచి ఆయుధం చేబూనినట్లయితే దాన్ని వెంటనే మానుకోవాలి. ఎందుకంటే ఇది అతని పని కాదు, పాలకుని పని. కారణం ఏమిటంటే సామాన్య జనుల చేతుల్లో ఆయుధాలు రావడం కొన్ని సందర్భా**

الىٰ الفساد اكثر من الأمر بالمعروف و النهى عن المنكر

లలో ఉపద్రవ కారకంగా పరిణమిస్తుంది. ఫలితంగా కల్లోలం పుడుతుంది. అది అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్ వల్ల కలిగే ప్రయోజనం కన్నా ఎంతో ఘనమయిన హానిగా రూపొందుతుంది.

*(అహ్కాముల్ కుర్ఆన్ : 4/ 1720)*

ఇమాముల్ హర్మైన్ ఇలా అంటున్నారు :

يسوغ الاُحاد الرعية ان يصدّ مرتكب الكبيرة ان لم يندفع عنها بقولهٖ ما لم ينته الأمر الى نصب قتال و شهر سلاح، فان انتهىٰ الأمر الىٰ ذٰلك الأمر الىٰ ذٰلك ربط الاَمر باللسلطان

ఇస్లామీయ రాజ్యంలోని పౌరులలో ప్రతి వ్యక్తికి, పెద్ద పాపానికి (మాసియత్ కబీరాకు) ఒడిగట్టే వానిని ప్రతిఘటించడం ధర్మసమ్మతమయిన బాధ్యత; ఇంకా అతను బోధన, ఉపదేశన, మాటల ద్వారా కూడా పాపపు చేష్టలకు దూర మవకపోతే, అతన్ని నిరోధించాలి, ఆపాలి. ఆ తరువాత అతన్ని ఆపేందుకు ఆయుధం, యుద్ధం అవసరమయినట్లయితే ఆ అనుమతి ఇక ఉండదు. ఆ వ్యవహారం ఆ స్థాయికి చేరు కున్నప్పుడు అది పాలనాధికారులకు చెందిన దయిపోతుంది.

*(షర్హ్‌ముస్లిమ్ (నవవీ), సం. 1, భాగం 2, పుట 23)*

అల్లామా జారుల్లా జమఖ్షరీ ఇలా అంటున్నారు :

الإنكار الّذى بالقتال، فالإمام و خلفاءهٗ اولىٰ لِانّهم اعلم بالسياسة وَمعهم عدتها

యుద్ధం ద్వారా నహీ అనిల్ ముస్కర్ (చెడు నిర్మూలన) పాలకుడు,అతని ప్రతినిధుల బాధ్యత (సామాన్య ప్రజల బాధ్యత కాదు). వారికి రాజకీయాలను గురించి బాగా తెలుసు. పైగా (పోరుకు సంబంధించిన) సామగ్రి కూడా వారివద్దనే ఉంటుంది.

*(అల్ కష్షాఫ్ అన్ హకాఇక్ అత్తన్జీల్ : 1/ 390)*

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విషయంలో, వ్యక్తులకు కూడా, కల్లోల ప్రమాదమున్నట్లయితే ఆయుధం చేబూనటాన్ని వ్యతిరేకించబడినప్పుడు సమూహాలకు, వర్గాలకు దీన్ని అనుమతించడం ఎలా సాధ్యమవుతుంది. ఏవిధంగానయితే వ్యక్తులకు, అనివార్య పరిస్థితుల్లో గత్యంతరం లేనప్పుడు శక్తినుపయోగించి మున్కర్‌ని రూపుమాపడానికి అధికారముందో అదేవిధంగా అధికారం వర్గాలకు సమూహాలకు కూడా వర్తింపచేయవచ్చు. ఉదాహరణకు, దోపిడీ దొంగల ఏదయినా ముఠా ఒక గ్రామంపైన దాడి జరిపినప్పుడు గ్రామ ప్రజలందరు కలిసి దాన్ని ఎదుర్కొనడం వారి బాధ్యత, వారిని ముట్టడించి పారద్రోలడం, అవసరమయితే, వీలయితే వారిని తుదముట్టించడానికి కూడా వారికి అనుమతి ఉంటుంది. ఈ వివరాలన్నింటి దృష్ట్యా మనం ఇలా చెప్పగలము- మున్కర్‌కు పాల్పడే ఏదయినా వర్గానికి విరుద్ధంగా మరేదయినా వర్గం కొన్ని సందర్భాలలో ఆయుధాలు చేపట్టగలదు. ఆ సందర్భాలు ఇవి:

1. ఆ పనిని ఆ వర్గం ప్రభుత్వానికి అప్పజెప్పే స్థితిలో లేనప్పుడు.
2. దానివల్ల ఏదయినా ఉపద్రవం, కలత ఉత్పన్నమయ్యే ప్రమాదం లేనప్పుడు, లేదా శాంతిభద్రతలు క్షీణించే ప్రమాదం లేనప్పుడు.
3. ఆయుధాలు చేపట్టకపోతే మరేదయినా పెద్ద మున్కర్ తలెత్తే ప్రమాదం భయం ఉన్నప్పుడు.

అయినప్పటికీ ఇటువంటి ప్రతి ఒక్కో చర్య ఒక వినాయింపులాంటిది. సాధారణ పరిస్థితుల్లో, సరయిన మాట ఇదే- ఏ వర్గానికయినాసరే **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** కార్యానికి ఏ వ్యక్తికి విరుద్ధంగానయినాసరే మరే వర్గానికి విరుద్ధంగానయినాసరే శక్తినుపయోగించే అనుమతినివ్వకూడదు. ఇదే సరయిన వాస్తవమయిన మాట.



# పరిధులు, మర్యాదలు

ముస్లిముల సంస్కరణ సుశిక్షణ, వారిని మారూఫ్ పట్ల ఆదేశించడం, మున్కర్‌ని గురించి వారించడం ఎంతగా ప్రముఖమయినదో అంతగానే సున్నిత మయిన కార్యం. దానికి ప్రత్యేకమయిన పరిమితులున్నాయి, మర్యాదలున్నాయి. వాటిని పాటించకుండా ఆ విధిని సరిగా నిర్వర్తించడం కూడా చాలా కష్టసాధ్యమయిన పని. అంతేకాదు, ఆ పరిమితుల్ని అతిక్రమించడం, ఆ మర్యాదల్ని పాటించకపోవడం వల్ల మారూఫ్‌ను స్థాపించబోయి మున్కర్‌కు పాల్పడే అవకాశమూ ఉంది. అలాగే మున్కర్‌ను చెరిపివేసే ప్రయత్నంలో మారూఫ్ కూడా సమసిపోయే ప్రమాదమూ ఉంది. దిగువన ఆ పరిమితులు పరిధులు, మర్యాదలు కాస్త వివరంగా ప్రస్తుత పరిచే ప్రయత్నం చేస్తున్నాము.

## 'అమ్ర్ బిల్ మారూఫ్' మరి 'నహీ అనిల్ మున్కర్'- వ్యత్యాసం

వాస్తవానికి అమ్ర్ బిల్ మారూఫ్‌లోనూ నహీ అనిల్ మున్కర్‌లోనూ ఎటువంటి వ్యత్యాసం లేదు. మారూఫ్‌ని ఆదేశించడం అంటే యదార్థానికి మున్కర్ నుండి వారించడం అన్నమాట. అలాగే మున్కర్‌ని వారించడం అంటే మారూఫ్‌ని ఆదేశించడం అని భావం. కాని కేవలం ఈ పారిభాషిక పదాలను గమనించినట్లయితే వీటిలో తప్పక వ్యత్యాసముంది. ఈ వ్యత్యాసాన్ని మనం మరోవిధంగా అన్వయించుకోవచ్చు. అమ్ర్ బిల్ మారూఫ్ అన్నది ఓ సకారాత్మక క్రియ. మరి నహీ అనిల్ మున్కర్ ఏమో నకారాత్మక చర్య. ఉదాహరణకు, ముస్లిముల పట్ల శ్రేయోభిలాష, వారి బోధనా సుశిక్షణల విషయం, ముఖ్యమయిన ధార్మిక విషయాలలో మార్గబోధన, మార్గ నిర్దేశన, వారి ఎడల ప్రేమానురాగాల వ్యవహారం, కష్టాలలో వారిని ఆదుకోవడం, వారికి సహాయపడటం, ఇత్యాది పనులన్నీ అమ్ర్ బిల్ మారూఫ్ కిందికి వస్తాయి. నహీ అనిల్ మున్కర్ అన్నది, ముస్లిములకు వారి ప్రాపంచిక, పారలౌకిక జీవితంలో

హానికరమయిన సమస్త నమ్మకాల నుండి, సకల ఆచరణల నుండి వారిని కాపాడటం.★

## అమ్ర్ బిల్ మారూఫ్- విధి, వాంఛనీయం

అమ్ర్ బిల్ మారూఫ్ అయినా నహీ అనిల్ మున్కర్ అయినా వీటిలో ప్రతి ఒక్క దాని విషయంలోనూ ప్రశ్న ఉదయిస్తుంది, ఒక ముస్లిమ్ వ్యక్తి పైన అది ఎప్పుడు విధి అవుతుంది, మరెప్పుడు అది కేవలం అనుమతించబడుతుంది, లేదా వాంఛనీయమవుతుంది అన్నది. అమ్ర్ బిల్ మారూఫ్ విషయంలో విద్వాంసులు (ఉలమా) ఇలా వ్రాశారు :

---

★ *ఇక్కడ ఒక విషయం విశదపరచడం అవసరం. కొందరు 'మున్కర్'నీ 'మాసియత్' (పాప చేష్ట)నూ ఒకటిగానే పరిగణిస్తారు. కాని ఈ రెంటిలో వ్యత్యాసముంది. ఇమామ్ గజాలీ ఈ వ్యత్యాసాన్ని సవివరంగా తెలిపారు :*

*"మున్కర్ అన్నదాని భావం చాలా విస్తృతమయింది. ఇందులో ఉన్న విస్తృతి 'మాసియత్' (పాపం)లో లేదు. మున్కర్ అని ప్రతి అయిష్టకర చేష్టకు చెప్పవచ్చు. అది సమర్థత గల వారు చేశారా లేదా సమర్థత లేనివారి వల్ల జరిగిందా అన్నది అప్రస్తుతం. కాని పాపం అన్నది, దానికి పాల్పడిన వ్యక్తి షరీఅత్ దృష్టిలో పాపం చేసిన వాడుగా పరిగణించబడినప్పుడే ఆ చేష్ట పాపంగా పరిగణించబడుతుంది. ఉదాహరణకు, ఒక పసివాడు సారాయి త్రాగుతున్నాడ నుకోండి, అతను ఖచ్చితంగా పాపానికి, నేరానికి ఒడిగట్టడం లేదు. ఎందుకంటే దానికి అతన్ని పాపిగా పరిగణించడం జరుగదు. అయినా అతను చేస్తున్నది మున్కర్ చేష్ట. అతన్ని వారించడం జరుగుతుంది, ఇది తప్పనిసరి. మరో విషయం కూడా గుర్తుంచుకోవాలి. ఒక మతి భ్రమించిన పురుషుడు, మతి భ్రమించిన స్త్రీతో లేదా ఏదయినా జంతువుతో రతిలో పాల్గొన్నట్లయితే దాన్నీ ఆపడం జరుగుతుంది. కారణం ఆ చేష్ట అయిష్టకరమయిందీ, విచ్చలవిడిగా జరుగుతుంది అన్నది కాదు, స్వయంగా ఆ చేష్ట సంభవించడం అయిష్టకర మయింది, అది ఏకాంతంలో జరిగినా దాన్ని మాన్పించడం తప్పనిసరి. అలాగే మున్కర్ చిన్నదయినా పెద్దదయినా తేడాను పాటించడం జరగదు. ప్రతి మున్కర్‌ని వారించడం జరుగుతుంది. వ్యభిచారం పెద్ద మున్కర్, దానికి సదృశంగా పర స్త్రీతో ఏకాంతంలో మాటలాడటం, ఆమెను చూడటం చిన్న మున్కర్. కాని రెంటినీ వారించడం జరుగుతుంది. ఇది తప్పనిసరి." (ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 853)*

الآمر بالمعروف تابع للمامور به، فان كان واجبًا فالأمر به واجب، وان كان ندبًا فندب

**అమ్ర్ బిల్ మారూఫ్ (విధి అవడం, కాకపోవడం అన్న విషయం) ఏ విషయాన్ని గురించి ఆదేశించబడుతుందో దానికి నిబద్ధ మయి ఉంటుంది. అంటే ఏ మారూఫ్‌ని గురించి ఆదేశించడం జరుగుతున్నదో 'విధి' అయిన విషయమయితే దాన్ని ఆదేశిం చడం కూడా 'విధి' అవుతుంది. కాని ఒకవేళ అది అభిలషణీయమయినదయితే దాన్ని ఆదేశిం చడం కూడా అభిలషణీయమవుతుంది.**

*(మబారికుల్ ఆజ్‌హార్ షర్హ్ మషారికుల్ అన్వార్: 1/ 50)*

## నహీ అనిల్ మున్కర్- విధి, వాంఛనీయం

నహీ అనిల్ మున్కర్ విషయంలో అల్లామా అబుస్సఊద్ ఇలా వ్రాశారు:

اما النّهى عن المنكر فواجب كلهٔ فان جميع ما انكره الشرع حرام

**పోతే, నహీ అనిల్ మున్కర్ విషయంలో (ఆదేశమేమిటంటే) ప్రతి మున్కర్‌ని వారిం చడం విధియే. ఎందుకంటే షరీఅత్‌కు అపరి చితమయిన విషయాలన్నీ నిషిద్ధమయినవే.**

*(ఇర్షాదుల్ అక్లుస్సలీమ్ ఇలా మజాయా అల్ కితాబుల్ కరీమ్ : 2/ 489)*

అల్లామా గారి ఈ అభిప్రాయం సరయినది కాదు. వాస్తవం ఏమిటంటే అమ్ర్ బిల్ మారూఫ్ అయినా నహీ అనిల్ మున్కర్ అయినా ఆదేశం ఒక్కటే. ఏ విధంగా నయితే మారూఫ్‌కు భిన్నమయిన స్థానాలున్నాయో ఆ స్థానాల రీత్యానే మారూఫ్‌ని ఆదేశించడం విధిగానో లేదా అభిలషణీయంగానో పరిగణించబడుతుందో అదేవిధంగా మున్కర్‌కు సంబంధించిన స్థానాలూ భిన్నమయినవి. ఆ స్థానాల రీత్యానే నహీ అనిల్ మున్కర్ కూడా విధిగానో లేదా విధి కాదనో నిర్ణయించడం జరుగుతుంది.

ఇదే విషయాన్ని ముల్లా అలీ కారీ ఇలా తెలిపారు :

اذا كان المنكر حرامًا فانه حينئذ وجب الزجر عنه اذ لو كان مكروهًا لم يجب بل يندب، و كذا الأمر بالمعروف تبع لما يؤمر بــه فان وجب فواجب، وان ندب فمندوب

**మున్కర్ నిషిద్ధమయినదయితే దానికి మందలించడం, చీవాట్లు పెట్టడం విధి అయింది. కాని అది మక్రూహ్ (ఏహ్యమయి నది) అయినట్లయితే మందలింపు, చీవాట్లు విధి కావు అభిలషణీయ మవుతాయి. అదే విధంగా అమ్ర్ బిల్ మారూఫ్ అన్నది ఏ విషయాన్ని గురించి ఆదేశించడం జరుగుతు న్నదో దానికి బద్ధమయి ఉంటుంది. అది విధి అయినదయితే అమ్ర్ బిల్ మారూఫ్ విధి అవుతుంది. అది అభిలషణీయమయిన దయితే అమ్ర్ బిల్ మారూఫ్ కూడా అభిలష ణీయమవుతుంది.**

*(అల్ ముబీన్ అల్ ముయీన్ లిఫహ్మ్ అల్ అర్బయీన్ : పు. 189)*

## అనుశోధన తగదు

షరీఅత్‌లో అనుశోధనను నిషేధించడం జరిగింది. అందువల్ల ఒకరి చెడుగుల అన్వేషణలో పడి అనుశోధన చెయ్యడం సరయినది కాదు. ఖుర్‌ఆన్‌లో وَ لَاتَجَسَّسُوْا **వలా తజస్సనూ** (ఒండొకరి రహస్యాల ఛేదనలో పడకండి) (అల్ హుజురాత్ : 12) అని ఉంది.

ప్రవక్తశ్రీ(స) ఇలా బోధించారు :

ان الأمير اذا ابتغى الريبة فى الناس افسدهم

**పాలకుడు జనుల్లో ఆశంకలు పెట్టి వెదక నారంభిస్తే వారిని చెరిపివేస్తాడు.**

*(అబూదావూద్, కితాబుల్ అదబ్, బాబు ఫీ తజస్సుస్)*

మరో ఉల్లేఖనంలో ఇలా ఉంది :

**మీరు లోపాల వెదుకులాటలో జనుల్ని వెంటాడినట్లయితే వారిని చెరిపివేస్తారు.**

**انک ان اتبعتَ عورات الناس افسد تهم**

*(అబూదావూద్, కితాబుల్ అదబ్, బాబు ఫీ తజస్సుస్; రవాహు బైహకీ ఫీ షుఅబిల్ ఈమాన్, మిష్కాతుల్ మసాబీహ్, కితాబుల్ ఇమారహ్ వల్ కజాఅ)*

మున్కర్‌ను పట్టుకునేందుకు ఎవరికయినా అధికారం ప్రాప్తమయ్యేది ఒక వ్యక్తి విచ్చలవిడిగా చెడుగుకు పాల్పడుతూ ఉంటేనే. మహనీయ అబ్దుల్లా బిన్ మస్‌ఊద్ ప్రకారం, ఒక వ్యక్తి గడ్డం నుండి సారాయి కారుతోందని అన్నప్పుడు ఆయన,

**"మనల్ని అనుశోధన పట్ల నిషేధించడం జరిగింది. ఎవరయినా మన సమక్షంలోకి వస్తే మనం అతన్ని పట్టుకుందాము" అనన్నారు.**

**انا قد نهينا عن التجسس ولكن ان يظهر لنا شئ نأخذ به**

*(అబూదావూద్, కితాబుల్ అదబ్, బాబు ఫీ తజస్సుస్)*

షరీఅత్ ఆదేశం ప్రకారం ఎవరిచేతనయినా పాపం జరిగినట్లయితే అతను తన పాపం గురించి ప్రకటన చేసుకుంటూ తిరగరాదు. దాన్ని అతను మరుగుపరచాలి. వాతావరణమంతా దాని చర్చలు జరగకుండా చూడాలి, చెడుగు దాని పరిధుల్లో పరిమితమయి వ్యాపించకుండా ఉండాలి. కాగా ప్రవక్తశ్రీ(స) ఇలా సెలవిచ్చారు :

**ఏ వ్యక్తి అయినా ఈ రోతల్లో దేనికయినా లోనట్లయితే దైవం దానిపైన వేసిన ముసుగును తొలగించరాదు, ఎందుకంటే ఎవరయినా మా ముందు తన అపరాధాన్ని బహిర్గతపరచినట్ల యితే మేము దైవశాసనం అతనిపైన అమలు పరచి తీరుతాము.**

**من اصاب من هٰذه القاذورات شيئًا فليستتر بستر اللّٰه فانه من يبدلنا صفحته نقم عليه كتاب اللّٰه**

*(మువత్తా ఇమామ్ మాలిక్, కితాబుల్ హుదూద్)*

దీని భావమేమిటంటే, తన అపరాధాన్ని దాచిన వ్యక్తి షరీఅత్ బోధనానుసారం ఆచరిస్తున్నాడని అర్థం. మరే వ్యక్తి దాన్ని వ్యక్తపరచడానికీ, దైవం కప్పివేసిన దాన్ని తెరచివెయ్యడానికి యత్నిస్తున్నాడో అతను మరో చెడుగుకు పాల్పడుతున్నాడని భావం.

అందువల్లనే ధర్మవేత్తలు వ్రాసినదాన్ని బట్టి, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** నిర్వహణ ఉద్దేశ్యంతో జనుల ప్రైవేట్ మీటింగుల్లో ఏమి జరుగుతున్నదో తెలుసుకునే ప్రయత్నం చెయ్యడం సరయిన విషయం కాదు. అదేవిధంగా ఒకరు పాపపు కార్యాలు చేస్తున్నారేమోనని అన్వేషణ ఉద్దేశ్యంతో వారి ఇండ్లల్లోకి అకస్మాత్తుగా జొరబడటం, బయటి నుంచి తొంగిచూడటం లేదా వారి ఇరుగుపొరుగు వారితో మాటలాడటం కూపీ తీయడం కూడా తప్పుడు పద్ధతులే. ఎందుకంటే ఒకవేళ ఓ వ్యక్తి నిజంగానే తన ఇంట ఏదయినా దుష్కార్యానికి పాల్పడుతున్నా అతను అల్లాహ్ వద్ద దానికి జవాబు చెప్పుకోవలసి ఉంటుంది. అతని పాపపు కార్యం అతని ఇంటి నాలుగు గోడల మధ్యన ఉన్నంతకాలం ఎవరికీ దానిపట్ల అభ్యంతరం తెలిపే హక్కు లేదు. ఈ సందర్భంగా హజ్రత్ ఉమర్(ర)కు సంబంధించిన ఓ సంఘటన పేర్కొంటారు. ఆయన ఒకసారి ఒక ఇంట తొంగి చూడగా ఆ ఇంటి యజమాని ఏదో మున్కర్‌కు ఒడిగడుతూ కనిపించాడు. హజ్రత్ ఉమర్(ర) దానిని విమర్శించారు. అతను దానికి సమాధానంగా ఇలా అన్నాడు, 'అమీరుల్ మూ'మినీన్, నేనయితే దేవుని ఓ ఆజ్ఞను ఉల్లంఘించాను. మరి మీరేమో మూడు దైవాజ్ఞల్ని ఉల్లంఘించారు.' మహనీయ ఉమర్(ర) అదెలా? అని అడగ్గా అతను, "అల్లాహ్ ఆదేశమేమో అనుశోధన చేయరాదన్నది, మీరేమో అనుశోధన చేశారు. అల్లాహ్ ఆదేశమేమో ఇండ్లల్లోకి వాటి గడపల ద్వారా వెళ్ళమన్నది, తమరేమో కప్పుపైనుంచి తొంగి చూశారు. అలాగే ఆయన ఆదేశం ప్రకారం, ఇంటి యజమాని అనుమతి లేనిదే ఇంటిలోకి ప్రవేశించరాదు అన్నది, సలామ్ చేసి మరీ ప్రవేశించాలన్నదీను. మీరు అనుమతి లేకుండానే ప్రవేశించారు, పైగా సలామ్ కూడా చెయ్యలేదు". ఇది విని హజ్రత్ ఉమర్ అతన్ని వదిలి పెట్టారు. అయితే (చేసిన ఆ తప్పుకు గాను) తౌబా చేసుకోమని ఆదేశించారు.

*(ఉహ్యాఉ ఉలూముద్దీన్ :2/ 352, 353)*

ఒకవేళ మున్కర్ చిహ్నాలు చాలా స్పష్టమయినప్పటికీ, ఉదాహరణకు, ఒక ఇంటి నుంచి ఆటపాటలు, సంగీత వాయిద్యాల శబ్దం వస్తున్నప్పుడు లేదా సారాయి త్రాగినవారి గలభా వినవచ్చినప్పుడు కూడా అల్లామా అబుల్ హసన్ మావర్దీ ప్రకారం, ఇంట్లోకి ప్రవేశించరాదు, బయటినుంచే చీవాట్లు పెట్టాలి; ఎందుకంటే ఒక చెడుగు పూర్తిగా స్పష్టమయిపోయింది. కాని లోపలికి ప్రవేశించడం మూలాన దాగివున్న ఇతర చెడుగు కూడా బయల్పడే ఆస్కారముంది. నహీ అనిల్ మున్కర్ కొరకు గోప్యంగా

ఉన్న చెడుగుల్ని బయటపెట్టడం, ప్రకటించడం సరయినది కాదు.

*(అహ్కాము స్సుల్తానియ్య : పు. 243)*

ఇమామ్ గజాలీ దీనితో విభేదించారు. ఆయన దృష్టిలో పైనుదాహరించిన కేసులో ఇంట్లోకి ప్రవేశించడం, సంగీత వాయిద్యాలను ఆటపాటల సామగ్రిని విరగ్గొట్టడం, సారాయి పారబోయటం అంతా అనుమతించదగినదే. ఇదే సందర్భంలో సారాయి దాచిపెట్టుకున్నారేమోనని, సంగీత వాయిద్యాలు దాచుకున్నారేమోనని వారి దుస్తులు సోదా చెయ్యడం, ఆయన ప్రకారం సరయినది కాదు. ఆ వ్యక్తి పాపాతురుడే అయినప్పటికీ ఇది తగదు. కాని ఒకవేళ ఒక వ్యక్తి బజారులో విచ్చలవిడిగా వాయిద్యాలో సారాయో తీసుకు వెడుతూఉంటే, అది సన్నని బట్టలోనుంచి కనిపిస్తూ ఉన్నట్లయితే నహీ అనిల్ మున్కర్ విధిని నిర్వర్తించవలసి ఉంటుందని ఆయన అంటారు. *(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 353)*

ఈ వ్యవహారంలో ఇమామ్ గజాలీ అభిప్రాయమే ఇతోధికంగా సరయినట్లు తోస్తోంది. ఒకరి వైయుక్తిక జీవితంలో జోక్యం చేసుకోవడం సముచితం కాదన్న మాటలో సందేహం లేదు. కాని ఒక చేష్ట దాని అతి స్పష్టమయిన చిహ్నాల వల్ల అది ఒకరి వైయక్తికం కాకపోయినప్పుడు, ప్రజలకు తెలిసిపోయి ప్రకటితమయిపోయినప్పుడు దాని పట్ల చర్య తీసుకోవడం తప్పనిసరి అవుతుంది. అలా చెయ్యకపోతే మున్కర్‌ను రూపుమాపే విధి పూర్తిగా నెరవేరదు. ఆ విధంగా **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** వ్యవస్థ అంటూ ఉన్నప్పటికీ అనేక కీడులు ప్రవర్థమానమవుతూ ఉంటాయి.

ఒకవేళ ఓ మున్కర్ పట్ల వెంటనే చర్య తీసుకోకపోయినట్లయితే తరువాత దాని లోటును పూరించడం, సవరించడం సాధ్యం కానటువంటిది అయినట్లయితే అటువంటి సందర్భాలలో అల్లామా మావర్దీ అనుశోధనకు, అన్వేషణకు, విచారణకు వెంటనే చర్య తీసుకోవచ్చని అనుమతినిస్తారు. ఉదాహరణకు, విశ్వసనీయుడయిన ఒక వ్యక్తి ఫలానా వ్యక్తి వ్యభిచరించబోతున్నాడని లేదా ఫలానా వ్యక్తి ఫలానా వ్యక్తిని చంపబోతున్నాడని, ఆ ఉద్దేశ్యంతో జనవాసానికి వెలుపలకు తీసుకువెడుతున్నట్లు సమాచారం అందజేసినట్లయితే ఇటువంటి పరిస్థితిలో ఏమరుపాటు వహించడం సబబు కాదు. ఎందుకంటే ఇందులో వ్యభిచారం, మానభంగం, అత్యాచారం, హత్య లాంటి నేరాలు జరిగే ప్రమాదముంది. *(అల్ అహ్కాముస్సుల్తానియ్య : పు.243)*

దీనివల్ల తెలిసేదేమిటంటే అనుశోధన తగదు అన్నది **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విషయంలో ఓ ముఖ్యమయిన షరతే కాని కొన్ని అనివార్య పరిస్థితుల్లో అనుశోధనకూ అనుమతి ఉంది. ఇమామ్ గజాలీ ఇలా అంటున్నారు :

**و قـد امـرنا بـأن نستر مـا ستر الله و ننكر علىٰ مـن أبـدى لنـا صفحته**

**మనకు ఆదేశించిన దాని ప్రకారం, అల్లాహ్ దేనినయితే గోప్యంగా పెట్టాడో దాన్ని గోప్యం గానే ఉంచాలి. మరి ఏ వ్యక్తి మన ఎదుట తన అపరాధాన్ని బహిర్గత పరుస్తాడో దానికి అతన్ని తప్పుపట్టాలి, అతన్ని విమర్శించాలి.**

ఇదే సందర్భంలో ఇంకా ఇలా అంటారు :

**معنى التجسُّس طلب الأمارات المعرفة فالأمارة المعرفة ان حصلت وأورثت المعرفة جاز العمل بمقتضاها، فاما طلب الأمارة المعرفة فلا رخصة فيه أصلاً**[1]

**అనుశోధన అంటే తెలుసుకునే చిహ్నాల అన్వేషణ. ఈ చిహ్నాలు వాటంతట అవే బహిర్గతమయిపోయినట్లయితే వాటికనుగుణంగా చర్య గైకొనేందుకు అనుమతించబడింది, అయితే ఆ చిహ్నాలను అన్వేషించడం అన్నది ఖచ్చితంగా అనుమతించబడలేదు.**

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్: 2/ 353)*

ఇమామ్ గజాలీ వ్రాసిన ఈ మాటల్ని ఈ విషయంలో సూత్రప్రాయమయిన నియమంగా పేర్కొనవచ్చు.

## విభేదాలు లేని మున్కర్ పట్ల విమర్శన

ఏ మున్కర్ పట్లనయితే ధర్మవేత్తల మధ్య విభేదాలు లేవో, ఏకాభిప్రాయమున్నదో ఆ మున్కర్ విషయంలోనే విమర్శన చేయడం సరయినది. ఏ మున్కర్ విషయంలోనయితే 'ఇజ్తిహాద్' (అన్వయ కృషి) అవసరమో అటువంటి విషయాల్లో విమర్శన చెయ్యడం సరయినది కాదు. ఇమామ్ గజాలీ విమర్శనా నిబంధనల్లో ఒక నిబంధనను ఇలా తెలుపుతున్నారు.

ان یکون کونه منکرا معلوما بغیر اجتهاد، فکل ما هو محل الاجتهاد فلا حسبة[٢]

అది మున్కర్ అవడం పట్ల 'ఇజ్తిహాద్' (అన్వయ కృషి) లేకుండానే తెలిసి పోవాలి. కాగా, అన్వయ కృషి అవసరమయ్యే ప్రతి విషయంలో విమర్శన అన్నది జరగరాదు.

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 353)*

ఈ సందర్భంలో ఇమామ్ గారు ఏదయితే వ్రాశారో దాని సంక్షిప్త రూపం ఇది:

'ఒక హనఫీ ఫిక్హ్‌ను అనుసరించే వ్యక్తి మరో షాఫియీ ఫిక్హ్‌ను అనుసరించే వ్యక్తిని, అతను ఇమామ్ షాఫియీని అనుసరించినందుకు విమర్శించలేడు. అలాగే ఒక షాఫియీ ఫిక్హ్‌ను అనుసరించే వ్యక్తి మరో హనఫీ ఫిక్హ్‌ను అనుసరించే వ్యక్తిని అతను ఇమామ్ అబూ హనీఫాను అనుసరిస్తున్నందుకు విమర్శించలేడు. ఒక వ్యక్తి తన పంథాకు విరుద్ధంగా ఆచరిస్తూ ఉన్నట్లయితే అతన్ని, తన అంగీకృత ఫిక్హ్‌కు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నందుకు విమర్శించవచ్చు. ఇటువంటి విమర్శన చేసే హక్కు ప్రతి వ్యక్తికీ ఉంది. అతను స్వయంగా ఆ పంథాను అనుసరించే వాడయినా కాకపోయినా. కారణం ఏమిటంటే ఒక 'ముకల్లిద్' (ఏదో ఒక పంథాను అనుసరించే వ్యక్తి), అవసరం కలిగినప్పుడు, సమయానుకూలంగా, తన సౌలభ్యం కోసం, తన ఇమామ్ అనుకరణను వదలి ఇతర ఇమామ్‌ని అనుసరించడం సరయిన విధానం కాదు. అదేవిధంగా ఒక వ్యక్తి 'ముజ్తహిద్' (అన్వయ కృషి సలిపేవాడయినటువంటి వ్యక్తి), తన అన్వయ కృషికి వ్యతిరేకంగా ఆచరిస్తూ ఉన్నట్లయితే అతన్నీ విమర్శనకు గురిచేయవచ్చు. ఎందుకంటే 'ముజ్తహిద్' తన 'ఇజ్తిహాద్'పైన్నే ఆచరించవలసి ఉంటుంది. తన ఇజ్తిహాద్‌ను వదలి ఇతరుల ఇజ్తిహాద్‌ను ఆచరించడం సరయినది కాదు.'

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 353, 354)*

అయితే ప్రభుత్వం పక్షాన **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధి నిర్వహణకు నియుక్తుడయిన వ్యక్తిని గురించి ఓ ప్రశ్న ఉత్పన్నమవుతుంది. అతను భేదాభిప్రాయమున్న అంశాలలో ఇతరుల్ని తన అభిప్రాయం లేదా ఇజ్తిహాద్‌ని అమలుపరిచేలా ఒత్తిడి తేగలడా? లేదా? ఈ వ్యవహారంలో అతని స్థానం ఏది? అతను కూడా విమర్శన చేసే సర్వసాధారణ వ్యక్తుల్లాంటివాడేనా లేదా వారికి

భిన్నమయినవాడా? అల్లామా అబుల్ హసన్ మావర్దీ ప్రకారం షాఫియీ ధర్మవేత్తలు ఈ సందర్భంలో రెండువిధాల అభిప్రాయాలూ వ్యక్తం చేశారు. కొందరేమో, ఆ వ్యక్తి తన అభిప్రాయం ప్రకారం ఆచరించడానికి ఇతరుల్ని బలవంతపెట్టగలడు అని అంటారు. కాని మరికొందరేమో భిన్నాభిప్రాయమున్న విషయాల్లో ఇజ్తిహాద్ (అన్వయ కృషి) చేసే అధికారం ఎల్లరకూ ఉందని అంటారు. అందువల్ల విమర్శన చేసే వ్యక్తి తన అన్వయకృషినే అమలుపరచాలని ఇతరుల్ని బలవంతపెట్టలేడు.

(అల్ అహ్కాము స్సుల్తానియ్య : పు.230, 231)

మా అభిప్రాయంలో ఈ రెండవ అభిప్రాయమే సరయినది, సమంజస మయినదీను. ఇజ్తిహాద్ చెయ్యదగిన విషయాలలో ఒకటికి మించిన అభిప్రాయాలు కలిగి ఉండే అవకాశం షరీఅత్ స్వయంగానే ఇచ్చింది. వాటిలో ఏ అభిప్రాయాన్ని ఏ వ్యక్తి సరయినదిగా భావిస్తాడో దాన్ని తాను స్వయంగా అనుసరించగలుగుతాడు, కాని ఇతరుల్ని బలవంతపెట్టజాలడు. ఇటువంటి వ్యవహారాలలో ఏదో ఒక అభిప్రాయాన్ని ఇతరులపైన రుద్దడం అంటే భావం, షరీఅత్ ఆ విషయంలో పెట్టిన విస్తృతిని అంతమొందించడం అన్నమాట. దానివల్ల జనం అనవసరంగా ఇబ్బందుల పాలవుతారు. ముల్లా అలీ కారీ ఈ సందర్భంలో ఎంతో సమంజసమయిన మాట, షరీఅత్‌తో తాదాత్మ్యత చెందే మాట పలికారు. ఆయన ఇలా అన్నారు :

لاَ انكار فى المختلف فيه بناء على ان كل مجتهد مصيب او المصيب واحد الاّ ان المخطى غير متعين لنــا مع ان الاِثم موضوع عنه و عمن تبعه.

**భిన్నాభిప్రాయాలున్న విషయాల్లో విమర్శన అంటూ జరగదు. కారణం ఏమిటంటే ఇజ్తిహాద్ చేసే ప్రతి వ్యక్తి (అన్వయ కృషి సలిపే ప్రతి ధర్మవేత్త) రుజుమార్గానే ఉన్నాడు. లేదా దీన్ని మరో విధంగానూ చెప్పవచ్చు. వీరిలో రుజుమార్గాన ఉన్నవారయితే ఒకరే కాని తప్పు చేస్తున్న వారెవరో మనకు నిర్దిష్టమయి లేరు, దీనితోపాటు మరో విషయమూ ఉంది, ఆ తప్పు చేసే వానికీ పాపం మూడదు, అతన్ని అనుసరించేవారికీ మూడదు!**

ఈ సందర్భంలో ఆయన ఇంకా ఇలా వ్రాస్తారు :

ليس له على الأصح ان يحمل الناس على مذهبه، سواء كان مجتهـدًا او مقلـدًا، فلم يزل الخلاف بين الصحابـة و التابعين

ఇంకా నిజం చెప్పాలంటే విమర్శన చేసే వ్యక్తికి జనుల్ని తన పంథాని అనుసరింపజేసేందుకు ఒత్తిడి తెచ్చే హక్కు లేదు. అతను అన్వయకృషి సలిపేవాడయినా కేవలం అనుసరించే ముకల్లిద్ అయినాసరే. (వారిని తమ తమ పంథాను అనుసరించేందుకు స్వేచ్ఛనివ్వాలి, ఎందుకంటే) ప్రవక్త సహచరుల్లోనూ (సహాబాలోనూ) (ర) తాబయీన్ (వారి అనుచరు) ల్లోనూ భేదాభిప్రాయాలుండేవి.

*(అల్ ముబీనుల్ ముయీన్, లిఫహ్మిల్ అర్బయీన్ : పు. 190)*

## బిద్అత్ పట్ల విమర్శన తప్పనిసరి

'ఇజ్తిహాద్' సంబంధం సవివరమయిన షరీఅత్ ఆదేశాలతో ఉంటుంది. ధార్మిక మూల సిద్ధాంతాల్లోనూ, షరీఅత్ ప్రాతిపదిక మూలాల్లోనూ ఇజ్తిహాద్‌కు ఎలాంటి చోటూ, అవకాశం లేదు. ఎవరయినా ధర్మంలోని ప్రాథమిక విశ్వాసాలనే ప్రశ్నిస్తే దాన్ని 'ఇజ్తిహాద్' (అన్వయ కృషి) వ్యవహారంగా పరిగణించి చూపోపు వహించడం జరగదు. దాన్ని తప్పనిసరిగా విమర్శనతో పరిశీలించవలసి ఉంటుంది. ఇటువంటి ప్రాథమిక, సూత్రప్రాయమయిన భేదాభిప్రాయాన్ని ఇమామ్ గజాలీ బిద్అత్‌గా అన్వయిస్తారు, వాటినన్నింటిని గురించి ఇలా అభిప్రాయపడ్డారు :

البدع كلها ينبغى ان تحسم ابوابها و تنكر على المبتد عين بدعهم و ان اعتقدوا انها الحق

సకల బిద్అత్‌ల ద్వారాలను మూయడం, అలా బిద్అతీలను, వారు కల్పించే బిద్అత్‌లను, వారి బిద్అత్ పట్ల విమర్శించి చీవాట్లు పెట్టడం అవసరం; వారు దాన్ని సత్యమయినదన్న నమ్మకం కలిగి ఉన్నాసరే.

*(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 355)*

## షరీఅత్‌కు విరుద్ధమయిన పుస్తకాల విమర్శన

ఇమామ్ ఇబ్ను కయ్యిమ్ ఇలా అన్నారు, కుర్‌ఆన్, సున్నత్‌కు విరుద్ధమయిన పుస్తకం ఏదయినా వ్రాయడం దాన్ని ముస్లిముల మధ్య వ్యాపింపజేయడం అధర్మం. ఇలాంటి పుస్తకాల రచనల్ని రూపుమాపడం, వాటిని వృధా చేయడం షరీఅత్ రీత్యా అనుమతించబడిందని ఆయన నుడివారు :

**الكتب المتضمنة لمخالفة السنة غير مأذون فيها بل مأذون فى محقها و اتلافها وما علىٰ الأمة اضر منها**

**షరీఅత్‌కు విరుద్ధమయిన భావాలు నిండిన పుస్తకాలకు ఎటువంటి అవకాశం లేదు. వాటిని రూపుమాపడానికి, వాటిని సమసింప జేయడం అనుమతించబడింది. సముదాయానికి వాటికన్నా హానికరమయినది మరొకటి ఏదీలేదు.**

*(అత్ తుర్కుల్ హిక్‌మియ్యతు ఫిస్సియాసష్షరీఅత్: పు. 254)*

ఇంకా ముందుకు వెళ్ళి ఆయన ఇలా అంటున్నారు :

**الكتب المشملة على الكذب و البدعة يجب إتلافها و إعدامها، وهى أولىٰ بذٰلك من إتلاف الآت اللهود والمعازف و إتلاف انية الخمر، فإن ضررها أعظم من هٰذه**

**అబద్ధాన్నీ, బిద్అత్‌నీ కలిగి ఉన్న పుస్తకాలను వృధా పరచడం, వినాశపరచడం అత్యవసరం. ఆటపాటల వస్తువుల్నీ, సంగీత వాయిద్యాల్నీ మధుపాత్రల్నీ విరగ్గొట్టడం, పగులగొట్టడం కన్నా వీటిని వృధా చెయ్యడం ఇతోధికంగా అవసరమయింది. కారణమేమి టంటే వీటివల్ల కలిగే హాని ఈ వస్తువులన్నింటి వల్ల కలిగే హాని కన్నా ఎంతో అధికం!**

*(అత్ తుర్కుల్ హిక్‌మియ్యఫిస్సియాసష్షరీఅత్ పు. 254)*

ఇంకా ఆయన, ఈ పుస్తకాలను వృధా చెయ్యడం వల్ల నష్టపరిహారం కూడా చెల్లించవలసిన అవసరం లేదు అని అంటారు :

**لاَ ضمان فى تحريق الكتب المضلّة و إتلا فها**

**దారి తప్పించే పుస్తకాలను కాల్చడం, వృధా పరచడం వల్ల ఎటువంటి నష్టపరిహారం ఇవ్వడం జరగదు.**

*(అత్ తుర్కుల్ హిక్‌మియ్యఫిస్సియాసష్షరీఅత్ పు. 254)*

నేడు భావ ప్రకటనా స్వేచ్ఛకు సంబంధించిన భావన ప్రచారంలో ఉంది. దాని రీత్యా పుస్తకాల విషయంలో ఈ వైఖరి చాలా తీవ్రమయిన పక్షపాత ధోరణిలా అనిపిస్తుంది. కాని ముస్లిమ్ సముదాయ ప్రయోజనాల దృష్ట్యా పరిశీలించినట్లయితే దాన్ని తప్పుగా పరిగణించలేము. ముస్లిమ్ సముదాయం ఒక సమైక్య భావ వర్గం పేరు. ఇస్లామ్ ఈ వర్గం చేత, ఈ సముదాయం ద్వారా ఓ ఆశయాన్ని సాధించాలని ఆశిస్తోంది. ఆ ఆశయ సాధన ఈ భావ సమైక్యత లేనిదే సాధ్యం కాదు. అందువల్ల సముదాయం దాని భావ సమైక్యతను కోల్పోరాదని అది కోరుకుంటుంది. అది ఎటు వంటి భావపరమయిన ధర్మభ్రష్టతకు లోనవరాదనీ, ఆలోచనాత్మక అరాచకత్వానికి గురవరాదనీ అది ఆశిస్తుంది. సముదాయానికి దాని జీవన తత్వం పట్ల పటిష్టమయిన విశ్వాసం లేనంతవరకు, దాని చింతనా ప్రాతిపదికలు సుస్థిరమయినవి కానంతవరకు, కళల్లో, విద్యల్లో, విజ్ఞానంలో అది ప్రతీప శక్తుల్ని ఎదిరించజాలదు. అంతేకాదు, చరిత్ర చెప్పే సాక్ష్యం ఏమిటంటే, సముదాయంలో మౌలిక చింతన, ప్రాథమిక ఆలోచన ఎప్పుడెప్పుడు డోలాయమానమయినా అప్పుడల్లా ఇస్లామేతర తత్వాలు, ముస్లిమ్ సముదాయాన్ని వాటిలో ఇముడ్చుకోవడం మొదలెట్టాయి. అల్లాహ్ వైపునకు, దైవ సందేశహరుని వైపునకు పిలుపునిచ్చే సందేశ ప్రదాతలు ప్రభవించవలసిన సముదాయంలో దైవ తిరస్కారం, నాస్తికత్వం ధ్వజవాహకులు ఆవిర్భవించసాగారు.

కుర్ఆన్, ప్రవక్త సంప్రదాయాన్ని (సున్నత్ని) ఎదిరించే పుస్తకాలను గురించి కఠిన వైఖరినవలంబించడం అంటే అర్థం, సముదాయంలో ఎప్పుడయినా భావనాత్మక మయిన భేదాభిప్రాయాలు ఉత్పన్నమయినా వాటి బోధన, అవగాహనను కాదని నిర్దయగా నొక్కివేయడమని అర్థం కాదు. దాని భావం కేవలం ఏమిటంటే, సముదాయం వీలయినంతవరకు, కేవలం దాని ధర్మం, విశ్వాసాలపైన, నిలకడగా, స్థిరచిత్తంతో నిలబడగలిగేలా చూడటం మాత్రమే. తద్వారా అందులోని దాని సిద్ధాంతాల పట్ల, మౌలిక సూత్రాల పట్ల తిరుగుబాటు ధోరణి పొడసూపకుండా ఉండాలన్నది ఉద్దేశ్యం. ఈ ప్రయత్నంలో, ఆలోచనల్ని ఆలోచనలతో ఎదిరించాలన్న విషయం, శాస్త్రీయ, చింతనాత్మక చర్చలకు ఆ ధోరణులలోనే సమాధానాలివ్వాలన్న భావం వాటంతట అవే చేరి ఉన్నాయి.

కుర్ఆన్, సున్నత్లకు వ్యతిరేకమయిన పుస్తకాలను గురించి ఇమామ్ ఇబ్ను కయ్యిమ్ దృక్కోణం కూడా దీనికి ముందే ప్రస్తావనలో వచ్చింది. ఆయన కూడా

వాటి సశాస్త్రీయ ఖండనను కేవలం అనుమతించబడిందని మాత్రమే కాదు, అవసరం మేరకు అభిలషణీయమని కూడా, ఇంకా విధి అయినదని కూడా పరిగణిస్తారు.

اما كتب ابطال الأراء والمذاهب المخالفة لهما فلا بأس بها و قد تكون واجبة و مستحبة و مباحة بحسب اقتضاء حال

**దైవగ్రంథం, ప్రవక్త సంప్రదాయం, భిన్న మత పంథాలకు, మత భావనలకు విరుద్ధంగా రచింపబడిన పుస్తకాల ఖండనగా పుస్తకాలు వ్రాయడంలో తప్పులేదు. అలా వ్రాయడం ఒక్కోసారి విధి అవుతుంది, మరోసారి అభిలషణీయమవుతుంది, ఇంకొకసారి అనుమతించబడినదవుతుంది. ఇది ఆయా పరిస్థితులను బట్టి ఆవశ్యకతలను బట్టి ఉంటుంది.**

*(అల్ తుర్కుల్ హిక్మియ్యతఫి స్సియాసియ అష్షరీయ : పు. 256)*

## బంధుగణం- విమర్శన

బంధువులకు మారూఫ్‌ని ఆదేశించడం, మున్కర్‌ని వారించడం అవసరమయినదీ ముఖ్యమయినదీను. అయితే దానికీ కొన్ని పరిమితులు, కొన్ని మర్యాదలున్నాయి. ఈ పరిమితుల్ని పాటించకుండా ఈ విధిని సరిగ్గా నిర్వర్తించడం కుదరదు. ఇక్కడ కేవలం తల్లిదండ్రులు, సంతానం, భార్యాభర్తల మధ్య **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**ని పాటించే పరిమితులు, మర్యాదల్ని వివరిస్తున్నాము, ఎందుకంటే ఈ బంధుత్వాలలో ఉన్న సున్నితత్వం ఇతర బంధుత్వాలలో కానరాదు.

## ప్రౌఢత్వానికి రాని సంతానం

సంతానం రెండు విధాలు, ఒకటి ప్రౌఢ సంతానం, రెండు, ప్రౌఢత్వానికి చేరని సంతానం. షరీఅత్ ఈ ఉభయుల్లో వ్యత్యాసాన్ని పాటించింది. వారి పైన తల్లిదండ్రులు **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**ని నిర్వహించడం అన్నదానిలోనూ రెండు విధానాలున్నాయి. అవి ఒకదానికొకటి కొంత భిన్నమయినవి.

ప్రౌఢత్వానికి చేరని సంతానానికి మారూఫ్‌ని ఆదేశించడం, మున్కర్ పట్ల వారించడం అంటే భావం వారికి సరయిన సుశిక్షణ, బోధన గరపడం అన్నమాట. వారు ప్రౌఢులయిన తరువాత, ఇస్లామ్ బోధనలకనుగుణంగా తమ జీవితాన్ని గడిపేలా

వారిని తీర్చిదిద్దడం అన్న మాట. హదీసుల్లో పిల్లల బోధన శిక్షణల పట్ల ఎంతో ఘనంగా చెప్పడం జరిగింది. ప్రవక్తశ్రీ (స) ఇలా సెలవిచ్చారు :

**لأن يؤدب الرجل ولده خير من ان يتصدق بصاع**

**మనిషి తన సంతానానికి ఒక ఇస్లామీయ మర్యాదను నేర్పడం, ఒక శేరు ధాన్యం సదకా (దానం) చెయ్యడం కన్నా ఎంతో మేలయినది.**

*(తిర్మిజీ, అబ్వాబుల్ బిర్ర్ వస్సిలా, బాబు మాజాఅ ఫీ అదబిల్ వలద్)*

మరో హదీసులో ఇలా ఉంది :

**ما نحل والد ولدا من نحل أفضل من أدب حسن**

**ఏ తండ్రి అయినా తన సంతానానికి ఉత్తమ ఇస్లామీయ మర్యాదకన్నా ఉత్కృష్టమయిన కానుక మరొకటి ప్రదానం చెయ్యలేదు.**

***(తిర్మిజీ, అబ్వాబుల్ బిర్ర్ వస్సిలా, బాబు మాజాఅ ఫీ అదబిల్ వలద్)***

పిల్లల బోధన, సుశిక్షణ కేవలం పుణ్యప్రదమయిన ఆచరణే కాదు, ఇది తల్లిదండ్రులకు షరీఅత్ విధించిన బాధ్యత కూడా. ఈ బాధ్యతను నిర్వర్తించడానికే షరీఅత్ వారికి తమ సంతానాన్ని అవసరమయినప్పుడు శిక్షించే అధికారమూ ఇచ్చింది. ఒక హదీసులో ఇలా ఉంది :

**مروا اولادكم بالصلوة و هم ابناء سبع سنين و اضربوهم عليها و هم ابناء عشر**

**మీ సంతానానికి నమాజ్‌ని ఆదేశించండి, వారు ఏడేళ్ళ ప్రాయానికి వచ్చినప్పుడు. వారు పదేళ్ళ వయసుకు వస్తే నమాజ్ పట్ల అశ్రద్ధ చూపించినట్లయితే వారిని కొట్టండి.**

*(అబూదావూద్, కితాబుస్సలాత్, బాబు మతా యూమర్ అల్ గులాము బిస్సలాత్)*

హదీసులో కేవలం నమాజ్ విషయంలో కాఠిన్యం వహించే ప్రస్తావన ఉంది. కాని రోజా (ఉపవాస వ్రతం) విషయంలోనూ ఇదే ఆదేశం వర్తిస్తుంది.★ తల్లిదండ్రులకు తమ సంతానం విద్యాబోధనలు, సుశిక్షణలు విధి అయినవి. అందువల్ల ధర్మవేత్తలు

★ *రద్దుల్ ముహ్తార్ అలాద్దుర్రుల్ ముఖ్తార్ : 3/ 261*

వ్రాసిన దాని ప్రకారం తల్లిదండ్రులు, తమ సంతానం కుర్ఆన్ పఠనం పట్ల, ధర్మజ్ఞాన సంపాదన పట్ల, ఇస్లామీయ మర్యాదలు నేర్చుకోవడం పట్ల బలవంతం చెయ్యగలరు.★

సంతానానికి సంరక్షకుడు తండ్రి. అందువల్ల వాళ్ళ బోధన, సుశిక్షణల బాధ్యత మూలతః అతనిపైనే పడుతుంది. అయితే తల్లికి కూడా ఈ విషయంలో ఓ విధమయిన సంరక్షణా భారం ఉంటుంది. హజ్రత్ మర్యమ్ తల్లి ఇలా దుఆ (ప్రార్థన) చేసింది:

**رَبِّ اِنِّی نَذَرْتُ لَکَ مَا فِی بَطْنِی مُحَـرَّرًا فَتَقَبَّلْ مِنِّی اِنَّکَ اَنْتَ السَّمِیْعُ الْعَلِیْمُ○**

**'నా ప్రభూ, నా గర్భంలో ఉన్న ఈ శిశువును నీకు సమర్పించుకుంటున్నాను, అది నీ సేవ కోసమే అంకితం. నా ఈ అర్పణను స్వీకరించు, నీవు అంతా వినేవాడవు. అన్నీ ఎరిగిన వాడవు'** *(ఆలి ఇమ్రాన్: 35)*

అల్లామా అబూబక్ర్ జస్సాస్ ఈ ఉదంతాన్ని ప్రస్తావించి ఇలా అన్నారు :

**یدلّ علی ان للامّ ضربًا من الولاَیة علی الولد فی تأدیبه و تعلیمهٗ و إمساکه و تربیته، لولاَ انها تملک ذٰلک لما نذرته فی ولدها**

**దీన్నిబట్టి తెలిసేదేమిటంటే, సంతానం బోధన, శిక్షణ, సంస్కరణ, దాన్ని అంకితం చెయ్యడం వరకు వ్యవహారాలన్నింటిలో తల్లికి కూడా ఒకింత సంరక్షణా బాధ్యత ఉంది. ఆ హక్కు ఆమెకు లేకపోతే తన సంతానం పట్ల అలా మొక్కుకునేవారు కారు.** *(అహ్కాముల్ కుర్ఆన్ : 2/ 14)*

అందువల్ల ఏ విధంగానయితే తండ్రి పిల్లవానికి విద్యాబుద్ధులు చెప్పే శిక్షించే అధికారం కలిగి ఉన్నాడో అదేవిధంగా తల్లికి కూడా ఈ హక్కులున్నాయి.

*(రద్దుల్ ముహ్తార్ అలాదుర్రుల్ ముఖ్తార్ : 3/ 261)*

## ప్రౌఢ సంతానం- విమర్శన

పిన్న వయస్కులు, ప్రౌఢ వయసుకు చేరని వారయిన సంతానాన్ని బోధించే, శిక్షణ గరిపే, శిక్షించే హక్కు తల్లిదండ్రులకు ఉంది. కాని సంతానం ప్రౌఢ వయసుకు చేరుకున్నప్పుడు తల్లిదండ్రులకు ఈ హక్కు మిగులదు. ఎందుకంటే ప్రౌఢులయిన

★ అల్‌బహ్రుర్రాయిక్ షర్హ్ కన్జుద్దకాయిక్ : 5/ 94

సంతానం ఓ విధంగా అపరిచితులవంటిది. ఇబ్ను ఆబిదీన్ ఇలా అంటారు :

اما الكبير فكالأجنبى

**కాని తనయుడు పెద్దవాడయిపోతే అతడు అపరిచితుని వంటివాడు.**

*(రద్దుల్ ముహ్తార్ అలా దుర్రుల్ ముఖ్తార్ : 3/ 261)*

కొందరేమో పిల్లవాళ్ళు పెద్దయిన తరువాత కూడా తల్లిదండ్రులకు వారిని శిక్షణ గరిపే హక్కు ఉందని వ్రాశారు : కాగా అల్ బహ్రుర్రాయిక్‌లో ఇలా వుంది :

ذكر الأسبيجانى أن للأب أن يؤدب ولده البالغ اذا وقع منه شئ

**అస్బీజానీ ప్రకారం, తండ్రికి తన ప్రౌఢ సంతానాన్ని శిక్షణ గరిపే హక్కుంది– ఏదయినా తప్పు వారి చేత జరిగినట్లయితే. (మందలించే హక్కు ఉంది).** *(అల్ బహ్రుర్రాయిక్ : 4/ 171)*

ఈ రెండు అభిప్రాయాల్లో బాహ్యంలో వైరుధ్యం కానవస్తోంది. కాని నిజానికి లేదు. దీన్ని అర్థం చేసుకునేందుకు ప్రౌఢ వయసు, ప్రౌఢ వయసు కాకపోవడం మధ్యన షరీఅత్ నియమించిన విభేదంలో గల విధానాన్ని గమనించవలసి ఉంటుంది. ప్రౌఢత్వానికి చేరని సంతానం బాధ్యత, సమర్థత లేని దయ, తల్లిదండ్రులకు విధేయమయి, వారికి లోబడి ఉంటుంది. దీనికి భిన్నంగా ప్రౌఢ సంతానం తనదయిన స్వేచ్ఛాయుత స్థిరస్థానం కలిగి వుంటుంది. తన మాటలకు చేతలకు షరీఅత్ రీత్యాను బాధ్యత కలిగి, సామర్థ్యం కలిగి ఉంటుంది. అందువల్ల సూత్రప్రాయంగా ఈ మాట సరయినదే. సంతానం ప్రౌఢత్వానికి చేరనంతవరకు, తల్లిదండ్రులకు విధేయమయి ఉన్నంతవరకు వారి శిక్షణాధికారం తల్లిదండ్రులకు ఉంటుంది. కాని సంతానం బుద్ధి కలిగి ప్రౌఢత్వానికి చేరుకున్నప్పుడు, తల్లిదండ్రులకు విధేయమయి లేనప్పుడు వారి శిక్షణ హక్కు కూడా తల్లిదండ్రులకు మిగులదు. ఈ సూత్రప్రాయమయిన వాస్తవాన్ని తెలుసుకున్న తరువాత ఆచరణాత్మక దృష్టి కోణంతో ఈ విషయాన్ని పరిశీలించినట్లయితే అర్థమయ్యేదేమిటంటే బాలురలో ప్రతి ఒక్కరు ప్రౌఢ వయసుకు చేరుకోగానే బాధ్యతలనన్నింటినీ వహించగల యోగ్యతకు చేరుకోలేరు. నిజానికి కొన్ని సందర్భాలలో ఇంకా చాలా కాలం వరకు వారు తల్లిదండ్రుల సంరక్షణ, సహకారం అవసరమయి ఉంటారు. ఉదాహరణకు, బుద్ధి కుశలత గల, ప్రౌఢ వయసుకు

చేరిన, స్వేచ్ఛాభిప్రాయం గల సంతానాన్ని ఏ తండ్రీ తనతోపాటు ఉండాలని బల వంతం చేయజాలడు. కాని తనయుని నీతి, నడవడి, శీల స్వభావాల పట్ల తృప్తి లేకపోతే అతన్ని వేరే ఇంట ఉండే అనుమతి ఇవ్వ నిరాకరించడానికి తండ్రికి అధికార ముంది. తనతోపాటే ఉండాలని బలవంతాన కోరవచ్చు. అంతేకాదు అవసరం మేరకు సమయానుకూలంగా అతను ఆ యువకుణ్ణి మందలించనూ గలడు. కాగా దుర్రు ముఖ్తార్‌లో ఇలా ఉంది :

**(والغلام اذا عقل واستغنى برأيه ليس للأب ضمه الىٰ نفسه) الاّ اذا لم يكن مأمون علىٰ نفسهٖ فله ضمّه لدفع فتنــة أو عــار و تأديبه اذا وقع منه شئ**

**అబ్బాయి బుద్ధి గలవాడు, స్వేచ్ఛాభిప్రాయం గలవాడు, ఇతరుల అభిప్రాయం అవసరం లేనివాడయి పోయినప్పుడు, తండ్రికి అతన్ని తనతోపాటు ఉంచుకునే హక్కు లేదు. అయితే తృప్తి లేని సందర్భంలో ఏదయినా ఉపద్రవ పరీక్షలో పడిపోకుండా తప్పించుకునేందుకు, అవమానాన్ని తప్పించుకునేందుకు తండ్రి అతన్ని తనతోపాటు ఉంచుకునేందుకు పట్టు పట్టవచ్చు. అతని చేత ఏదయినా తప్పుడు చేష్ట జరిగినా తండ్రికి అతన్ని మందలించే హక్కూ ఉంది.**

*(దుర్రుల్ ముఖ్తార్ షర్హ్ తన్వీరుల్ అబ్సార్ : 2/ 883)*

తనయుడు ప్రౌఢ వయసుకు చేరినప్పటికీ అతన్ని తనతోపాటే ఉంచుకునే హక్కు తండ్రికి ఏ పరిస్థితుల్లో అన్వయిస్తుందో, అవే పరిస్థితుల్లో తండ్రి లేకపోయి నప్పుడు ఆ యువకుని సంరక్షకుడుగా ఎవరున్నా వారికీ ఆ హక్కు వర్తిస్తుంది. ఎందుకంటే ఇదే అన్నింటికన్నా పెద్ద బంధుత్వపు అనురాగ బాధ్యత, ఇదే మున్కర్ నిర్మూలన కూడా. షరీఅత్ ఈ రెండు అంశాల ఆదేశమూ ఇచ్చింది :

**و الظاهــران الجدّ كذٰلك بل غيره مـن العصبـات كالأخ و العم....فان دفع المنكر واجب**

**బాహ్యంలో చూస్తే తాత (తండ్రి తండ్రి) కూడా తండ్రి వలెనే సంరక్షకుడు. అంతేకాదు తాత మాత్రమే కాక ఇతర సమీప బంధువులు (అసబాత్), సోదరుడు, బాబాయి కూడా ఇదే కోవకు చెందినవారు. ఎందుకంటే మున్కర్‌ను**

على كل من قدر عليه لاسيما من يلحقه عاره وذلك ايضا من أعظم صلة الرحم والشرع امر بصلتها وبدفع المنكر ما امكن

వారించడం, దాని సామర్థ్యం గల ప్రతి ఒక్కరికీ విధి అయిన అంశం. మరీ ముఖ్యంగా, దాని వల్ల ఎవరయితే పరాభవాన్ని అనుభవించవలసి వస్తుందో వారు. అంతేకాక ఇది అన్నింటినీ మించిన బంధుత్వపు అనురాగ బాధ్యత. మరి షరీఅత్ ఏమో బంధుత్వపు ప్రేమను, వీలయి నంత మేర మున్కర్ నిర్మూలనకూ ఆదేశ మిచ్చింది. *(రద్దుల్ ముహ్తార్ :2/ 883)*

ఏవిధంగానయితే కొన్ని పరిస్థితుల్లో తల్లిదండ్రులకు ప్రౌఢ సంతానాన్ని శిక్షించే హక్కున్నదో అదేవిధంగా కొన్ని సందర్భాలలో వారిపైన కొన్ని బాధ్యతలూ మోపబడ తాయి. ఒక ఉదాహరణ: యువకుడు ప్రౌఢ వయసుకు చేరి సంపాదనా యోగ్యు డయిన తరువాత తండ్రిపైన అతని ఆర్థిక బాధ్యత తారసిల్లదు. కాని అబ్బాయి ధార్మిక విద్యనభ్యసిస్తున్న కారణంగా సంపాదించే స్థితిలో లేకపోయినట్లయితే తండ్రి అతని ఖర్చు భరించడం తప్పనిసరి అవుతుంది. *(అల్ బహ్రురాయిక్ : 4/ 200)*

సంతానాన్ని ఉపద్రవ పరీక్షకు లోనవకుండా కాపాడటం **నహీ అనిల్ మున్కర్** అయినట్లే అతని విద్యాబోధనల్లో సహాయపడటం **అమ్ర్ బిల్ మారూఫ్**గా పరిగణించ వలసి వస్తుంది. సంతానం ప్రౌఢ వయసుకు చేరినప్పటికీ తల్లిదండ్రులు అవసర మయినప్పుడు వారిపైన అమ్ర్ బిల్ మారూఫ్‌ని విధించడమూ తప్పనిసరి అవుతుంది. అలాగే నహీ అనిల్ మున్కర్ కూడా చెయ్యవలసి ఉంటుంది.

## తల్లిదండ్రుల విమర్శన

సంతానం, తల్లిదండ్రుల పట్ల అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ విధిని నిర్వర్తించడం చాలా సున్నితమయిన విషయం. ఇందులో చాలా జాగ్రత్తగా మసలుకోవలసి ఉంటుంది. ఒకరి తల్లిదండ్రులు జ్ఞానం లేకపోవడం చేత 'మారూఫ్'ని వదిలివేయడమో లేదా మున్కర్‌కు పాల్పడటమో చేస్తూ ఉన్నట్లయితే, వారికి షరీఅత్ ఆదేశాలను తెలుపడం వారికి నచ్చజెప్పడం సంతానం బాధ్యత. అంతకుమించి మందలించడం, చీవాట్లు పెట్టడం, బాధించడం, కొట్టడం, హత్యకు పాల్పడటం ఎంతమాత్రం అనుమతించబడదు. దివ్యకుర్‌ఆన్‌లో ఇలా ఉంది :

وَلَا تَقُلْ لَّهُمَا اُفٍّ وَّ لَا تَنْهَرْ هُمَا وَقُلْ لَّهُمَا قَوْلًا كَرِيْمًا○

**వారిని 'అబ్బ' అని కూడా అనకండి, వారిని చీదరించుకుంటూ బదులు పలకకండి, ఎంతో గౌరవంతో వారిని పలకరించండి.**

*(బనీ ఇస్రాయీల్ : 23)*

తల్లిదండ్రుల హక్కు తమ సంతానంపైన చాలా బలవత్తరమయినది. కడకు వారు సంతానాన్ని చంపివేసినా వారి నుంచి హత్యా ప్రతీకారం (కిసాస్) తీర్చుకోవడం జరగదు:

لاَ يقاد الوالد لولد

**సంతానాన్ని చంపినందుకు తండ్రిని హత్యా ప్రతీకారంగా చంపడం జరగదు.**

*(తిర్మిజీ, అబ్వాబుద్దియాత్)*

అలాగే సంతానం అంటే కొడుకు కూడా తండ్రి నుండి కిసాస్ (హత్యా ప్రతీ కారం) తీర్చుకోలేడు. ఉదాహరణకు ఒక వ్యక్తి తన కొడుకు తల్లిని చంపివేసినట్లయితే కిసాస్ (ప్రతీకారం) తీర్చుకునే హక్కు ఆ అబ్బాయి నుండి దానంతట అదే రద్దయి పోతుంది. *(అల్ హిదాయ మఅష్షర్హుల్ ఇనాయ అలీ హామిష్, ఫత్‌హుల్ కదీర్: 8/260)*

తిరస్కారులయిన తల్లిదండ్రులు యుద్ధంలో కొడుకు సమక్షంలో తారసపడి నట్లయితే కొడుకు వారిని తన చేతులతో సంహరించకుండా తప్పించుకోవాలన్నది ఆదేశం,వారు అతనిపైకి దాడి జరిపిన పక్షంలో అతను తన ప్రాణం కాపాడుకోవడానికి సంహరించే చర్య తీసుకోవలసి వస్తే అది వేరే విషయం.

*(జస్సాస్ : అహ్కాముల్ కుర్‌ఆన్ : 2/ 336; అల్ బహ్రుర్రాయిక్ : 5/ 78)*

ధర్మవేత్తలు దీన్ని ఎంతవరకు పొడిగించారంటే, ఒకవేళ తల్లిదండ్రులపై దైవశిక్ష విధితమయినా సంతానం ఆ 'హద్దు' (శిక్ష)ను వారిపైన అమలుజరపడంలో పాలు పంచుకోరు.

ఇలాంటి వివరాలన్నీ ముందుంచిన తరువాత ఇమామ్ గజాలీ ఇలా అంటారు:

فاذا لم يجز لـه ايذاءه بعقوبة هى حق على جنايـة سابقـة فلا يجوز لـه ايذاءه بعقوبـة هى منـع من جنايـة مستقبلـة متوقعة بل اولى

**కొడుకు తన తండ్రికి ఇటువంటి శిక్ష ద్వారా బాధపెట్టడం ధర్మసమ్మతం కానప్పుడు, అది నిజానికి అతను చేసిన నేరానికి అతనిపైన విధితమయినప్పుడు, అతను తన తండ్రికి, మున్ముందు జరగబోయే నేరానికి శిక్ష వెయ్యడం ఇతోధికంగా ధర్మసమ్మతం కాదు.**

(ఇహ్యాఉ ఉలూముద్దీన్: 2/ 346)

అల్లామా ఇబ్ను ఆబిదీన్ 'ఫుసూలుల్ అలామీ' అనే గ్రంథాన్ని ఉటంకిస్తూ ఇలా వ్రాశారు, ఎవరయినా తన తల్లిదండ్రుల్ని మున్కర్‌కు పాల్పడుతూ ఉండగా చూసినట్లయితే వారిని ఒకసారి వారించాలి; వారు మానుకుంటే సరి, కాని ఇలా వారించడం కూడా వారికి ఇష్టం కాకపోయినట్లయితే మౌనం వహించాలి (మళ్ళీ వారించరాదు). ఆ పైన వారి కోసం దుఆ చేయాలి, పరమ ప్రభువు వారికి సన్మార్గం చూపాలని, వారి తప్పిదాలను మన్నించాలనీను.

*(రద్దుల్ ముహ్తార్ అలా దుర్రుల్ ముఖ్తార్ : 3/ 261)*

కొందరి ప్రకారం తల్లిదండ్రులు ఏదయినా మున్కర్‌కు ఒడిగడుతున్నట్లయితే వారిని స్పర్శించకుండా వారు పాల్పడుతున్న మున్కర్‌ను తుడిచిపెట్టాలి. ఉదాహరణకు వారు సారాయి త్రాగుతుంటే వారిని ఏమీ అనకుండా సారాయిని పారబోయాలి. *(అత్‌తష్రీఉల్ జనాయీ అల్ ఇస్లామీ : 1/ 509)*

## భార్య పట్ల విమర్శన

ఇప్పుడు మరో ప్రశ్నను పరిశీలిద్దాము, భర్త, భార్య పట్ల **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** నిర్వహించే పరిధులేవి? అలాగే భార్య ఏ పరిధులకు లోబడి తన భర్త విషయంలో ఈ విధిని నిర్వర్తించగలదు? దివ్యకుర్‌ఆన్‌లో ఇలా ఉంది :

**اَلرِّجَالُ قَوّٰمُوْنَ عَلَى النِّسَاءِ**

**పురుషులు స్త్రీలపైన వ్యవహారకర్తలు.**

దీని భావమేమిటంటే ఇస్లామ్ ఏర్పరచిన కుటుంబ వ్యవస్థలో భర్త వ్యవహారకర్త, భార్య ఏమో అతనికి లోబడి, విధేయురాలయి మెలగాలి. భర్త వ్యవహార కర్త అంటే కేవలం అతను భార్య ఆర్థిక భారాన్ని మోసేవాడు; ఇంటి వ్యవహారాలను పర్యవేక్షించేవాడు మాత్రమే కాదు, అతను భార్యకు సంబంధించిన ప్రాపంచిక, పారలౌకిక సాఫల్యం కొరకు సయితం పాటుపడేవాడయి ఉండాలి. ఆమె నైతిక, శీల నిర్మాణంలో ఏవయినా లోటుపాట్లు ఉన్నట్లయితే వాటిని సంస్కరించాలి. ఒక సంరక్షకుడు తనకు కిందివారి లోటుపాట్లను సరిదిద్దేలానే వీటినీ సంస్కరించాలి. అల్లామా ఇబ్ను కసీర్ 'కవ్వామ్' అన్న కుర్‌ఆన్‌లోని పదానికి వివరణ ఇలా తెలిపారు :

**الرجل قيّم على المرأة، وَ هو رئيسها و كبيرها و الحاكم عليها**

**పురుషుడు స్త్రీపైన కయ్యిమ్ (వ్యవహార కర్త). అంటే అతను ఆమెకు నాయకుడు, పెద్ద, ఆమె పట్ల పాలన చేసేవాడు, ఆమె దారి తప్పి**

وموٴدبها اذا اعوجت

నట్లయితే ఆమెను దారిలో పెట్టేవాడు.

(తఫ్సీర్ ఇబ్ను కసీర్ : 2/ 324)

జస్సాస్ ఇలా అంటారు :

تضمن قوله الرِّجَالُ قَوَّامُوْنَ عَلَى النِّسَاءِ قيامهم عليهن بالتأديب و التدبير و الحفظ و الصيانة

పురుషులు స్త్రీలపైన కవ్వామ్. అల్లాహ్ పలికిన ఈ మాటలో పురుషులు తమ స్త్రీలకు బోధన, శిక్షణ గరపడం, వారికి అవసరమయిన ఏర్పాట్లు, వ్యవహారాలు సరిచూడటం, వారి రక్షణ, పర్యవేక్షణ అన్నీ చేరి ఉన్నాయి.

(అహ్కాముల్ కుర్‌ఆన్ : 2/ 236)

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ ఫర్జ్ కిఫాయ అన్నది నిజమే. కాని ఒక వ్యక్తి మారూఫ్‌ని వదిలిపెట్టిన విషయం, లేదా మున్కర్‌కు పాల్పడుతున్న విషయం ఓ ప్రత్యేక వ్యక్తికే తెలిసినట్లయితే మరి అతను అమ్ర్ బిల్ మారూఫ్ నహీ అనిల్ మున్కర్ కూడా చేయగల సామర్థ్యమూ గలవాడయితే ఈ బాధ్యత అతనికి ఫర్జ్ కిఫాయ కాదు, అతనికి అది ఫర్జ్ అయిన్‌గా రూపొందుతుంది.

ఒక విషయం మటుకు వాస్తవం. ఒక వ్యక్తికి తన భార్యాపిల్లల మేళ్ళయినా లోటుపాట్లయినా తెలుసుకోవడం ఎంతగా సులభతరమో అంతగా మరొకరెవరికీ సాధ్యమయ్యే విషయం కాదు. పైగా వారి సంస్కరణా శక్తి, బాధ్యత, హక్కులు కూడా షరీఅత్ రీత్యా అతనికే ప్రాప్తమయి ఉన్నాయి. ఈ రెండు కారణాలను ముందుంచుకుని గమనిస్తే ద్యోతకమయ్యేదేమిటంటే మనిషికి తన భార్యాపిల్లల సంస్కరణ అనేక వ్యవహారాలలో అతనికి ఫర్జ్ అయిన్‌గా మారిపోతుంది. ఆ వ్యవహారాలను ఇతరులు తెలుసుకోనూ లేరు, వారు సంస్కరణా చెయ్యలేరు. ఇమామ్ నవవీ అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ అనే అంశాన్ని చర్చిస్తూ ఇలా అంటారు :

ثم انه قد يتعيّن كما اذا كان فى موضع لاَ يعلم به الاّ هـو او لاَ يتمكن من ازالته الاّ هـو، وكمن

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కొన్ని సందర్భాలలో ఫర్జ్ అయిన్‌గా మారి పోతుంది. ఉదాహరణకు మనిషి, మున్కర్ జరగగా తానే తెలుసుకున్నాడు లేదా తానే దాన్ని నిర్మూలించగలడు, అటువంటి సంద

یری زوجته او ولده او غلامه علی منکر او تقصیر فی المعروف

ర్థంలో అది అతనికి ఫర్జ్ అయిన్‌గా రూపొం దుతుంది. ఉదాహరణకు మనిషి తన భార్యను లేదా తన సంతానాన్ని లేదా తన నౌకరును మున్కర్‌కు పాల్పడుతూ ఉండగా చూశాడు, లేదా మారూఫ్‌లో కొరతను పాటించడం గమనించాడు, (అటువంటి పరిస్థితిలో అతనికి అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ విధి అవుతుంది)

*(షర్హ్ ముస్లిమ్ : సం. 1, భాగం 2, పు. 20)*

భార్య ఒకవేళ భర్త హక్కుల్ని నిర్వర్తించకపోయినట్లయితే అతని ఆజ్ఞల్ని ఉల్లంఘించినట్లయితే భర్త ఆమెను శిక్షించవచ్చు. కాగా కుర్‌ఆన్‌లో ఇలా ఉంది :

وَ الّٰتِی تَخَافُوْنَ نُشُوْزَهُنَّ فَعِظُوْهُنَّ وَ اهْجُرُوْهُنَّ فِی الْمَضَاجِعِ وَ اضْرِبُوْهُنَّ

ఏ స్త్రీల పట్ల మీకు తిరుగుబాటు సంశయ ముందో వారిని బోధపరచండి, వారిని పడకల నుండి దూరంగా ఉండండి, వారిని కొట్టండి.

*(అన్ నిసా : 34)*

షరీఅత్ భర్తకు, భార్యను శిక్షించే హక్కు ఇచ్చింది. దీన్ని అతను ఆమె చేత మారూఫ్‌ను ఆచరింపజేయడానికి, మున్కర్‌ని మానిపింపజేయడానికి సహాయంగా వాడుకోగలడు. కాని ఒక విషయం ఇక్కడ గుర్తుంచుకోవాలి. ఈ హక్కును వినియో గించుకోవడంలోనూ కొన్ని పరిమితులున్నాయి. ఈ పరిమితులకు లోబడే భర్త భార్యను శిక్షించేందుకు అర్హుడు కాగలడు:

1) షరీఅత్‌లో ఉన్న ఎటువంటి కారణం చూపకుండా ఆమె అతని లైంగిక కోరికను మన్నించడానికి నిరాకరించినప్పుడు లేదా అతని ఆజ్ఞల్ని ఉల్లంఘించినప్పుడు, అతనికి ఎదురుగా తన ఔన్నత్యం, పెద్దరికపు వైఖరిని అవలంబించినప్పుడు భర్తకు భార్యను శిక్షించే హక్కు ఉంటుంది. ఉదాహరణకు అతని పట్ల దుర్భాషలాడింది, పోరాడింది, అతని గడ్డం పట్టి లాగింది, అతని బట్టలు చింపింది, అతను ఆదేశించి నప్పటికీ, స్తోమత ఉన్నప్పటికీ ధర్మసమ్మతమయిన అలంకరణ, భూషణలు మాని వేసింది. అతని ఇష్టానికి విరుద్ధంగా ఇంటి సామగ్రి మరెవరికయినా ఇచ్చివేసింది, మొదలయిన చేష్టలు. లేదా ఆమె వల్ల ఏదయినా అనైతిక చేష్ట జరగడం, ఎవరినయినా

దూషించడం, పర పురుషుల మధ్య ముసుగు తీసి వెయ్యడం, లేదా వారితో మాట లాడటం, భర్త అనుమతి లేకుండా ఇంటి బయటికి బయలు వెడలడం వగైరా.

*(కన్జుద్దకాయిక్ మఅ షర్హ్ అల్ బహ్రుర్రాయిక్ : 5/ 48,49)*

2) స్త్రీ తన భరణం (నాన్ నఫక) (రోజువారీ కూడు, గూడు, గుడ్డ ఖర్చు) కొరకు పట్టుబడితే దాన్ని కావాలని తగాదా పెడితే భర్త ఆమెను శిక్షించలేడు, అది ఆమె హక్కు, తన హక్కు కొరకు ఆమె పట్టు పట్టవచ్చు. *(అల్ బహ్రుర్రాయిక్ షర్హ్ కన్జుద్దకాయిక్ : 5/ 49)*

3) భర్త అక్రమంగా, నిష్కారణంగా భార్యను కొట్టినట్లయితే స్వయంగా భర్తను శిక్షించడం జరుగుతుంది.

*(అల్ బహ్రుర్రాయిక్ షర్హ్ కన్జుద్దకాయిక్ : 5/ 49)*

4) శిక్ష అన్నది కేవలం షరీఅత్, ఏ మున్కర్‌ల విషయమయితే 'హద్' నిర్ణయించలేదో వాటికి పాల్పడినప్పుడే నిర్ణయమవుతుంది. మరి ఏ మున్కర్‌కు గాను షరీఅత్ 'హద్ద్' విధించిందో వాటికయితే హద్దును అమలుపరచడం జరుగు తుంది, మరో శిక్ష కాదు. అయితే హద్దును అమలుపరచడం జన సామాన్యం పని, బాధ్యత కాదు, ఇది ప్రభుత్వాధికారుల బాధ్యత, విధి. అందువల్ల భర్త కేవలం షరీఅత్ 'హద్ద్' విధించని మున్కర్‌కు పాల్పడినప్పుడే భార్యను శిక్షించగలడు. అల్లామా కాషానీ ఇలా అంటున్నారు :

**اذا ارتكبت معصية سوى النشوز ليس فيه حدّ مقدّر فللزّوج ان يؤد بها تعزيرًالها لِاَن للزوج ان يعزر زوجته كما للمولىٰ ان يعزر مملوكه**

**భర్త ఆజ్ఞోల్లంఘన మాత్రమేకాక స్త్రీ మరేదయినా పాపానికి ఒడిగడితే దానికి ఏదయినా నిర్ణీత హద్ద్ విధితమయి లేకపోతే భర్త శిక్షగా ఆమెను ఏవిధంగానయినా మందలించగలడు, అతనికి ఆ అనుమతి ఉంది. ఎందుకంటే యజమానికి తన నౌకరును శిక్షించే హక్కు ఏవిధంగా ఉందో అదేవిధంగా భర్తకు తన భార్యను శిక్షించే హక్కు, అధికారం ఉంది.**

*(బదాయి అస్సనాయి ఫీ తర్తీబ్ అష్షరాయి: 2/ 334)*

5) భార్యను శిక్షించడం అన్నదానికీ ఒక పరిమితి ఉంది. దాన్ని హదీసులో 'కఠినం కాని దెబ్బ' (**జర్‌బన్ గైర్ ముబ్రహ్.★**) గా పేర్కొనడం జరిగింది. ఈ పరిమితిని దాటడం భర్తకు ధర్మసమ్మతం కాదు.**జర్‌బన్ గైర్ ముబ్రహ్** (కఠినం కాని దెబ్బ)కు వివరణగా అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (ర) ఇలా అన్నారు, 'మిస్వాక్' (పలుదోము పుల్ల) లేదా అటువంటి ఏదయినా వస్తువుతో కొట్టడం, మరో ఉల్లేఖనంలో 'ఎముక విరిగేటటువంటి దెబ్బ కారాదు' అని అన్నారు. కతాదా (ర) ఇలా అన్నారు, 'ఆ దెబ్బతో ఆమె శరీరంలో ఎటువంటి లోపం గోచరించరాదు'

*(జామిఉల్ బయాన్ ఫీ తఫ్సీరుల్ కుర్‌ఆన్; ఇబ్ను జరీర్ : 5/ 41)*

ఎవరయినా తన భార్యను మా చెడ్డగా బాదినట్లయితే స్వయంగా అతన్నే శిక్షించడం జరుగుతుంది :

**ادّعت علیٰ زوجها ضربًا فاحشًا و ثبت ذٰلک علیه عزر**

**స్త్రీ ఒకవేళ తన పెనిమిటి మా చెడ్డగా బాదాడని నిందించగా, అది రుజువయితే, అతన్ని శిక్షించడం జరుగుతుంది.**

*(తన్వీరుల్ అబ్సార్ : 3/ 262)*

హనఫీ ఫిక్హ్ వేత్తలు వ్రాసిన దాని ప్రకారం, భర్త శిక్షించడం మూలాన భార్య ప్రాణం కోల్పోయినట్లయితే భర్తపైన హత్యా పరిహారం విధి అవుతుంది.

(హిదాయ, మఅ ఫత్‌హుల్ కదీర్ : 4/ 217)

6) భార్య ఒకవేళ భర్త (హక్కుల) పట్ల తన బాధ్యతల్ని నెరవేర్చకపోతే భర్త ఆమెకు నచ్చజెప్పాలి. బోధించాలి. బోధన వల్ల ప్రయోజనం లేకపోయినట్లయితే కుర్‌ఆన్ ఉపదేశం ప్రకారం తన పడకను వేరుచేసుకోవాలి. అప్పటికీ ఆమె దారికి రాకపోతే భర్త ఆమెను శిక్షించగలడు. భార్య ఆజ్ఞోల్లంఘన తోటే తొలి చర్యగానే శిక్షించే హక్కు భర్తకు లేదు. *(బదాయి అస్సనాయీ ఫీ తర్తీబు ష్షరాయి : 2/ 334)*

7) కొందరు ధర్మవేత్తల అభిప్రాయంలో స్త్రీని శిక్షించడం అన్నది, ఆమె సంస్కరణ అన్నది సంభవమన్న ఆశ ఉన్నప్పుడే సరయినది. కాని కఠినశిక్ష లేనిదే ఆమె సంస్కరణ జరగదని భర్త భావించిన సందర్భంలోనూ, సంస్కరణ జరిగే ఆశ లేదన్న సందర్భంలోనూ, శిక్షించే అనుమతి ఇవ్వబడదు. ఈ రెండు పరిస్థితుల్లోనూ

★ *ముస్లిమ్ : కితాబుల్ హజ్జ్, బాబు హజ్జతున్నబీ (స)*

శిక్షించడం భర్త చేసేది అక్రమంగా పరిగణించబడుతుంది.

(అత్ తష్రీఉల్ జనాయి అల్ ఇస్లామీ : 1/ 516, 517)

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** చాలా విస్తృతమయిన కార్యం. ఇందులో యావజ్జీవిత సంస్కరణ సంలీనమయి ఉంది. విశ్వాసాలు, ఆరాధనలు, నైతిక నియమాలు, వ్యవహారాలు- సర్వం. దీనికెదురుగా షరీఅత్ భర్తకు ఇచ్చిన హక్కు, భార్యను శిక్షించే హక్కు చాలా పరిమితమయింది. దీనిద్వారా అతను కొన్ని ప్రత్యేక విభాగాలలోనే భార్యను సంస్కరించగలడు. ప్రశ్న ఏమిటంటే, భార్య మరీ దారి తప్పిపోయి చాలా చెడుగులో పడిపోయినట్లయితే, కేవలం భర్తను కష్టపెట్టడమే కాదు, అతని హక్కుల్ని నిర్వర్తించకపోవడమేకాదు, దేవుని హక్కులు సయితం ఎగ్గొట్టడం మొదలెడితే షరీఅత్ ఆదేశాలను సయితం ఉల్లంఘించడం ప్రారంభిస్తే భర్త ఏంచేయాలి? దానికి చాలా ముక్తసరి, సంక్షిప్త సమాధానం- అటువంటి భార్యకు విడాకులు ఇచ్చివేయాలి. ఎందుకంటే ధర్మభ్రష్టురాలయిన భార్యతో జీవితం గడపడం కన్నా ఆమెతో వేరుపడటమే ఎంతో మేలు. కనుక అల్ బహ్రుర్రాయిక్‌లో గాయతుల్ బయాన్‌ని ఉటంకించి ఇలా వ్రాయడం జరిగింది:

**يستحب طلاقها اذا كانت سليطة موذية أو تاركة للصلوٰة لاَ تقيم حدود الله تعالىٰ**

**అతను తలాక్ ఇవ్వడం అభిలషణీయం- ఆమె పోరు పెట్టినప్పుడు, కష్టపెట్టినప్పుడు, నమాజ్ మానివేసినప్పుడు, దైవాదేశాలను పాలించడం మానివేసినప్పుడు.** *(అల్ బహ్రుర్రాయిక్ షర్హ్ కన్జుద్దకాయిక్ : 3/237)*

అల్లామా ఇబ్ను ఆబిదీన్ దానిపై ఇంకా అదనంగా ఇలా వ్రాశారు :

**الظاهر ان ترک الفرائض غير الصلوٰة كالصلوة**

**బాహ్యంలో నమాజ్ కాక ఇతర విధులను మానివేయడం కూడా నమాజ్‌ని మానివేయడం లాంటిదే.**

*(రద్దుల్ ముహ్తార్ అలా దుర్రుల్ ముఖ్తార్ : 2/ 572)*

హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (ర) ఇలా నుడివారు : 'నా మీద భార్య మహ్ర్ బాకీ ఉండగా నేను అల్లాహ్‌ను కలుసుకోవడం కన్నా నేను నమాజ్‌ని ఆచరించని భార్యతో జీవితం గడపడం మేలని భావిస్తాను'.

*(రద్దుల్ ముహ్తార్ అలా దుర్రుల్ ముఖ్తార్ : 2/ 572).*

ఇక్కడ ఓ విషయం ప్రస్తావించడం సబబుగా ఉంటుంది. హనఫీ ఫుకహా దృష్టిలో, నమాజ్‌ని వదిలిపెట్టిన భార్యను భర్త శిక్షించనూ గలడు. ఇది వారి ప్రాధాన్యత గల అభిప్రాయం. *(చూడండి అల్ బహ్రుర్రాయిక్ : 5/ 49)*

## భర్త పట్ల విమర్శన

భార్య భర్తకు లోబడి ఏలుబడిలో ఉంటుంది. ఇమామ్ గజాలీ ప్రకారం, భర్తకు ఎదురుగా భార్య, తండ్రికి ఎదురుగా తనయుని వంటిది. అందువల్ల భర్త ఏదయినా మున్కర్‌కు తెలియక పాల్పడితే భార్య అతనికి షరీఅత్ ఆదేశం తెలుపుతుంది. కాని ఒకవేళ అతను తెలిసీ కావాలని మున్కర్‌కు ఒడిగడితే అతనికి బోధన ఉపదేశన ద్వారా నచ్చజెప్పుతుంది. అంతేకాని మందలించే, చీవాట్లు పెట్టే, దెబ్బలు కొట్టే హక్కు ఆమెకు లేదు. *(ఇహ్యాఉ ఉలూముద్దీన్ : 2/ 346)*



# 11. గుణగణాలు

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్** మున్కర్ కార్యం కొన్ని విలక్షణమయిన గుణగణాలను కోరుతుంది. ఏ వ్యక్తిలోనయితే ఈ గుణగణాలుంటాయో అతను ఈ విధిని సరయిన రీతిలో, దాని నిబంధనలన్నింటితో సహా నిర్వర్తించగలుగుతాడు. మరెవరయితే ఈ గుణాలు లేనివాడో అతడు ఈ విధిని నిర్వర్తించడం దుర్లభం. **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్** మున్కర్ కొరకు అవసరమయిన గుణాలలో కొన్నింటిని గత చర్చల్లో నిమ్న విషయంగా ప్రస్తావించడం జరిగింది. ఇక్కడ కొన్ని ముఖ్యమయిన గుణగణాలను ప్రస్తావిస్తున్నాము.

## నమాజ్

విశ్వాసి ప్రపంచంలో మారూఫ్‌ని స్థాపించేవాడు, మున్కర్‌ని నిర్మూలించేవాడు. అల్లాహ్, ఆయన సందేశహరుడు మానవునికి ఏ ఆదేశాన్నయితే ఇచ్చారో అది మారూఫ్‌గా పరిగణించబడుతుంది. మరి ఏ విషయాన్ని వారించారో అది మున్కర్‌గా లెక్కించబడుతుంది. ఈ రెండు పదాలు మొత్తం ధర్మాన్ని ఆవరించి ఉన్నాయి. **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్** మున్కర్ వాస్తవానికి ఇకామతుద్దీన్ (ధర్మ సంస్థాపనం) అన్నదానికి మారుపేరు. ఇంత ఘనమయిన కార్యం నిర్వహించేవారు ఎవరయి ఉంటారు- వారి జీవితాలు చెడుగుల నుండి ప్రక్షాళితమయి ఉండాలి; వారు తమపైన 'మారూఫ్'ను సుస్థాపితం చేసుకుని ఉండాలి. ఎవరయితే స్వయంగానే 'మున్కర్'లో లీనమయి ఉన్నారో, వారు ఇతరుల్ని దాన్నుండి ఎలా ఆపగలరు. మరెవరి జీవితాల్లో స్వయంగానే 'మారూఫ్'స్థాపితమయి లేదో వారు ఏ ముఖంతో 'మారూఫ్'ని ప్రచారం చెయ్యగలరు? ప్రపంచంలో క్రియాశూన్యులయిన బోధకులు విప్లవాన్ని తీసుకు రాలేరు. దీనికి శీలవంతులయిన జనులు అవసరమయి ఉంటారు. వారు తమ మాటలకు తామే ఆదర్శమయి నిలువగలిగిన వారయి ఉండాలి; ఇతరులకు బోధించే

ముందు స్వయంగా ఆచరించి చూపేవారయి ఉండాలి. నమాజ్ విశ్వాసిని **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్** విధిని నిర్వర్తించే, అత్యుత్తమంగా నిర్వర్తించే యోగ్యునిగా తీర్చిదిద్దుతుంది. అప్పుడే అతడు ప్రపంచానికి మంచిని ఆదేశించేవానిగా, చెడు నుండి వారించే వానిగా రూపొందగలడు. మహనీయ లుక్మాన్ (అలైహిస్సలామ్) చేసిన ఉద్బోధనలో ఇదే విషయాన్ని సూచనప్రాయంగా తెలుపడం జరిగింది :

**يَا بُنَيَّ اَقِمِ الصَّلوٰةَ وَأْمُرْ بِالْمَعْرُوْفِ وَانْهَ عَنِ الْمُنْكَرِ وَ اصْبِرْ عَلٰى مَا اَصَابَكَ اِنَّ ذٰلِكَ مِنْ عَزْمِ الْاُمُوْرِ ٥**

**నాయనా, నమాజ్‌ని స్థాపించు, మంచిని ఆదేశించు, చెడును నిరోధించు, మరే ఆపద వచ్చి పడినా దానికి సహనం వహించు. ఈ విషయాలు మరీ మరీ తాకీదుగా బోధించబడిన విషయాలు.** *(లుక్మాన్ : 17)*

వ్యాఖ్యాతలు దీన్ని వివరిస్తూ హజ్రత్ లుక్మాన్(అ) తన తనయుణ్ణి 'ఇకామతుస్సలాత్' (నమాజ్ స్థాపన) కొరకు చేసిన బోధనకు భావం, అతను తన వ్యక్తిత్వపు పరిపూర్ణతను సాధించాలని కోరడం అన్నమాట. అతను పరమప్రభువు వైపునకు ఏకోన్ముఖుడవ్వాలని, తనలో 'తక్వా' గుణాన్ని, దైవం వైపునకు సదా మరలుతూ ఉండే లక్షణాన్ని ఉత్పన్నం చేసుకోవాలని వ్యాఖ్యాతలు భావం చెప్పారు. **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్**ని బోధించడం అంటే భావం ఇతరుల్ని ధర్మం వైపునకు పిలుపునివ్వడం, వారి సంస్కరణ, సుశిక్షణ కొరకు ప్రయత్నం చెయ్యడం అన్నది.★ ఈ రెండున్నూ (నమాజ్ స్థాపన, ధర్మం వైపునకు పిలుపు) వేర్వేరు కార్యాలు. అయితే వీటి మధ్యన అతి ప్రగాఢమయిన సంబంధముంది. నమాజ్ అన్నది సూత్రప్రాయంగా అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్ కార్యానికి షరతుగా నిర్ణయమయిన అంశం కాదు. కాని వాస్తవానికి నమాజ్ ద్వారానే మనిషి అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్ భారాన్ని మోయగల యోగ్యుడవుతాడు. ఏ వ్యక్తికయితే నమాజ్‌తో సంబంధం లేదో అతనికి అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్ బాధ్యతను నిర్వహించడం, నిత్యం నిర్వహిస్తూ ఉండటం సులువయిన పని కాదు.

---

★ ఇదే పుస్తకంలో 2వ అధ్యాయం, 'విధి, ప్రాముఖ్యత' అన్న చర్చ చూడండి

వాస్తవమేమిటంటే అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కార్యసిద్ధికి ఏ మహత్పూర్వకమయిన గుణగణాల, ఉత్కృష్టమయిన లక్షణాల ఆవశ్యకత ఉందో అవి నమాజ్ ద్వారానే ఉత్పన్నమవుతాయి. ఏ వ్యక్తి అయితే ప్రపంచాన్ని విలాస స్థలంగా, కాలక్షేప క్షేత్రంగా భావించి ఇందులోనే లీనమైపోకుండా దీన్ని ఓ పరీక్షా స్థలిగా భావిస్తూ ఇందులో గడిపే ఒక్కో క్షణం ఒక్కో ఆచరణకు పరమప్రభువు సన్నిధిలో సమాధానం చెప్పుకోవలసి ఉందని జీవిస్తాడో, ఇంకా ఇక్కడ తాను చేసే ప్రతి పనిలో పరలోక సాఫల్యం కోరుకుంటాడో, దానికే తన ప్రయత్నాలన్నీ అంకితం చేస్తాడో, ఎవని నరనరాన అల్లాహ్ సంస్మరణ జీర్ణమయి ప్రవహిస్తుందో, మరెవరయితే అల్లాహ్‌ను మరచి జీవించేవారు శ్రద్ధ చూపే పనులన్నింటినీ పరిత్యజించి మసలుకుంటాడో, మరెవని జీవితం అశ్లీల వ్యవహారాలతో దుష్టచేష్టలతో పూర్తిగా ప్రక్షాళితమయి ఉంటుందో- అదో అలాంటి వారే అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ వంటి మహత్తర కార్యభారాన్ని నిర్వహించి దానికి సరయిన న్యాయం చేకూర్చగలుగుతారు. కుర్‌ఆన్ చెప్పేదేమిటంటే ఈ సద్గుణాలు, ఈ ఉత్తమ లక్షణాలన్నింటి మూల సరోవరం నమాజ్! నమాజ్ ద్వారా జీవితంలో ఇస్లామీయ రూపురేఖలు పెల్లుబుకుతాయి. ఉన్నత నైతిక ప్రమాణాల నిర్మాణం సాగుతుంది. నమాజ్ ద్వారా మనిషికి అశ్లీలమూ చెడుగులూ ఛాయమాత్రంగానూ లేని జీవితం, దైవ సంస్మరణ భావనలతో జ్యోతిర్మయమయిన జీవితం దైవదాస్య భావం తొణికిసలాడే జీవితం సంప్రాప్తమవుతుంది. ఈ మాటనే కుర్‌ఆన్ ఆయత్‌లో ఇలా తెలుపడం జరిగింది :

اَقِمِ الصَّلٰوۃَ اِنَّ الصَّلٰوۃَ تَنْهٰى عَنِ الْفَحْشَآءِ وَ الْمُنْكَرِ وَلَذِكْرُ اللّٰهِ اَكْبَرُ

**నమాజ్‌ని స్థాపించు, నిస్సందేహంగా నమాజ్ నీతిబాహ్య చేష్టల నుండి, చెడుల నుండి వారిస్తుంది, మరి అల్లాహ్ సంస్మరణ ఇంత కన్నా ఎంతో గొప్ప విషయం.**

***(అల్ అన్కబూత్ : 45)***

దీనిద్వారా తెలుసుకోవచ్చు- ఒక వ్యక్తి నీతిబాహ్యమయిన విషయాలను చెడులను ఎదిరించి పోరాడటానికి, మంచినీ మారూఫ్‌ని వ్యాపింపజేయడానికి దృఢ సంకల్పంతో రంగంలో దిగినట్లయితే అతనికొరకు నమాజ్ ఎంత ప్రముఖమయిందో.

## సహనం

హజ్రత్ లుక్మాన్(అ) తన తనయుణ్ణి **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్**తోపాటు సహనం పాటించవలసిందని ఉపదేశించారు. ఇదీ ఒక యదార్థాన్ని చాటడమే. అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కార్యం సహనాన్ని కోరుతుంది. సహన హీనుడయిన వ్యక్తి దీనికి తగినవాడు కాడు. ఇమామ్ రాజీ (రహ్మ) ఇలా నుడివారు :

**من يأمر بالمعروف و ينهىٰ عن المنكر يؤذى فأمره بالصّبر**

**ఏ వ్యక్తి మారూఫ్‌ను ఆదేశిస్తాడో, మున్కర్‌ని వారిస్తాడో అతనికి జనం పక్షాన కష్టాలు ఎదురవుతాయి. అందువల్లనే హజ్రత్ లుక్మాన్ తన కొడుకుకు సహనాన్ని ఉద్బోధించారు.**
*(మఫాతీహుల్ గైబ్ అత్ తఫ్సీరుల్ కబీర్) సం,13, భాగం 25, పు.131)*

ఇదే మాటను 'అస్ర్' సూరాలోనూ చెప్పడం జరిగింది. అక్కడ కూడా 'తవాసీ బిల్ హక్క్'తోపాటు 'తవాసీ బిస్సబ్ర్' అన్న ఆదేశముంది. 'తవాసీ బిల్ హక్క్' అంటే విశ్వాసులు ఒండొకరికి దైవధర్మం పట్ల ఉపదేశించుకుంటూ ఉండాలి. ఇది ధర్మాన్ని నమ్మేవారి మధ్యన **అమ్ర్ బిల్ మారూఫ్** వ నహీ **అనిల్ మున్కర్** అన్నమాట. తవాసీ బిస్సబ్ర్ అంటే ధర్మంపైన నిలకడ చూపడానికి, దాన్ని సమున్నత పరిచే మార్గంలో చేసే కృషిలో ఎదురయ్యే కష్టాన్ని భరించేందుకు పరస్పరం ప్రేరేపించుకుంటూ ఉండాలి. దీన్నిబట్టి అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ విషయంలో సహనం ప్రాముఖ్యత విశదమయిపోతుంది.

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కొరకు సహనం ఎంత అవసరమో దాని ప్రాముఖ్యత ఏమిటో తెలుసుకునేందుకు ఇమామ్ ఇబ్ను తైమియ్యా చేసిన ఈ వివరణ ద్వారా ద్యోతకమయిపోతుంది.

**امر الله الرسل وهم ائمة الاَمر بالمعروف والنهى عن المنكر بالصبر**

**అల్లాహ్, దైవ సందేశహరులకీ, ఎవరయితే అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్‌మున్కర్ వ్యవహారంలో అందరికీ నాయక మన్యుల వంటి వారో, సహనం వహించవలసిందని ఆదేశమిచ్చాడు.** *(అల్ హస్బహ్ ఫిల్ ఇస్లామ్ : పు. 71)*

అల్లాహ్ సందేశహరులకే **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** కొరకు సహనం అవసరమయినప్పుడు సాధారణ జనులు సహనం లేనిదే దాన్ని ఎలా నిర్వర్తిం చగలరు?

వాస్తవం ఏమిటంటే **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** ఓ అతి సంక్లిష్టమయిన కార్యం. అది మనిషిలోని అత్యుత్తమ సామర్థ్యాలను పిండుకుంటుంది. ఇందులో అడుగడుగునా మనిషి సహనశక్తికి పరీక్షా ఘడియలు ఎదురవుతుంటాయి. మనిషి కఠిన పరీక్షలను దాటవలసి ఉంటుంది. ఈ సున్నితమయిన దశలను దాటడం అందరికీ సాధ్యమయిన పనికాదు, విపత్తులను భరించగల స్థోమత గల వారు, దెబ్బ మీద దెబ్బను తట్టుకోగలవారు, అయినా ధర్మంపై సుస్థిరత కనబరచగల శక్తి గలవారు, ఏలినవారి సమక్షంలో సత్యవాక్కు పలకగల స్థోమత, తెగింపు గలవారు, ప్రపంచంలోని ఏ శక్తి ఎదురయినప్పటికీ తమను నిజాన్ని వెల్లడించకుండా అడ్డుకోజాలనంతటి వజ్ర సంకల్పం గలవారు, మహా దురహంకారులయిన దుర్మా ర్గులు, దౌర్జన్యపరుల సమక్షంలో సయితం గట్టిగా నిలబడి, చూపుతో చూపు కలిపి ఎదురు పలకగల ధైర్యసాహసాలు గలవారు- వారే ఈ విపత్కర పరిస్థితుల్లో ఈ విధిని నిర్వర్తించగలుగుతారు.

ఇదేవిధంగా **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** నిర్వహణ కొరకు మనిషి తొలుత తన మనోకాంక్షలపైన అదుపు సాధించడమూ అవసరమే, తాను దైవాదేశాలకు పూర్తిగా స్వయం సమర్పణ చేసుకుని వాటికి లోబడి పోవలసి ఉంటుంది. ఎందుకంటే ఏ వ్యక్తికి తన మనోకాంక్షలపైన అదుపును సాధించే సామర్థ్యం ఉండదో అతను ఇతరుల్ని వారి మనోకాంక్షల అనుసరణ నుంచి వారించలేడు. సహన గుణం ఈ సకల సద్గుణాల సమగ్ర స్వరూపం. సహన గుణం గల వ్యక్తి అయితే ఎంతగా కఠినమయిన పరిస్థితులు ఎదురయినా **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధిని నిర్వర్తిస్తూనే ఉంటాడు, నిరంతరాయంగా నిర్వర్తిస్తూ ఉంటాడు. కాని ఈ సద్గుణం లేని వ్యక్తి ఈ మహత్కార్యాన్ని, దానికి తగిన ఉత్తమ రీతిలో నిర్వర్తించలేకపోతాడు. మరెప్పుడయినా సాహసించి మొదలెట్టినా దానిపైన నిలకడ చూపలేడు.

## క్షమ, చూపోపు

దివ్యఖుర్ఆన్ క్షమను, అమ్ర్ బిల్ మారూఫ్‌ను, చూపోపును ఒకే చోట

ప్రస్తావించింది. విశ్వకర్త ఇలా సెలవిచ్చాడు :

خُذِ الْعَفْوَ وَ أْمُرْ بِالْعُرْفِ وَ اَعْرِضْ عَنِ الْجَاهِلِيْنَ ○

**ప్రవక్తా క్షమావైఖరిని అవలంబించు, మారూఫ్‌ని ఆదేశించు, మూర్ఖుల ఎడల చూపోపు విధానాన్ని పాటించు.**

***(అల్ ఆరాఫ్ : 199)***

దీన్నిబట్టి విశదమయ్యేదేమిటంటే అమ్ర్ బిల్ మారూఫ్‌కు క్షమ, చూపోపుతో చాలా లోతయిన సంబంధముంది. వ్యాఖ్యాతలు ఆయత్‌లోని మొదటి ముక్క **خُذِ الْعَفْوَ** కు మూడు అర్థాలు చెప్పారు. ఒకటి, జనులతో క్షమ చూపోపు వ్యవహారం జరపాలి. రెండు, వారి ఎడల ఉన్నత శీల స్వభావాలను ఆశించరాదు, దాన్ని వారి నుండి కోరరాదు కూడా. వారు ఎటువంటి కష్టానికి లోనవకుండా ఏ మేరకు సదాచరణ చేయగలిగినా దానికి రాజీపడాలి, దాన్ని మించి వారిని కష్టానికి గురి చేయరాదు. మూడు, ధనం వెచ్చించవలసిన సందర్భాలలో వారిపైకి ఒత్తిడి తేరాదు, వారు సులభంగా ఇచ్చిన మేరకు స్వీకరించాలి. ఈ మూడు విషయాలు నీతికి సంబంధించినవే అన్నది తెలుస్తూనే ఉంది. *(రూహుల్ మఆనీ : సం.5, భాగం 9, పు.137)*

దివ్యకుర్‌ఆన్ అమ్ర్ బిల్ మారూఫ్‌ని బోధించే ముందు క్షమాపణా వైఖరిని అవలంబించాలని ఆదేశించింది. దీనిభావం ఏమిటంటే, మనిషి అమ్ర్ బిల్ మారూఫ్‌ని నిర్వహించే యోగ్యుడవడానికి నైతికంగా అతను ఉన్నతంగా ఎదిగినప్పుడే సాధ్యం. ఏ వ్యక్తి వ్యక్తిత్వం, సహనం, సంయమనం వంటి గుణాలు మూర్తీభవించిన వ్యక్తిత్వమో, ఎవరు జనుల తప్పిదాలను మన్నించివేస్తాడో, వారి దౌర్జన్యాలను, వ్యంగ్యోక్తులను, ఎత్తి పొడుపులను భరిస్తాడో అతనికే **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** మార్గం సులభతరమవుతుంది. దిగజారిన నైతిక గుణాలు, ఆవేశ పూరిత మనిషి ఈ సంక్లిష్టమయిన కొండకోనను దాటజాలడు.

క్షమ, అమ్ర్ బిల్ మారూఫ్ ఉద్బోధన తరువాత కుర్‌ఆన్ చూపోపు వహించే ఆదేశమిచ్చింది. ఈ క్రమం తెలిపేదేమిటంటే ఎంతో అత్యుత్తమ సౌజన్యశీలతతో, మరెంతో నీతిమంతంగా **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** విధిని నిర్వర్తించినప్పటికీ సంబోధితుని పక్షాన అజ్ఞానం, మూఢత్వమే ప్రదర్శించబడుతూ

ఉంటే మనిషి అతన్నుండి విముఖత చూపడమే ఉత్తమం. ఎందుకంటే, **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్** వంటి మహత్తర లక్ష్యాన్ని చేబూని జనం మధ్యన నిలిచిన వ్యక్తికి మూఢజనంతో పేచీ పెట్టుకోవడం అతని స్థాయికి తగిన విషయం కాదు.

ఏదయినా విషయాన్ని సామంజస్యతతో చర్చించడాన్ని కుర్ఆన్ కాదనదు. కాని మాటను అర్థం చేసుకునే భావనే లేనిచోట, కేవలం పిడివాదం, మొండి పట్టు ద్వారా ఎంతో సమంజసమయిన వాదనను సయితం ఖండించడం జరుగుతూ ఉంటే, అటువంటి సందర్భాలలో మనిషి దానికి బదులుగా ప్రతిచర్యగా ఏదయినా చేసి సమయం వృథా చెయ్యడానికి బదులు మౌనం వహించడం సరయిన పద్ధతి అని బోధించడం జరిగింది.

క్షమ, చూపోపు అంటే భావం, ఎవరయినా అల్లాహ్ ఆయన సందేశహరుని పట్ల తిరుగుబాటు వైఖరినవలంబిస్తే అతని పట్ల రాజీ పడాలన్నది కాదు, లేదా ఏ ఆచరణల విషయంలో ఏ వ్యక్తికి వినాయింపు లేదో అటువంటి విషయాలలో వదులునివ్వటమనీ అర్థం కాదు, మరి ఏ హక్కుల నిర్వర్తన ప్రతి ఒక్కరికీ అత్యవసరమో వాటి పట్ల మెతక వైఖరి చూపడమని కూడా భావం కాదు; ఎందుకంటే ఇటువంటి వ్యవహారాలలో మెతకదనం, ఏమరుపాటు చూపటం వల్ల షరీఅత్ వ్యవస్థ అంతా ఛిన్నాభిన్నమయిపోతుంది; ప్రతి వ్యక్తి తనకు ఇష్టమయినది చేసుకుంటూ ఉంటాడు. క్షమ, చూపోపుల అసలు సంబంధం నైతికత, మానవీయ వ్యవహార సరళితోనే ఉంది. హక్కులతో, విధులతో లేదు. ఇమామ్ రాజీ (రహ్మ) క్షమ, చూపోపు, అమ్ర్ బిల్ మారూఫ్ ఆదేశాలను గురించి చర్చిస్తూ ఇలా అన్నారు :

**الحقوق التي تستوفى من الناس و توخذ منهم اما ان يجوز ادخال المساهلة و المسامحة فيها و اما ان لاّ يجوز، اما القســم الاول فهو المراد بقوله خُذِ العَفوَ و يدخل فيه ترک التشدّد فى كل ما يتعلق بالحقوق المالية، و يدخل فيه ايضا**

**మానవులతో ప్రాప్తమయ్యే హక్కులు రెండు రకాలు: కొన్నింటి పట్ల వదులునివ్వడం, లేదా చూపోపు సాధ్యమయినా అవుతుంది లేదా పూర్తిగా సాధ్యమవదు. అల్లాహ్ 'చూపోపు వైఖరిని అవలంబించమని ఆదేశిస్తున్నాడు. ఇది మొదటి కోవకు సంబంధించింది. ధన సంబంధమయిన హక్కుల విషయంలో కఠినంగా వ్యవహరించరాదన్నదీ ఇందులోనే**

التخلق مع الناس بالخلق الطيب و ترک الغلظة والفضاضة...... و من هذا الباب ان يدعو الخلق الى الدين الحق بالرفق و اللطف ...... و اما القسم الثانی و هو الذی لاَ يجوز دخول المساهلة و المسامحة فيه فالحكم فيه ان يأمر بالمعروف، و العرف و العارفة و المعروف هو كل أمرعرف انه لاَبد من التيان به وان وجود ه خير من عدمه، و ذٰلک لأن فی هـذا القسم لو اقتصر على الأخـذ بالعفو و لم يأمر بالعـرف ولم يكشف عـن حقيقة الحـال لكان ذٰلک سعيًا فی تغيير الـدين و ابطال الحق و انه لاَ يجوز

చేరి ఉంది. అలాగే జనం పట్ల ఉత్తమ నైతికత ప్రదర్శించాలనీ ఒకరిని అసహ్యంగా చూడరాద న్నది, ఒకరి పట్ల కఠినంగా వ్యవహరించ రాదన్నది కూడా ఇందులోని అంశమే. దీనితో పాటు మృదువుగా ప్రేమగా అనురాగంతో జనులకు ధర్మ సందేశాన్ని అందజేయాలన్న మాట కూడా దీని కిందికే వస్తుంది. ఇక రెండవ కోవకు చెందిన విషయం ఏమిటంటే క్షమ చూపడం చూపోపు వహించడం సరయినది కాదన్నది. దీని విషయంలో అమ్ర్ బిల్ మారూఫ్ ఆదేశముంది. ఉర్ఫ్, ఆరిఫ, మారూఫ్ (అరబీ) అని తప్పనిసరిగా చేయ వలసినదిగా, అందరూ ఎరిగిన ప్రతి పనినీ అంటారు. దీన్ని చేయకపోవడం కన్నా చెయ్యడం ఉత్తమమయింది. ఇక ఈ రెండవ కోవకు చెందిన కార్యంలోనూ క్షమ, చూపోపుతో వ్యవహరించినట్లయితే, మారూఫ్‌ను ఆదేశించక పోయినట్లయితే యదార్థాన్ని విడమర్చి తెలుపకపోయినట్లయితే ధర్మాన్ని మార్చడానికి, సత్యాన్ని రూపుమాపడానికి ప్రయత్నం జరుగు తోందన్నమాట. ఈ వైఖరి సరయినది కాదని తెలుస్తూనే ఉంది. *(మఫాతీహుల్‌గైబ్ (అత్తఫ్సీరుల్ కబీర్) సం.8, భాగం 15, పు.78)*

ఇబ్ను జరీర్ తబరీ చూపోపు వహించడాన్ని గురించి ఇలా అన్నారు :

ذٰلک و ان كان امرًا من الله نبيه به فانه تاديب منه عز ذكره لخلقه باحتمال من ظلمهم او اعتـدى عليهم لاَ بالاَعراض عمن جهل

ఇది అల్లాహ్ తరఫున తన ప్రవక్తకు, చూపోపు వహించమన్న ఆదేశమయినా, నిజానికి అల్లాహ్ తన దాసులయిన మానవులకు మర్యాద నేర్పాడు. వారు, తమపైన అన్యాయం అక్రమం జరిపిన వారిని భరించాలి అని. దీని భావం, ఎవరయినా దేవుని పట్ల తప్పనిసరి

الواجب عليه من حق الله ولا بالصفح عمن كفر بالله و جهل وحدانيته و هو للمسلمين حرب

అయిన హక్కులకు ఎదురుగా తలబిరుసు వైఖరినవలంబిస్తే అతన్నీ భరించాలన్నది కాదు, ఇంకా అల్లాహ్ ఎడల తిరస్కారాన్నీ ఆయన ఏకత్వం పట్ల నిరాకరణను చూపిన వారినీ భరించాలనీ, వారి పట్లనూ చూపోపు వహిం చాలనీ కాదు. నిజానికి ఇటువంటి వ్యక్తి ముస్లిములతో యుద్ధం చేస్తున్నవాడు!

*(జామిఉల్ బయాన్ ఫీ తఫ్సీరుల్ కుర్ఆన్ 9/ 98)*

## ఇఖ్లాస్ (చిత్తశుద్ధి)

చిత్తశుద్ధి ప్రతి పనికీ ప్రాణం వంటిది. చిత్తశుద్ధి ఊపిరి వంటిది. ఈ ఊపిరి గనక లేకపోతే ప్రపంచం ఏ పనులనయితే మహోత్కృష్టమయినవని తలుస్తుందో అవన్నీ భారహీనమయి పోతాయి. అందువల్ల **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్** విధి నిర్వహణ గావిస్తూ మనిషి మాటిమాటికీ తన సంకల్పాన్ని పరిశీలించు కుంటూ ఉండాలి. అందులో ఏదయినా కల్తీ జరగలేదు కదా అని, తన చిత్తశుద్ధిలో ఏదయినా లోపం తటస్థించడం లేదు కదా అని, తన ఆంతర్యం దైవప్రసన్నత తప్ప మరేదయినా కాంక్షించడం లేదు కదా అని!

**అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్** అన్నది ధర్మ సేవ, మానవునికి మహత్తరమయిన శుభదాయిని. ఈ శుభం ఎంతో గొప్పది. ఇంతకన్నా గొప్ప శుభాన్ని ఊహించనూ లేము. ఈ శుభం, ఆపాద మస్తకం చిత్తశుద్ధి నిండినవారికే ప్రాప్తమవు తుంది.తమ వ్యక్తిత్వాన్ని మొత్తాన్ని అల్లాహ్ ప్రసన్నతకే అంకితం చేసుకున్న దాన్ని అందులోనే సంవిలీనం చేసుకున్న, పరలోక సాఫల్యం తప్ప మరి దేన్నీ కోరుకోని శుభాత్మలకే అది ప్రాప్తమవుతుంది. కాని దీనితోపాటు మరో వాస్తవమూ ఉంది. **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్** నిర్వహిస్తున్న వ్యక్తిలో చిత్తశుద్ధి మిగిలి ఉండటం అన్నది కూడా చాలా కష్టమయిన విషయమే. మనిషి మహా గొప్ప గొప్ప బహిరంగ సభల్లో, మహా సమావేశాల్లో సత్య ప్రకటనకు నిలబడినప్పుడు, అతని వ్రాతలు అసంఖ్యాక జనులు చదువుతున్నప్పుడు, అతను నిర్భయంగా అసత్యాన్ని, మిథ్యాశక్తుల్ని ఛాలెంజి చేస్తున్నప్పుడు, అతని ధార్మిక సేవల చర్యలు, అతని స్థిరచిత్త కథనాలు, అతని త్యాగాల గాథలు అన్నివైపులా వ్యాపిస్తున్నప్పుడు, నోళ్ళు అతని పొగడ్తలలో సదా నిమగ్నమయి ఉన్నప్పుడు ఓ మహా ప్రమాదం పొంచి ఉంటుందన్న మాట! అతనిలో పేరు ప్రఖ్యాతులు, ప్రతిష్టలు, ప్రదర్శనా వాంఛలు పెల్లుబికి వస్తాయి.

ఈ భావనలు ఉదయించిన తరువాత, అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ వల్ల ప్రపంచానికి ఎంత ప్రయోజనం ఒనగూడినా ఈ విధిని నిర్వహించేవాడు మటుకు నిశ్చయంగా ఆ ప్రయోజనానికి వంచితుడుగానే ఉండిపోతాడు. అంతేకాదు వాస్తవానికి మనిషిలో ఖులూస్ (చిత్తశుద్ధి) లిల్లాహియత్ (దైవం కొరకే పని చేసే లక్షణం) లేకపోయినట్లయితే అతను తన ప్రచారం, తన బోధన, ఉపదేశనల వల్ల కూడా ఇతరులకు ఎటువంటి ప్రయోజనం చేకూర్చలేడు. ముల్లా అలీ కారీ ప్రకారం, అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ ఫలవంతం కావడానికీ, ఆ మార్గంలో దైవసహాయం లభించడానికీ మనిషి చిత్తశుద్ధితో ఈ విధిని నిర్వర్తించడం అవసరం. కాగా ఆయన పదాలు ఇవి :

من اهم شروط الاَمر بالمعروف و النهى عن المنكر ان يكون صاحبه مخلصًا فى فعله طالبًا إظهار دين الله و إعلاء كلمته و إطاعة أمره فى بريته دون الرياء و السمعة و الحمية لنفسه و طبيعته فانما ينصر و يزول به المنكر اذا كان صادقًا و فى مقام الإخلاص موافقًا، قال الله تعالىٰ اِنْ تَنْصُرُوا اللّٰهَ يَنْصُرْكُمْ وَ يُثَبِّتْ اَقْدَامَكُمْ

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ మున్కర్ కార్యనిర్వహణకు ఒక ముఖ్యమయిన షరతు, ఈ పనిని చేపట్టినవాడు తన పనిలో చిత్తశుద్ధి గలవాడయి ఉండాలి అన్నది. ఈ కార్యనిర్వహణ ద్వారా అతని ఉద్దేశ్యం, దైవధర్మం ఆధిక్యత పొందాలన్నదీ దైవ వచనం సమున్నతం కావాలన్నది, దైవసృష్టి, మానవులు, దైవాదేశ పాలనలో ఆయనకు లోబడి జీవించాలన్నదీ కావాలి. ఈ కార్యనిర్వహణ చేస్తూ అతనిలో ప్రదర్శనాబుద్ధి, పేరుప్రతిష్టల కోరిక, తన మనస్సు నైజం కోరే వాంఛల పరిపూర్తి భావనలు జనించరాదు. అతను తన ఆచరణలో నిజాయితీ గలవాడయితే, చిత్తశుద్ధి గలవాడే అయినట్లయితే నిశ్చయంగా అతనికి దైవ సహాయం అందుతుంది, మున్కర్ నిజంగానే నిర్మూలన చెందుతుంది. అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు, "మీరు అల్లాహ్‌కు సహాయపడితే ఆయన కూడా మీకు సహాయపడతాడు, మీ పాదాలను సుస్థిరపరుస్తాడు."

*(అల్ ముబీన్ అల్ ముయీన్ లిఫహ్మిల్ అర్బయీన్ : పు. 193,194)*

ఏ వ్యక్తి **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్** విధిని నిర్వర్తిస్తాడో అతను ఓ యదార్థాన్ని విస్మరించరాదు; అతను నిర్వహించే పవిత్రకార్యం కొరకు దైవప్రవక్తలు ప్రభవింపజేయబడ్డారు, దాన్ని మహనీయ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లమ్) ఆయన గౌరవనీయ సహచరులు నిర్వహించారు. అందువల్ల తనలో ఆ మహనీయులు, ప్రవక్తలు, వారి అనుచరుల చిత్తశుద్ధికి అతి సాధారణ రూపమయినా లేకపోయినట్లయితే అతను ఏవిధంగానూ వారి స్థానాన్ని పొందలేడు. చిత్తశుద్ధి లేకుండా ఎవడు **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్** విధిని నిర్వర్తిస్తాడో అతను బాహ్యంలో ప్రవక్తల కార్యాన్నే నిర్వహించినా ఆ కార్యం, ప్రవక్తల కార్యంలోని నిజసారం, ఆ ఊపిరి, ఆ జీవం, ఆ ఆత్మ లేనిదయి ఉత్తుత్తి రూపంగానే మిగిలి ఉంటుంది. నిజాముద్దీన్ నీషాపూరీ **అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్**కు చెందిన కొన్ని షరతుల్ని, మర్యాదల్ని ఉటంకించిన తరువాత ఇలా అన్నారు

**كل ذٰلک ايمانًا و احتسابًا لاَ سمعة ولاَ رياءاً ولاَ لغرض من الاَغراض النفسانية و الجسمانية، وذٰلک ان هٰذه الدعوة منصب النبيّ وخلفائه الراشدين بعدهٖ**

**ఇదంతా విశ్వాసపు భావనలతో ప్రతిఫలాభిలాష లతో జరగాలి. అందులో ఏమాత్రం పేరుప్రతి ష్టలు, ప్రదర్శనాభిలాష, మానసిక శారీరక ప్రయోజనాలు, కాంక్షల పరిపూర్తి ఏ కోశాన కానరాకూడదు. ఎందుకంటే ఈ సందేశం, ప్రవక్త, ఆయన తరువాత సత్యపథగాములయిన ఖులఫాల హెూదాకు చెందిన సందేశం!**

*(గరాయిబుల్ కుర్ఆన్ వ రగాయిబుల్ ఫుర్కాన్, (అలా హామిష్ ఇబ్ను జరీర్) : 4/ 31,32)*

అమ్ర్ బిల్ మారూఫ్ వ నహీ అనిల్ ముస్కర్ విధి ఓ మహా గొప్ప ధ్యేయం కొరకు నిర్వర్తించబడుతుంది. అది, దేవుని భూమిపైన ఆయన వచనం సమున్నత మవ్వాలి, ఆయన ధర్మం ఆధిక్యతనొందాలి. మానవుడు దేవుని నిజ దాసుడవ్వాలి, మిథ్య నుండి మోక్షం పొందాలి. ఇది ఎంతో పవిత్రమయిన కార్యం. ఇందులో ఒకవేళ చిత్తశుద్ధి లేకపోతే, దీని నిర్వహణ వల్ల మనిషికి మానసిక తృప్తి లభించవచ్చునేమో, ప్రపంచంలో అతనికి ప్రశంసలు ప్రాప్తం కావచ్చునేమో కాని దైవం సన్నిధిలో అతనికి ఎటువంటి ప్రతిఫలమూ ప్రాప్తమయ్యే ఆశ మిగులదు.

